# తెలుగులో చిత్రకవిత్వము

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి "డాక్టరేట్"

పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము


**డాక్టర్. గాదె ధర్మేశ్వరరావు** ఎమ్.ఎ; పిహెచ్.డి;

ఆంధ్రభాషోపన్యాసకులు, ఆర్. వి. వి. యస్. కళాశాల.

ధరణికోట, అమరావతి, గుంటూరు జిల్లా

Pin 522020 (A. P.)



సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :




శ్రీమహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్

మ్యూజియంరోడ్ * ఏలూరురోడ్ కార్నర్

గవర్నరుపేట . . . విజయవాడ-2.

BOOK : TELUGULO CHITRAKAVITVAMU
AUTHOR : Dr. G. DHARMESWARARAO



ముద్రణ : జనవరి, 1986.

ప్రతులు : 1000

పబ్లిషర్సు :
రాజ్యలక్ష్మి పబ్లికేషన్స్, అమరావతి,
గుంటూరు జిల్లా.

మూల్యము : రు. 75-00

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారి
ఆర్థిక సహాయముతో ప్రకటితము.

ముద్రణ :
శ్రీకృష్ణా ప్రింటర్స్, నవోదయ కాలనీ,
విజయవాడ-10.

# చిత్ర కవిత్వ ప్రశంస.

శ్రీ విక్రాల శేషాచార్యులు చిత్రకవి తను ప్రశంసించినతీరు. (వారి శ్రీ. వేం. చి. ర. కరము ఉ. భా. 7 to 16)

మృదుల కవితరీతి మేదురమౌ చిత్ర
కవితగూడ కవికి గాఁతు గొలుపు
పూఁదండ యట్లు ముత్యాల దండయు
గన్నులున్న వానికిఁ గాంతు నిడదె?

ఏ కవితా వధూమణికి నెంచగ భూషలు శ్లేష ముఖ్యముల్
ప్రాకటమైన నాగముఖబంధము లా రతి కాల బంధముల్
స్వీకృత గర్భ ధారణము శ్రీకర గర్భ కవిత్వ విభ్రమం
బా కవితా వధూమణికి నారయ శిల్పము సంతుకాదొకో.

కవితాచిత్రవిదుండు కోమల కథా కావ్యమ్ము నున్మాడ్కిన
త్కవి సూక్తంబగు ప్రౌఢచిత్రకవితా కావ్యమ్మునుం గూడ చ
ద్వి వినోదించు, నదెట్లనంగ నతి మాధ్వీకాభమౌ వాతెఱం
బని గొంచుం గఠినమ్మటంచు విడునే నాథుం డురోజద్వయిన్.

కోమల కావ్య సారమును గ్రోలి ప్రమోదము నొందు రీతి
భామినిఁ బ్రౌఢ చిత్రకృతిఁ బోల్పగు శబ్ద విచిత్రలక్ష్మి నేని
ధీమహితుండు కాంచి మఱితృప్తిసి గాంచునొ వాఁడె సాహితీ
ధీమహితుండు వాఁడె జగతి న్మము బొంట్లకు శ్లాఘనీయుడున్

# కన్నతల్లికి అంకితము

రామకూరు వంశాబ్ధి గారాబు పట్టి
గాదె వారింటి కోడలై గౌరవముగ
పుట్టి మెట్టిన యిండ్లకు పుణ్యకీర్తి
తెచ్చి పెట్టియు, "సతి" పేరు తెచ్చుకొనియె.

దానధర్మములకు దండిగ నిలయమై
పనుల పాటలందు ప్రజ్ఞ గలిగి
మాట మంచి తోడ మన్నన లందె బో
ఇరుగు పొరుగు నుండి తఱుఁగు లేక.

సప్తసంతానములు గల్గి జనని, చాల
ముద్దు ముచ్చట లన్నిట మురిసి మురిసి,
తూఁగి పొంగి ఓలాడె సంతోషజలధిఁ
గనికరసుమవల్లి ఘనత గన్నతల్లి.

అట్టి,
గుణవారాశిజ మణికిన్.
ప్రణుతుండగు పావరాజ భార్యామణికిన్,
మణిఖిత్తువంటి జననికి.
మణెమ్మకు, సుమహితమౌ నమస్సుల నిడుదున్.

ఎట్టులైన అమ్మ! ఎనలేని నీఋణ
మ్మేను తీర్చలేను, కాన నిదియె
కృతిని ప్రీతి నిడుదు, కృపఁజూచి, కొనినీవు
దీవన లిడి నన్ను బ్రోవు మమ్మ.

# నా మాతృదేవత



స్వర్లోకగతురాలైన శ్రీమతి గాదె మణెమ్మ

# విషయసూచిక



## ప్రథమ ప్రకరణము



## ద్వితీయ ప్రకరణము

## తృతీయ ప్రకరణము



## చతుర్థ ప్రకరణము

## పంచమ ప్రకరణము

**Dr. B RAMA RAJU**
*Professor. Emeritus*
Department of Telugu,
University College of Arts,
Osmania University.
HYDERABAD. 500 007.

1-8-117/2
Chikkadpalil.
Hyderabad.
500 020.
*Dt.* 5.12.85

ప్రపంచ సాహిత్య క్షేత్రంలో చిత్రకవిత్వం ఒక విశిష్టమైన ప్రక్రియ. ఈ ప్రక్రియ అభివృద్ధి చెందిన అన్ని భాషల్లోను ఉన్నట్లున్నది. తెలుగులో చిత్రకవిత్వం నానావిధాలు. ఈ ప్రక్రియ మనకు సంస్కృతం నుంచి వారసత్వంగా వచ్చింది. దానికి తెలుగు కవులు వన్నెలు చిన్నెలు ఉద్ది సంస్కృతంలో కంటే ఎక్కువ చమత్కారాలు ప్రదర్శించినారు. ప్రాచీనయుగం నుండియే తెలుగులో చిత్రకవిత్వం అభివృద్ధి పొందుతున్నది. ఇటీవల దానిపై అభిమానం తగ్గినా ఈ శతాబ్దం మధ్యభాగం దాకా తెలుగు చిత్రకవిత్వం తీరు పోకడలు పోయి కవి పండితులకు, సారస్వత పోషకులకు, రసికులకు వినోద విజ్ఞానాలు పంచినది. ఆశ్చర్యానందాలు ఆమెతలిచ్చినది.

తెలుగులోని ఈ ప్రక్రియ గురించి శ్రీగాదె ధర్మేశ్వరరావు గారు క్షోదక్షమమైన పరిశ్రమచేసి గొప్ప సిద్ధాంత గ్రంథం రచించినారు. తెలుగులో చిత్రకవిత్వం ఆరంభవికాసముల గూర్చి సమగ్రంగా పరిశీలించటమే కాక సంస్కృతాది భారతీయ భాషల్లోను విదేశీయ భాషల్లోను చిత్రకవిత్వం ఏ తీరుగా ఉన్నదో స్థాలీపులాకంగా ప్రదర్శించినారు. శ్రీధర్మేశ్వరరావుగారి గ్రంథం వారి గాఢ పరిశ్రమకు సవిమర్శక విశ్లేషణకు చక్కని నిదర్శనం ఈ నాడు అంతగా పట్టించుకొనని తెలుగులోని ఒకానొక ప్రక్రియ గురించి ఎంతో శ్రమించి సాధికారమైన ఈ గ్రంథం వెలువరించినందుకు ధర్మేశ్వరరావుగారిని అభినందిస్తున్నాను.

ఈ సిద్ధాంత గ్రంథం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి., ఉపాధి కోసం నా పర్యవేక్షణలో సిద్ధమైనందుకు నాకు మరింత సంతోషదాయకమైనది. ఈ కాలంలో గ్రంథరచనకంటె దానిని ప్రకటించడం చాలా కష్టమయినపని. అందులోను అనేక బంధ కవిత్వపు చిత్రాలతో అచ్చుకావటం చాలా వ్యయ ప్రయాసలతో కూడినపని. ఇంత గొప్ప కార్యాన్ని సాధించిన శ్రీధర్మేశ్వరరావుగారి కృషిని సాహిత్య ప్రతులు ఆదరిస్తారని నమ్ముతున్నాను. పరాత్పరుడు ధర్మేశ్వరరావుకు ఇతోధిక శక్తి యుక్తులు దీర్ఘాయురారోగ్య భాగ్యములు ప్రసాదించవలెనని కోరుతున్నాను.

—బి.రామరాజు.

# ప్రవేశిక

**Dr. T. KOTESWARA RAO**
*Professeor, Department of Telugu*
S. K. University
ANANTAPUR.

ఈ పరిశోధన గ్రంథంలో 5 ప్రకరణాలున్నవి.

1 చిత్రకవిత్వ స్వరూప స్వభావాదులు.

2. శబ్దచిత్రములు.

3. ఆకార నియమ చిత్రము.

4. చ్యుతగూఢ చిత్రములు.

5. ఇతర చిత్రములు.

అనుబంధంలో సంస్కృత-హిందీ-తమిళ-ఆంగ్లభాషల్లో వుండి తెలుగులో లేని బంధాలను గురించిన ప్రస్తావన.

పై 5 ప్రకరణాల్లో తెలుగులోవున్న చిత్రకవిత్వాన్ని గురించి పరిశోధక పండితుడు కూలంకషంగా చర్చించాడు. ఈ కవితా శాఖను గురించి సమస్త విషయాల్ని ఒకచోట కుప్పగా పోసినగ్రంథమిదే. దీని కోసం గ్రంథకర్త అనేకగ్రంథాలను అవలోకనంచేసి అనేక భాషల్లోని చిత్రకవితా విషయాలుకూడాసమీకరించటంలో ఈ గ్రంథం ఉద్గ్రంథ మౌతున్నది.

ఈ పండితుడెంత శ్రమించింది చూడాలంటే ఈ గ్రంథమంతా చూడాల్సిందే. మచ్చుకొకటి రెండుదాహరణలు.

34వ పుటలో అభినవమయూరి సూరిచే వ్రాయబడిన కాకతీయుల వర్ధమాన పురశాసనాన్నుదాహరించటం ఆ శాసనకాలం 13వ శకం (క్రీ.శ. 1245) గ్రంథకర్త కావ్యప్రపంచంనుండేకాక శాసనాలుకూడా చూచాడనటానికిది వుదాహరణ

మరొక వుదాహరణ ద్వితీయ ప్రకరణం. ఈ ప్రకరణంలో ఇందులో 6శబ్ద చిత్రాలను ప్రస్తావించి వాటికనేకోదాహరణ లివ్వటం చూస్తే ఈ పరిశోధనలోని పరిణాహం తెలుస్తుంది.

95వ పుటలో పద్యభ్రమకాన్ని బట్టి చూస్తే-పూర్వకాలంలో వీధిబళ్ళల్లో పద్యాలు-ఎక్కాలు మొదలైనవి క్రిందినుండి పైకి పైనుంచి క్రిందికీ అప్పచెప్పుకొనే పద్ధతి వుండేది. ఇదంతా ఈ చిత్రకవితా ప్రభావమేమో ననిపిస్తుంది.

ఈ కవితాశాఖ ఎప్పటినుండి ప్రారంభమైనదీ-దాని వికాసదశ-అంటే పరిణామ క్రమమంతా-ప్రథమ ప్రకరణంలో 5వ అధ్యాయంలో ప్రస్తావితమైనది.

ప్రథమాధ్యాయమంతా చిత్రకవితా స్వరూప స్వభావ నిరూపణ. దాని లక్షణాలన్నిటినీ 3వ పుటలో క్రోడీకరించాడు గ్రంథకర్త. చిత్రకవితా నామసార్థక్య విచారణలో వైదిక వాఙ్మయలోనుండి చిత్రశబ్దాన్నుదాహరించి-ఏయేఘట్టాల్లో ఏయేఅర్థాల్లో అది ప్రయోగింపబడిందో చూపటం చాలా ఆశ్చర్యంగా వుంది. అదంతా చిత్రకావ్యకౌతుకంలోనిదని వివరణ మున్నా చిత్రశబ్ద నిర్వచనానికి దానినుదాహరించటం పరిశోధన గ్రంథ నిర్మాణ పథకం బాగుందనటాని కుపకరించేదని చివరలో ఆయా అర్థాలను చిత్రకవితకు అన్వయింపజేసి చిత్రకవితా నామసార్థక్యాన్ని చక్కగా నిరూపించాము.

ఇతరకళల్లో ఈ చిత్రకవితా స్వరూపం ఎలా వుంటుందో అదేస్థలంలో (8,9,10,11 పుటలు) వున్నది. చిత్రంలో రూపము ఏకదేశం చూపబడటమన్న 9వ పుటలో అంశం సరికాదు. ఆధునిక కళలో దాని స్వరూపం అనేకరకాలుగా చూపబడ్డ విషయం చూస్తే ఈ వాక్యం సరికాదని తెలుస్తుంది అలాగే 11వ పుటలో యంత్రాలు ఆకార చిత్రకవితా రూపాలనటమూ సరికాదు. యంత్ర విషయం వేరు కనక.

ఈ కవితా శాఖ అవసరమా? దాని ఔచిత్యమేమిటి? అన్నప్రశ్నకు సమాధానంగా 14వ పుటలో 4 కారణాలు చూపబడ్డవి ఇంకా ఇతరత్రా కొన్ని కారణాలు చెప్పబడ్డవి. వాటిని బట్టి చూస్తే రసవత్కావ్య కవులు కొందరు ఈ చిత్రకవిత్వాన్ని తమ కావ్యాల్లో ఎందుకు ప్రవేశపెట్టింది తెలుస్తుంది. అంటే ఔచిత్యదృష్టి కలిగిన కావ్యాల్లో కూడా దీనికి ప్రవేశముంది. అతిప్రాచీన కాలంలో ఎక్కడో వకచోట ఈ కవితా శాఖను ప్రారంభించిన మహాకవి ఔచిత్య దృష్టితోనే

వ్రాస్తే-తర్వాతవారు రానురాను ఇదొక కావ్య-కవితా భేదంగా చేసుకున్నారనటానికి సాక్ష్యం నన్నె చోడాదులు చూపిన చిత్రకవిత్వం ముద్రాలంకార దృష్టితో చూడవచ్చు.

చిత్రకవిత-సందర్భ ప్రయోజనాలు (P 28) ఈ ఔచిత్యానికి సంబంధించినవే. కాని కావ్యమంతా అదే అయితే? ఇది రానురాను వచ్చిన మార్పు.

ఈ బంధకవిత్వంలో కవులు పాఠకలోకాన్ని కికురించిన ఘట్టాలనేకం. ఈ చమత్కారానికుదాహరణగా 115 పుటలో చక్రబంధ విషయం చూడవచ్చు. ఇటీవల ఆచార్య కొర్లపాటి శ్రీ రామమూర్తిగారు కూడా తమ కుమార సంభవం నన్నెచోడుని అన్న దానిలోనూ ఇలాంటి విచిత్రాంశం చూపించారు. ఇదొక సంప్రదాయమన్నట్లున్నది చూస్తే. వంచనకూడా కళే నన్నట్లుంది.

117 వ పుటలో ఈ బంధాల పట్టికవుంది. వాటన్నిటికీ ఉదాహరణలు చూపటం-బొమ్మలతోసహా చాలా సమగ్రంగా వుంది. ఇందుకే ఈ విషయ విన్యాసం 150 పుటలదాకా వ్యాప్తం కావటం సంభవించింది.

ఇందులో 157 వ పుటలో పద్మబంధ విషయం చూడదగిందిగా వుంది. చతుర్దళ-ద్వాదశ-షోడశ-ద్వాత్రింశద్దళ పద్మాలున్నాయి. ఇది చాలా లోతుగా విచారించాల్సిన విషయంగా కన్పిస్తున్నది. ఎందుకంటే ఉపాసనా విషయాలైన యంత్రాలు చిత్ర కవితా సంబంధంగా 10 వ పుటలో సూచింపబడ్డది.

"యంత్రముల తంత్రముండును కావున అది ఆకార (బంధ) చిత్రము వలె నుండునుగదా" అన్నసూచన వాక్యముంది. కాని దాని సంపూర్ణ వివరణంలేదు. ఆ మాటలు చిత్రకావ్య కౌతుకం లోనివిగా ఈ గ్రంథకర్త వుదాహరించాడు ఆ గ్రంథం నేను చూడనందువల్ల దాని వివరణ మేమిటో చెప్పలేనుగాని ఈ పద్మ బంధంచూస్తే యోగ శాస్త్రం చెప్పే చక్రాలనే కవులిలా మార్చుకున్నారా? దీనికవి ఆధారమా?-అన్న సందేహం కలుగుతున్నది. మూలాధారాది చక్రాల్లో దళాలు కూడా బీజాక్షర సహితాలే. కనుక ఈ మాతృకా సహిత చక్రతంత్ర మాధారంగా ఎవడో వక మహా దార్శనికుడు ఈ శాఖకు మార్గదర్శకుడా? పైగా ఈ బంధాలు 1)మాంగళిక 2) ఆయుధ 3) ప్రకీర్ణభేదాల్లో వున్నవి. (చూ పు. 117)

1. బీజాక్షర స్వరూపం 2. సుదర్శనాదులు 3. పుష్పమాలికా-ఛత్ర చామరాదులు. వీటన్నిటివెనుక ఒక చారిత్రక-తాత్త్విక-సంస్కృత నేపథ్యమున్నట్లు దర్శించవచ్చు. ఆ పరిణామాన్ని చూడాలి.

ఈ నేపథ్యాన్ని వేరుగా చెప్పిచూడాలి. ఎందుకంటే ముగ్గులు-ఆధునిక కళ, అంతా తంత్రాధారితంగా చూస్తున్నాం కనుక, ఈ బంధాలనూ చూడవచ్చు. ఇది వేరే విద్య.

కొన్నిటికి గ్రంథకర్త కుదాహరణలు దొరకలేదు. తానే ఇచ్చాడు. దీని కుదాహరణ మాంగళిక బంధాల్లో శ్రీ బంధం దగ్గరవుంది. అలాగే వ్యంజనశతకం, వ్యస్త దత్తాక్షర (272) దగ్గర-కన్పిస్తుంది. అంటే పరిశోధకుడు మంచి ఊహాశాలి అని చూపించే స్థలాలున్నాయనటాన్ని లాంటివి ధ్రువపరిచేవి.

అధో జ్ఞాపికల్లో ఇచ్చిన సంకేత వివరణ లేకపోవటంవల్ల పాఠకునికి కొన్ని ఇబ్బందులు కలగటం తక్క-తే ఈ గ్రంథంలో లోపం.

ఇంత సమగ్రంగా ఆ కవితా శాఖను గూర్చి తెలుగువారి కందించిన పరిశోధకుని పరిశ్రమ-పాండిత్యం-ఎంతైనా మెచ్చదగ్గవి.

—తుమ్మపూడి కోటేశ్వరరావు

**Prof G. NAGAIAH**
M.A., Ph.D.
Professor of Tleugu Studies&Head
Sri Venkateswara University
Tirupati. 517502

Resi: Door No. 18.1.699
Bhavani Nagar,
TIRUPATI
517501
*Dt 21.12.85*


# అభినందన

తెలుగులో చిత్రకవిత్వాన్ని గురించిన ప్రత్యేక విమర్శ గ్రంథము ఇంత వరకు ఏదియు వెలువడలేదు. ఇదియే మొదటిది. కవిత్వం కాని కవిత్వం చిత్ర కవిత్వం కావ్యంలో నీరస పట్టులందు పాఠకుల చిత్తాన్ని ఆకర్షించి వారిలో ఉత్సాహాన్ని కల్గించి, చమత్కారాన్ని అందించి ఆహ్లాద పరచడానికి చిత్ర కవిత్వ రచన అవసర మౌతుంది. కవితా భేదంగానే కాక అలంకారంగా కూడ కావ్యాల్లో చిత్రకవితా ప్రయోగం కన్పిస్తుంది. తెలుగులోని నిరోష్ఠ్యకావ్యాలు, అనేకార్థ కావ్యాలు, అచ్చతెనుగు కావ్యాలు మొదలైన చిత్రకావ్యాలన్నీ చమత్కారరచనలే ఇవి ఆయా కవుల భాషాపాండిత్యపాటవాన్ని ప్రకటిస్తాయి. తెలుగులో మొదటి సారిగా చిత్ర కవితను కావ్యంలో సందర్భోచితంగా ప్రదర్శించిన వాడు నన్నెచోడుడు. (క్రీ శ.1130), విన్నకోట పెద్దన (క్రీ శ.1402) కావ్యాలంకార చూడామణి తెలుగులో మొదటి చిత్రకవిత్వ లక్షణ గ్రంథం. కల్పనలకు పాండిత్య ప్రకర్షకు ప్రాధాన్యముకల ప్రబంధయుగంలో చిత్ర కవితా రీతులు అనేకం పుట్టినాయి క్రీ.శ 18,19 శతాబ్దుల్లో చిత్రకావ్యాలు కోకొల్లలుగా వెలిసినాయి. నన్నెచోడుని నాటినుండియు నేటివరకు వెలువడిన చిత్రకవిత్వపై చిత్ర్యాదుల మీద బహు రీతుల దృష్టిని ప్రసరింపజేసి సమగ్ర పరిశీలన, పరిశోధన గావించి ఈ గ్రంథాన్ని లోకాని కందించిన డక్టర్ గాదె ధర్మేశ్వరరావుగారు మిక్కిలి అభినందనీయుడు.

విషయసేకరణలోనూ, విమర్శనాత్మకపరిశీలనలోనూ, విషయ వ్యక్తీకరణలోనూ ధర్మేశ్వరరావుకుగల ప్రావీణ్యం ప్రతిపుటలోనూ ప్రతిబింబిస్తుంది. ఇందులో చిత్రకవిత్వ వివిధరూపాలు సమగ్రంగా పరిశీలింపబడినవి వివిధబంధాలను రచయిత చిత్రాలతో పాటు ప్రదర్శించినాడు. పరిశోధక సామర్థ్యము, పాండిత్యముకల డాక్టర్ ధర్మేశ్వరరావుగారి సాహిత్య కృషిని ఆంధ్రలోక మభినందించి ఆదరించి ప్రోత్సహిస్తుందని నా ఆకాంక్ష.

జి. నాగయ్య
ఆంధ్రశాఖాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

# నివేదనము

ఒకనాడు నేను మిత్రులు శ్రీవావిలాల సుబ్బారావు కలిసినప్పుడు కబుర్లలో పరిశోధనాంశములు క్రొత్తవి చేపట్టుటకు వీలైనవి రెండు మూడు దొర్లినవి. వానిలో ఒకటి ఈ 'తెలుగులో చిత్రకవిత్వము.' ఇది వారు సూచించినదియే అందులకు వారికి నా కృతజ్ఞత.

మా కళాశాలలోని చిత్రకవితా సంబంధ గ్రంథములను పరికించి విషయమును సేకరించితిని. 1979 జూలై నెలలో ఆ విషయసామగ్రిని, జానపదసాహితీ తపస్వి, ఉత్తమదేశికులునైన శ్రీ బి. రామరాజుగారికి చూప, వారు నన్ను ప్రోత్సహించి Ph D , పట్టమునకై పరిశోధనచేయుటకు ఉస్మానియా విశ్వవిద్యాలయమున నవకాశము గల్పించిరి. ఉపరి వారే పర్యవేక్షకులుగా నుండుటయు జరిగినది. ఇందులకు వారికి నా కృతజ్ఞతాభివందనములు.

U.G.C వారి Faculty Improvement Programme క్రింద పరిశోధన చేయుటకు నా కవకాశము కల్పించిన మా కళాశాల ప్రిన్సిపల్ శ్రీ కె. టి. రాయుడుగార్కి కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

U.G.C వారు నాకు 1979 నుండి 1982 వరకు మూడేండ్లపాటు F.I.P క్రింద Ph.D., కొరకు పరిశోధన మొనరించుటకు నిధులను మంజూరుచేసిరి. వారి కందులకు నేనెంతయో కృతజ్ఞుడను.

U.G.C నిధుల మంజూరు విషయమున సహాయపడి, ఇంకను ఇతర సందర్భములందు, అడుగడుగున నన్ను ప్రోత్సహించి, సకల సదుపాయములు గల్పించి నా ఈ పరిశోధన కృషి ఈ రూపమునకు వచ్చునట్లు చేసిన ఆచార్య రామరాజుగారికి మరొకమారు నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

అవసరమైన గ్రంథముల నిప్పించి, వివిధ విషయములను తెలియజేసిన ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీ రీసెర్చి అసిస్టెంటు శ్రీ విఠల దేవుని సుందరశర్మగారికి నా కృతజ్ఞత.

అడిగినదే తడవుగ వారి ఇంట భద్రపరుపబడిన గ్రంథముల జూపి, నన్నాశీర్వదించి, ప్రోత్సహించిన, సింగరాయకొండ, కలికివాయి గ్రామవాసులు,

సంస్కృతాంధ్రముల కవీశ్వరులైన శ్రీ వి్రాల శేషాచార్యులుగారికి నా ప్రణామములు.

ఉస్మానియా యూనివర్శిటీ తెలుగుశాఖాధిపతులు, ప్రస్తుతము Emeritus Professor బి. రామరాజుగారు, S.K. యూనివర్శిటీ తెలుగు శాఖాధిపతులు ప్రొఫెసర్ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు, S.V. యూనివర్శిటీ, తెలుగు స్టడీస్ ప్రొఫెసర్ మరియు ఆంధ్రశాఖాధ్యక్షులు, జి. నాగయ్యగారు నేను కోరినదే తడవుగ, మన్నించి తమ అభిప్రాయముల నొసంగిరి. వారికి నా నమస్సుమనస్సులు.

ఈ గ్రంథము ముద్రణార్థము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖవారు ఆర్థిక సాహాయ్యమందించిరి వారికి నా కృతజ్ఞత.

పరిశోధన చేయుటకు నా కవకాశము కల్పించి, తదుపరి ఈ గ్రంథము ముద్రణ మొనరింప ననుమతి నిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయము అధికారులకు నా కృతజ్ఞత.

ఈ సిద్ధాంత వ్యాసములో దాదాపు చిత్రముల నన్నిటిని తీర్చిదిద్దిన చిత్రకారుడు, మా శిష్యుడు నైన చిరంజీవులు జి. అమరేశ్వరరావుకు నా శుభాశీస్సులు.

గ్రంథముల పరిశీలింప ననుమతి నొసంగిన హైదరాబాదు, వేటపాలెం, తిరుపతి, మద్రాసు మున్నగు ప్రదేశముల యందలి గ్రంథాలయాధికారులకు నా కృతజ్ఞత.

ఈ గ్రంథము ప్రచురణార్థము తోడ్పడిన, ప్రోత్సహించిన శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్, (మ్యూజియంరోడ్-విజయవాడ) వారికి నా కృతజ్ఞత.

విషయము సాంకేతికపరమైనది. అందులోను ఉద్గ్రంథము. ముద్రించుట కష్టసాధ్యము. అట్టి దానిని త్వరగా ముద్రించియిచ్చిన శ్రీ కృష్ణాప్రింటర్స్‌వారి నభినందించుచున్నాను.

ఈ కృషిలో చేదోడు వాదోడుగా ఉన్న నా సోదరులకు, నా సహధర్మిణికి ఆశీస్సులు.

## గ్రంథమును గూర్చి:

ఇంకను యీ కృషిలో కొద్దిగాగాని, గొప్పగాగాని తోడ్పడిన పెద్దలందరికి ప్రణామములు, పిన్నలకు ఆశీస్సులు.

పద్య రచనము నేడు సన్నగిల్లినది. ఇట్టి పరిస్థితులలో పద్యరచనమునందే పుట్టి పెరిగిన చిత్రకవిత్వము సంగతి వేఱు చెప్పనక్కరలేదు. ఇప్పటికే అది మరుగున పడిపోయినది పైపెచ్చు ఈ చిత్రకవిత్వము నధమముగా పండితులు భావించుటచే అనాదరణము పొందినది. అంతేకాక సులభముగా నేటి పాఠకులకు తేలికగా కొఱకుడు పడనిదిది. ఇట్టి చిత్రకవిత్వముపై మక్కువగలవారు మననము చేసికొనుట కొరకు, మక్కువలేని వారికి తగినట్లు కల్పించుకొనుటకు పనికివచ్చునట్లును, అసలు చిత్ర కవిత్వమననేమియో తెలిసికొనగోరు జిజ్ఞాసువులకు పరిచయ మొనర్చిన సాధనమగుటకైన ఆశతోడను, తెలుగు సాహిత్యమునగల చిత్ర కవిత్వమునంతటిని ఒకచోట చేర్చి, విశ్లేషించి చూపిన, సమగ్రముగ దానిని ప్రదర్శించినట్లగునను యుద్దేశము తోడను ఈ యత్నమును గైకొంటిని. ఆత్మవిశ్వాసమును పెంచుకొంటిని

విషయము కష్ట సాధ్యమైనది. ప్రాచీన కావ్యములందే ఈ చిత్రకవిత యుండుటచేత, అట్టి కావ్యము లీనాటి గ్రంథాలయములందు దొరకవు. కావున విషయమును సేకరించుట నాకెదురైన కష్టములలో మొదటిది. లక్ష్యముండి లక్షణము లేకుండుట, అట్లే లక్షణముండి లక్ష్యము లేకుండుట రెండవది. లక్షణ లక్ష్యము లున్నను బంధములకు బొమ్మలు చిత్రించి యుండకపోవుట మూడవది. అంతేకాక సంస్కృతములో ఉండి తెలుగులో కొన్ని బంధములు లేవు. వాని ననుబంధములో చేర్చితిని సంస్కృతాంధ్రభాషలలో బంధము. లన్నిటికిని బొమ్మలు లిఖింపబడి లభింపక పోవుట శోచనీయము ఇదిగాక, బొమ్మలో శ్లోకముండిన సందర్భముల, అట్టి బొమ్మలలో తెలుగు పద్యములు లిఖించి, సమన్వయించి చూపుట సమస్య అయినది ఇప్పటికి ఈపని జరుగనియెడల బొమ్మ ఊహకు కూడ అందనిపరిస్థితి ఏర్పడవచ్చు. అందువలన బంధ సాధారణ లక్షణముల ననుసరించి చిత్రకల్పనము చేసితిని. పద్యగూఢము (గర్భకవిత్వము) విషయమున ఒక పద్యమునుండి పెక్కింటిని వెలికి దీయుట నాల్గవదైన కష్టము ఇటువంటి వింకెన్నో కష్టములు సమస్య లెదురైనవి నా ఓపిక కొలది అతిక్రమించితిని. ఈ కృషిలో నేనెంతవరకు కృతార్థుడనైతినో బుధజనుల నిర్ణయమునకు వదలివేయుచున్నాను.

భావి పరిశోధకుల పురోగమనమునకు యీ కృషి దోహదకారి కాగలదని నా ఆశయము ఈ పరిశోధనాంశము నింతకుముందెవరును చేపట్టక పోవుట విశేషము. నా అదృష్టము.

భాష విషయములో ఒకమాట స్పష్టత కొఱకు రచనలో సరళ గ్రాంథిక భాషను వాడితిని అరసున్నను వాడలేదు. సంధి చేయక విడదీసి వ్రాసిన సందర్భములే అధికము.

## రచనా ప్రణాళిక:

ప్రథమ ప్రకరణములో చిత్ర కవిత్వము యొక్క స్వరూప స్వభావములను, దాని భేదములను, ఈ కవిత్వ ప్రారంభ వికాసములను, ఆంధ్రేతర భాషలలోగల చిత్రకవిత్వము, చిత్రకవిత- సందర్భము- ప్రయోజనముల గూర్చి ముచ్చటించితిని. ద్వితీయ ప్రకరణములో శబ్ద చిత్రములైన స్వర, వంజన, స్థాన, గతినియమ చిత్రములను, అక్షర పాద నియమ చిత్రములను, వీని మిశ్రమమును గూర్చి వివరించితిని. తృతీయ ప్రకరణములో ఆకారనియమ చిత్రము (బంధకవిత్వము) ను పట సహితముగ చిత్రించితిని.

చతుర్థ ప్రకరణములో చ్యుత చిత్రములు తెల్పితిని. గూఢ చిత్రము క్రింద పద, పాద, పద్యగూఢము (గర్భకవిత్వము), భాషా గోపనముల గూర్చి పేర్కొంటిని.

పంచమ ప్రకరణములో ప్రశ్నోత్తర ప్రహేళికలు అనేకార్థకావ్యాలు, అచ్చ తెలుగు, మరియు ఇతర చిత్రముల, సకల చిత్ర మిశ్రమమును చేర్చుట జరిగినది.

సంస్కృతములోనుంచి తెలుగులో కనబడని బంధములను మరియు ఆంగ్ల తమిళములలోగల బంధములను నాకు లభించిన వాని నన్నిటిని అనుబంధములో చేర్చితిని. వానిలో బొమ్మలేనివానికి బొమ్మను కల్పించి వేసితిని.

మనవి : విషయము కొంత సాంకేతిక పరమైనది. ముద్రించుట కష్టసాధ్యము నైనది. అందులోను ఉద్గ్రంథము. అట్టికరి దొసగులు దొర్లుట అసహజము కాదు. ఎంత జాగ్రత్తపడినను అవి దొర్లినవి. గ్రంథాంతమునగల 'సుపథము' ననుసరించి చదువుకొన పఠితుల నర్థించుచున్నాను.

ఇట్లు,
విధేయుడు,
డా॥ గాదె ధర్మేశ్వరరావు

| సంస్కృతము : | సంకేతనామ సూచిక |
|---|---|
| సా. ర. | సాహిత్య రత్నాకరం |
| సర కంఠా | సరస్వతీ కంఠాభరణమ్ |
| సు ర. భాం. | సుభాషితరత్న భాండాగారం |
| ల.స. | లక్ష్మీసహస్రమ్ |
| పా స. | పాదుకాసహస్రమ్ |
| కా.ద | కావ్యాదర్శము |
| కా.శా. | కావ్యాను శాసనమ్ |
| తెలుగు : | |
| కా.చూ. | కావ్యాలంకార చూడామణి |
| ల.సా సం. | లక్షణ సార సంగ్రహము |
| ఆం కా.ద. | ఆంధ్ర కావ్యాదర్శము |
| ల.స. | లక్ష్మీ సహస్రము (ఆంధ్రము) |
| కు.సం | కుమార సంభవము |
| ష చ. | షట్చక్రవర్తి చరిత్ర |
| ప్ర రా వేం వి వి. | ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము |
| ప్ర.సం బం.ని గ్రం. | ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము |
| అ. ఉ.రామా | అద్భుతోత్తర రామాయణము |
| ని.భా రామా. | నిర్వచన భారత గర్భ రామాయణము |
| శ్రీ.వేం చి ర కరము | శ్రీ వేంకటేశ్వర చిత్ర రత్నాకరము VOL.I. |
| VOL I పూ భా VOL II.ఉ.భా. | పూర్వ భాగము. VOL II. ఉత్తర భాగము. |
| చ నా శాస్త్రి | చర్ల నారాయణ శాస్త్రి |
| వేదుల వారి | వేదుల సూర్యనారాయణ వారి |
| గ వేం కవి | గణపవరపు వేంకటకవి |
| మంపా.శాస్త్రి | మండపాక పార్వతీశ్వర శాస్త్రి |
| నాదేళ్ళవారు | నాదెళ్ళ పురుషోత్తమకవి |
| రా ల.నా | రావిపాటి లక్ష్మీనారాయణ |
| వి క్రాలవారు | విక్రాల శేషాచార్యులు |

—) 0 (—

# తెలుగులో చిత్రకవిత్వము

## ప్రథమ ప్రకరణము

## చిత్రకవిత్వము - స్వరూప స్వభావాదులు

### 1. అవతారిక

ఆంధ్రసాహిత్యమొక యనంత రత్నాకరము. దాని లోతుపాతులు చెలియలి కట్టలు దెలియుట మానవ మాత్రుల కసాధ్యము. రత్నాకర మందలి రత్నములను కనుగొనుట, విలువ గట్టుట ఆ శోభననుభవించుట కొందఱికే వీలుపడును "లోకో భిన్నరుచిః" అన్నట్లు సాగరసమీపమున పిల్లగాలుల తేలిపోవుటతో తృప్తిపడువారు, సాగరసౌందర్యమును వీక్షించి ఆనందించువారు, కాళ్ళు కడిగికొనువారు, స్నానము చేయ నిచ్ఛగించువారు, పడవమీద ప్రయాణము చేయువారు, జలచరములబట్టువారు, రత్నములను వెలికిదీయువారు, కనుగొనబడిన జాతి రత్నముల శోభల ననుభవించు వారయి లోకములో భిన్న భిన్న రుచులుగల వ్యక్తులు మనకు కనబడుచుందురు.

ఇట్లే సాహితీప్రక్రియలు, వానిభేదములు కాలానుగుణముగ లోకముచే నాదరింపబడుచుండును.ఏ ప్రక్రియగాని తదంశముగాని కొఱగానిదనుట పొరపాటు. ఏ కొందఱిచేతనయిన నది ఆదరింపబడును లేదా కొందఱికైనను రుచి కల్గించుననెడి సత్యము విస్మరింపరానిది. నాటకము, నవల, కవిత్వము మున్నగునవి సాహితీ ప్రక్రియలు. ప్రక్రియలన్నిటిని కలిపి రత్నాకరము, దాని పరిసరప్రాంతములతో పోల్చినపుడు కవిత్వము రత్నాకరమునందు లభించెడి ఒక జాతిరత్నమని చెప్ప వచ్చును. కవిత్వములో ఒకభేదమైన చిత్రకవిత్వము జాతిరత్నమునకు కించిద్భిన్న మైన రత్నమే యగును. ఇట్లు చిత్రకవిత్వమొక రత్నమైనప్పుడు, అందలి రీతులు కాంతులగుచున్నవి.

పండితులేకాక పామర పాఠకులుకూడా ఆ చిత్ర కవితారత్నకాంతులను కాంచియు, తద్రత్నమాలను తమకంఠసీమల దాల్చియు ఆనందించుచున్నారు.

విద్వద్వరేణ్యులు, విమర్శక శిఖామణులు కొందఱు చిత్ర కవిత్వముగూర్చి యెడనెడ గ్రంథపీఠికలయందు విమర్శములయందు పేర్కొనిరి. కాని ఆ కవిత్వ తత్త్వము, రీతులు నిప్పటివరకు ఒకచో పూలమాలవలె ప్రోవడి యుండలేదు.

ఒకచో చేర్చి తెలుగున చిత్రకవిత్వ స్వరూప స్వభావాదులను, ఆ కవిత్వ మందలి భేదములను, తత్సంబంధములైన సూక్ష్మాంశములను సోదాహరణముగ నిరూపించుటకే యీ "తెలుగులో చిత్రకవిత్వము" గ్రంథ రచన ముద్దేశింపబడినది.

## 2. చిత్రకవిత్వ స్వరూప స్వభావములు

తెలుగు చిత్ర కవితాకన్యకు సంస్కృత చిత్రకవితయే మాతృక యని చెప్ప వచ్చును. తల్లి రూపురేఖలు, గుణవిశేషణములన్నియు బిడ్డయందు సహజముగా మూర్తీభవించును. అందఱి విషయమున అన్నివేళల ఇట్లుండునని చెప్పలేము. రూప గుణాదులు కొన్ని తల్లిబిడ్డలకు వేఱగుచుండును. తల్లికంటె బిడ్డ కొన్నిట ప్రత్యే కత నిలుపుకొనుటగూడ జరుగును. ఇట్లు తెలుగు చిత్రకవితకు సంస్కృత చిత్ర కవిత జనని యయినను తెలుగు బిడ్డ రూపగుణాదులలో కొంచెము భిన్నమయి తన ప్రత్యేకతను నిల్పుకొనుచున్నది. అందువలన తెలుగు చిత్రకవితా స్వరూపస్వభావ ముల గూర్చి ప్రత్యేకముగా తెలిసికొనవలసిన యవసరమేర్పడినది. స్వరూప స్వభా వముల నిర్ణయమున కీ క్రింది యంశములు తోడ్పడును.

1) లక్షణము 2) చిత్రకవిత-నామ సార్థక్యము 3) కావ్యేతర కళలయందలి చిత్రతత్త్వము 4) కవిత్వము-చిత్రకవిత్వము 5) తెలుగున చతుర్విధ కవితలు-చిత్రకవిత్వము.

### 1. లక్షణము

చిత్ర కవితాలక్షణము గూర్చి యే తెలుగు లాక్షణికుడును సమగ్రముగ చెప్పియుండలేదు. సంస్కృతాలంకారికులలో గూడ ఒకఱిదఱే సంపూర్ణముగ దాని లక్షణములను నిర్వచించి యుండిరి

చిత్ర కవిత్వమునకు లక్షణమును ప్రకాశవర్షుడిట్లు చెప్పెను.

'చిత్రంతు నియమన్యాసో వర్ణానామీప్సితక్రమమ్
స్వర వర్ణ గతి స్థాన బంధహారాది బంధనాత్'

[రసార్ణవాలంకారమ్ III. 52]

ఒక నియతక్రమమున వర్ణాదులను ప్రయోగించు ప్రక్రియయే చిత్రకవిత్వము. అది స్వరవ్యంజన (వర్ణ) గతి, స్థాన, హారము మున్నగు బంధముల రూపమున ఉండునని పై లక్షణమున కర్థము.

ఇంకను వివరముగ లక్షణ మొసంగినవాడు హేమచంద్రుడు. "స్వరవ్యంజన స్థాన గత్యాకార నియమచ్యుత గూఢాదిచిత్రమ్". [కా.శా.V.4]. దీనికి టిప్పణిలో 'స్వరాదీనాం నియమచ్యుత గూఢా దిశ్చ చిత్ర సాదృశ్య యాదాశ్చర్య హేతుత్వా ద్వాచిత్రమ్' [కా శా.V.12 వంక్తి].

చిత్రరూపమున కవిచే చిత్రింపబడుటగాని, ఆశ్చర్యము గలిగించునట్టి దగుట వలనగాని ఇది చిత్రమనిపించుకొనదగినది.

వీనివలన చిత్రకవిత స్వరూపమిట్లు తెలియగలదు.

1. ఒక నియతక్రమమున వర్ణాదులు వ్రాయబడి కన్పడుట.

2. ఒక చిత్రరూపమున అనగా హేమచంద్రుడన్నట్లు ఆకారనియమచిత్రము (బంధకవిత్వము) చిత్రింపబడి కనబడుట.

3. పద్యమున పదపాదములు లేదా మరియొక పద్యము,పద్యములు గూఢమై (గర్భకవిత్వము) కనబడుట.

4. హేమచంద్రుడు 'ఆది' అని వాడుటలో ప్రశ్నోత్తర ప్రహేళికాది చిత్రములు, శ్లేషప్రాతిపదికపై నిర్మింపబడిన అనేకార్థకావ్యములు మున్నగునవి చిత్రకవిత్వము క్రిందికి వచ్చునని కా.శా. టిప్పణిబట్టి తెలియుచున్నది. వీనియందు చమత్కారరూపమున చిత్రముండునని, వీనిరచన మాశ్చర్యము కలిగించునని తెలియును.

పై లక్షణములనుబట్టి చిత్రకవిత స్వభావమిట్లు తెలియును.

1. చిత్రతత్త్వము గలిగియుండుట చిత్రకవిత స్వభావము.

2. ఆలేఖ్యరూపమున గనబడుట [ఆకారము, బంధకవిత]

3. ఆశ్చర్యము గల్గించునట్టిదై యుండుట [సర్వచిత్రములు]

4. చమత్కార జనకమై యుండుట [చ్యుత, గూఢాదులు]
5. ఒక నియమ బద్ధమై యుండుట [నిరోష్ఠ్యము, అచ్చ తెలుగు మొ॥]
6. గూఢత గల్గినదై యుండుట [చ్యుత గూఢాదులు]

## 2. చిత్రకవిత — నామ సార్థక్యము

చిత్రకవిత కాపేరు సార్థకమేమో చూడవలసిన పని కలదని యనిపించు చున్నది.

చిత్రపదమున కర్థము లనేకములు. మొదటగా వానిని తెలిసికొనవలసి యున్నది. వైదిక, లౌకిక వాఙ్మయములందు చిత్రపదమెన్ని అర్థములలో వాడబడి నదో వానిని గూర్చిన వివరణము చిత్రకావ్యకౌతుకమను సంస్కృత గ్రంథమున గలదు.[1] వైదిక వాఙ్మయమున చిత్రపదము తొమ్మిది అర్థములలో ప్రయోగింప బడినదవి గుర్తించబడినది.

1. అద్భుతం, ఆశ్చర్యం, విచిత్రం

1. చిత్రం నష్టం గుహా హితం సువేదిం కూచి దర్థినమ్.
(ఋతుసంహిత. సాతవలేకర. 4-7-6)

2. చిత్రోనతి చిత్యనామ కృత్వోవ తిష్ఠతేయే అగ్నః ఇతి.
(కాత్యాయన. శ్రౌ. సూ. అ. 18 చయన)

3. పురుషే చిత్రే సామ గాయతి. (కా. శ్రౌ. సూ. 17-76)

4. చిత్రః ప్రకేత ఉషసో మహా అస్యగ్నే సఖ్యేమారిషా మా వయంతవ.
(ఋ.సం. 1-94-5)

5. ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగాచ్చిత్రం ప్రకేతో అజ నిష్ఠ విభ్వా.
(అందలి. 1-113-1)

6. సచిత్ర చిత్రం చిత యన్త మస్మే చిత్రక్షత్ర చిత్ర తమం వ్యో ధామ్.
(అందలి. 6-6-7)

7. రయిర్న చిత్రా సూరోన సన్దృగా యుర్నప్రాణోనిత్యోన సూనః.
(ఋ. సం. 1-66-1)

---

1. పీఠిక. పుట. 1. 22.సంపాదకుడు. ప్రేమలతాశర్మ. ప్రింటు.1965

2. నానావిధమ్

1. చిత్రా మఘా యస్య యోగే ధి జగ్యే తం వాం హువే అతిరిక్తం పిబధ్యై.
(అందలి. 8-58-3)

2. అందలి 7-75-5 3) 7-77-3 4) 7-45-4 5) 1-44-1 6) 10-140-3

3. అనేకమ్.
చిత్రైః రంజి భిర్వపుషే వ్యంజతే వక్షఃసు రుక్మాఀ అధియేతిరే శుభే.
(అందలి. 1-64-4)

4. ఉత్కృష్టమ్.
చిత్రోవోస్తు యామశ్చిత్ర ఊతీ సుదానవః। మరుతో అహి భానవః
(అందలి. 1-172-1)

5. ప్రభూతిమ్.
చిత్రం రయిం యశసం ధేహ్యస్మే దేవి మర్త్యేషు మానుషి శ్రవస్యుమ్.
(అందలి. 1-113-15)

6. దీప్తిమత్
స్వరుం న పేశో విదథేష్వం జం చిత్రం దివో దుహితా భానుమ శ్రేత్
(అందలి. 1-92-5)
స్వసారః శ్యావీమ రుషీమజు షూణ్ చిత్ర ముచ్ఛంతీ ముషసం న గావః
(అందలి 1-71-1)
అయః స్వర్ణ భానునా చిత్రో విభాత్యర్చిషా (అందలి 2-8-4)

7. నానా వర్ణయుక్తమ్ (శబలమ్)
సచన్త యదుషసః సూర్యేణ, చిత్రామస్యకేతవో రామవిన్దన్
(అందలి 10-111-7)
ఆవహన్తి పోష్యాః వార్యాణి చిత్రం కేతుం కృణుతే చేకితానః
(అందలి 1-113-1)

8. దర్శనీయమ్.
ఏంద్ర యాహి మత్స్వ చిత్రేణ దేవ రాధసా. (అ దలి. 8 1-23)
వి తద్ యయురరుణ యుగ్భిర శ్వైశ్చిత్రం భాన్త్యుషసశ్చంద్ర రథాః
(అందలి. 6-65-2)
అగ్నౌ చాధూమకే యజ్జ్యోతిశ్చిత్ర తరం (మైత్రేయ్యుపనిషద్ 6-10)

9. ఆలేఖ్యమ్.
చిత్ర భిత్తి రివ మిధ్యా మనోరమమ్. (మైత్రేయ్యుపనిషద్. 4-2)
లౌకిక వాఙ్మయ మందు చిత్ర పద మీక్రింది అర్థములలో ఉపయోగింప బడినది.

1. వివిధ వర్ణయుక్తము.
మృగః....చిత్రో రజితబిందుభిః (వాల్మీకి రామాయణే 3-36-18)

2. ఆలేఖ్యమ్.
చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా. (మాఘకావ్యే. 2-9)
పునరపి చిత్రీకృతా కాన్తా (అందలి. 6-20)

3. అద్భుతం, చమత్కార జనకమ్.
కిమ త చిత్రం యది కామ సూర్భూః (రఘువంశే. 5-33)
వాక్యమప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు (వాల్మీకి రామాయణే. 3-45-29)

4. ఉజ్జ్వలం, భాస్వరం.
చిత్ర ధాతు విచిత్రా ద్రీనిభ భగ్నభుజద్రుమాన్।
జలాశయాణ్పివ జలాన్నలినీః సురసేవితాః (శ్రీమద్భాగవతే 1-6-12)

5. మధురమ్
వక్తా....చిత్ర కథః (శుక్రనీతిసారః 3-56)
చిత్ర స్వనైః పత్రరథైః (శ్రీ మద్భాగవతే.1-6-13)

6. ఉద్వేగకరమ్.
చిత్రైర్వధోపాయైః (మనుస్మృతౌ 9-2-48)

శ్రీసూర్యరాయాంధ్రము, శబ్దార్థ చంద్రిక మున్నగు తెలుగు నిఘంటువులలో 'చిత్రము'నకు 1] ఆశ్చర్యము 2] చిత్తరువు 3] చిత్రవర్ణము 4] పదచమత్కారము 5] కావ్యభేదము [చిత్రము] 6] నానావర్ణములుగలది 7] మనోహరమైనది 8] కనబడునది అనెడి అర్థములు చిత్రకవితకు సంబంధించినవి కనబడుచున్నవి.

వైదిక లౌకిక వాఙ్మయములు, నిఘంటువుల యందు "చిత్ర" పదమునకు 1] ఆలేఖ్యము లేదా చిత్తరువు 2] అద్భుతము లేదా ఆశ్చర్యము 3] పదాచమత్కారము 4] నానా వర్ణములు గలది 5] మనోహరమైనది 6] దర్శనీయమైనది అనెడి అర్థములు చిత్ర కవిత్వమునకు సంబంధించినంత వరకు గ్రహింపవలసి యున్నది.

నానా వర్ణములు గల, మనోహరమైన, దర్శనీయమైన కవిత చిత్ర కవిత యని 'చిత్ర' పదమునకు సామాన్యార్థముతో చెప్పవలెను. ఆలేఖ్యము, అద్భుతము, చమత్కారము అని ప్రత్యేకార్థములను 'చిత్రకవిత'లోని 'చిత్ర'కు చెప్పు కొనవలెను.

అర్థసమన్వయము: ఆలేఖ్యమనెడి అర్థమున ఆకార నియమ చిత్రము (బంధ కవిత్వము), అద్భుతమనెడి అర్థమున పద్యమున పాద, పద్యముల గూఢ మొన రించు చిత్రము (గర్భకవిత్వము), స్వరవ్యంజనాది నియమ చిత్రములు, చమత్కార మనెడి అర్థమున చ్యుత, ప్రశ్నోత్తర, ప్రహేళికాది చిత్రములు గ్రహింపబడి, యిట్టి అర్థములిచ్చు 'చిత్ర' పదము, కవిత్వ పదమునకు ముందు జోడింపబడి "చిత్రకవిత్వ" మను పేరు సార్థకమైనది.[1]

## 3. కావ్యేతర కళలయందలి చిత్రతత్త్వము

కావ్యకళకు చిత్రతత్త్వముతోడెచిత్రకవిత్వముగా పిలువబడుచున్నదనిగ్రహిం చితిమి.ఒక్క కావ్యకళయందేకాక మిగిలిన కళలు ముఖ్యముగాలలితకళల యందీ చిత్ర తత్త్వమున్నదేమో పరిశీలించుట అవసరమైయున్నది. ఏలనకళలయందనుకరణస్వభావ ముండునుగదా.కనుక కావ్యేతర కళల యందలి చిత్రతత్త్వము నారయవలెను.

ఏ కళాకారుడైనను తన కళయందు సిద్ధహస్తుడై పిదప అందు చిత్రతత్త్వ మును జొప్పించుటకు పాటుపడును. కళాకారులు నలుగురిలోను తాను తన కళాఖండ మును విలక్షణముగా తీర్చిదిద్ది అదియు, తానును మిన్నగా ఉండుటకు నిరంతరము కృషిచేయుచుండును. ఇది సహజము. ఆ భావము కవికి గూడ ఉండుట సహజమే కదా. కవి కావ్యకళలో చిత్రతత్త్వము రూపొందించి అనగా చిత్రకవిత్వమును చిత్రించి తాను తోటి కవులకంటె మిన్న అనిపించుకొనును. దానిని తరువాతి కవులు పోషించి పెంపొందింప జూతురు.

చిత్రతత్త్వము ఇతర కళలలో ఎట్లున్నదో చూతము.

---

1. చిత్రకవితా స్వభావమునుగూర్చి నాకోనసము "తెలుగులో చిత్రకవిత" మాసపత్రిక 'నవభారతి' 1980 మార్చి. హైదరాబాదు ప్రచురణ.

చిత్రకళ:

అనులోమ విలోమమనెడి చిత్రతత్త్వము చిత్ర కవిత్వములోవలె చిత్తరువులలోను కన్పడును.[1] ఒకే బొమ్మ అనులోమముగా సర్దారు, విలోమముగ పసిపిల్లవాడుగ కన్పడుట ఇందుల కుదాహరణము. అనేకార్థకావ్యాలలోవలె చిత్తరువులో మూడు చిత్తరువులను చూడవచ్చు[2] చిత్తరువున కెదురుగా నిలబడి చూచిన 'రామకృష్ణపరమహంస' కొంచెము ఎడమకు జరిగి ఒక కోణములో చూచిన 'వివేకానందుడు' కుడికి జరిగి ఒక కోణములోచూచిన 'శారదాదేవి' కనబడును. ఇట్లే ఒక చిత్రమున మఱియొక దానిని గూఢ మొనరించుట-కుదాహరణము[3] మేఘపంక్తి చిత్రములో గజపంక్తిని గూఢ మొనరించుట. చిత్రకవిత్వము లోని ఏకపాది, ద్విపాదలవలె చిత్రకళలోగూడ ఏకరేఖా,ద్విరేఖా చిత్రములున్నవి[4].

గానకళ:

శ్రవ్యరాగమున దృశ్యరూప ధ్యానము సంగీత శాస్త్రమున కలదు. వేద పాఠమున ధ్వజ, జటా, మాలా. రథ యిటువంటి అష్టభేదాకృతి సూచికల పేర్లు వినబడుచున్నవి. సంగీతములోని స్వరసంధర్భ రూపాలంకారములతో వేణీఊర్మి, శ్యేన, ఆవర్త మొ॥ ఆకృతి రూపములు కలవు. సంగీత ప్రబంధములలో చక్రవాల, క్రౌంచపద, స్వస్తిక యిటువంటి దృగాకృతి సూచక సంజ్ఞలు కలవు. దైవ దృశ్య సూచకమైన పేర్లు కమల, కాంచీ, కిరీట, క్రౌంచపద, చక్ర, చక్రపద మొ॥ వినబడుచున్నవి.[5] ఆడువా రొకచరణము, మఱొక చరణమును మగవారు పాడినట్లు, ఒకే గాయకుడు గాత్రముతో మార్పు ద్వారా తన సాధనచే గీతము నాలాపించును. ఇట్లు గానకళలో చిత్రత్వమున్నదని చెప్పవచ్చును.

---

1. గుమ్మా శంకరరావు. తెలుగులోచిత్రకవిత వ్యాసము. 'తెలుగు' పత్రిక తెలుగుఅకాడమీ ప్రచురణ హైదరాబాదు. సెప్టెంబరు 1979.
2. అదే.
3. పండితరామరూప పాఠక. చిత్రకావ్య కౌతుకమ్. ప్రథమ ఖండం. పుట. 24.
4. పై గుమ్మా శంకరరావు గారి వ్యాసము.
5. చిత్రకావ్య కౌతుకమ్. పీఠిక పుట. 21. ఆధారము.

శి ల్ప క ళ :

చిత్రకళవంటిదైనను శిలపై చిత్రరూప కల్పనమిది. చిత్రకళలో రూపము యొక్క ఏకదేశమును ప్రదర్శించుటకు వీలగును. కాని శిలపై నాల్గువైపుల మూర్తి పూర్తిగా తీర్చి దిద్దుటకు వీలగును. ఇది మూర్తికళ. ఇందులో గూఢ చిత్రచిత్రణము కలదు. గూఢచిత్రణమనుకొనదగును. ఉదా :- [1].భువనేశ్వరనగర కేదార గౌరి మందిర ప్రాంగణములో ఉన్న చిన్న మందిరములో ఉన్నది పురుష విగ్రహము. మామూలుగ చూచినచో పవళించిన పురుషుడుగాను, ఒక వైపునుండి చూచినచో ఎడమవైపుకు తలవంచుకొని వరుండినట్లు, వేరొక వైపునుండి చూచిన కుడివైపుకు తలవంచుకొని పవళించిన, వేంకొక కోణము నుండి చూచిన ఇద్దరు పురుషులుగా కన బడును. ఒకే ఆకారము శిల్పకళలోని చిత్ర చిత్రణము చేత నాల్గు ఆకారములుగ కనబడుచున్నది. మఱియొక ఉదాహరణము- [2]"రెండు తలలు" అనెడి భావ గర్భిత మైన శిల్పము. ఆడ, మగ వ్యక్తుల తలలు శిల్పమందు భావగర్భితములుగా రూపొం దినది శిల్పి, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన శ్రీ జి. రవీంద్రరెడ్డి ఇది గాజుతో శిల్పమును మలిచిన ప్రక్రియకూడ- దీనికి జాతీయ స్థాయిలో 1980 మార్చిలో బహుమతి లభించినది. పద్యములో పద్యము బు గూఢమొనరించినట్లు (గర్భకవితవలె) ఇది మూర్తిలోని మూర్తిగూఢము చేసినట్లుండును.

నా ట్య క ళ :

ఇందు నాటక నృత్యకళలు వచ్చును. నటుడొక్క పాత్రను స్వతన కారోపించు. కాని అభినయించుట నాటక కళలో సర్వ సామాన్యము. అందు ద్విపాత్రాభినయ ప్రక్రియ ప్రచారములోనున్నది. అనగా ఒకే నటుడు రెండు పాత్రలను ధరియించి తదనుగుణముగ నటించి, ఆ రెండింటికి న్యాయము చేకూర్చి, కళను శోభాయమాన మొనర్చును. ఇది నాటకకళలో చిత్రతత్త్వమును కనబఱచుటయే.

ఏదో ఒక భావము నాధారముగ జేసికొని నృత్యమొనరించుట నృత్య విషయ

---

1. చిత్రకావ్య కౌతుకమ్. పీఠిక. పుట. [illegible]. ఆధారము.

2. ఆంధ్రజ్యోతి. దినపత్రిక. 1984 డిసెంబరు. 14. స్త్రీలు పేజీలలో

ములో సామాన్యము. అట్లుకాక రాధామాధవులకు లేదా మతొక జంటకో చెందిన భావములను ప్రతిబించెడి విధమున సంవాదరీతి కనుకూలించునట్లు మనోహరముగ నృత్యము చేసి చూపుట నృత్యకళలో చిత్రతత్త్వము నెఱుకపఱచినట్లుండును.

ఇ త ర ము లు :

యజ్ఞకర్మములో ఆకృతిభంగి 'శ్యేనచిద్' క్రియా విశేషము. అందలి శ్యేనాకృతి చయనము భంగి విశేషముచే కల్పింపబడును. 'కంకచిద్' అను చయన యాగ సంజ్ఞకూడ ఇటువంటిదే.[1]

ఆగమశాస్త్రములో మంత్రములు జ్ఞానాత్మకములు. తంత్రము క్రియాత్మకము యంత్రము భావనాత్మకము. యంత్రముల తంత్రముండును. కావున అది ఆకార చిత్రము (బంధకవిత్వము) వలె ఉండునుగదా.[2]

ఈ వివరణముబట్టి ప్రతికళలోను చిత్రతత్త్వ ముండుననియు, అట్లే కావ్యకళలో గూడ చిత్రతత్త్వమున్నదనియు, అదే చిత్రకవిత్వమనియు, తెలియుచున్నది. మొదటగా ఈ చిత్రకవిత్వము సంస్కృత సాహిత్యములో గైకొనబడినది. దాని నుండి తెలుగువారు గ్రహించిర నివేఱు చెప్పనక్కరలేదు.

## 4. కవిత్వము : చిత్రకవిత్వము

కవిత్వమున చిత్రకవిత్వ రూపురేఖలు చిత్రకవిత్వ స్వరూప స్వభావములు తెలిసికొనుట కుపకరించును.

అర్థప్రాధాన్యమునుబట్టి కావ్యము-మూడు విధనములని సంస్కృతా లంకారికులు చెప్పియున్నారు.అవి ధ్వనికావ్యము, గుణీభూతవ్యంగ్యకావ్యము, చిత్రకావ్యము చిత్రకావ్యము శబ్దచిత్రము వాచ్యచిత్రమని రెండు విధములని మమ్మటుడు, ఆనందవర్ధనుడును చెప్పియుండిరి. చిత్రకావ్యములో శబ్దార్థచిత్రముల తారతమ్యమును గుర్తించినవాడు జగన్నాథ పండితుడు. ఆతని దృష్టిలో కావ్యములు నాలుగురకములు.

1. ధ్వని 2. గుణీభూత వ్యంగ్యము 3. అర్థ చిత్రము 4. శబ్దచిత్రము. ఈ చిత్రమధమశ్రేణికి చెందినది.కావ్యమని పేరిడి పిలుచుచున్నను అర్థమునుబట్టి కవిత్వ

1. చిత్రకావ్య కౌతుకమ్. పీఠిక. పుట. ౨౬ ఆధారము.
2. అదే.

మెన్ని విధములో పై విచారణము తెలుపుచున్నది. దీనినిబట్టి చిత్ర రచన యొక కవితా రీతి యనియు, ప్రబంధాది పద్య కావ్యములలో (గ్రంథములలో) ఈ చిత్ర కవిత్వమునకు స్థానమున్నదనియు నిస్సంశయముగ చెప్పవచ్చును. ఏలన పై అలంకారికుల వాక్కులే ప్రమాణము.

ఒక కావ్యములో ధ్వని ప్రధానమైన పద్యములు కొన్ని, గుణీభూత వ్యంగ్య ప్రధానమైన పద్యములు కొన్ని, చిత్రరచనా ప్రధానములైన పద్యములు కొన్ని, కేవలము శబ్దాలంకార ప్రధానములైనవి కొన్ని, అర్థాలంకార ప్రధానమైనవి కొన్ని, యుండును. ఇవి యన్నియుకలిసి మృష్టాన్న మన్నమాట. దీనిని తయారుకావించువాడు కవి. వివిధరుచుల నందించెడి యీ వంటకములను తిని యానందించువాడు సహృదయ పాఠకుడు.

కవిత్వ పరముగ గాక కావ్యమనగా కావ్యమే యనెడి దృష్టితో జూచిన యెడల ఒక కావ్యము ప్రత్యేక ధ్వని ప్రధానమయినదనియు, మఱొకటి గుణీభూత వ్యంగ్య ప్రధానమయినదనియు నిష్కర్షగ చెప్పలేము. అట్లుండుటకూడ అరుదే. కాని ప్రతిపద్యము చిత్రరచనతో కూడిన ప్రత్యేక చిత్రకావ్యములు మనకు ప్రత్యక్షములగు చున్నది. ఆ చిత్రకావ్య నిర్మాతలను చిత్రకవులని పిల్వదగును.

వ్యంగ్యము స్ఫురింపజేసెడి కవిత్వమున్నప్పుడు చిత్రకవిత యెందుల కనెడి ప్రశ్న ముదయించవచ్చును. తినుబండములను, వాని రుచులలో మార్పులను తఱచు జిహ్వ కోరుచునే ఉండును. ఒకవింత దృశ్యమును గూర్చి వినుటకు, దానిని చూచి ఆనందించుటకు నెల్లప్పుడు శ్రవణ చక్షువు లుబలాటపడుచుండును. ఇది లోక సహజము ఇట్లే కావ్యములో వైవిధ్యము తప్పనిసరి. తన రచనలో ఒకకొత్తదనము చూపవలెనని నిరంతరము కవి కృషి సల్పుచునే యుండును. చిత్రకవితా రచన మీ కృషిలో భాగమే. చిత్రకవితను పఠింప వీలైన దర్శింప పాఠకులువ్విళ్ళూరుచుందురు. వారికి దగినట్లు రుచికర కవిత్వము నందించి వారిని ఆనందపఱచుటయే కవి పరమావధి.

ఇక రెండవ కారణము. కవియెంత జాగ్రత్తపడినను కావ్యములో కొన్ని పట్టుల రసభావాదుల కొఱత యేర్పడును. అట్టి నీరసమయిన పట్టులందు పఠితలకు క్రొత్త యూపిరి పోసి, ఉత్సాహము కల్గించి, కొత్తరుచిని చూపి, వ్యామోహమున

పడవేసి, చిత్తము నాకర్షించి, ఒకరకమైన చమత్కారము నందించి, యాహ్లాద పరచు బాధ్యత కవి మీదకలదు. అందుకు చిత్ర కవిత్వరచన మవసరము.

ధ్వని లేని లోటును దీర్చి తన గురుతర బాధ్యతను చిత్రకవిత్వము నిర్వహించుచున్నది. అట్టి సమయముల రసభావాదుల గోచరింపజేయు కవితనంమువరకు సహృదయుడగు శ్రోత చిత్రకవితా మృతమును గ్రోలక తప్పదు.

శ్రవ్య కావ్యమున శ్రోత వాచ్యార్థము తెలిసికొని, మననము చేసికొని తదుపరి వ్యంగ్యార్థము గ్రహించుచుండును. దీనికిగాను శ్రోత ఆలోచనా పూర్వక మయిన శ్రమకు లోనగు చుండును. అప్పుడు శ్రోతకు మనోల్లాసము, కించిత్ చమత్కారము లవసరమగును. ఈ సమయమున చిత్రరచన ముండిన వీనులకింపు, మనసున కూరటయు కలుగును. అందువలన కావ్యముల నక్కడక్కడ చిత్రకవితను ప్రవేశపెట్టుట కవి ధర్మము. ఇది కవి చిత్రము నుపయోగించుటకు మూడవకారణము.

చిత్రకవిత్వము సృజియింపబడుటలో చతుర్థ కారణము క్రిందిది. వేర్వేఱు, కవితలు, శబ్దార్థాలంకారములు కోకొల్లలుగ కవితా సామ్రాజ్యమున వర్థిల్లుచున్నవి. 'లోకోభిన్నరుచిః' అన్నట్లు సామాజికుల భిన్నభిన్నరుచుల కనుగుణముగ, వారి యాదరణము ననుసరించి కావ్యాలలో కవితలను, అందలి రీతులను, అలంకారములను పొందుపరచి, అందఱి యొక్క రుచులను దీర్ప కవి ప్రయత్నించును దీనివలన ఆ కావ్యము సామాజికులందఱిచేత ఎల్లప్పుడు ఆదరణను, మెప్పునుపొందుటకు వీలగును కొంతలో కొంత సామాన్యముగ అందఱికిని వారివారి రుచులు దీర కవి కవితాపదార్థ మందించిన వాడగును. నలుగురును తన కావ్యము చదివి,తృప్తిచెంది, ఆనందింతురు. అప్పుడు కవికిగూడ తృప్తి, ఆనందము, శాశ్వతకీర్తి, కలుగును కదా.

"వర్ణ సామ్యము, శబ్ద సామ్యములందు సహృదయుల సహజరుచిని త్రుంచి వేయలేము. శబ్ద చిత్ర మధమ శ్రేణికి చెందినదిగా స్వీకరించినను దాని యందలి అభిరుచి నిరాకరింప శక్యము కానిది." 1.

చిత్రము సృజింపబడుటకు నాలుగు కారణములు కలవని పైన చేసిన చర్చ వలన తేలినది. రసభావాదులమధ్య వాని కడ్డు తగలని విధమున పరిమిత ప్రయోజనములతో చిత్రకవితను వాడుచున్న విధానమిది. "కావ్యమున రసభావాధ్వని ననుసరించుచు

1చిత్రకావ్యకౌతుకమ్ పీఠిక. పుట. 24. అధారము.

వైచిత్ర ప్రయోగము చేసిన సూక్ష్మ దృష్టికి గాని చిత్ర మహిమ గోచరముగాదు. రసభావాదుల మధ్యలో వాడబడిన చిత్ర మెవరికిని అనిష్టత కాదు."[1]

ఇట్లు క్వాచిత్కముగ ఉత్తమ కావ్యములలో చిత్ర కవిత్వము వాడిన కవులున్నారు. "అంత మాత్రమున ఉత్తమ కావ్యమునకు హాని వాటిల్లదని" పరశురామ పంతుల లింగమూర్తి కవి సీతారామాంజనేయ సంవాదములో చెప్పియున్నారు.

కవి తన ప్రజ్ఞా పాటవముచేత, వ్యుత్పత్త్యభ్యాసాది గుణాధిక్యము చేత, శబ్దగత పాండిత్య ప్రకర్షచేత నిటు రసపోషణము గావించుచు నెడనెడ చిత్ర కవిత్వము వెలయించుచు కావ్యమును నిర్మింపవచ్చునని గ్రహింపవలయును. సామాన్య కవికిది కుదరక పోవచ్చును. చిత్ర కవితారీతులు పెక్కుగలవు. వానిలో ఏవేవి యెక్కడ వాడుట సమంజసమో గుర్తెఱిగి యుండవలయును. అందువలన పైన చెప్పిన గుణములుగల కవిచేతిలో పడిన కావ్యమునకు శోభచేకూరును.

ఈ సందర్భమున "యదవ్యంగ్యమపి చారు తచ్చిత్రమ్" (చిత్ర మీమాంస. గ్రంథారంభ ప్రకరణమ్). అనెడి అప్పయ్యదీక్షితులవారి మాట గుర్తుంచుకొనవలెను. వ్యంగ్య రహితమయినది చిత్రకవిత్వము. అయినను చారువయినదని ఆ మాట కర్థములు. చారువనగా ఒప్పిదము, మనోహరము, అందములని అర్థములు. ఇవే అర్థములు కలిగి "చిత్ర" పదము సార్థకమగుచున్నది. కావ్యమున కందము లేదా శోభను గూర్చునది, శ్రవ్యకావ్య పాఠకుల మనస్సులను హరింపజేయునది అనగా వారికి రుచి కల్గించి, అలౌకికా నందమును గూర్చునది చిత్రకవిత్వమని స్పష్టముగ చెప్పవచ్చును.

చిత్రపదములచేత వైచిత్ర్యము, కుతూహల జనకత్వము, విస్మయకరత్వము అను గుణములు గలిగి, చిత్రరచనముతోడ చిత్ర కవిత్వమను పేర అది ఒక కవితా భేదముగ కావ్యములో తగిన స్థానము నాక్రమించును. ఒక పరమావధి, ఒక ప్రయోజనము కోరియే. యే కవియైనను కవితను సృజియించును. కావున ప్రయోజన రహితమయిన కవిత యుండదు. సందర్భౌచితిని పాటించుట కవికి తప్పనిసరి కొన్ని సందర్భముల ఔచిత్యము పాటించుటకు చిత్రకవిత్వము వాడుట ఆవశ్యకమయి యున్నది. అట్టి సందర్భములో అది కావ్యశోభ నినుమడింప జేయుననుటలో విప్రతి

---

1 చిత్రకావ్యకౌతుకమ్, పీఠిక. పుట. 23,24 ఆధారము.

పత్తిలేదు. పాత్రల స్వభావము సహజముగ నుండునట్లు దిద్ది తీర్చుటకిది తోడ్పడును. చిత్రకవిత్వము వెలయించుటకు ప్రథమ సందర్భము. అత్యుత్తమ విధానము గూడ. ఈ చిత్రకవిత్వ రచనము కావ్యములో సందర్భమునకు దగిన ఒక రకమయిన ధ్వనిని సూచించును. అప్పుడు చిత్రకవిత ఒక కవితాభేదముగ వాడబడుచున్నది. సందర్భోచితముగ ఎట్లు వాడబడుచున్నదో మాతము.

1. ఒకపాత్ర తడబడుచు మాటలాడుట, నడుచుట లనెడి ధ్వనిని సూచించుటకు వర్ణసామ్యము, శబ్దసామ్యము గలిగిన హ్రస్వాక్షర సహిత శబ్ద రచనమవసరము 1) ఉదా: 'తడబడనడుగిడు'' — భాగవతము [8-103]. 2) శ్రీరంగమహాత్మ్యములో చిత్రసేనుడను గంధర్వుడు తన గర్వముచే మహిమలను పోగొట్టుకొని చుల్కనయై దేవుని ప్రార్థించు సందర్భమున సర్వలఘు రచనము సందర్భశోభితము అతడంత లఘువయినాడని సూచితము.

2. నిరోష్ఠ్య చిత్రము : పెదవులు కలువ వీలులేదు. పలుకవలెను. అప్పుడోష్ఠ్యాక్షరములు పరిహరించిన రచనము పాత్ర కుచితము. ఎందుకన ఆపాత్ర స్వభావమున్నది యున్నట్లు ప్రదర్శించి నట్లగునుగదా ఉదా:—దండి,దశకుమారచరిత్ర మందు మంత్రగుప్తుడు రాజుతో మాట్లాడు సందర్భము. 3. గుప్త సంభాషణము. పోకూరి కాశీపతి—సిద్ధని చరిత్రలో రామునిచేత సీతపేరు చెప్పించిన విధము. పద్యము నాల్గుచరణముల తుది అక్షరములు కలుపుకొనిన 'సీత' అని పేరు వచ్చును. భర్త భార్యపేరు చెప్పుట ఆచారము కాదు. సమంజసము కాదు. ఔచిత్యమునకు విరుద్ధము. అందువలన కవి ఈ చిత్రము ద్వారా రామునిచేత సీత పేరును చెప్పించెను. ఈ చిత్రము సందర్భోచితము. ఇది నామపద గూఢ చిత్రము.

4 బంధగర్భ కవితా రచనము— ఇది ఒకరకమయిన ధ్వనిని ప్రతిపాదించును ఉదా:— నన్నెచోడుని కుమార సంభవము. అందు నాగాభరణుని నాగబంధమున, చక్రిని చక్రబంధమున స్తుతించుట, చతుర్విధ జ్ఞానోపదేశము కొఱకు చతుర్విధ కందము. భక్తుని శరీరమున పరమేశ్వరుడు నిరంతరము గర్భస్థుడై యుండునని తెలుపుటకు కందగర్భ చంపకమాలను రచియించుట సందర్భోచితమై యొప్పుచున్నది.

ఇక మఱియొక తెగకు చెందిన కవులుకలరు. వారు చిత్రమనిన చెవి కోసికొనెదరు వారికి ధోడు, చిత్రమనిన మిక్కిలి మక్కువ, జూపెడి పాఠకులు కూడ

లోకమున కలరు. ఈ జాతికవులు కావ్యములలో నక్కడక్కడ చిత్రమును చూపుట కంటె ప్రత్యేక చిత్రకావ్యము వ్రాయుటమేలు. ఇట్టివి కవి తన చిత్ర కవితా రచనా సామర్థ్యము నెఱుకపఱచుటకు, ప్రజ్ఞను చాటుటకును, పాఠకులకు చిత్ర కవితపైగల అమితప్రీతిని దీర్చుటకును పని వచ్చును. ఉదా:—ఆశ్వాసాంత పద్యముల చిత్ర రచనము, అచ్చము నిరోష్ఠ్యకావ్యములు, అచ్చతెలుగు కావ్యాలు అనే కార్థకావ్యాలు మున్నగునవి.

సందర్భానుసారము చిత్రకవిత ఒక కవితాభేదముగ ఎట్లు వాడబడునో గమనించితిమి. చిత్రకవిత ఒక చిత్రరూప శబ్దాలంకారము. ప్రహేళికా, ప్రశ్నోత్తరాదులు స్వరవ్యంజన చిత్రాదులు చిత్రరూప శబ్దాలంకారములు.

చిత్రకవితలో ఒక భేదమైన ఆకార నియమచిత్రము (బంధకవిత) చిత్రాలంకారమని చెప్పవచ్చును,

ఇట్లు, కవితాభేదముగ, అలంకారముగ, ఔచిత్యము ననుసరించి యుత్తమ కావ్యముల యందును, చిత్రకవితాప్రయోగము మిక్కిలి యొప్పిదమై, శాస్త్ర సమ్మతమై యుండునని చెప్ప వీలగుచున్నది.

చిత్రకవిత ఒక శబ్దాలంకారమా? లేక దానికి దీనికి భేదమేమయిన కలదా? అనునది ప్రశ్నము. సంస్కృతాలంకారికులు చిత్రకవితను శబ్దాలంకార శీర్షికక్రింద జేర్చి వివరించిరి. అంత మాత్రముచేత చిత్రకవిత్వము కేవలము శబ్దాలంకారమని చెప్పరాదు. లాటానుప్రాస, ఛేకానుప్రాస. యమకము, ముక్తపదగ్రస్తాదులు శబ్దాలంకారమును చిత్ర కవిత్వము కావ్యములో రసభావముల కడ్డు రాకుండుటయే కాక వానికి ప్రోద్బలము వహించుచు, ఒకానొక ధ్వనిని ప్రసాదించుచుండి, ఒక ప్రయోజనమును చేకూర్చునని లోగడ గమనించితిమి. చిత్రములోని రచనా విశేషము బట్టి, సందర్భోచితముగ దాని వాడకము బట్టి, అందువలన కలిగెడి ప్రయోజనమును బట్టి, అది కేవలము శబ్దాలంకారమని చెప్పజాలను. శబ్దాలంకారరచనకు దీని రచనము భిన్నమయినదని వేఱు చెప్పనక్కఱలేదు.

కొందఱు సంస్కృత లాక్షణికులు, తెలుగుకవులు చిత్రకవిత్వము వాడకము గూర్చి తెల్పిన తీరు దిగువ వివరింపబడుచున్నది.

చిత్రకవితను శబ్దాలంకారముగ భావించి ఆ శీర్షిక క్రిందనే దండి మొదలు

కొని సంస్కృత లాక్షణికులు, వివరించి ప్రదర్శించిరి. తెలుగు లాక్షణికులలో అప్ప కవి. 'శబ్దార్థ లక్షణాలంకార సీసమాలిక, [అప్పకవీయము. ప్ర.33]లో "ప్రాసాదిగా చెప్పబడినవన్నియు శబ్దవితతి కలంకార వితతులయ్యె." అని అందునను ప్రాసాదులు, చిత్ర గర్భబంధ కవిత లన్నిటిని పేర్కొనెను.

శబ్దాలంకారముగ ఈ చిత్ర కవిత కావ్యములలో తప్పక వాడపలెనని సంస్కృత లాక్షణికు లిట్లు చెప్పియున్నారు.

శబ్దాలంకారములన్నియు గద్యపద్యములలోను రసానుగుణముగ కవులచే ప్రయోగింపబడవలెనని ఇట్లు ప్రకాశవర్షుడు నొక్కి చెప్పెను.

అమీచ శబ్దాలంకారాః
పద్యేగద్యేచ కోవిదైః
కార్యాః సందర్భశోభాయై
యథౌచిత్యం యథారసమ్.

[రసార్ణవాలంకారమ్]

శబ్దాలంకార చిత్రోక్తులు వాగ్దేవికి సముజ్జ్వలాభరణములని ఈ శాస్త్రకారుడిట్లు వల్కెను.

"జాతి స్తత్ర వాగ్దేవ్యామూర్తి స్తద్జ్ఞైయిరు దీరితా
రీతి య స్త్వంగ సౌందర్య లావణ్య మధవృత్తయః
రచనా ఘటనే దేవ్యాః కుండలే పరికీర్తితే

— — — — — —

లీలాకమల మౌచిత్యం వాసః ప్రశ్నోత్తరమ్పరమ్
ప్రహేళికాం తు పదక. మన్మ్రపా : తు కంచుకమ్
క్రీడాశకుంతం యమకం గూఢోక్తిం కేళికందుకమ్.'

(రసా. అలం. III 66.74)

ఇట్లాతడు సరస్వతీదేవికి విలాసవాసముగా, పదకముగా, కంచుకముగా, క్రీడాశకుంతముగా, కేళికందుకముగా, ఈ ప్రశ్నోత్తర ప్రహేళికాది చిత్రముల నుగ్గడించెను. అదియేగాక.

"వినాచ శ్లేష చిత్రాభ్యాం
కీ దృశీ వాగ్వి దగ్ధతా" శ్లేషచిత్రములేని వాగ్విన్యాస సామర్థ్యమెట్టిది? అని నిగ్గదీసి యడిగెను.

కావ్యములలో తప్పక చిత్రకవిత చొప్పించవలెనని తెలుగుకవు లిట్లు తెల్పిరి.

1. భైరవుడు. శ్రీ రంగమహాత్మ్యమున

కం॥ చెప్పెదఁ గావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపు చిలుకగఁ బాకం
బుప్పతిలఁ జిత్రరచనలు
చొప్పడ శబ్దార్థ ఘటన సుకవులు మెచ్చన్ (1-27)

శ్రుతికింపైనచో చోద్యముండునని భైరవుడిట్లు చెప్పెను.

కం॥ శ్రుతి సుకరంబై మధుర
శ్రుతి కలిత స్వర విశేష సువ్యక్తరబై
శ్రుతి ఘోషము వినఁబడె వి
శ్రుతముగ నచ్చోట నేమి చోద్యము గలదో. (5-5)

గ్రంథస్థమైన చిత్రకవితను వెలయించిన వారిలో ప్రథముడు [illegible]. ద్వితీయుడు ఈ భైరవుడు

2. నవనము చిననారాయణనాయకుడు కువలయాశ్వ చరిత్ర [illegible] కవిత్వ లక్షణముల నిట్లు తెల్పెను.

ఒకచో శబ్దనిగుంభనం లొకచోయుక్తి క్రియా గౌరవం
బొకచో నద్భుతజాతివార్త లొకచో నుజ్జృంభితత, ద్రస
ప్రకరంబుం గనిపించినన్మదికి సంభావింప నర్హంబు[illegible]
కకటా యేమియులేని కబ్బ మదికాహ్లాదంబు [illegible]విందునే

3 గం. వేం. క .. ప్ర. రా. వేం. వి. వి. అవతారికలో ఇట్లు చెప్పెను
'ప్రీతి పద్యంబు జమత్కృతి'—21.
'చిత్రబంధమ్ములచే సోయగసు మించి.'—23.

4. అహోబలపండితుడు కాళిందీ కన్యాపరిణయములో

కం॥ చిత్రవ్యక్తులనట కా
క్చిత్రాభివ్యక్తులేమి చిత్రంబగునే
చిత్రవ్యక్తుల చిత్రము
చిత్రధ్వని రయత నర్ధ చిత్రత మెఱయన్ (5-78)

అని వివరించి "కర్ణంబుల కుండలీ బంధాలంకారంబును, గనద్బాహుల మాలికా బంధాలంకారమును, గరతలంబుల పద్మ బంధాలంకారంబును గప్పనూగారున నాగ బంధాలంకారంబును అని ఇట్లు సందర్భసహితముగ (బంధచిత్రము) అలంకారము లేవి వాడవలెనో చెప్పియున్నాడు. (6-270).

5. ముద్దుపళని-రాధికా సాంత్వనమున,

'ఆశుకవిత్వంబు లల్లితేనేసరా
చిత్రప్రబంధముల్ చేయవలదె' అనియు,

6. పోలిపెద్ది వెంకట్రాయకవి. వేణుగోపాలశతకమున,

'కవుల మంచంతింతగా నల్లితేగాదు
చిత్రప్రబంధముల్ చేయువలయు.' అనియు ఆనతిచ్చిరి.

7. నెల్లూరి వీరరాఘవకవి. 'వివిధ చిత్రస్ఫూర్తి' 'శ్లేషోక్తి' 'చమత్కార సందర్భ గర్భిత చతురవృత్తి' 'ఏకార్థవైభవము' అని (1-29, 1-32) పద్యములు చెప్పియున్నాడు.

8. విక్రాలశేషాచార్యులుగారు చెప్పిన తీరు,

ఉ॥ ఏ కవితా వధూమణికి నెంచగ భూషలు శ్లేష ముఖ్యముల్
ప్రాకటమైన నాగముఖబంధము లా రతికాల బంధముల్
స్వీకృత గర్భధారణమ శ్రీకరగర్భ కవిత్వ విభ్రమం
చా కవితా వధూమణికి నారయకబ్బము సంతకాదొకో.

(శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా. 14).

వ్యంగ్యార్థ సమన్విత కవిత్వము పండితులకే అర్థమగునేమొ. కాని చిత్ర కవిత్వము శ్రవణసుఖమునిచ్చు గుణముచేత, చిత్రాలంకారముగ వాడబడుచుండుటచేత, పండిత పామరుల నెక్కువగా నుఱ్ఱూత లూగించి, ఆశ్చర్యమున ముంచెత్తి, ఆనందింపచేయు చున్నదని భావింపవచ్చును.

అర్థమునుబట్టి ఒక కావ్యము లేదా కవిత్వము ఉత్తమ, మధ్యమ, అధమ ములుగ ఆలంకారికులు చెప్పియున్నారు. వారిదృష్టిలో చిత్రకవిత్వ మధమమగును. కొన్ని కఠోరనియమరహిత చిత్రకావ్యములు లేదా చిత్రకవితారీతులు కలవు. ఉదా: 1. నిర్వచనకావ్యములు. 2 చతుర్విధ కందరచనము. ఇట్టి చతుర్విధ కంద పద్యములతో మాత్రమే రచియింపబడిన కావ్యము చిత్రకావ్యము. 3. అచ్చము నిరోష్ఠ్యచిత్రమయ కావ్యము. చతుర్విధ కంద లేదా నిరోష్ఠ్యపద్య రచనావిధానమునకు రెండు మూడు పద్యములు వ్రాయునప్పటికే కవి అలవాటుపడును. అప్పుడిక ఆ చిత్ర రచనావిధానము పయి దృష్టి పెద్దగా నుంచనవసరములేదు. ఇక దృష్టి రసభావవర్ణ నాలంకారాదులపై తప్పక మఱలును అప్పుడట్లు నిర్మింపబడిన కావ్యము నియమ ముండుటబట్టి మధ్యమము కాగలదు. ఒక్కొక్కప్పుడు పరికించినచో అట్టికావ్యము లుత్తమములగుటకు వీలున్నదని నేను భావించుచున్నాను.[1]

ఒకవిషయములో ఒక కవిత వుత్తమమైన మఱియొక విషయములో ఇంకొక కవిత వుత్తమమగును. ఒక్కొక్క సందర్భములో ఒక్కొక్క కవిత కావ్యమునకు శోభచేకూర్చును. అర్థప్రాధాన్యము వహించినది ఒకటైన, చమత్కార ప్రాధాన్యము వహించెడిది వేఱొక కవితయగును. దేని పరిధి దానిది. దేని సత్తదానిది. దేని విలువదానిది. దేని గుణము దానిది. ఒకదానితో మఱియొక దానికి పోలికలేదు. పోల్చినచో ఆయాగుణములలో దేనికదియేసాటి. హెచ్చుతగ్గులని ప్రశ్నయేలేదు.

మల్లె, గులాబిపుష్పములు రెండును రెండే వాసనరంగులలో దేనికదేసాటి.

చిత్రకవితా గుణములు, దాని పరిధి, సత్తవిలువ లోగడ గమనించితిమి గదా. కవిత్వము రుచిరార్థము ప్రసాదించును. చిత్రకవిత్వము పండిత పామర జనులకు రుచికర పదార్థములందించును. రెండును ఆస్వాదింపదగినవే. ఆదరింప దగినవే. ఆనందదాయకము లయినవే

### 5. తెలుగున చతుర్విధ కవితలు—చిత్రకవిత్వము

తెలుగులో చిత్రకవితా స్వరూప స్వభావముల నఱయుటకు తెలుగులోని చతుర్విధకవితలగూర్చి తెలిసికొనవలసియున్నది.

---

[1] కవిత్వము-చిత్ర కవిత్వము, నా వ్యాసము. 1-11-8?. సమాలోచన. పత్రపత్రికలో ప్రచురితము.

తెలుగు కవిత చతుర్విధ మనియు, అందు చిత్రకవిత్వ మొకటి అనియు తెలుగు లాక్షణికులు, కవులును, పలువురు తెల్పిరి. మొదటగా చతుర్విధ కవిత లెవ్వియో అరయుదము. సాహిత్య విమర్శకులు పలువురు వీనినిగూర్చి లోగడ చర్చించి తేల్చిరి. కాని మనమొకసారి మరల సంగ్రహముగా ముచ్చటించు కొనవలసి యున్నది.

'మృదు మధుర చిత్ర విస్తర'లు చతుర్విధ కవితలని పేరు పెట్టకయే నన్నయ్య, శ్రీనాథు కవులిద్దరే ప్రస్తావించిరి. వారి గ్రంధావతారికలలో పాఠ భేదమగుపడు చున్నది [1]

మృదుకవిత కోమలపద విన్యాసముతోడను లలిత భావములతోడను, ప్రసాద గుణముతోడను కూడినది కనుక మధుర కవితలో అది అంతర్భవించునని తెలుగు భాషాసమితి, VOL. 6. కవితాభేదములు, పుట 617-619లో వివరించుట జరిగినది. తెలుగు ఛందో వికాసములో కూడ ఇదే అభిప్రాయము వెలువరింపబడినది. మృదు వన్నది మిగిలిన వానికి విశేషణమని తాత్పర్యము. దీనిని బట్టి ఇక మధుర, చిత్ర, విస్తరణ మూడే మిగిలినవి. ఇవి వాని గుణమునుబట్టి పేర్లు వానికి సార్థక మైనవి. మధురముగా నుండునది మధుర కవిత, చిత్రముగా నుండునది చిత్ర కవిత, విస్తరించి, అష్టాదశవర్ణనలు అలంకార భూయిష్ఠమైనది విస్తరణకవిత. విస్తరకవితకు విస్తారమని నామాంతరము.

తర్వాతి కవులందరు పై మూటికి తోడుగ ఆశువుచేర్చి ఆశువు, మధుర, చిత్ర, విస్తరలు చతుర్విధకవితలని పేరిడి పేర్కొనిరి.

1) వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్ర[6-13], (2) చిన్నన్న-పరమయోగి విలాసము [పుట. 206], (3) పింగళి సూరన-కళాపూర్ణోదయము [1-11], (4) గ.వేం. కవి.-ప్ర. రా. వేం. వి వి. (43) (5) శేషము వేంకటపతి-తారా శశాంకము [2-54] తెలుగు లాక్షణికులలో వార్తాకవి రాఘవయ్య 'లక్షణ దీపిక'లో ఇట్లే చెప్పి, యీ కవితల స్వరూపములను చక్కగా వివరించియున్నాడు. దీనినిబట్టి ఆశువు, మధుర చిత్ర, విస్తరలు చతుర్విధ కవితలనెడి సంప్రదాయము ప్రచారమైనట్లు తేలుచున్నది.

---

1. చూడు పీఠిక XIV (శ్రీ) వ.రా. కేం. వి.వి. అకాడమీ ప్ర. 1977

కవితాగుణమునుబట్టి మధుర, చిత్ర, విస్తర, లేర్పడినట్లు లోగడ తెలిపితిమి. త్వరిత గతిని చెప్పబడెడిది ఆశుకవిత. అదే దాని గుణము. అవధాన ప్రక్రియ దీని క్రిందకు వచ్చును గనుక అది ప్రచారమై, పిదప అధికాశు కవిత్వము విస్తరిల్లుటం జేసి, ఆశువు కవితా విభాగముగా జేరినది. కావున ఇప్పటికిని తెలుగునాట చతుర్విధకవితలన ఆశువు, మధుర, చిత్ర, విస్తరలే.

కాని జూలూరి అప్పయ్య పండితులు మనుచరిత్ర వ్యాఖ్యానమున బంధ, చిత్ర, గర్భ, ఆశువులు చతుర్విధ కవితలని భావించిరి. ఇట్లే నిడుదవోలు వేంకటావుగారు ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో "అప్పకవి (క్రీ.శ. 1656) నాటినుండి ఆశువు, మధుర, చిత్ర, విస్తరలనెడి సంప్రదాయము మఱుగునపడి ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వములనెడి మతభేదమేర్పడినది. అయినను చాల మంది కవులు, లాక్షణికులు ప్రాచీన సంప్రదాయమునే పాటించిరి." అని తెల్పిరి. దీని నిట్లు వివరింపదగును.

చిత్ర కవిత స్వరూప స్వభావములగూర్చి ఇప్పటివరకు చూచిన దానిని బట్టి-చిత్రభేదమైన ఆకారనియమచిత్రము బంధకవిత్వముగను, గూఢ చిత్రములో పద్య గూఢము గర్భకవిత్వముగను చెప్ప వీలున్నదిగదా. కనుక బంధగర్భ కవితలు చిత్రకవితా విభాగములేకాని, కవితా విభాగములుకావు. కనుక బంధ గర్భ కవితలు చిత్రకవితలో అంతర్భవించునవే. ఇట్లే రావూరి దొరసామిశర్మ గారు భావించిరి.[1] పాటిబండ మాధవశర్మగారు చిత్ర కవిత్వ జాతిలోనివి బంధగర్భ కవితా విభాగములనిరి.[2]

ఆశువు, చిత్ర, గర్భ, బంధములు చతుర్విధ కవితలనుట పొరపాటు. ఏలన ఇవియే కవితా విభాగములన ఇతర కవిత్వమే కవితా విభాగములనిన జేరును. చిత్రకవి పెద్దన చిత్రకవితల గూర్చి స్పష్టముగ ఇట్లు తెలిపియున్నాడు.

"చిత్ర కవితలొనరు క్షితిమున్న జెప్పిన
వృత్త గర్భితముల నెసగికొన్ని
పద్మచక్రబంధాదులను గొన్ని
యమక భేదగోపనములుగొన్ని" [3-100]

1. తెలుగులో చందోరీతులు. చిత్ర కవిత ప్రింటు, 1962.
2. విజ్ఞాన దీపిక I అం. ప్ర. సా అకాడమీ ప్రింటు 1970 పుట 423.

కావున చిత్ర కవితలలో వృత్త గర్భితములు, పద్మచక్రబంధాదులు చేరునవియే చిత్రకవి భావన. చిత్ర కవితాభేదములైన చిత్ర, బంధ, గర్భ కవితలకు ఆయా పేర్లిడి చిత్రకవి పెద్దన కంటె విపులముగ వివరించినవాడు అప్పకవి. అంతమాత్రమున అవి వేర్వేరు కవితలని, అవియే చతుర్విధ కవితలని, అవి ఆశువు, గర్భ, బంధ, చిత్రలని అప్పకవి భావించినాడను కొనుట మన పొరపాటు భావన.

ఇట్లు పరిశీలించి చూడ ఆశువు, మధుర, చిత్ర, విస్తర కవితలు చతుర్విధ కవితలని తేలును.

ఇక చిత్ర కవితయందు చేరు రచనలగూర్చి విచారించుదము. ఏయే రచన లేయే కవితా విభాగముల జేరునో వివరించినవాడు వార్తాకవి రాఘవయ్య. చిత్ర కవితక్రింద చేరదగు రచనలగూర్చి అతడిట్లు తెల్పెను. "చిత్ర కవిత్వం బన్నది పాదగోపనంబును, పద్యభ్రమకంబును పాదభ్రమకంబును, నామగోపనంబును, అనులోమవిలోమగతి పద్యంబును కందగీత గర్భిత వృత్తంబులును, కందద్వయ గర్భిత మణిగణని కరంబును, క్రౌంచపద గర్భిత కందద్వయంబును, ద్విపద చౌపదలాలి సువ్వాల మంగళహారతి ధవళంబులు శోభనార్ధ చంద్రికాదిపద దర్వులాదులయ గర్భిత సీసంబులును, కంకపటమండూక తురంగ నటభేరీ వినాద నాటకరంగ వృత్తంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకర జిహ్వా, అచల జిహ్వా వృత్తంబులును, రగడ బేదంబులును, తాళగతులును, దండక వృత్తములును, అష్టదళ షోడశగదళ, ద్వాత్రింశద్దళపద్మ బంధంబులును,నవావరణ ద్వాదశావరణ చక్ర బంధంబులును, రథ నాగ ద్వినాగ కులాల చక్ర ఆందోళికా, ఛత్రాది బంధంబులును, గోమూత్రికా పుష్పమాలికా, పుష్పగుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల కంకణ సర్వతోభద్ర కవి కల్పితకల్ప వల్లరి వివియాదిగా గల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుట జేసిన యది."

ఈతని మతమున ఆశు, మధుర, చిత్ర, విస్తరలు చతుర్విధ కవితలు. గర్భ, బంధకవితలు చిత్ర కవితలోని విభాగములే అవియు, చిత్రకవితాస్వరూపము వివరించుచు చమత్కార మీ కవితాస్వభావమనియు నితడు తెల్పి చెప్పెను.

కాని రగడభేదములు దేశీయములగుటచే మధుర విభాగమున చేర్పవలసి

యుండగా ఇతడు చిత్రకవితలో చేర్చెనని సంపత్కుమార్ గారు భావించిరి.[1] అట్లు తాళగతులను, దండకవృత్తరచనము చిత్రమని యిందుచేర్చెనేమొ. కాని ఇవి యిందు చేరవు.

ఇక చతుర్విధ కవితలలో చిత్రకవితకు మిగిలిన మూడు కవితలతో గల సంబంధమును పరిశీలింపవలెను.

ఆశువు : త్వరితగతిని చెప్పబడెడిదీ కవితయైనను చిత్రతత్త్వమందున్నచో, అది తర్వాత చిత్ర కవిత్వ విభాగమున జేరును. ఉదా :- ఇచ్ఛా వాక్యసంఘట్టనము. ఇది దత్తపదివంటిదనినారు గుమ్మా శంకరరావుగారు.[2] రచన చిత్రముగా ఉండును కనుక అప్పకవి దీనిని చిత్రకవితలో చేర్చియున్నాడు. వర్ణవిలోపము, నల్లెంట్లు, కొంతవరకు ప్రశ్నోత్తర ప్రహేళికలు మొదట ఆశువుగా చెప్పబడి రచనా చమత్కృతినిబట్టి తర్వాత చిత్ర కవితలో చేరునవి. కవితా వినోదము కొఱకుద్దేశించిన యిట్టి చిత్ర రచనలు ఆశువుకు సంబంధించినవే సంస్కృతమున ఆశువున్నది. తెలుగు కవులు దానిననుసరించిరి. చిత్ర కవిత ఒక ఛాయగ ఆశువునందు చోటు చేసికొనును. పరిశ్రమ, సాధన, సమయస్ఫూర్తి, భావన ఈ కవికితప్పనిసరి.

మధురము : 'లయప్రమాణంబుల నొప్పి' మృదుమధుర వచన రచనల ప్రసిద్ధంబైన యది అని దీని స్వభావము. దేశీయ కవితలనగా రగడలు, పదములు, తాళములు. అవి యిందు చేరును.

సంస్కృతము కన్నడముల మధుర విభాగములేదు. తమిళమున క్రీ. శ. 12వ శతాబ్దినుండి ప్రసిద్ధ జెందిన 'పొట్టియల్' గ్రంథమున ఆశు, మధుర, చిత్ర, విస్తరలని కవిత తెలుపబడినది ఈ "మధుర దేశికవితలోనే వర్థిల్లినది. దాక్షిణాత్య సాహిత్యమునకు సంబంధించినది.[3] అని నిడదవోలు వేంకట్రావుగారనిరి. చిత్ర కవితలో ఒకే భేదమున కావ్యము నిర్మించిన, అందు మధుర కవితా స్వరూపము చోటు చేసికొనును.

---

1. తెలుగు ఛందో వికాసము, కులపతి సమితి వరంగల్లు 10-5-62.
2. తెలుగులో చిత్రకవిత. వ్యాసం. "తెలుగు" పత్రిక ప్రచురణ. అకాడమీ సెప్టెంబరు 1979
3. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర

ఈ మధురమునందు మిగిలిన మూడు కవితల ప్రవేశము కొంచెము కష్టమే. అయినను ఈ రచనలో చిత్రకవితను వెలయించిన వారున్నారు. ఉదా :- పురాణం పిచ్చయ్య—మైరావణ నాటకములో పాదభ్రమకము 'మారాను తతను రామా' అను పద్యము.

విస్తర కవిత : ఇది విస్తరించి యుండి తనలో మిగిలిన మూటికి చోటొసం గును. అంతటి శక్తిగలది. మహా కావ్యములీజాతికి చెందినవి అనగా తెలుగున ప్రబంధములు. సందర్భాను గుణముగ ఒక శబ్దాలంకారముగ సంస్కృత కవులు విస్తరకవితలో చిత్రకవితను ప్రదర్శించిరి. ఉదా :- మాఘుని శిశుపాలవధ, భారవి కిరాతార్జునీయము, అట్లే తెలుగున నంది తిమ్మనాదులు చిత్రముల చవి చూపించిరి.

చిత్ర కవిత : ఇక చిత్ర కవితకి మిగిలిన మూడు కవితల కవుల కంటె అధిక ప్రతిభ పాండిత్యము లవసరము. చిత్రకవి మేధకు శ్రమ నధికముగా గలిగిం చును. ఛందస్సాధారముగా జేసికొని అద్భుతమును పుట్టించెడి విధముగా ఒక చమ త్కారమును, ఒక చిత్రమును పాఠకుని ముందుంచునది చిత్రకవిత.

సంస్కృతము, కన్నడము, తమిళ తెలుగు మున్నగు భాషలన్నింటియందు చిత్ర విభాగము కలదు.

పై చర్చవలన తెలుగున చతుర్విధ కవితలు, వానిలో చిత్ర కవితయొక్క స్వరూప స్వభావములు, చిత్ర కవితయందు చేరదగు రచనలు, చతుర్విధ కవిత లలో మిగిలిన మూటితో చిత్రకవితకుగల సంబంధము మున్నగు విషయములు తెలిసినవి.

## 3. చిత్రకవిత్వము-భేదములు

చిత్రకవిత్వ స్వరూప స్వభావములు తెలిసిన పిదప దాని యందలి భేదము లను తెలిసికొనెదము.

హేమచంద్రుడు కావ్యాను శాసనములో చిత్రము గూర్చి నిర్వచించుచు చిత్రకవితా భేదములనందే వివరించెను.

"స్వరవ్యంజన స్థాన గత్యాకారనియమచ్యుత గూఢాది చిత్రమ్" [5-4]
ఇది పరిపూర్ణ నిర్వచనము చిత్రములో అన్నిరకము లిందు పొందు పఱుపబడినవి.

అవి 1. స్వర 2. వ్యంజన 3 స్థాన 4. గతి 5. ఆకారనియమ చిత్రము 6. చ్యుత 7. గూఢ 8. 'ఆది' చిత్రము-నుటలో ప్రశ్నోత్తర ప్రహేళికాదు, అనే కార్థ కావ్యములు మున్నగునవి స్వీకరింపవలెనని కావ్యను శాసనము టిప్పణిలో అర్థము చెప్పబడినది.

తెలుగులో విన్నకోట పెద్దన, చిత్ర కవి పెద్దన, అప్పకవి మున్నగువారు చిత్రకవితా భేదములను తెలిపి ప్రదర్శించిరి.

చిత్రకవి పెద్దన ఆ భేదముల నిట్లు వివరించెను.

"చిత్ర కవిత లొనరు క్షితిమున్న జెప్పిన
వృత్తగర్భితములు నెసగికొన్ని
పద్మచక్రనాగ బంధాదులనుగొన్ని
యమక భేద గోపనములు గొన్ని"

[ల.సా.సం.3-100]

వృత్త గర్భితములనుటలో హేమ చంద్రుడు చెప్పిన గూఢ చిత్రము క్రింద పద్యములు పద్య గూఢముగా భావింపనగును. గోపనము లనగా ఈ గూఢచిత్రము క్రింద పాద, పద గూఢములుగ భావింపవలెను. పద్మ చక్రనాగబంధాదులు హేమ చంద్రుడు చెప్పిన ఆకారనియమ చిత్రము క్రిందకు వచ్చును. కాని మన తెలుగు లాక్షణికులు, కవులు బంధకవిత్వమనియే పిలిచిరి. ఆకారము 'చిత్తరువు'నకు ప్రాధాన్యమిడి సంస్కృతమున ఆకారనియమ చిత్రమని పిలిచిరి. పద్యాక్షరము లాకారమున ఒక నియమమున బంధింపబడుటనుబట్టి ఆ బంధనమనెడి క్రియా పద ప్రాధాన్యమునుబట్టి తెలుగున బంధకవిత్వమని పేరిడిరి. పేరు వేరైనను క్రియ ఒకటే.

యమక భేదములనగా ఏకపాది, ద్విపాది చిత్రములు. వీనిని అప్పకవి గుర్తించెను స్వర వ్యంజన చిత్రముల క్రింద కాక వీనిని అక్షర చిత్రము క్రింద గ్రహింపవలెను.

చిత్రకవి పెద్దన ననుసరించి అప్పకవి ఇంక కొన్నిటి నధికముగా జేర్చెను. కొన్నిటిని విడిచిపెట్టెను.

విన్నకోట పెద్దన చెప్పిన 'సరిగమ పధను'లను అప్పకవి తొలుత చిత్ర కవితా భేదములలో చెప్పెను గాని, వానిని వివరించు సందర్భమున విడిచిపెట్టెను. ఈ 'సరిగమ'లు 'స్వరవ్యంజన' మిశ్ర చిత్రము క్రింద చెప్పనగును. ఏలన, స్వరవ్యంజనముల రెండింటి చిత్రనియమ మందున్నది.

చిత్రకవి పెద్దన చెప్పిన 'గుణితము'ను అప్పకవి విడిచిపెట్టెను. అప్పకవి అధికముగా చెప్పిన వీక్రిందివి. 1. ఏకపాది 2. ద్విపాది. ఇవి యమక భేదములు. అక్షరచిత్రమునకు సంబంధించినవి. 3. త్రిపద. మూడు పదములను మొదటి మూడు పాదముల యందు దాచి, నాల్గవ పాదమున ఆపదములు చెప్పబడును. పద గూఢము క్రింద నేను దీనిని గ్రహించితిని. 4. అక్షర విలోపము. ఇది వర్ణచ్యుతమనచెల్లును. చ్యుత చిత్రము క్రింద గ్రైకొనబడినది. 5 నల్లెంట్లు 6. ఇచ్ఛావాక్య సంఘట్టనము లాశువుకు సంబంధించి, అవధాన విద్యయందు వాడబడెడివి. చిత్రముగా పూరింప బడును కనుక వీనిని చిత్రకవిత్వము క్రింద అప్పకవి చెప్పెను. 'ఇతరచిత్రములు' శీర్షిక క్రింద వీనిని నేను తెల్పితిని. ఇవి హేమచంద్రుని 'అది' చిత్రములక్రిందకు వచ్చునన్నమాట.

వార్తాకవి రాఘవయ్య 'నామగోపనము'ను చెప్పియున్నాడు. ఇది పద గూఢము క్రిందకు వచ్చును

భేదముల స్థూల వివరణము:

1. స్వరచిత్రము: ఇందు పేరుకు దగినట్లు స్వర సంబంధ చిత్రము లుండును.
   ఉదా:- తలకట్లు, గుడులు మొ॥.

2. వ్యంజన చిత్రము: వ్యంజన సంబంధ చిత్రము లిందు చేరును.
   ఉదా:- ఏకాక్షరి, ద్వ్యక్షరి మొ॥ .

3. స్థాన నియమ చిత్రము:- అక్షరములు పలుకబడు స్థానమును బట్టి ఆ అక్షరములు మాత్రమే గ్రహించియో, విసర్జించియో చేయబడు చిత్రమిది.
   ఉదా:- ఓష్ఠ్యము, నిరోష్ఠ్యము, అస్పర్శము మొ॥.

4. గతిచిత్రము: అనులోమ విలోమ గతిని పొందు అక్షరములను పాదములను గమనింతుము.

ఉదా:- పాద, పద్యభ్రమకములు. మొ॥.

ఈపై నాలుగు చిత్రములను గలిపి శబ్దచిత్రకవిత లనవచ్చు ఈశబ్ద చిత్రముల మిశ్రమము కూడా గమనింపదగును.

5. ఆకారనియమ చిత్రము: ఇదే బంధకవిత్వము.
ఉదా:- మురజ, శంఖబంధములు. మొ॥.

6. చ్యుత చిత్రము : మాత్రార్థమాత్రావర్ణాదుల చ్యుతము లిందుండును.

7. గూఢ చిత్రము : వివిధ పద, పాదగూఢములు, భాషాగోపనము, పద్య గూఢము [గర్భకవిత్వము] లిందు గమనింతుము.

8. హేమచంద్రుని 'ఆది' చిత్రములు : వీనియందు ప్రశ్నోత్తర ప్రహేళికలు, నల్లెంట్లు, ఇచ్ఛావాక్య సంఘట్టన, అనేకార్థ కావ్యాలు మొ॥ చేరును.

పైన చెప్పబడినవికాక మఱియేమైన చిత్రములున్నచో వానివాని చిత్ర సంబంధముల ననుసరించి చొప్పించితిని. స్వరవ్యంజనములలో రానిస కొన్ని అక్షర చిత్రము క్రిందకు చేరినవి. ఇట్లే తదితరములను గ్రహించుట జరిగినది.

మఱియొక విధముగ చిత్రకవిత మొత్తమును శబ్దచిత్రము, వాచ్య చిత్రము, రూపచిత్రమని మూడు రకములుగ చెప్పవచ్చును.

స్వర, వ్యంజన, స్థాన, గతిచిత్రములు శబ్దచిత్రములు. చ్యుత, గూఢ (పద, పాద, భాషోగోపనము) ప్రశ్నోత్తర, ప్రహేళికాది చిత్రములు వాచ్యచిత్రములు ఆకార [బంధకవిత్వము], పద్యగూఢ [గర్భకృత్వము] చిత్రములు రూప చిత్రములు.

## 4. చిత్రకవిత : సందర్భము : ప్రయోజనములు

సందర్భౌచితిని పాటించి చిత్రకవితా రచనము చేయుట కవిత కలంకార మగుటయేకాక పాఠకుల కేకాగ్రత, సమయస్ఫూర్తి, అపాత్య వస్తుగత లీనత కల్గించును.

పెదవులు కలుప వీలులేదు. అప్పుడు నిరోష్ఠ్య చిత్రము సందర్భోచితము. ఉదా:- సంస్కృతమున దండి దశకుమార చరిత్రలో మంత్రగుప్తుడు రాజుతో మాట్లాడిన తీరు. అనలిట్టి సందర్భముల కొఱకే చిత్రకవిత్వ ముద్భవించినదా యనినట్లుండును. ఇట్టి సందర్భముల ఒక కవితాభేదముగ చిత్రకవిత వాడబడును కాని కేవల మొక అలంకారముగ కాదని చెప్పవచ్చును.

ఇట్టే ముక్కులేనివారు నిరను నాసికరీతి మాట్లాడుదురు. ఉదా:- శూర్పణఖ ముక్కు పోగొట్టుకొనిన తరి నిరను నాసిక చిత్రమున మాట్లాడెను [1]

తెలుగున నన్నెచోడుడు నాగభరణుని నాగమురజ బంధములలోను, చక్రి శక్రాద్యమరచక్రబంధంబునను స్తుతించుట, చతుర్విధ జ్ఞానోపదేశము కొఱకు చతుర్విధ కందమును, పరమేశ్వరుని నిరంతరము తలచువాని శరీరమున నతడు గర్భస్థుడై యుండునని తెలుపుటకు కంద గర్భ చంపకమాలను రచియించుట సందర్భ శోభ వినుమడించును గదా.

శ్రీరంగమహత్త్వములో భైరవికవి లఘ్వర్థములను సాధించుటకు లఘ్వక్షర ములను ప్రయోగించెను. చిత్రసేనుడను గంధర్వుడు తన గర్వముచే మహిమలను పోగొట్టుకొని చుల్కనయై [సర్వలఘువుగా మారి] శివుని స్తోత్రము చేయుట సందర్భోచితము.

వివాహవేదిక యందు సీతారాముల కంఠసీమను పుష్పమాలిక వేయుటను పుష్పమాలికా బంధమును వ్రాసి చమత్కరించి చూపినవాడు రావిపాటి లక్ష్మీ నారాయణ. [భారత గర్భరామాయణం. పుట 26, 27. పద్యం 51.]

---

1. నారాయణుని. నిరనునాసిక చంపువు. [పుట. 874. M. Krishnamachariar. History of Classical Literature నుండి గ్రహింపబడినది]

"బాహువుల మాలికా బంధాలంకారంబున, గవ్వనూగారున నాగబంధాలంకారంబున వర్ణింపవలె"నని అహోబల పండితుడు కాళిందీ కన్యా పరిణయములో చెప్పియున్నాడు. [గద్య. 6_27]

చిత్ర కవిత క్రిందకు రాకపోయినను సందర్భోచిత చిత్రరచన సార్థకమని చెప్పుటకు క్రిందిది ఉదాహరణము. మత్తయైనవారు మాటాడురీతి. సీసపాదము.

"తతత తామర సాక్షి తలపంతమాడకు
వివివి వీణా కంఠ వీణ తెమ్ము."

[అన్నయ్య. సుదక్షిణా పరిణయం. 3_10]

పాత్రల స్వరూప స్వభావములు పూర్తిగా పాఠకుల కందించుట కిట్టి చిత్ర రచన తోడ్పడును.

2. యుద్ధవర్ణన సమయములందు మహాకవులచే మహాకావ్యముల చిత్రకవిత వాడబడినది. మాఘుని శిశుపాలవధ, భారవి కిరాతార్జునీయము లిందు కుదాహరణము. యుద్ధవీరులు వారివారి ఆయుధములు ప్రయోగించు సందర్భముల ఆ యా ఆయుధ బంధములను చిత్రించవలసి యున్నది. శివుని యుద్ధసమయమున శివాయుధములు, అట్లే విష్ణువు యుద్ధమున విష్ణ్వాయుధములైన చక్ర శంఖాదులను వాడవలెను. రసాభాస సంఘటనముల చిత్రకవిత వాడకమెంతయో తగియున్నది. అందుకు సంస్కృతమున నీతివర్మ రచించిన 'కీచకవధ' ఉదాహరణము [1]

3. స్తోత్ర సందర్భములందు చిత్రకవిత సరసముగా ఉండును. విరివిగా వాడబడినది. సంస్కృతమున శతకముల, సహస్రముల పుష్కలముగా ఉన్నదిది. ఉదా:_ ఆనందవర్ధనుని దేవీశతకమొక చిత్రమందిరమనవచ్చు. ఇంకను ఈశ్వర శతకము, లక్ష్మీ, పాదుకా సహస్రాదులు.

తెలుగున స్తోత్రసందర్భముల విరివిగా చిత్రకవిత వాడబడినది. ఉదా:_ నంది తిమ్మన, పారిజాతాపహరణములో కృష్ణుని స్తుతించు సందర్భము. ధరణిదేవుల రామ మంత్రియొక్క దశావతార చరిత్ర, తూము రామదాసుని_ మిత్ర విందోద్వాహము మున్నగు కావ్యముల స్తోత్రసందర్భములలో వాడబడినది.

---

1. Krishnamachariar. History of Classical Literature పుట. 870. ముద్రణ. 1937.

4. క్రీడా వినోద గోష్ఠులలో చిత్రకవిత ప్రయోగింపబడి మిక్కిలి వినోద మందించును. తద్ద్వారా పాఠకుల కానందము నందించుటయే దీని పరమ ప్రయోజనము. కవితా గోష్ఠులలో ప్రశ్నోత్తరము, గూఢచతుర్థపాదము, క్రియా మున్నగు గోపనములు, వర్ణబిందు చ్యుతకాదులు గుప్తసంభాషణముకొఱకు, వినోదము కొఱకు ప్రదర్శింపబడుచుండెడిది. క్రీడార్థము ప్రహేళికలు, చదరంగము మున్నగునవి కలవు.

ఇటువంటి చిత్రకవిత ప్రయోజనమును దండి యీ క్రింది విధముగ వివరించెను.

"క్రీడా గోష్ఠి వినోదేషు తద్ జ్ఞయిరాకీర్ణ మంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికా."

[కా.ద. III. 97]

ప్రాచీను లీవినోదముల నాదరించినట్లు బాణాభట్టు కాదంబరిలో సూచించెను.

"కదా చి దక్షర చ్యుతకమాత్రాచ్యుక బిందుమతీ
గూఢ చతుర్థపాద ప్రహేళికా ప్రదానాదిభిః"

దీనిని బట్టి చిత్రకృతులతో నాటివారు వినోదించినట్లు స్పష్టము.

5. కథా భాగమునకు సంబంధములేని ప్రతి ఆశ్వాసాంతముననో, ఆశ్వాసాదినో, చిత్రకవితను కవులు వ్రాసిరి. ఇట్లు వ్రాయుట వారిపాండిత్యమును ప్రదర్శించుట కొఱకే అని తేలను. ఇదికవుల ప్రతిభను గుర్తించుటకే పరిమితమైయుండును. ఇంకెట్టి ప్రయోజనము లేదు. ఈ సందర్భమున అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతి వ్యాఖ్య గమనింపదగును.[1] "ఏ కవి ఉద్దేశ్యమైనను పాండిత్య ప్రకర్షను లోకమునకు ప్రకటించుటయే. చిత్రకావ్యములు పుట్టుటలోగూడ ఇంతియే." "1890 ప్రాంతమున పుట్టిన కావ్యములు చిత్రకవిత్వ సహితములే".

నూటికి తొంబదిమంది కవులట్లే వ్రాసిరి. ఒకటి రెండు మచ్చుకు. ఉదా:- పిండిప్రోలు లక్ష్మణకవి-లంకా విజయములో రెండాశ్వాసముల చివరను చిత్రకవిత

---

1. పుట. 15. సంపుటి 10. సంచిక 1. జనవరి 189 . [అముద్రిత గ్రంథ చింతామణి].

కలదు. చింతలపల్లి ఛాయాపతి-రాఘవాభ్యుదయములో ప్రతి ఆశ్వాసాంతమున చిత్ర కవితను ప్రదర్శించెను.

గర్భకవిత నెక్కువగా ఆశ్వాసాంతముల యందే ప్రయోగించిరి. ఉదా:- అప్పకవీయము మొ॥.

ఆశ్వాసాంతమునగాక ఇష్టదేవతా ప్రార్థన, షష్ఠ్యంత రచనా సమయముల చిత్రకవిత వ్రాసినవారున్నారు. అది దేవతల స్తోత్రము చేసినట్లుండును గదా.

ఉదా:- తూమురామదాసుని-మిత్రవిందోద్వాహము. ఇవికాక,

చిక్కులలో ఉన్నప్పుడు పంజరము, ఆటల వర్ణనసమయముల చదరంగము, ఊరేరిగింపుల రథము, యుద్ధమున ఖడ్గము, ఆభరణముల నలంకారవస్తువులను వర్ణించు సమయముల పుష్పమాలిక, హారము మొ॥ సరోవర వర్ణనమున సరోవరము పద్మబంధములును, ఇట్లే సమయోచితముగ ఆకారనియమ చిత్రకవితను (బంధములను) వాడిన బహుళ ప్రయోజనమును సాధింపనగును.

పాఠకున కొకవిధమైన శ్రవణ సుఖము గల్గించుట అనగా శబ్దమాధుర్యము, ధ్వని అనుకరణము, వినుట కింపుగా నుండుటయు, ఏకపాది, ద్విపాది, ఏకాక్షరి, ద్వ్యక్షర్యాదుల, గతిభేదనులు మున్నగునవి ఇటువంటివి. ఒక విధమైన ఉద్రేకోత్సాహములను ఆయా సమయముల గల్గించునదిది.

అప్పకవి శబ్దార్థ లక్షణాలంకార సీసమాలికలో[1]. (పుట. 18) చిత్రకవిత ప్రయోజనము నిట్లు చెప్పకయే చెప్పెను.

"చిత్రకవిత్వ ప్రసిద్ధ నామంబులై
పెంపొంది వీనుల కింపొనర్చు"

"గర్భకవిత్వ విఖ్యాతిచే శ్రవణ సుఖంబొనర్చు"

"బంధకవిత్వ విశ్రుతములై
కవులకు జెవులపండువుల సేయు"

---

1. అప్పకవీయము- వావిళ్ళ ప్రచురణ- మద్రాసు 1928.

చదువరులకు రుచిభేదము గల్గించుటయు చిత్రకవిత ప్రయోజనము. పాఠకుడు ధ్వని చేత, రసముచేత, మనసు విసుగెత్తినపుడు కూడ వానికి ఊఱట గలిగించునదిది. మనసును మరల్చి ఆలోచనము కల్గించుచు, చమత్కారముచే ఆనందము నందించును.

పరశురామ పంతుల లింగమూర్తి తన సీతారామాంజనేయ సంవాదమున చెప్పిన మాటలను గుర్తుంచుకొనవలె. అవి చిత్రకవిత ప్రయోజనమును చాటి చెప్పుచున్నవి. "చదువరులకు రుచిభేదము గలుగుటకును, గొందఱికిది ఇష్టమగుటం జేసియు నీ రచనావైచిత్రిని మహాకవులును తమ యుత్తమ కావ్యములలోఁ గ్వాచిత్కముగాఁ గావించియున్నారనియు, నంతమాత్రమున నుత్తమ కావ్యమునకు హాని వాటిల్లదనియుఁ దెలియవలయును."

## 5. తెలుగులో చిత్ర కవిత్వము—ప్రారంభ వికాస దశలు

సంస్కృతమున చిత్రకవిత క్రీ.శ. 7వ శతాబ్ది, తమిళమున 8వ శతాబ్ది, కన్నడమున కూడ అదే సమయమున ప్రారంభమైనట్లు తెలియుచున్నది. పాశ్చాత్య వాఙ్మయమున (Alexandrian Age) అలెగ్జాండరు కాలము నుండి నైటింగేల్ గ్రుడ్డు, గొడ్డలి మున్నగు ఆకారముల బంధములు, విలోమ పద్యములున్నట్లు బెరిడెల్‌కీత్ పండితుడన్నాడు.[1]

తెలుగులో మొట్టమొదటిగా చిత్రకవితను కావ్యమున ప్రదర్శించినవాడునన్నె చోడుడు. వావిళ్ళ వారి కుమారసంభవము ద్వితీయ ముద్రణమునకు పీఠిక వ్రాయుచు నిడుదవోలు వేంకటరావుగారు "వాఙ్మయమున తొలుత బంధగర్భ, చిత్రకవితలను ప్రవేశపెట్టినవాడు నన్నెచోడుడనియు, కావ్యాలంకార చూడామణి, కావ్యాలంకార సంగ్రహము, అప్పకవీయము మొదలగు నాలంకారిక లక్షణగ్రంథములయందీ బంధ కవిత ప్రస్తావమున్నది. తరువాతి ప్రబంధకవులు దీని నభివృద్ధి చేసిరనిరి. ఆంధ్ర వాఙ్మయచరిత్ర ద్వితీయ ముద్రణాను బంధములో "చిత్రబంధ కవిత్వము నన్నెచోడుని నాటినుండియు వెలసినది. భారతకవులు శ్రీనాథ యుగమునాటి కవులు దీనిని చేపట్టలేదు. క్రీ శ. 16వ శతాబ్ది నుండియు ఈ కవిత విస్తరిల్లినది"అనియు వంగూరి సుబ్బారావుగారు పేర్కొనిరి.

---

1. History of Sanskrit Literature. Page 127.
[కావ్యాలంకార సంగ్రహం. పుట 559]

తన కుమార సంభవ మొక ప్రబంధమగుట జేసియు, తమిళ కన్నడముల 8వ శతాబ్దమునకే చిత్రకవిత లక్షణములు గ్రంథస్థ మగుటచేతను, తనది కొత్త దేశీయ సంప్రదాయమగుట చేతను, కన్నడ లక్షణ గ్రంథములనుండి చిత్ర కవితా రీతులు స్వీకరించి నన్నెచోడుడు ప్రదర్శించియుండవచ్చు. తనకు లోగడ సంస్కృతమున స్వతంత్ర ప్రబంధములదగు కిరాతార్జునీయము, శిశుపాలవధాది గ్రంథముల చిత్రకవిత ప్రదర్శింపబడినవి. అవికూడ చూచి ఆ రీతినే ఇతడు తన స్వతంత్ర ప్రబంధమనబడదగు కుమారసంభవమున చిత్రకవితారీతులు సందర్భోచితముగ ప్రవేశ పెట్టియున్నాడు.

ఈ సందర్భమున వేదంవారి మాటల నిట పేర్కొందును[1]. "లక్ష్యములను బట్టి లక్షణము లేర్పడుట పరిణామ మార్గము. లోకస్వభావము. కాని తెలుగునకు మాత్రమిట్లు కాదు. కావ్యప్రక్రియలన్నిటిని మనవారు సంస్కృతమునుండియే గ్రహించి నందున ఆంధ్రవాఙ్మయ రీతి అంతయు సంస్కృత మర్యాదలను మనము తెచ్చుకొన్న విధపు చరిత్రయే."

ఈ విషయమునే వల్లామర్గయ్యగారిట్లనిరి.[2] "నన్నెచోడుడు కుమారసంభవమున సర్వ లఘువృత్తాది చిత్రకవిత్వమును సంస్కృత కవుల మెప్పునకై రచించెను. ప్రతి పద్యచమత్కృతికై పండితుల మన్ననకై పాటుపడిన వారిలో ప్రథముడు నన్నెచోడుడు."

నన్నెచోడునికాలము వివాదాస్పదమైనను పెక్కుమంది ఇతడు 12వ శతాబ్దిన ఉండినవాడనిరి.

ఇతడు సందర్భోచితిని పాటించి చిత్రకవితను ప్రారంభదశయందు వాడిన వాడైనాడు.

తెలుగులో స్వరాడిచిత్రమును, ఆకారనియమ చిత్రమును, గూఢచిత్రము ననెడి చిత్రరీతులను తొలుదొల్త ప్రవేశపెట్టిన వాడితడే. ఇది విశేషము.

---

1. శ్రీ.ప్ర.రా. వేం. వి.వి. పీఠిక. పుట. XX. ఆం. ప్ర. సా. అకా ప్రతి. 1977
2. ప్రబంధ వాఙ్మయ వికాసము, పుట. 217.

ఇతని తర్వాత, ఇక తెలుగు సాహిత్యములో చిత్రకవితను కావ్యములలో నక్కడక్కడ కొద్దిగానో గొప్పగానో లేదా కావ్యము మొత్తము మీదనో ప్రదర్శించిన కవులవారి గ్రంథముల పేర్లు వరుసగా ఈయబడుచున్నవి. కాలక్రమమున చిత్ర కవిత వికాసము, విస్తరలు తెలియును.

13వ శతాబ్దిలో మల్లికార్జున పండితుడు, పాల్కురికి సోమనాథుడు వ్రాసిన అక్షరాంక గద్య పద్యములు చిత్రకవితా భేదములలో అక్షర చిత్రముక్రంద జెప్ప నగును. కన్నడ సాహిత్య సాహచర్య ప్రభావమువలన ఇది తెలుగున వ్రాయబడి యుండవచ్చుననిపించుచున్నది.

ఈ శతాబ్దమున అనగా (క్రీ.శ. 1245) అభినవ మయూరి సూరిచే వ్రాయ బడిన కాకతీయుల వర్ధమానపుర శాసనమున చిత్రకవిత గలదు. కాని అందలి భాష సంస్కృతము. ఉత్తరదేశమునుండి తెలుగుదేశమునకు చిత్రకవిత ఇప్పుడే శాసన ములయందు సంస్కృత భాషారూపమున ప్రవేశించుచున్నదన్న మాట.ఈ శాసనమున ఒక షడర చక్రబంధము కలదు.ఇందు కావ్య, కవి, కథానాయక, లేఖకుల నామములు గలవు. రెండవ వలయమున నాగేశ శాసనము, నాల్గవ వలయమున మయూర విరచితము, ఏడవ వలయమున గుండవీరనుతి, తొమ్మిదవ వలయమున నాగయ లిఖి తము___అని కలదు.

37, 38 పంక్తుల శ్లోకమొక గోమూత్రికా బంధము. కన్నడమునుండి కాక నరాసరి సంస్కృతము నుండి దిగుమతి చేసికొనినవి పై బంధములని చెప్పవచ్చును.

మయూరిసూరి పుత్రుడైన ఈశ్వరసూరి లేదా ఈశ్వర భట్టోపాధ్యాయుడు కాకతీయుల శాసనకవులలో రెండవవవాడు. ఇతడు క్రీ.శ. 1259, 62, 76 సం.ల. శాసనముల మూటిని రచించెను. ఇవి బూదపూరు (మహబూబ్‌నగర్ జిల్లా)లో లభించినవి

క్రీ.శ. 1259 సం. శాసనము చివర చక్రబంధము కలదు. ఇందుశకము అంకెలను అక్షరముల చిత్రముగా తెల్పబడినది. 'శాకాబ్దే, శశిదంతి శంకరమితే' అనగా శశి =1, దంతి=8, శంకర=11. 'అంకానాం వామతో గతిః' అనబడు సూత్రముబట్టి ఈ అంకెలను ఎడమనుండి కుడికి మార్చిన 1181. శకమగును.

రెండవ శాసనకాలము క్రీ శ. 1262. దీనియందు నిర్దంత్యము, క్రియాపద

భ్రమకము, నిస్తాలవ్యము, నిష్కంఠ్యము, క్రియాపదత్రయ గోపనము, నిరోష్ఠ్యము, అక్షరముష్టిక మొ॥ చిత్రములు కలవు. భాష సంస్కృతము. "ఇందొక శ్లోకము రెండు గోమూత్రిక లగును. ఆ రెండును గలిపిజాలబంధమగును." అని వేదం వారు తెల్పిరి.[1]. పైవాని యందేకాక అచ్చంపేట తాలుకా ఉమామహేశ్వరశాసనమున చక్రబంధముకలదు. దీని కాలమున క్రీ.శ. 1375. సంస్కృతభాష.

క్రీ.శ. 1281 వాడుగా జెప్పబడు జక్కనతాత పెద్దయ చిత్రరచనము చేసినట్లు జక్కన విక్రమార్క చరిత్రలో సీసమాలికలో వివరించినాడు. అవధాన విద్యలో మేటి అని, చ్యుత చిత్రాదులు, గూఢ చిత్రాదులు అనగా వృత్తకందకములు, కందవృత్తములు మున్నగు చిత్రకవితాభేదముల నెన్నిటినో ప్రదర్శించెనని జక్కన సీసమాలికలో చెప్పియున్నాడు. కాని ఆ పెద్దయ రచనలు కానరావు. గ్రంథస్థము కాలేదేమో, ఈతడు పై శాసనరచయిత ఈశ్వరసూరికి సమకాలికు డగుచున్నాడు.

తిక్కన (13వ శతాబ్ది). భారతమున చిత్రకవిత్వము లేదు. భారత మాంధ్రీకరణమగుట చేతనేమో నన్నయ తిక్కనలు చిత్రకవిత్వము వ్రాయలేదని చెప్పవచ్చు కాని తిక్కన నిర్వచన నియమమున 'నిర్వచనోత్తర రామాయణము'న్వ్రాసియున్నాడు. నియమమున్నదికనుక ఇది కొంచెము చిత్రకవితా ఛాయలు గలిగినదిగా చెప్పవచ్చును.

14వ శతాబ్దము : జక్కన ఎఱ్ఱనను గూర్చి 'ఆ చిత్రకవిత్వవాగ్విభవ జృంభితుగొల్చెద' ననెను, కాని ఎఱ్ఱన ఏమి చిత్రకవిత్వము వ్రాసినాడో తెలియదు.

నాచనసోమన (1390). ఉత్తరహరి వంశము ప్రబంధము. అందు నిరోష్ఠ్య చిత్రము (1-106) కలదు.

15వ శతాబ్దము : విన్నకోట పెద్దన కా. చూ. యందు కొన్ని చిత్రకవితా లక్షణములను సోదాహరణముగ పేర్కొనెను. ఇదియే మొదటి తెలుగు చిత్రకవిత్వ లక్షణ గ్రంథము

శ్రీనాథుడు చిత్రకవితను పెద్దగా అంటఃపోయినను కొన్ని ఏకపాది,

---

1. నన్నెచోడుడు కవిత్వము. 'తెలుగు చిత్ర బంధ కవిత్వములు, శీర్షిక ప్రింటు. ౧౯౮౪.

ద్విపాదులవంటివి, బిందుచ్యుతకములను చెప్పియున్నాడు. చిత్రకవితాఛాయ లాతని కవితలో పొడగట్టగలవు.

పోతన భాగవతమున కొన్ని సర్వలఘు పద్యములను రచించెను.

భైరవుడు చక్ర, నాగ, గోమూత్రికా బంధములను, సర్వలఘువు మున్నగు చిత్రకవితా రచనలను తన శ్రీరంగ మహత్త్వమునందు చొప్పించెను. భైరవుని దగ్గరనుండి ప్రతి ఆశ్వాసాంతమున ఏదో ఒక చిత్ర కవితా భేదమును వ్రాయుటకు కవు లలవాటు పడిరి.

కొఱవి గోపరాజు. సింహాసన ద్వాత్రింశికలో (4-24) నిరోష్ఠ్య దండకమును రచించెను.

పిల్లలమఱ్ఱి పినవీరన-జైమినీ భారతమందలి అశ్వమేధపర్వములో (8-221) పాదభ్రమక మొకటి కలదు.

నందిమల్లయ, ఘంటసింగయ జంటకవులు వరాహపురాణములో ఏకాక్షరి, ద్వ్యక్షరి, పద్యభ్రమకముల రచించిరి. తెలుగులో కావ్యారంభమునుండి క్రీ శ. 1500 వరకు చిత్రకవిత్వ ప్రారంభ దశగా పేర్కొనదగును. ఈ దశలో దాదాపుగ అన్ని చిత్రములు స్పృశింప బడినవి. స్వరచిత్ర సంబంధమైన సర్వలఘువు, వ్యంజన చిత్రములు, ఏకాక్షరి మున్నగునవి, స్థాన చిత్రములైన నిరోష్ఠ్యాదులు, గతిచిత్రములైన పాదపద్య భ్రమకాదులు, ఆకారనియమ చిత్రములైన నాగ, మురజ, చక్రబంధాదులు, గూఢ చిత్రములైన చతుర్విధ కంద, కందగర్భ చంపక మాలాదులు, అక్షరచిత్రములైన అక్షరాంక గద్యలు, ఏక పాది ద్విపాదులు మున్నగునవి చిత్రింపబడియున్నవి.

16. వ. శతాబ్ది. వికాస దశ.

అల్లసాని పెద్దన ఆశువుగా చెప్పిన పద్య మాలికలో అచ్చ తెలుగు రచన మున్నది. అటువంటి రచన ముత్తరోత్తర అచ్చతెలుగు కావ్యమే అవతరించుటకు దారి తీసినది.

హరిభట్టు - నారసింహపురాణము ఉత్తరభాగము (1-110) నిరోష్ఠ్యసీసము నంది తిమ్మన, పారి జాతాపహరణములో శ్రీకృష్ణుని స్తోత్ర సందర్భమున చిత్ర కవిత మిక్కిలిగా గలదు.

అయ్యలరాజు రామభద్రుని - రామాభ్యుదయము.

పింగళి సూరన[1]. - కళాపూర్ణోదయము, రాఘవపాండవీయము (ద్వ్యర్థి) కావ్యములు.

మరింగంటి సింగరాచార్యులవారి దశరథ రాజనందన చరిత్ర (నిరోష్ఠ్య కావ్యము) రామకృష్ణ విజయము, (ద్వ్యర్థి) (అలభ్యము) శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణమనుకావ్యములు.

రామరాజ భూషణుడు — హరిశ్చంద్ర నలోపాఖ్యానము (ద్వ్యర్థి)

పొన్నికంటి తెలగన—యయాతి చరిత్ర. (అచ్చతెలుగు కావ్యం).

కామినేని మల్లారెడ్డి—షట్చక్రవర్తి చరిత్ర, శివధర్మోత్తరము, పద్మపురాణము. ఈమూడింటిలో చిత్రకవితా రీతులుప్రదర్శింపబడినవి

తెనాలి అన్నయ్య — సుదక్షిణా పరిణయము.

చిత్రకవి పెద్దన— ల. సా. సం. ఇందు చిత్రకవితా లక్షణములు పేర్కొన బడినవి. ఉదాహరణము లీయబడినవి.

తెనాలి రామభద్రకవి—ఇందుమతీ పరిణయము.

తురిమెళ్ళ రామన్న — శేషధర్మము[2].

ఈ శతాబ్దిన అచ్చతెలుగు, అనేకార్థ కావ్యములు బయలుదేరినవి. ఇది విశేషము. అచ్చము నిరోష్ఠ్య కావ్యములు పుట్టిన దీ కాలములోనే. కొన్నిట ప్రారంభదశ, కొన్నిట ఆ దశనువీడి వికాసదశకు చిత్రకవిత చేరుకొన్నది.

17. వ. శతాబ్ది. పరాకాష్ఠ దశ.

అందుగుల వెంకయ్య—రామరాజీయము.

దామెరల అంకన్న —ఉషాపరిణయము. (అముద్రితము). (A.P. Govt. Manuscript Library తారనాక హైదరాబాదు. అందు కాగితము, ఆకు వ్రాత ప్రతులు గలవు). ఇందులో కందములో 108 కందములు గూఢ మొనర్చిన

---

1. కొందఱు విమర్శకులు పింగళిసూరన 17వ శతాబ్దము వాడని భావించిరి.

2. డా॥ బి. రామరాజుగారి "మరుగుపడిన మాణిక్యాలు" గ్రంథము, ఏప్రియల్ 1961 పుట. 30. ప్రచురణ. గోలకొండ పత్రిక

విధానము మనకత్యంతాశ్చర్యము గొలుపకమానదు. ఇది పద్యగూఢ చిత్రము (గర్భకవిత)నకు పరకాష్ఠ,

కృష్ణాధ్వరి— నైషధ పారిజాతము. (ద్వ్యర్థి)

రంగాజమ్మ—మన్నారు దాసవిలాసము.[1]

చింతలపల్లి వీరరాఘవకవి—మధుర వాణీవిలాసము. అముద్రితము.

గణపవరపు వేంకటకవి.—ప్ర. రా. వేం వి. వి. ఇది చిత్రకళామందిరము. ఈ గ్రంధ మచ్చము చిత్ర కావ్యము కాని చిత్రకావ్యము. చిత్రకవిత్వ విషయమున తెలుగు సాహిత్యమున ఇటువంటి కావ్యము నభూతో న భవిష్యతి. ఇందులో లేని చిత్రకవితాభేదము దాదాపు తెలుగులో మఱి యేకావ్యములోను లేదనియే చెప్పవచ్చు.

పిడుపర్తి బసవప్ప — నిరోష్ఠ్య సీతాకల్యాణము[2]

అహోబలపండితుడు.—కాళిందీ కన్యాపరిణయము

బోయినిపల్లి కుమార వేంకట రాయలు—ద్రౌపదీ కల్యాణము[3].

ఇందు త్రిప ఆశ్వాసాంతమున చిత్రకవిత ప్రదర్శింపబడినది

18, 19, 20 శతాబ్దములు : విస్తరదశ.

18వ. శతాబ్ది. కంకంటి పాపరాజు—ఉత్తర రామాయణము.

ధరణి దేవుల రామమంత్రి—దశావతార చరిత్ర.

గుడారు వేంకటదాసు—ప్రకృష్ట బలరామ చరిత్ర. [ఇది అముద్రితము] (కాగితముప్రతి మద్రాసు ఓరియన్టల్ మాన్యుస్క్రిప్ట్స్ గ్రంథాలయమున గలదు.)

కంకంటి నారసింహకవి— విష్ణుమాయావిలాసము.

అయ్యలరాజు నారాయణా మాత్యుడు-హంస వింశతి.

---

1. బుచ్చారెడ్డిగారి పరిశోధన వ్యాసము· "మధురవాణీవిలాసము" విమర్శనము· ఉస్మానియా విశ్వవిద్యాలయము. 19 9.

2. తంజావూరు పుస్తక శాలలో కలదు· ముద్రితము· నెం. 169లో పుటలు ౫౦-౬౨.

3. బి· రామరాజుగారి "మరుగు పడిన మాణిక్యాలు"గ్రంథము. ప్రచురణ· గోలకొండ పత్రిక.

నెల్లూరి వీరరాఘవకవి— యాదవ రాఘవ పాండవీయము (త్ర్యర్థికావ్యము)
వెలిదండ్ల వేంకటపతి — రాధా మాధవ సంవాదము.
కూచిమంచి తిమ్మకవి—రసికజన మనోభిరామము, అచ్చతెల్గురామాయణము
శేషము వేంకటపతి—శశాంక విజయము.
పుష్పగిరి తిమ్మన— సమీరకుమార విజయము.
ముద్దుపళని— రాధికా సాంత్వనము.
చింతలపల్లి ఛాయాపతి— రాఘవాభ్యుదయము.
ఈదులపల్లి భవానీశ— ధర్మఖండము.
అడిదము సూరకవి— కవిజనరంజనము.
మంగళగిరి ఆనందకవి—విజయనందనవిలాసము.
పరశురామ పంతుల లింగమూర్తి—సీతారామాంజనేయ సంవాదము.
కనుపర్తి అచ్చయ్య— కవిరాజ మనోరంజనము, అని రుద్ధ చరిత్రము
రేకపల్లి సోమనాథకవి — రుక్మవతీ పరిణయము.
పిండిప్రోలు లక్ష్మణకవి – లంకా విజయము (ద్వ్యర్థి)
బుక్క పట్టణం వేంకటాచార్యులు – అచలాత్మజా పరిణయం (ద్వ్యర్థి)
కుందుర్తి వేంకటాచలం – మిత్రవిందాపరిణయము.
విక్రాల శ్రీనివాసా చార్యకవి – సౌగంధికా పారిజాతీయము.
(ద్వ్యర్థి) భారత భాగవత కథల జోడింప బడినదిది.

19, 20 శతాబ్దములు ·

పెద్దాడ నాగరాజు— శకుంతలా పరిణయము.
నంబెరుమాళ్ళ పురుషకారి కేశవయ్య – దాశరథి చరిత్ర (నిరోష్ఠ్యకావ్యము)
శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి – రామాయణ కథాత్మకమగు కంకణ బంధము.
కొక్కొండ వేంకటరత్నం – బిల్వేశ్వరీయము.
అల్లమరాజు రామకృష్ణకవి – అచ్చ తెలుగు భాగవతము, సుకవి జనమనో రంజనము, కవిజన చకోర చంద్రోదయము.
మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి – సీతారామచరితము, కృష్ణార్జున చరిత్ర (ద్వ్యర్థి)
మల్లమ పల్లి బుచ్చి కవి హాలాస మహాత్మ్యం.

తిరుమామిడి రామస్వామి – శుద్ధాంధ్ర కిరాతార్జునీయము.
వీరరాఘవా చార్యులు – యధాశ్లోక తాత్పర్య భారతము
రాయవరపు గవర్రాజు – శుద్ధాంధ్ర హరిశ్చంద్ర చరిత్ర.
తూము రామదాసు – నిర్వచన మిత్రవిందోద్వాహము.
త్యాగరాజ మొదలి –'సుబ్రహ్మణ్య విజయము' అను విద్వత్కర్ణా మృతము.
గోపీనాథ వెంకటకవి – శిశుపాలవధ మహాకావ్యము, గోపీనాథ రామాయణము
మండపాక పేరయ – నిరోష్ఠ్య దాశరదీ శతకము[1].
మండపాక పార్వతీశ్వరశాస్త్రి – కాశీవిశ్వనాధ శతకము.రాధాకృష్ణ సంవాదము, ప్రబంధ సంబంధ బంధవిబంధన గ్రంధము (లక్షణ గ్రంధము) అందుకు లక్ష్యగ్రంధము "కవితా వినోద కోశము" అని పేరుతో. చిత్ర కావ్యము వ్రాయబడినట్లు చెప్పబడుచున్నది. అది అలభ్యము.[2]
శ్రీపాద వేంకటాచలకవి – రామకృష్ణోపాఖ్యానము.
వారణాసి వేంకటేశ్వర్లు - శ్రీరామ చంద్రో పాఖ్యానము.
నాదెళ్ళ పురుషోత్తమ కవి – చతుర్మ్కీర కంద రామాయణము, చిత్ర కంద పద్యరత్నాకరం, అద్భుతోత్తర రామాయణము, గురుభక్తి. ప్రభావము, కృష్ణానదీమహాత్మ్యము, మల్లికార్జునశతకము,ధార్మికోల్లాసిని, మున్నగు. నవి. ఈ కవి హిందీ సంస్కృతాంధ్రభాషల పండితుడు.
మరింగంటి నరసింహాచార్యులు – తాలాంక నందనీ పరిణయము.
కందుకూరి వీరేశలింగం పంతులుగారు – రసికజన మనోరంజనము, శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము
కాణాద పెద్దన – ముకుందవిలాసము (భద్రాపరిణయము) యథాశ్లోక తాత్పర్య రామాయణ భాగము.

---

1. సంస్థానములు సాహిత్యపోషణ. T. Donappa. పుట. 307. ప్రింటు. 1969.
2. విజ్ఞాన సర్వస్వము, తెలుగుభాషా సమితి. Vol. 6.చతుర్విధ కవితలు, పుట. 617_619,

కొడవలూరి రామచంద్రకవి — మహాసేనోదయము.
మాడభూషి వేంకటాచార్యులు — భరతాభ్యుదయము.
నల్లాన్ చక్రవర్తుల లక్ష్మీనృసింహాచార్యులు — కుబ్జాకృష్ణ విలాసము (అచ్చతెల్గు).
బిజ్జుల తిమ్మభూపాలుడు — అనర్ఘ రాఘవము.
శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి — ఋ. అం. ని. ని. నిరూష్ఠ్యకా దశాక్షరి శాకుంతలము.
వావిలికొలను సుబ్బారావు— శ్రీకుమారాభ్యుదయము, శ్రీకౌసల్యాపరిణయము.
శలపాక వేంకట సూర్యప్రకాశకవి — ఋ. అం. నిరోష్ఠ్యచంద్రహాస చరిత్ర.
అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి — భద్రాపరిణయము.
మచ్చ వేంకటకవి — ఋ. అం. ని. ని. కుశచరిత్ర.
అయ్యనకోటి పార్థసారథిశెట్టి — సత్యవిజయము.
ఓగిరాల జగన్నాథం — సుమనో మనోభిరంజనము.
చేకుమళ్ళ రంగశాయి — వాణీవిలాస వనమాలిక.
మల్లన — రుక్మాంగదచరిత్ర.
అబ్బరాజుహనుమంతరాయశర్మపాకయాజి — ఋ. అం ని. ని. దాశరాధి చరిత్ర.
శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ — దీక్షితచరిత్రము.
పురాణం పిచ్చయ్య — విజయాశ్వచరిత్రము, మైరావణ నాటకము.
పూడిపెద్ది లింగమూర్తి పంతులు — సువర్చలా పరిణయము.
భువనగిరి విజయరామ — శ్రీ గణేశ్వరీయము.
మరుగేశం పిళ్లై వడగరై — త్రిశిరగిరీశ శతకము
కోడూరు వేంకటాచలకవి — శివరహస్య ఖండము.
జానపాటి పట్టాభి రామశాస్త్రి — నాగరఖండము.
ప్రతాప హనుమయ్య — శ్రీసులక్షణోపాఖ్యానము.
సుబ్బరాజ నామధేయుడు — శ్రీగోవింద కృష్ణయాచేంద్రవిజయము.
అల్లమరాజు రంగశాయి — శ్రీమదాంధ్ర చంపూ రామాయణము.

కృష్ణకవి – శకుంతలాపరిణయము.

పోకూరి కాశీపతి – శు. ఆం. ని. ని. హరిశ్చంద్రచరిత్ర, సారంగ ధరీయము (త్ర్యర్థి).

అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి – భార్గవ రామచరిత్రము.

ముత్య సుబ్బరాయ దైవజ్ఞమణి – విదుషి.

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులు – శ్రీమహేంద్ర విజయము

పోతరాజు లక్ష్మీనరసింహకవి – మాఘపురాణము.

రావిపాటి లక్ష్మీనారాయణ – నిర్వచన భారత గర్భ రామాయణము.

(అచ్చము గర్భకవితగల గ్రంథము) (ద్వ్యర్థికావ్యమనికూడ అనవచ్చు).

గాదె పాపరాజు – శ్రీ దర్శి జానకిరామ విచిత్ర నక్షత్ర కందగర్భాష్టోత్తర శతకము.

(27 నక్షత్రములు 27 చతుర్విధకందములు. 27×4 = 108 కందములు. శతకము), చతుర్ముఖ రామాయణము (అచ్చము చతుర్విధ కందములతో)

పూర్ణప్రజ్ఞాచార్యులు – శ్రీరామతత్త్వము.

వేదుల సూర్యనారాయణ – లక్ష్మీసహస్రము (ఆంధ్రము).

నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి – 1) శ్రీహనుమద్రామాయణము,
2) ఉత్తమ జీవయాత్ర.

విక్రాల శేషాచార్యులు – శ్రీ. వేం. చి. ర. కరము. Vol. I, II, III, ఇవి మూడును సకలచిత్ర కవితా భేదములు గల్గినవి. అచ్చము చిత్ర కావ్యములు.

అడ్డుమిల్లి నారాయణరావు – నారాయణీయము.

సముదవోలు వేంకట్రావు – మించుపల్లె – తెలుగు పొలుపు.

మిన్నికంటి గురునాథశర్మ – శివగీత, హరిహరదత్త స్తుతి.

కొత్తపల్లి సూర్యారావు – వెఱ్ఱికి వేయి విధములు.

కోట వీరాంజనేయశర్మ – చిత్రాశ్వీయము, మాధురీసుధాకరము (అముద్రితము).

బుఱ్ఱా కమలాదేవి – ఛందోహంసి

విక్రాల శ్రీదేవమ్మ – రసికశరణాగతి, వాసవదత్తా పరిణయం.

బోడి వాసుదేవరావు – చిత్రమంజరి [అచ్చము అకారచిత్రకావ్యము).

గాదేపల్లి కుక్కుటేశ్వరరావు - యేసు కృష్ణీయము [ద్వ్యర్థి].
కోలాచలం శ్రీనివాసరావు - సునందినీ పరిణయము.
[నాటకారంభమున దేవతాప్రార్థనలో బంధములుగలవు.]
రాప్తాటి ఓబిరెడ్డి - బంధములు.[వ్రాతప్రతి].
సింహాద్రి వేంకట నామధేయ - చమత్కారమంజరి.

ఇంకను కొందఱు గ్రంథకర్తలు[1]. వారిగ్రంథముల పేళ్ళుక్రింద పేర్కొన బడుచున్నది.

బహుజనపల్లి సీతారామాచార్యులు - సుందరరాజ శతకము.
బిరుదురాజు శేషాద్రికవి - ఆంధ్రకుమార సంభవము.
వావిలాల వాసుదేవశాస్త్రి - రుక్మిణీస్మరణము.
కూచిమంచి సోమసుందరకవి - లక్ష్మీప్రియవిలాసము.
పక్కి వేంకటనర్సయ్య - శకుంతలా పరిణయము.
ఇంకను ముక్తివి వేంకట తిరుమలదాసు - వాక్యగురుపరం పరార్థము,
రామాయణ సారసంగ్రహము,[కిష్కింధా],
ముక్తినూతలపాటి సీతారామయ్య - శ్రీవేణుగోపాలశతకము.
భువనగిరి విజయ రామయ్య - మల్లికార్జున సహస్రము,మున్నగు కావ్యముల చిత్రకవితగలదు.
అముద్రితములైన, చినవేంకటార్యుని - భద్రరాజ పుత్రచరిత్రము.

(Paper, No. 597. Govt Oriental Manuscript Library. Madras).
వెలగపూడి కృష్ణయామాత్యుని- భానుమద్విజయము.

(Paper. D. No. 606. Govt Oriental. Manuscript Library. Madras).

మున్నగువాని యందు చిత్రకవిత కనబడుచున్నది.

ఇంక నాదృష్టికిరానివి, చిత్రకవిత గలిగిన గ్రంథములు పెక్కులుండవచ్చు.

19, 20 శతాబ్దములలో చిత్రకవిత చెప్పలేనంత విస్తృతి పొందినది. అచ్చము చిత్రకవితతో కూడిన కావ్యములు బయలుదేరినవి. అచ్చము పద్యగూఢము (గర్భకవిత్వము) స్థాననియమచిత్రము (నిరోష్ఠ్యము), ఆకారనియమ చిత్రము

---

[1]. పూండ్ల రామకృష్ణయ్యగా । ప. రా. వేం. వి.వి. పీఠిక. అముద్రిత గ్రంథ చింతామణి చూడుడు.

[బంధకవిత్వము], లతో కూడిన కావ్యము లీకాలమున పుట్టినవి, ఛందస్సును పాటించి ప్రాచీన పక్కీలో కావ్యము వ్రాయు ప్రతి కవియు ఈ కాలమున ఏదో కనీస మొక్క చిత్ర కవితా భేదమైనను తన కావ్యమున చొప్పించని యెడల అది పరిపూర్ణత చెందదని, తాను కవిగా అనిపించుకొననేమోనని యనుకొని వ్రాసినారని నట్లున్నది. కవులు పరిశ్రమచేసి పద్యగూఢచిత్రము (గర్భకవిత్వము)ను పెంపొందింపజేసిరి. కవులు తమకు ముందుగల చిత్రకవిత నాకళింపుజేసికొని, తమప్రతిభచే చిత్రకవితాభేదములలో తమకు ముందులేని క్రొత్తఛందములతో క్రొత్తపోకడలు పోయిరి. కవుల ఉద్దేశ్యమేమోగాని, మొత్తముమీద 19, 20 శతాబ్దులలో ఇంతవరకు చిత్రకవితను బహుముఖముల విస్తరింపజేసిరి. ఇది వాస్తవము.

మొదటగా కథాంశములో సందర్భోచితముగ వాడబడుటకు పుట్టినది చిత్రకవిత. తర్వాత సందర్భానుసారము అలంకారముగ వాడబడినది. 16వ శతాబ్దము వరకది ఆశయబద్ధమై అదుపులో ఉన్నది. 17వ శతాబ్దినుండి కవులకీ కవితపై మోజు పెరిగినది. కేవలము తమ ప్రతిభను వెల్లడించుటకా అనినట్లు చిత్రకవితను మచ్చుకైనను తమ కావ్యముల ప్రదర్శించిరి. సంస్థానములు చిత్రకవితను పెంపొందింప జేసినవి. అందువలననే 18, 19, 20 శతాబ్దములలో చిత్రకవిత విరివిగ కావ్యముల ప్రదర్శించుట జరిగినది.

సంస్కృతములోవలె తెలుగులో అచ్చము చిత్రకావ్య నిర్మాతలు కలరు. వారిని, వారిగ్రంథముల నిట పేర్కొనుచున్నాను.

తెలుగువాఙ్మయమున గల అన్ని నిరోష్ఠ్య కావ్యములు, అన్ని అనేకార్థ కావ్యములు, అన్ని అచ్చ తెలుగు కావ్యములు చిత్రకావ్యము లనదగును.

ఇవికాక ముఖ్యముగ పేర్కొనదగినవి క్రింద ఇచ్చుచున్నాను.

గణపవరపు వేంకటకవి-ప్ర రా.వేం.వి వి.లో దాదాపు ప్రతిపద్యమున ఏదో ఒక చిత్రమున్నది.

మండపాక పార్వతీశ్వరకవి ప్ర.సం.బం.వి. గ్రంథము. లక్షణగ్రంథము /లభ్యము) లక్ష్యగ్రంథము కవితావినోదకోశము.

అకారనియమ చిత్రము (బంధకవిత) ఇందుకలదు. కాని గ్రంథము నేడలభ్యము.[1]

---

1. చూడు. విజ్ఞాన సర్వస్వము. తెలుగుభాషా సమితి. VoL. 6 pages 617-619

సంక్షిప్తముగ ఈ నా "చిత్రకవిత్వము - ప్రారంభవికాసములు" వ్యాసము "నవభారతి" మాసపత్రిక 1982 ఏప్రియల్ సంచికలో ప్రచురితమైనది.

నాదెళ్ళ పురుషోత్తమకవి- 1) చతుర్ముఖీన కందరామాయణము, 2) మల్లికార్జున శతకము 3) చిత్రకంద పద్యారత్నాకరము. వీరు బందరు వాస్తవ్యులు.

రావిపాటి లక్ష్మీనారాయణ - నిర్వచన భారతగర్భ రామాయణం వీరు నర్సరావుపేట వాస్తవ్యులు.

గాదె పాపరాజు — శ్రీదర్శి జానకిరామ విచిత్ర నక్షత్ర కందగర్భశతకము చతుర్ముఖ రామాయణము (చతుర్విధకందములతో) వీరు ప్రకాశంజిల్లా అద్దంకి తాలుకా ధర్మవరం వాస్తవ్యులు నేత్రావధాని, కవి.

విక్రాల శేషాచార్యులు-శ్రీ. వేం.చి.ర.కరము. VoL. I, II, III. (సమస్త, చిత్రభేదములతో కూడిన చిత్రకావ్యాలు). వీరు ప్రకాశంజిల్లా సింగరాయకొండ సమీపమున కలికివాయి వాస్తవ్యులు

బోడి వాసుదేవరావు - చిత్రమంజరి. (అకారచిత్రము). వీరు గుంటూరు వాస్తవ్యులు.

## 6. ఆంధ్రేతరభాషలలో చిత్రకవిత

ఆంధ్రేతర భాషలలోని చిత్రకవితను దిఙ్మాత్రము నిట నుట్టంకించుచుంటిని.[1]

మొదటగ భారతీయభాషలు: సంస్కృతము: ఇందలి లక్షణగ్రంథములు : 1. భరతముని నాటనశాస్త్రమున యమకభేదములు 10 చెప్పబడినవి. 2 అగ్నిపురాణమున యమకము 6భేదములు. బంధము లెనిమిది. గోమూత్రికామ్బుజ చక్రాదులు. 3 భామహుడు కావ్యాలంకారమున ప్రహేళికా లక్షణములు చెప్పబడినవి. 4. దండి-కావ్యాదర్శమున స్వరవ్యంజన స్థానచిత్రములు ప్రహేళికలు పదునారు. కొన్నిబంధములు 5. వామనుడు కావ్యాలంకారసూత్రాణిలో 5-1 చిత్రలక్షణము. పైనికాక, ఖడ్గ, ముసల, ధనువు, శరము, శూలము, శక్తి, హలము, ప్రతిలోమానులోమములు, చ్యుతగూఢములు. పేర్కొనబడినవి. 6 భోజుడు సరస్వతీకంఠాభరణమ్. ఇందు స్వరాది చిత్రములు, బంధములలో ద్విశృంగాటక, మురజభేదములు, వ్యోమ, శరయంత్రములు ప్రదర్శింపబడినవి. 7. మమ్మటుడు కావ్యప్రకాశము నపై ప్రసిద్ధ బంధములు 4 వివరించెను. 8. హేమచంద్రుడు-కావ్యానుశాసనమున

1. చిత్రకావ్య కౌతుకమ్, సంస్కృతం. పీఠిక. పుట. 26, 27. ఆధారము ప్ర. సంస్కరణ.

స్వరచిత్ర వ్యంజనస్థానగతి, ఆకార, చ్యుత, గూఢాది చిత్రములు సోదాహరణముగ వివరింపబడినవి. నూత్న బంధము లేవియులేవు. 9. రాజానకరుయ్యకుని అలంకార సర్వస్వమున విశేషములులేవు. 10. కవికర్ణపూరుని అలంకార కౌస్తుభమున పతాకా గదా బంధములు గలవు. 11. విశ్వనాధుని సాహిత్యదర్పణమున కొన్ని బంధము లకుదోడు ఉక్తివైచిత్ర్యమాత్రాచ్యుత దత్తాక్షరాదులు వివరింపబడినవి. ఇంకను ధర్మదాసుని విదగ్ధముఖమండనము, ధర్మసూరి సాహిత్య రత్నాకరము, విద్యానాథుని ప్రతాపరుద్రయ శోభూషణము, గోవింద కావ్యప్రదీపము, నరేంద్రప్రభసూరి అలంకార మహోదధి మున్నగు వానియందు కొన్నిచిత్రములు ప్రదర్శింపబడినవి. "పాణిని-సంజ్ఞాయాం (3-4-42) బంధేచ విభాషా (6-3-13) లవ్యాఖ్యయందు క్రౌంచ, మయూరికా, అట్టాలికా, హస్తచక్రబంధములు పేర్కొనబడినవి.[1]

వైదిక వాఙ్మయమున బీజరూపమున శబ్దాలంకారము కలదు.[2]

ఉదా:-

కాస్విదాసీత్పూర్వ చిత్తిః కిస్విదాసీద్ బృహద్వయః
కాస్విదా సీత్ పిలిప్పలా కాస్విదాసీత్ పశంగిలా-53
ద్యౌరా సీత్ పూర్వచిత్తి రశ్వం ఆసీద్ బృహద్వయః
అవిరాసీత్ పలిప్పిలా రాత్రి రాసీత్ పశంగిలా-54

(వాజపేయ సంహితా 23-53,54)

దాదాపు పాదయమక మిందున్నది గదా.

నమకచమక శుక్లయజుర్వేద సంహితలలో (16-18) అనుప్రాస కలదు. శుక్లయజుర్వేద అ. 4-40.లో మంత్రమందు పద్మబంధము పొదగట్టగలదు.

లౌకిక వాఙ్మయమున గల చిత్రకవిత.[3]

వాల్మీకి రామాయణమున సుందరకాండ పంచమ సర్గప్రతి శ్లోకము అత్యానుప్రాసయుక్తమైనది.

---

1. చిత్రకావ్యకౌతుకమ్. సంస్కృతం. పీఠిక. పుట. 27 ప్రథమ సంస్కరణ. 1965
2. అదే. పుట. 28
3. అదే. " పుట. 29నుండి గ్రహింపబడినది.

కాళిదాసుని రఘువంశమున యమక భేదములు గలవు.

భారవి కిరాతార్జునీయమున 15వ సర్గలో. బంధములుగలవు.

భట్టికవి రావణవధకావ్యమున, యమకము. సంస్కృత ప్రాకృత సంకీర్ణ ప్రయోగములు గలవు.

మాఘుని శిశుపాలవధ 19వసర్గ మొత్తము వివిధ చిత్రకవితారీతులతో నిండినది.

రాజానక రత్నాకరుని హరవిజయము మహాకావ్యమున 20వ సర్గ యుద్ధ వర్ణన సమయమున చిత్రకవిత కలదు.

శివస్వామిని 'కప్పిణాభ్యుదయము' 6, 18 సర్గలు చిత్రాత్మకమైనవి.

మంఖకుని శ్రీకంఠ చరితములో శ్లిష్టప్రయోగ బాహుళ్యముకలదు. అచ్చము చిత్రముతో కూడిన కావ్యము లిట్రిందివి. 1) చిత్రకవి చిత్రరత్నాకరము, 2) వేంకటేశ్వరుని చిత్రబంధరామాయణము 3) కవిరాజసూరి రాఘవపాండవీయమ్ 4) విద్యామాఘువుని పార్వతీ రుక్మిణీయమ్ 5) చిదంబర సుమతి రాఘవపాండవయాదవీయమ్ 6) కృష్ణమూర్తి కంకణరామాయణమ్ 7) శ్రీకృష్ణపరబ్రహ్మవరతంత్రకాలస్వామి అలంకార మణిహారము, 8) విశ్వేశ్వరుని కవీంద్రకర్ణాభరణమ్ 9) నాగరాజువి భావశతకమ్. ఇందు ప్రహేళికా విశేషమున్నది).

స్తోత్ర సాహిత్యమునందలి చిత్రకవిత[1]

ఆనందవర్ధనాచార్యుని-దేవీశతకము, అవతారకవి-ఈశ్వరశతకము, వేంకటాధ్వరి-లక్ష్మీ సహస్రము, వేంకటనాథుడు-పాదుకా సహస్రము, నంజరాజకవి-శ్రీ శివపాద కమలరేణు సహస్రమ్, మున్నగునవి.

జైన స్తోత్రమున 1) సమన్తభద్రస్వామి 'జినశతకస్తుతి విద్యా' 2) జయతిలకసూరి 'చతురహారావళి చిత్రస్తవః' మున్నగునవి. ఇవికాక, శ్రీకృష్ణకవి మన్దారమరన్ద చంపూ, సుభాషితరత్న భాండాగారం (సంపాదకుడు, నారాయణరామ. ఆచార్య), పండిత రామరూప పాఠకుని 'చిత్రకావ్య కౌతుకమ్' పేర్కొనదగినవి.

ఇంకను (1) కాశీవాసి శ్రీ దుఃఖభంజనకవి-వాగ్వల్లభఛందో గ్రంథము

---

1. చిత్రకావ్య కౌతుకమ్, సంస్కృతము. పీఠిక పుట. 30 నుండి గ్రహింపబడినది.

(2) శ్రీ రఘువీరమిశ్రుడు-శ్రీ లక్ష్మీశ్వరోపాయనము. (3) శ్రీ దామోదరమిశ్రశాస్త్రి-చిత్రబంధకావ్యమ్- పేర్కొనదగినవి.

తెలుగులో కనబడని, సంస్కృతములో నాచే సేకరింపబడిన ఆకార నియమ చిత్రభేదములు (బంధములు), అనుబంధమున పొందుపఱుపబడినవి.

హిందీభాష యందలి చిత్రకవిత [1].

కేశవదాసు. భిఖారీదాసు, లాలకవి, గోకులనాథ, దీనదయాళగిరి ముఖ్య కవివర్యులు.

కేశవదాసు : 16వ శతాబ్ది, యమకభేదములు. 16 'వ' ప్రభావ మందు నిరోష్ఠ్య రచనము తర్వాత ఏకాక్షరి నుండి 26 అక్షరములు పద్యబంధరచనము చేసెను.

చతురక్షరపద్యము : ఉదా:-

"బనమాలీ బనమే మిలే బనీ నలిన బనమాల
నయనమిలీ మన మన మిలీబైన నమిలీన బాల."

వర్ణసంఖ్యా నియమము పదములతో లచనము: ఉదా:-

సీతానాథ, సేతునాథ, సత్యనాథ, రఘునాథ, వ్రజనాథ
దీనానాథ దేవగతి అని నాల్గక్షరపదముల వాడకము.

ప్రశ్నోత్తర చిత్రభేదములు, అనులోమ విలోమ క్రమత్త్రైకార్థము భిన్నార్థములు గతాగత్త్రైకార్థగతాగత భిన్నార్థములునిరూపింపబడినవి. డమరు,చక్రాది ప్రసిద్ధబంధములు ప్రదర్శింపబడినవి. దీనదయాళగిరి. క్రీ.శ. 1850 ప్రాంతంవాడు. చిత్రకావ్యరచనలో సిద్ధహస్తుడు. మాలరోలా ఛందసిలో మధ్యలో ద్రుతవిలంబిత పద్యముండునట్లు రచించెను. అనేకానేకోత్తర మిట్లున్నది.

వాసతకో కమై. కహా? కౌన్ వాచీ ఆ. సర్. కో?
కహాకరై బలి? కౌన్ అలీకో సింగార్హై?
ఇట్లా 12 ప్రశ్నలకొకే జవాబు. ఆ జవాబిట్లున్నది.
"వారః సూర్యాది దివసే ద్వారే వసర బృందయోః
కులే వృక్షే హరే హరో వారం మధ్య స్వ భాజనే."

---

[1] చిత్రకావ్య కౌతుకమ్. సంస్కృతము. పీఠిక. పుట. 30 నుండి 34 వరకు.

కొన్ని మామూలు బంధములతోపాటు కపాటమును చిత్రించెను. ఏకస్వర లఘ్వ క్షరాది చిత్రములు ప్రదర్శించెను.

భక్తప్రవర తులసీదాసు : రామచరితమానస్‌లో ఛత్రఖడ్గ, నాల, పద్మ, త్రిశూల నాగమయూరకిరీట అశ్వగతి బంధములు ప్రకటింపబడినవి. ఇతని ఛత్రబంధమను బంధములో చూడనగును. (పటము. 145)

గుర్జర (గుజరాతీ) భాష[1] : ఇందు శ్రీదళపతి, మను సుఖభాయీ, ఖబరదార్ మొదలగు కొంతమంది జైనాచార్యులు చిత్రకవిత్వ నిర్మాతలు కలరని చెప్పవచ్చును.

మహారాష్ట్రము : శ్రీవిఠల్‌కవి-"రుక్మిణీ స్వయంవరము", కవిమోరోపంతుని (మయూరపంతః), అమ్లానమాలాబంధ, మంత్రరామాయణము మున్నగునవి, శ్రీపాలందే మహాశయుడు 'సైరంధ్రీనాటకము', నబంధములు, 'షణ్మాసీంచా' పుస్తకమున ప్రహేళికలు చెప్పబడియున్నవి.

ఉత్కలభాష : ఉపేంద్రభంజుని తండ్రి చిత్రకవి శ్రేష్ఠుడని తెలియును. ఒక దేవుని స్తోత్రసందర్భమున అనేక దేవుల స్తుతి వచ్చునట్లు రచించెను

వంగభాష : బంగ-నయపాలది భాషలలోగూడ చిత్రకావ్య పరంపర సమృద్ధిగా లభించును.

కర్ణాటభాష : 'సిరిభూవలయ' గ్రంథమున సమాన-వక్ర, చతుష్కోణ, త్రికోణ, విపరీతాదిగతి చదువులలో అనేకభాషలు, అనేక విషయములు గలవు. 'సర్వజ్ఞ' గ్రంథము అనుపేరుతో ప్రసిద్ధి చెందినది. దీనికర్త 'సిరికుముదేందు గురు.

'కవిరాజమార్గము' లక్షణగ్రంథము. రాష్ట్రకూటరాజు నృపతుంగచే వ్రాయ బడినది. కవికాలము క్రీ. శ. 815-877. ద్వితీయపరిచ్ఛేదము. శబ్దాలంకారముల క్రింద చిత్రకవిత చూపబడినది గతప్రత్యాగతములు, గూఢ చతుర్థము, ఏకాక్షర్యా దులు, నిరోష్ఠ్యము, అతాలవ్యము, గోమూత్రిక, మురజ చక్రాదులు, ప్రహేళిక, వర్ణబిందుచ్యుతకములు-ప్రదర్శింపబడినవి.

---

1. చిత్రకావ్యకౌతుకమ్. సంస్కృతము పీఠిక పుటలు 34, 35 నుండి ఈ గుర్జర, మహారాష్ట్ర, ఉత్కళ, వంగభాషలగల చిత్రకవిత్వవిషయము గ్రహింపబడినది.

12వ శతాబ్దివాడైన నాగవర్మ 'కావ్యావలోకనము' లక్షణగ్రంథమును వ్రాసెను. ఇందు చిత్రకవితాలక్షణ లక్ష్యము లొనంగబడినవి.

తమిళభాష : దండి, అలంకారము, లక్షణగ్రంథము. నాంగడియమడక్కు (ఏకపాదివలె యమకము) మెల్లినత్తాన్ (వర్గపంచమాక్షరపద్యము) ఈరెడిత్తాన్ (దవ్యక్షర్యాదులు) నిరోట్టమ్ (నిరోష్ఠ్యము) చురుక్కమ్ (చ్యుతకచిత్రము) వినా ఉత్తరం (ప్రశ్నోత్తరం) కూటచతుక్కమ్ (గూఢచతుర్థము) కోమూతిరి (గోమూత్రిక) ఇరట్టైనాకపంతం (ద్వినాగబంధం) సుళికుళమ్ (సుడిగుండం), చక్రము, సర్వతోభద్ర మురస (మురజ) బంధములు ప్రదర్శితములు.

కార్తైకరవ్పు : ఒకపద్యములోని దేసిసంఖ్యలు తీసుకొని చదివిన వేరొక పద్యము వచ్చును. ఇంకను భేదములు కలవు.

పై ద్వినాగ, (పటము. 143) సుడిగుండం (పటము. 144) బంధచిత్రములను అనుబంధములో చూడనగును.

పాశ్చాత్యభాషలు : ఈ భాషలలో చిత్రకవిత్వ మాయా సందర్భముల చూప బడినది. ఆంగ్లములో 'ధనుర్బంధము' బొమ్మ అనుబంధములో చూపబడినది. (పటము. 145) సిలువ, మధుపాత్ర ఆకారములుగూడ ఆంగ్లమున ఉన్నవి. అంతే కాదు చెరిడెల్‌కీత్ పండితుడు అన్నవాక్యాలను బట్టి, అలెగ్జాండరు తరువాతి కాలమున, అతని కాలమునను రోమన్ కవిత్వమునందు అనులోమ విలోమ పద్యములు, గొడ్డలి నైటింగేల్ గుడ్డు, మున్నగు బంధములున్నట్లు తెలియు చున్నది.[1]

ఈ వివరణముబట్టి ప్రతిభాషలోను ఏదో ఒక కాలమున చిత్రకవిత్వము చోటు చేసికొని కవులచే నాదరింపబడినదనుట సుస్పష్టము ఇదే పరిస్థితి తెలుగులోను కొనసాగినది

---

[1] History of Sanskrit Literature. Page. 127. (కావ్యాలంకార సంగ్రహము పుట. 559.)

# ద్వితీయ ప్రకరణము.

# శబ్దచిత్రములు

కావ్యములందు శబ్దాలంకారములుగ సందర్భోచిత చమత్కారముల నందించునవి శబ్దచిత్రములు. కొన్ని కొన్ని చిత్రములు కవితగనే పనికివచ్చును. ఇందు ప్రధానముగ 1. స్వర్ణచిత్రము. 2. వ్యంజనచిత్రము. 3. స్థాన నియమచిత్రము. 4. గతినియమచిత్రము. 5. ఇతరశబ్ద చిత్రములు. 6. శబ్దచిత్ర మిశ్రమములు గమనింపదగినవి.

ఈ శబ్దచిత్రము సంస్కృతాంగ్లముల కలదు.

## 1. స్వరచిత్రము

పద్యమంతటను స్వరనియమము పాటింపబడుట. హల్లు మాత్ర మేదైనను గావచ్చును. ఇది స్వరచిత్ర లక్షణము. కేవలమీ స్వరచిత్రమును పాటించి తెలుగున కావ్యములు వ్రాయబడలేదు.

### [1] "అ" స్వరము. [ తలకట్లు. ]

హ్రస్వ అకారము పద్యమందంతట పాటింపబడుట ఇందలి చిత్రము. హల్లేదైనను గావచ్చును. హల్లుకు తలకట్టిచ్చుట అనగా హల్లుపై హ్రస్వ 'అ' కారము చేర్చుటయే. పద్యమందలి ప్రత్యక్షరము 'అ' స్వరము గలిగియుండును.

సంస్కృతమున ఈ క్రిందిది ఉదాహరణము. లక్షణానుసారమున్నది.

"జయమదన గజదమన వరకల భగత గమన
గత జనన గద మరణ భవ భయ గనద శరణ."

(కావ్యానుశాసనమ్. V. 463)

లక్షణానుసారము తెలుగులో వ్రాయబడిన 'తలకట్లు' పద్య మిట్లున్నది.

"దయగనరఘన దశరథ తనయ! నయ!
గగన చరరథ! దశశతకర శశధర
నయన! సతతసరస! నతనగచరచయ!
శత దరహరద! దశగళదళన! సదయ."

[కేశవయ్య-దాశరథి చరిత్ర. 4-15].

అచ్చతెలుగులో ఇటులున్నది.

అనగ దన కడకదయగ తడయక జన
నచట గదలక నతడడలఁగ గడ
గడదడ నలసట దగ దనరగ గడక
దగనడ చనవి గలయగన దలచ

(పోకూరి కాశీపతి. శు. అం ని. ని. హరిశ్చంద్ర చరిత్ర. 2-109)

ఈ చిత్రమున 'అ' స్వరనియమమునకు ప్రాధాన్యము. దీనికి తెలుగు లాక్షణికులు తలకట్టని పేరిడిరి. అట్లని ప్రత్యక్షరము తలకట్టు కలిగియుండవలెనని అర్థముకాదు. పైవానిలో జ, ఞ ల, అక్షరములు తలకట్టు లేకపోయినను 'అ' స్వర సహితములు. ఇట్టి నియమముతో పద్యములు వ్రాయుట కష్టమని తోచికాబోలు కొంతసడలించి వ్రాయబడిన పద్యములు తెలుగున ఎక్కువగా కనబడుచున్నవి. లక్షణ కారులే సడలింపులు గావించిరి 'అం, అః'లు ఏస్వరము ప్రక్కనైన ఉండవచ్చు గనుక, వానినిగూడ గ్రహించి విన్నకోట పెద్దనాదులు లక్ష్యములు చూపిరి. 'మనః కంపన' అని [కా చూ. 6-60.] పద్యమునగలదు. ఈ లక్షణకారుని లక్షణ మిట్లున్నది.

"తలకట్టు బోదలుం గొ
మ్ములు గల వర్ణముల తోడి ముఖ్యపదములున్
గల కబ్బము హ్రస్వస్వర
కలితంబగు" - [కా. చూ. 6-59]

లక్ష్యమున బిందువు, విసర్గలు హ్రస్వస్వరములుగ గ్రహించెను. ఈరీతిలో సాగిన పద్యము క్రిందిది.

1) ల. సా. సం. 3-124.
2) గ. వేం కవి. - ప్ర. ధా. వేం. ఫి. ఫి. 811 సీసపాదము,

3) వేదుల వారి ఆం. ల. స. చిత్ర. స్త. బ. 32

4) విక్రాలవారి - శ్రీ. వేం. చి. ర. కదము. పూ.భా. చిత్ర.1.

5) విక్రాల శ్రీదేవమ్మ. - వాసవ దత్తా పరిణయం. 2-110

6) అల్లమరాజు రంగశాయి - శ్రీమదాంధ్ర చంపూ రామాయణం. ఆరణ్య. ॥ గీతము

ఇంక కొంచెము లక్షణ విరుద్ధముగ వ్రాసిన తెల్గుకవు లున్నారు. వీరు తల కట్టుతో తృప్తిచెంది. 'ఆ' తీసికొనిరి. తల కట్టుండి దీర్ఘ మిచ్చుటకు వీలున్నది కనుక 'హా, యా, మా'లు వ్రాయబడినదను కొన్నను తలకట్టు లేకయే 'ఆ' స్వరముతో "సత్యావాసా" అని వ్రాయబడుటయు చూడవచ్చును.

తలకట్టుండి ఉ, ఊ, ల (వట్రువసుడి) వాడిరి. 'భువనపూర్ణ', 'వృషభ' 'భూష' అనునవి యిందు కుదాహరణములు.

ఈరీతిలో వ్రాయబడిన పద్యము లీక్రిందివి.

1) అప్పకవి. అప్పకవీయము. 4-554.

2) మల్లారెడ్డి. ష. చ. 3-112

3) మిన్నికంటి గురునాథ్ శర్మ శివగీత. 6-1, 7-1.

4) బోడి వాసుదేవరావు - చిత్రమంజరి. -3.

5) రాప్తాటి ఓబిరెడ్డి - కవిజన వినోదిని. పుట. 32 (వ్రాతప్రతి)

[౨] "ఆ" స్వ ర ము

వ్యంజన మేదైనప్పటికి పద్యమున ప్రతివ్యంజనము పై 'ఆ' స్వరము పాటింపబడుట దీనినియమము.

సంస్కృతమున ఉదా :- సామా యామా మాయా మాసా
మారా నాయా యానారామా
యానా వారా రావా నాయా
మాయా రామా మారా యామా.

[దండి. కా. ద. 3-87].

తెలుగున దీర్ఘంతాక్షరములతో పద్యము మొత్తము వ్రాయుట కష్టమే. అవి అన్నియు దాదాపు సంస్కృత పదాలే అయిఉండాలి, అందుకనే తెలుగు లాక్షణికులు దీనిని పేర్కొనలేదు.

1. కేశవయ్య – దాశరథి చరిత్ర 4–16 పద్యమిట్లున్నది.
సారా చారా సాధ్యారాధ్యా | నారాగారా నానాకారా
తారా రాస్యా దాతాజ్యాజా | తారాజాత్రా తాఖ్యా తాఖ్యా.
2. అల్లమరాజు రంగశాయి. శ్రీ. అం. చం. రామాయణం. అరణ్య. 73.

[3] సర్వాదంతము

పద్యములోని ప్రతి వ్యంజనము పై 'అ,ఆ' స్వరములు మాత్రమే కలిపి వాడబడిన సర్వాదంతమనబడును.

ఉదా :– ఘన సప్తాశ్వాన్వయ సా
ధన పట భవ దమల చరణ దాస్యమరయగా
ననవరత భజన నడపగ
ననఘత బరమపద వాస మవసరమనగా.

[నాదెళ్ళవారి అ. ఉ. రామా].

వీరే ఇందలి దేవీస్తుతి సందర్భమున, సోమేశ్వరీయమను గ్రంథమున సర్వాదంత పద్యములను వ్రాసిరి.

[4] "ఇ" స్వరము [గుడులు]

'ఇ'స్వరము పద్యమందంతట పాటింపబడిన ఈ చిత్రమగును. హల్లే దైనను గావచ్చును. ఈ గుడులను చిన్నకోట పెద్దన 'బోడలు' అని పిలిచెను.

సంస్కృతమున దీనిని ద్విస్వర నియమమను పేరుతో కా. శా. లో వ్రాయబడిన రీతి యిట్లున్నది.

"క్షితి స్థితిమితి తిక్షిప్తి విధివిన్నది సిద్ధి లిత్."

ఆంగ్లభాషలో ఏకాచ్చు పద్యములు (Unin vocalic verses) కలవు. సాయంకాల వర్ణనకు చెందిన ఈక్రింది పద్యమున 'i' అచ్చు పాటింపబడినది.[1]

Idling, I sit in this mild twilight dim.
Whilst birds, in wild, swift vigils circling skim.
Light windo in sigling sink, till rising bright
Night's virgin pilgrim swims in vivid light.

1. తిరుపతి "సాహిత్య సమితి" వ్యాసావళి. లో జి. యన్ రెడ్డి గారి చిత్రకవిత వ్యాసం.

తెలుగున స్వరచిత్రమున బిందువు, విసర్గ లుండుట లక్షణాను సారమే అని విన్నకోట పెద్దన చెప్పి, ఆమార్గమున నడిచినాడు. ఇక దీర్ఘము పరిహరింప వలెననిన కంద మీ చిత్రమునకు సరిపడదు. అందువలన తేటగతి పద్యము. బిందువు కల్గినది.

ఉదా :-

మించి నిర్మించితివి వినిర్మితిని క్షితిని
గిలిని విదిలించి శివికిరి నిలిపితిక్షితి
సిరికి విరివిడి విడిదివి విరి విడికిని
విడిసి నిలిచితి విగ్గిరి సిరికి విడిది.

[విక్రాలవారి శ్రీ. వేం. చి.ర. కరము. పూ. భా.2]

2. గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 811. రెండవ పాదము.

కందమున: 1. ఉదా:- విన్నకోట పెద్దన. కా. చూ. 6-61

2) చిత్రకవి. ల. సా. సం. 3-125

3) అప్పకవి, అప్పకవీయము. 4-555

4) మల్లారెడ్డి - ష. చ. 3-114

5) అల్లమరాజు రంగశాయి ఆం. చం. రామా. ఆరణ్య. 7b

## [5] "ఈ" స్వ ర ము

ఉదా:- విద్యున్మానల: సీరీశీలీ శ్రీస్త్రీ ప్రీతీ
గీరీడ్వీతీ కీర్తీ రీతీ
నీరీడీప్తీ నీతీహీష్టీ
హీరీ డీందీ క్షీపీ డ్వీతీ.

[అల్లమరాజు రంగశాయి. శ్రీ. ఆం. చం. రామా. ఆరణ్య. 75].

## [6] స ర్వే ద ం త ము

పద్యములో ప్రతివ్యంజనముపై 'ఇ, ఈ,'లు మాత్రమే కలిపి వాడబడిన సర్వేదంతమనబడును. వ్యంజనము లేవైనను గావచ్చును.

1. ఉదా :- నిలిచితి గిరితి వినితిని
బిలిచితి సిస్థితిని జిగిని బిరిది నినిడితి.
గ్గిలి చితి బిగితీర్చితి విలి
విలిచితి నీప్రీతి మితికి విరివి యిది విధిన్. [నాదెళ్ళవారి]

1. అచ్చతెలుగులో

కినిసి సిరిఁదీసి నీ లిగి
తిని సిగ్గడి కింగిరికిని దిగి తీరితిఁగి
త్రిని జీరి నించి చిక్కడి
తిని జియ్యా యింతి కీరితిని నిల్చిరిసీ.

[పోకూరి కాశీపతి. శు.అం.ని.ని. హరిశ్చంద్ర చరిత్ర. 2-135]

3) కేశవయ్య. దాశరధీ చరిత్ర. 4-17.
4) అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 100.
5) రాప్తాటి ఓబిరెడ్డి, కవిజన వినోదిని. పుట. 32. (వ్రాతప్రతి.)

[7] "ఉ" స్వ రము క్రొ మ్ము లు]

పద్యమున ప్రతివ్యంజనముపై 'ఉ' స్వరమును మాత్రమే పాటించుటను కొమ్ములందురు.

సంస్కృతమున భోజుని సర. కంఠా. 2-276గా క్రిందిది ఉదా :

"ఉరుగుం భు గురుం యుత్సు చుక్రు శుస్తుష్టువుః పురు
లులుభుః పుపుషుర్ముత్యు ముముహుర్ముముహుర్ముహుః"

తెలుగులో ఉదా :- ఉరుగుణులు గురులు గుకురులు
గురులును బుణ్యులును బుధులుఁ గుతుకులు శ్రుతులున్
సురుచులు సుముఖులు సుఖులును
బురుసుతు లుడు........ [కా. చూ. 6-62].

2) చిత్రకవి. లక్ష. సా. సం. 3-126.
3) అప్పకవి. అప్పకవీయము. 4-556
4) గ. వేం. కవి. శ్రీ వేం. వి. వి. 811 సీస. 3వ పాదము.
5) అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 101.
6) విక్రాల వారి. శ్రీ. వేం. చి. ర. కరము చి. ప్ర. 3. (వటువసుడి గూడ చేర్చిరి)
7) అల్లమరాజు రంగశాయి. శ్రీ. అం. చం. రామా అరణ్య. 74, 76. [అచ్చ తెలుగు]
8) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. పుట. 32 [వ్రాతప్రతి]
9) పోకూరి కాశీపతి - శు. అ. ని. ని. హరి. చరిత్ర 2-71 [అచ్చతెలుగు]

[8] "ఎ, ఏ," స్వ ర ము లు

పద్య మంతటను 'ఎ, ఏ' స్వరములు పాటింప బడవలెను.

సంస్కృతమున 'ఎ' లేదు.

ఆంగ్లమున Lord Holtand 1824 Eve 's Legend అనెడి శీర్షికతో 'e' అచ్చును మాత్రమే గ్రహించి కొన్ని పంక్తుల గద్యరచన చేసినాడు.[1]

"Men were never perfect, yet the thee bretheren verses were ever esteemed respected, revered, even when the rest,whethere the select few, whether the mere herd, were left nelgected.

The eldest's vessels seek the deep stem the element, get hence; the keen peter when free wedded Hester Green the slender, steen, severe erect Hester Green;The next Clever Ned, less dependent wedded sweet elden Heber -here Endeth the Legend."

తెలుగులో ఎత్వముతోగాని, ఏత్వముతోగాని పద్యములు వ్రాయబడలేదు. 'ఎఏ'లతో గూడిన పద్యము లున్నవి. ఇవి తెలుగున ప్రత్యేకము. ఏలన, సంస్కృతమున 'ఏ' ఉండి 'ఎ' లేదు. ఏత్వకంద మను పేరుతో మల్లారెడ్డి ష. చ. 3-113గా వ్రాసి యున్నాడు.

అది:

1. కం॥ కేవే దేదే లేదే
నేవే రే యెమ్మె హెచ్చె నేడే మేలే
తేపే లేపే నేనే
నేవే సేసేదె దేజ జేజేజేజే.

---

1. తిరుపతి, సాహిత్యవ్యాసావళిలో చిత్ర కవిత్వం. వ్యాసం. కర్త. జి. యన్. రెడ్డిగారు

2. కేశవయ్య-దాశరధి చరిత్ర-4-13

3. పోకూరికాశీపతి శు.అం.ని.ని. హరి. చరిత్ర ‘కేరేదేతే’ పద్యము.

## [9] ‘ఐ’ స్వరము

‘ఐ’ స్వరనియమముతో పద్యమును వ్రాయుట దీని లక్షణము.
సంస్కృతమున కా.శా. వాఖ్యలో గలది ఉదా:-

“వై ధైరైనైశ్చైన్ద్రైరైజైరైలైర్జై న్వైఃసైదైర్వైః
మైత్రైరైఖైకైరైర్వైధైయైఃస్వైరైరైః స్వైధైదైవైస్సైపైః

తెలుగున ఉదా:-లేదు

## [10] ‘ఒ,ఓ’ స్వరములు

సంస్కృతమున ‘ఒ’ లేదు.
తెలుగున ఉదా:-లేదు
‘ఓ’తో సంస్కృతమున ఉదా:-

‘భోగో రోగో మోదో మోహో’

[దండి కా.ద.3. 84.3వ పాదం]

[11] ఔ స్వరముతో సంస్కృతాంధ్రముల వ్రాయబడినట్లు కనబడుట లేదు.

## [12] స్వ గ ల ఘు వు

పద్యములో ప్రత్యక్షరము లఘువై యుండుట దీని లక్షణము అనగా ప్రతి వ్యంజనముపై హ్రస్వాచ్చులైన అ, ఇ, ఉ, ఋ (వట్రుసుడి.ృ) ఎ, ఒ లుండునట్లు వ్రాయుటను సర్వలఘ్వందురు. అంతేకాదు. ద్విత్వ సంయుక్తాక్షరములు పదమధ్యములందు వాడరాదు బిందువు న,ల,ర,ల పొల్లులు విసర్గలు వాడరాదు. ఇది కూడ తెలుగున ప్రత్యేకము ఏలన, ఎ, ఒ లు సంస్కృతమున లేవు. కనుక ఈ చిత్ర మచ్చట పొసగదు.

తెలుగు కవులు సర్వలఘువును విరివిగ వాడిరి. కందపద్యమైనచో 8వ గణము చివరి అక్షరము గురువై యుండవలెను గనుక ఆచోట తప్పని సరియై

గురువును వాడిరి. కాని ఇది సీసము తేటగీతి, ఆటవెలది మొ॥ పద్యములకు బాగుగ సరిపోవును. సీసము. 1 వ, రకము: సర్వలఘు సీస లక్షణ మప్ప కవీయమున గలదు.

కం॥ క్షమ షట్త్రింశల్లఘువులు
క్రిమ హేళ విరామముగల దీర్ఘపదచతు
ష్కముపై నొకగీతిమురి
ప్రమథన సర్వలఘుసీస పద్యమున కగున్
[అప్పకవీయం 4-530]

దీని ప్రకారము ప్రతి పాదమున 36అక్షరములు,అవియు లఘువులుగా ఉండ వలెను. అనగా 6 ఇం.గ. 6×5=30. 2 సూర్యగ. 2×3=6 మొత్తము 36 అక్ష రాలు, ఈ లక్షణాను సారమే వ్రాయబడినవి క్రిందివి.

1. భాగవతము. వెలిగందల నారయ. సీసము
2. అప్పకవి అప్పకవీయము 4-531
3. కొడవలూరు రామచంద్రకవి-మహాసేనోదయము -7-195
4. అడ్డుమిల్లి నారాయణరావు నారాయణీయము. పుట 98లో

సీసము రెండవరకము. ఇం. గ.6×4=24 2సూ.గ.2×3=6 మొత్తము30 అక్షరములు. ఉదా:- గ.వేం. కవి-ప్ర.రా.వేం. వి.వి. 75 పద్యము. "నిఖిల సురదనుజ నికరశుభితజల నిధిభవఘుమ ఘుమ నినదమనగ" క్రింద తేటగీతిన-న, నల నల, న,న గణములతో పాదమునకు 17 అక్షరము.

అందలి 221 వ పద్యము కూడ ఇదే విధము

ఆటవెలదికి న,న,న, నల, నల గణముతో 1,3 పాదముల 17 అక్షరాలు.

5. నగణములతో 2,4 పాదముల-15 అక్షరాలు.

కందము: 1, 3 పాదములు 3 'నల' గణములు 3×4=12 అక్షరా లుండును 2,4 పాదములు 4 'నల'లు 1న. =19 అక్షరాలు.

1) ఉదా: తగు దగదని మనమున మును
వగ వగ నొడబడఁగ వగవ వగవఁగ బిడయున్
దగు దగ దని పగవని వగ
వగవగ బనిగలవె తనకు వగమటి జగతిన్
[నన్నెచోడుడు-కు సం.10-186]

2) భాగవతము 8-54, 146, 211, 212. 10-186, 1561.
3) అయ్యలరాజు నారాయణామాత్యుడు. హంసవింశతి 4-70
4) బుక్కపట్టణం వేంకటాచార్యుడు. అచలాత్మజా పరిణయం 3-41
5) కనుపర్తి అబ్బయ్య-కవిరాజ మనోరంజనము 1-216
6) నాదెళ్ళవారు-గురుప్రభావము. అ. ఉ. రామా లలో
7) మిన్నికంటి గురునాథశర్మ-శివగీత 5-1
8) కోట వీరాంజనేయశర్మ-చిత్రాశ్వీయము 3-42
9) పోకూరి కాశీపతి-శు.అం.ని.ని. హరిశ్చంద్ర 1-8 సీసం

[అచ్చ తెలుగు]

సందర్భము:

1. తత్తరపాటు సమయమున ఆలస్యముగ నుచ్చరింతుము గనుక లఘ్వక్షరములు సహజముగ దొర్లును. ఆ సమయముల సర్వలఘు పద్యములు మిక్కిలి ఉచితము (ఉదా:- 1) 'అడిగెదనని కడువడిజను' అను పద్యము

[భాగవతం-8-103]

2) అడుగడుగున భయపడుచు-అచలాత్మజా పరిణయములో పద్యము.

2. చులకనయైన మనిషిని గూర్చి వర్ణించునపుడు సర్వలఘురచనము శోభ గూర్చి సందర్భోచితమై యలరారును.

ఉదా:- చిత్రసేనుడను గంధర్వుడు తన గర్వముచే మహిమలను పోగొట్టుకొని చుల్కనయై (సర్వలఘువుమారి) శివుని స్తోత్రముచేయు సందర్భము-భైరవుడు శ్రీరంగమహత్త్వము. లఘుగద్య 3-215

## [13] సర్వగురువు

పద్యములో అక్షరములన్నియు గురువులే
సంస్కృతమున ఈ చిత్రము సులభము

ఉదా:- ఆమ్నాయానా మాహాన్త్యావాగ్గీతీ రీతీః ప్రీతీభీతీః
భోగోరోగో మోదో మోహో ధ్యేయే వేచ్ఛేద్దేశే క్షేమే.

[కా. ద. 3-84]

తెలుగున పద్యములలో ఈ చిత్రము వ్రాయుటకష్టము, అందువలన ఒక సర్వగురు వచనము గ.వేం.కవి. చెప్పిన దానిని ఈ దిగువ నిచ్చుచుంటిని

"ఆవేశం దాశ్చర్యారూఢాత్మాంభోజా తోద్యత్కం దర్పాటోప స్థా
యన్నారా చస్తోమ శ్రేష్ఠోద్భోధా దీనాంచ ద్భోధానై పుణ్య ప్రౌఢి
శ్రీనారీ రత్నం బిట్లొహించెన్"-447

## 2. వ్యంజన చిత్రము

ఈ చిత్రమున వ్యంజన నియమమును గమనింతుము. వ్యంజనముపై స్వర మేదైన నుండవచ్చును. పద్యమంతయు ఒకే వ్యంజనముతో వ్రాయబడుటను ఏక వ్యంజనచిత్రము లేదా ఆ పద్యమును ఏకాక్షరి అందురు. రెండు వ్యంజనముల నియమముతో వ్రాయబడిన పద్యమును ద్వ్యవ్యంజన చిత్రము లేదా ద్వ్యక్షరి అందురు. ఇట్లే త్ర్యక్షరి, చతురక్షరి, పంచాక్షరి మొదలగునవి.

కేవలము వ్యంజన చిత్రముతోడనే నిర్మింపబడిన కావ్యములు సంస్కృతాంధ్రముల లేవు. ఇందువరుసగా ఏకాక్షరపాదము, ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, చతురక్షరి, పంచాక్షరి, మొ॥ కలవు.

### 1. ఏకాక్షర పాదము

ఒకే వ్యంజనముతో పాదము మొత్తము వ్రాయబడుటను ఏకాక్షర పాద మందురు. వ్యంజనముపై అచ్చు ఏదైనను ఉండవచ్చును. పద్యములో ఒక్కొక్క పాదము నొక్కొక్క వ్యంజనముతో వ్రాయురీతి యిది. సంస్కృతములో మాఘుని శిశుపాల వధ.లో. 19-3 ఉదా॥

తెలుగులో ఉదా:-1) ఆ॥వె॥ మామ మామ మమ్మమమ్మెముమిమ్మిమ్ము.
నేను నిన్ను నినుని నూనినాను.
రార రార రురురు రార రారే రురో
యియ్యు యయ్య యయ్య యయ్య యయ్య.
[విక్రాల వారి. శ్రీ వేం.చి.ర.కరము ఉ.ఖా.]

### 2. ఏకవ్యంజనమ్ లేదా ఏకాక్షరి

పద్యమందంతటను ఒకే వ్యంజనముండెడి నియమమున వ్రాయుట. అచ్చేదైనను గావచ్చును.

సంస్కృతమున న,ద,య,త,ర,మ,వ,క అను వ్యంజన నియమములతో, తెలుగున న,ల,క,మ,ర,లతో, ఏకాక్షరులు కనబడుచున్నవి. ఇందులో 'న' ఏకాక్షరుల సంఖ్య అధికము. ఉత్తమ పురుష సర్వనామ రూపములు నేను, నన్ను, క్రియా రూపములు ఉన్నాను, అన్నాను, అనన్ వంటి నకార పొల్లు వాడుకొను సౌకర్య ముండుటచేతనేమొ 'న' ఏకాక్షరులు విరివిగా వ్రాయబడినవి. చిన్న పద్యములైన కందము ద్విపదలలోనే ఈ చిత్రమగుపడుచున్నది.

సంస్కృతమున శిశుపాలవధ, కిరాతార్జునీయము, దేవీశతకము. పా.స.ల.స మొ॥ కావ్యముల కలదు.

తెలుగున ఉదా:- వేదులవారి ల.స. చి. స్త. 35.

ద్విపద : రరరారరారోర రరరేరరైర
రరరారరేరరోరారరారార

అర్థము : ర = వజ్రాయుధమును, ర = గ్రహించునట్టి ఇంద్రునకు, రా = ధనమును, ర = ఇచ్చుదానా. (దుర్వాసశ్శాపగ్రస్తుడగు నింద్రునకు తిర్గి రాజ్యమిచ్చిన దానాయనుట) రా = రమ్మా, ర+ఉ=రో, ర = అగ్ని, ఉ=శివుడు, రర = వజ్రాయుధ హస్తుడగు నింద్రుడు వీరందరిని, ర = గ్రహింప జేయునట్టి, రా+ఇల: ధనమునకు భూమియైనదానా, రై = ధనమును, రః=గ్రహింపజేయుదానా, ర = నాశమును, ర = పొందునట్టి వారిని, రా=స్వీకరించుదానవును, అర = ధనహీనునకు, రా = ధనమునకు, ఇలరో = స్థానమైనదానవైనదానా, ర+అ = కోరికతో, అ=విష్ణువును, ర = స్వీకరించు వారికి, రా = ధనమును, ర = గ్రహింపజేయువారియందు, అ = సంపూర్ణమైన, ర కోరికగలదానా.

మరొక ద్విపద. వేదులవారి ల.స.చి. స్త. 36.

కందము :

1) నిన్ను నిను నెన్న నీనే
నెన్నిన నన్నన్న నననవిన నానే నా
విన్నాని నా ననూనున్
నన్నానన్నాను నేననా మన్నానా.

[విక్రావారి. శ్రీ వేం. చి.ర. కరము. పూ. భా. 8 (a)]

పదచ్ఛేదంబు: నిన్నున్ ఇనున్ ఎన్నన్ ఈ నేను ఎన్నినన్ అన్నన్న ననవు

అవిన నానేనా నిన్ను ఊనినాను అనూనున్ నన్ను ఊను అన్నాను. నేను అనా నున్నానా.

అర్థము : అనిన=నీకుపైన ప్రభువులులేని, నానా=సర్వమునకు ఇనా=ప్రభువైనవాడా, ఇనున్=సర్వేశ్వరుడవైన, నిన్నున్, ఎన్నన్=స్తుతించుటకొరకు, ఈనేను, ఎన్నినన్=ఆలోచించినచో, ననను=చిగురును, (అల్పుడని అర్థము). అన్నన్న=చోద్యము, అనూనున్=గొప్పవాడవైన, నినున్=నిన్ను, ఊనినాను=ఆశ్రయించినాను, నున్న=త్రోసివేయబడిన, అనా=శకటముగలవాడవైన, అనా=తండ్రీ! నేను, నన్ను+ఊను=ఆదుకొనుము, అన్నాను=అంటిని.

అచ్చతెలుగులో ఉదా:-

2) మేమే మిమ్మో మేమా
మీమీ మామాము మోము మిమ్మమ్మోమో.
మేమే మీమీ మమ్మే
మూమూ మమ్మమ్మ మమ్మే మోమా మమ్మా.

[తిరుమామిడి రామస్వామి-ఆంధ్రకిరాతార్జునీయం].

3) సంపిఘంటల జంట వరాహపురాణము. 10-90 'న' వ్యంజనం
4) అప్పకవి అప్పకవీయము 4-564 'న'
5) గ.వేం. కవి ప్ర.రా.వేం. వి.వి. 223 'ల' 214, 'త'
6) అల్లమరాజు రంగశాయి చంప్వాభార 'మ'
7) పరశురామపంతులలింగమూర్తి సీతారామాంజనేయ సంవాదము 2-89 'న'
8) నాదెళ్ళవారి సోమేశ్వరీయము 'న', అ.ఉ.రామా. 'న'2 పద్యములు
9) కేశవయ్య దాశరథీ చరిత్ర 3-160 'న'
10) పోకూరి కాశీపతి శు.ఆం.ని.ని.హరి.చలి '2-76 న'
11) అడ్డుమిల్లి నారాయణరావు నారాయణీయం. పుట. 94, 95 'న' 'వ'
12) కామినేని మల్లారెడ్డి ష. చ. '3-106 న'
13) బుర్రాకమలాదేవి చందోహంసి పుట. 63 'న'
14) కాకొండవారి బిల్వేశ్వరీయము 4-159 'న'
15) చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీవిలాసము 2-11 'న'

## ౮. ద్వ్యంజనమ్ లేదా ద్వ్యక్షరి

పద్యమున రెండే వ్యంజనములు పాటించుట ద్వ్యక్షరి అనబడును. ఆవ్యంజనములపై ఏ అచ్చైయినను వాడవచ్చును. దీని లక్షణమిట్లున్నది.

కం॥ ధరద్వ్యక్షరి యన రెండ
క్షరములు పద్యంబుపేరు కవి పూనిన య
క్షరముల రెండిటనగు నం
దిరవుగ నితరాక్షరంబు లిడరా దెలమిన్.

[ల.సా.సం. 3-116]

సంస్కృతమున ఏకాక్షరులు 12 అయిన ద్వ్యక్షరులు 35 సేకరించగలిగితిని ఇట్లే తెలుగునను ద్వ్యక్షరుల సంఖ్య అధికమే. అందులో 'నమ'లతో వ్రాయబడిన ద్వ్యక్షరులు ఎక్కువ. లాక్షణికు లిద్దఱు వ్రాసినవియు, కవులు వ్రాసిన 21లో 12 ద్వ్యక్షరులు "నమ"లవే.

తమిళమున దండి అలంకారమందును కన్నడ "కవి రాజమార్గము"ందును 'నమ' ద్వ్యక్షరులధికము.

ఇక "నమ" ద్వ్యక్షరులలో గూడ ఈ దిగువ పదములే విరివిగా వాడబడినవి నేమమున, లేదా నీమమున, మనమున, అనుమానము, మాను లేదా మానను, నిను, నమ్మినాను. మొ॥

వేదులవారి ల.స.చి. స్త. 34 'కల'లతో తేటగీతి ద్వ్యక్షరి కలదు.

తెలుగులో మిగిలిన వన్నియు కంద ద్వ్యక్షరులే.

తెలుగున ఉదా :- 1) మనమున ననుమానము నూ
నను నీనామ మనుమను మననమును నేమ
మ్మున మాన నన్ను మన్నన
మనుమను నానా మునీన మానా మానా

[నంది తిమ్మన. పారిజాతాపహరణం. 5-98].

అర్థము : నానా=సకల, మునీన=మునిశ్రేష్ఠులయొక్క, మాన=ప్రమాణములకు, అనూనా=అధికుడా. మనమునన్=మనస్సునందు, అనుమానమున్=సందేహమును, ఊనను=పెట్టను, నీనామమును=నీపేరనెడు, మను=మంత్రముయొక్క, మననమును=ధ్యానమును, నేమమ్మునన్=నియమముతో, మానన్=వదలను,

నన్నున్=అట్టినన్ను, మన్ననన్=ప్రీతితో మనుము+అను జీవించుము అని చెప్పుము,

ఉదా :–

| | | |
|---|---|---|
| 2) చిత్రకవి | లక్ష. సా. నం. | 3_116 |
| 3) అప్పకవి | అప్పకవీయము | 4_565 |
| 4) నందిఘంటలజంట | వరాహపురాణము | 11_69 'కల' వ్యంజనములు. |
| 5) సూరనకవి | కళాపూర్ణోదయము | 7_223 |
| 6) గ. వేం. కవి | ప్ర.రా.వేం.వి.వి | 222 వ. |
| 7) కనుపర్తి అబ్బయ్య | కవిరాజమనోరంజనము | |
| 8) పరశురామపంతులలింగమూర్తి | సీతారామాంజనేయ సంవాదము | 2_90 |
| 9) పురాణం పిచ్చయ్య | విజయాశ్వచరిత్ర | 3_199 |
| 10) నాదెళ్ళవారి | సోమేశ్వరీయములో 1, అ.ఉ. రామాలో 3కలవు. | |
| 11) మిన్నికంటి గురునాథశర్మ | శివగీత | 9_1 |
| 12) విక్రాలవారి | శ్రీ వేం. చి.ర.కరము. పూ.భా. | 7 |
| 13) కేశవయ్య | దాశరథి చరిత్ర | 3_135 |
| 14) అడ్డుమిల్లి నారాయణరావు | నారాయణీయము పుట. 95, 96 లలో 3 కలవు. | |
| 15) కామినేని మల్లారెడ్డి | ష.చ. | 3_107 'వద' |
| 16) కుందుర్తి వేంకటాచలకవి | మిత్రవిందాపరిణయం 3వ ఆశ్వాసాంతము 'గర' | |
| 17) కాణాద పెద్దన | భద్రాపరిణయం | 3_301 'మర' |
| 18) బుర్రా కమలాదేవి | చందోహంసి | 'మన' |
| 19) కొక్కొండవారి | బిల్వేశ్వరీయము | 4_158 |
| 20) చింతలపల్లి వీరరాఘవకవి | మధురవాణీవిలాసము | 2_13 'నమ' మరియు 2_12 'నక' |

## 4. త్ర్యక్షరి

పద్యమును మొత్తము మూడు వ్యంజనములతోడనే నిర్మించుట ఇందలి చిత్రము ఆ వ్యంజనములపై నేదేని అచ్చును వాడవచ్చును అప్పకవి లక్షణము లక్ష్యముతో

నొసంగెను. ఈ త్ర్యక్షరిని సంస్కృతాంధ్రకవులు ద్వ్యక్షరివలె ఎక్కువగా నుపయోగించలేదనియే చెప్పనగును.

సంస్కృతమున ఇది కా. ద., పాదుకా, ల. స. లలో దేశికశతకాదులలో కనబడుచున్నవి.

తెలుగున నుదా :-

1) నా పాపమ్మును మోపును
మాపుము మాపూనినీన మానని నెమ్మిన్
నీ పావనిపై నాపై
నా పన్నునిపైన నొప్పునా నెపమెన్నన్.
[విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. ఉ.భా. 34]

ఇందు 'నపమ' వ్యంజనములు కలవు.

[మా=లక్ష్మియనెడు, మానినీ=స్త్రీ యొక్క, ఇన=వల్లభా]

2) అప్పకవి. అప్పకవీయము. 4.566. 'నతమ'
3) గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 878.ప. 3వ పాదము 'కనల,
4) భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ. శంకరవిజయము. 'నమయ'
5) నాదెళ్ళవారి. సోమేశ్వరీయములో 1, అద్ను.ఉ.రామా. 2 కలవు.
6) వేదులవారి ల.స. చి. స్త. 33. ఆటవెలది. 'తమర'
7) అద్నుమిల్లి నారాయణరావు-నారాయణీయము. పుట. 96. 'నమయ'
8) బుర్రా కమలాదేవి. ఛందోహంసి 'మతన'
9) కొక్కొండవారి-బిల్వేశ్వరీయము. 'నేమగా' 4-157.
10) కాణాద పెద్దనాదుబు. యథాశ్లోకతాత్పర్య రామాయణం. అయోధ్య, నాల్గవ ఆశ్వాసాంతము, పుట. 246. 'భనవ'
11) చింతలపల్లి వీరరాఘవకవి-మధురవాణీ విలాసము. 2-14 'దానప'

## ౬. చతురక్షరి

పద్యమందంతటను నాలుగు వ్యంజనములే కనబడుట చతురక్షరి పద్యమందురు.

సంస్కృతమున ల.స.చి.స్త.48. 'మరపస' వ్యంజనముల చతురక్షరి కలదు.

తెలుగున ఉదా:- 1) రామానాయన నయమున
రామా మము నోముమయ్యరయమునను రమా
రామా యనయము నిన్నే
మేమేమో నమ్మినాము మేమన నెమ్మిన్.
[మే=మా దేహము, మన=బ్రదుకుటకుగాను, నెమ్మిన్ : ప్రేమతో. విక్రాలవారి శ్రీ వేం. చి. ర. కరము. ఉ.భా.33]

ఉదా :-

2) ఆడిదము సూరకవి. కవిజనరంజనము. 'నమదగ'
3) నాదెళ్ళవారి. సోమేశ్వరీయము 'శవమన'
" అ.ఉ. రామా. 'గరవమ'
4) అడ్డువిల్లి నారాయణరావు-నారాయణీయము 'రయవల'
5) కొక్కొండవారి. బిల్వేశ్వరీయము. 'శ్రీవినుతా' 4.156.
6) కాజాద పెద్దనాదులు = యథాశ్లోకతాత్పర్య రామాయణం పుట.253.

6. పంచాక్షరి

పద్యము పంచ వ్యంజనముల చేతనే వ్రాయబడిన పంచాక్షరి అందురు.వానిపై అచ్చేదైనను నిల్పవచ్చును.

ఉదా :1) నెల్లూరి వీరరాఘవకవి యాదవరాఘవ పాండవీయమున[1-6] 'నమశ్శివాయ' పంచాక్షరీ మంత్రమును పంచాక్షరిగా సీసమున చెప్పుట సందర్భ శోభితము.

2) పరమ కృపాకర నరపా
మరపా నీ ప్రాపు కోరి మననున్న మము
న్నరకము నన నుప మానుము
కర మనుపమ మైన ప్రేమ కననిమ్మన్నా.
[నాదెళ్ళవారి అ.ఉ రామా]

వీరి అ.ఉ. రామా.లో మరియొకటి కలదు.

3) ఆడిదము సూరకవి- కవిజనరంజనము
4) నందిఘంటల జంట. వరాహపురాణము 10-56 'నమశ్శివాయ'
5) కొక్కొండవారి బిల్వేశ్వరీయము 4-155 'నమశ్శివాయ'
6) గుడారు వెంకటదాసు. ప్రకృష్ణ బలరామచరిత్ర 2.223. 'నరజనక'

## 7. ష డ క్ష రి

ఆరువ్యంజనములతో నిర్మింపబడు పద్యమిది. రానురాను ఈ చిత్రమున క్లిష్టత నశలుచున్నది.

ఉదా:- 1) కనికరమున గనుమమ్మా
మన నన్విన వమ్మా కరకు మానఁగ రమ్మా
గౌనముగ నీ నికరమ్మగ
మననిమ్మా నిన్నెరుంగు మార్గ మ్మిమ్మా.
[నాదెళ్ళవారి అ.ఉ. రామా. దేవీస్తుతి, సంపర్భము]

2) ఆడిదము సూరకవి. కవిజనరంజనము 'వరమనయక'

## 8. స ప్తా క్ష రి

సప్తవ్యంజనము లుండును.

ఉదా :. గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి వి. 878. సీసముక్రింది గీత పద్య మూడవ పాదము. "భవ్యభావభదాకార దివ్యయావ," ఇందు 'భవయకదదవ' అనునవి యేడు వ్యంజనములు.

## 9. అ ష్టా క్ష రి

అష్టవ్యంజనము లిందుండును.

ఉదా:- గ.వేం. కవి.ప్ర.రా.వేం.వి వి. 878 పద్యగీత పద్య నాల్గవ పాదము. 'రాధికాస్ఫుట దిక్కరి కాధరాంగ' ఇందు 'కగటదధఫరస' అను అష్టవ్యంజనము లున్నవి.

## 10. వ్యంజన చిత్రమిశ్రము

పద్యములో ఒక్కొక్కపాదము నొక్కొక్క వ్యంజన చిత్రభేదముతో వ్రాసిన కవులున్నారు మొ.పా. ఏకాక్షరిగ, రెండవపాదము ద్వ్యక్షరిగ, ఇట్లే 8వ పా. అష్టాక్షరిగ వ్రాయుట జరిగినది.

ఉదా:- 1) గ.వేం.కవి - ప్ర.రా.వేం వి వి. 878 సీసపద్యము

2) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. ఉ.బా. ఆ పద్య మిట్లున్నది.

కం॥ మా నాయన న న్నోముర [చతురక్షరి]
మా నాయన నేమ మునను మానని నెమ్మి [త్ర్యక్షరి]
న్నే నిమ్మి నెమ్మనమ్మున [ద్వ్యక్షరి]
నానానను నూవినానున న్నూన నినున్ [ఏకాక్షరి]

3) వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము 3-138. సీసము

4) విక్రాల శ్రీదేవమ్మ. రసిక శరణాగతి పుట. 42 కందము 2 పాదములు ద్వ్యక్షరి. కడమపాదములు ఏకాక్షరి.

5) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి పుట. 28. తేటగీతి. నాల్గు పాదము లేకాక్షరి నుండి చతురక్షరి వరకు.

## 11. అపునరుక్త వ్యంజనము

పద్యములో ఒకమాఱు వచ్చిన హల్లు మఱియొక తడవ తిరిగి రాకపోవుటయే ఇందలి చిత్రము. అవ్యంజములపై అచ్చులేవైన నుండవచ్చును.

సంస్కృతమున 'లక్ష్మీ' స; ఈశ్వరశతకము లందిది కననగును.

తెలుగున వేదులవారి ల.స.చి.స్త. 16. ఉదా :-

ద్విపద : 'అచ్ఛం సంగఫణి శయ మనోజ్ఞదేవి!
హెచ్చైన బహుళాధు లింకింపజాడు'

## 12. ప్రాస చిత్రము

ప్రాసకు హల్లు ప్రధానము. అచ్చు మాత్రమేదైన నుండదగును. అందువలన వ్యంజన చిత్రముక్రింద ప్రాస చిత్రమను పేర గ్రహింపవలసివచ్చినది.

శబ్దాలంకరములగు విశేషప్రాసములని, సుకర, దుష్కర, ద్వంద్వ, త్ర్యక్షర, చతురక్షర, అంత్య, అనుప్రాసములు అప్పకవీయములో 3.382 to 391 లలోను, ద్వి, త్రి, ప్రాసములు కా.మా. 6-82, 83, 84లలో లక్ష్యములు తెల్పబడినవి.

వీని నన్నిటిని కవులు కొద్దిగానో గొప్పగానో తమ కావ్యముల చూపిరి. ఇవి అప్రయత్నముగ ప్రయోగింపబడుచుండును.

ఇవికాక; పంచప్రాస 1) రామాభ్యుదయము 6-23, 2) సారంగధర చరిత్ర

3-219, 3) రుక్మాంగద చరిత్ర 5-100 4) అ.ఉ.రామా. 'తలపవుగద''కురియం జేసెను' పద్యములలో గాంచనగును.

షడక్షర ప్రాసము. ప్రతాపహనుమయ్య శ్రీ సులక్షణోపాఖ్యానము- ద్వి. ఆ. 29లో కలదు.ఈప్రయోగము అరుదు.

ఇందులో మఱియొక చిత్రము ఏకప్రాసము.అనగా ఒకే ప్రాసాక్షరము ప్రతి పద్యమున పాటించి కావ్యమును వ్రాయుట.

తెలుగులో కృష్ణకవి- 1) వరదరాజశతకము. రేఫప్రాస. చంపకమాలలు.

2) మంచెళ్ళ కృష్ణకవి-పూరుష ముఖ్య శతకము రేఫ. ఉత్పలమాలలు.

3) కూచిమంచి తిమ్మకవి. చిరవిభవ శతకము. రేఫప్రాస.

4) మిన్నికంటి గురునాధశర్మగారి 'హరిహరదత్త స్తుతి'లో 'నరసింహస్తుతి' అను శతకము 'త'కార ప్రాసయుక్తము. పద్యము మొత్తము ఒకే ప్రాసయతితో వ్రాసిన తెలుగు కవులు గలరు.

ఉదా :- 1) ఎఱ్ఱన భారతము . అరణ్య 6-369.

2) బుక్కపట్టణం వేంకటాచార్యుడు. అచలాత్మజాపరిణయం. 1-24, మఱియు 3-7

3) కోటవీరాంజనేయశర్మ. 'చిత్రాశ్వీయము' 3-37 సీసము క్రింది తేట గీతిన ఒకేప్రాసయతి పాటింపబడినది.

## 3. స్థాననియమ చిత్రము

ఉచ్చరించబడెడి స్థానము ననుసరించి అక్షరములు పద్యమున ఉపయోగించి చూపుట ఈ స్థాననియమ చిత్రమనబడును. ఒక స్థానమునకు చెందిన వర్ణములతో నిర్మింపబడిన పద్య మాస్థానము పేరుతో పిల్వబడును. లేదా అస్థానమునకు చెందిన వర్ణములను పరిహరించి పద్యము వ్రాయబడిన ఆ స్థానాక్షరములు లేనిదని పిల్వ బడును.

ఈ చిత్రము సంస్కృతమున కలదు.

ఇటువంటిది పాశ్చాత్య భాషలలోను కలదు. "దానికి Lipo-grammatta (Letter dropping) అనిపేరు. అట్టి కవిత్వము వ్రాసేకవిని Lipo gramma-tist అందురు. Tryphiodous అని పేరుగల వాడు గ్రీకు ప్రాచీన రచయిత,

Ulysses సాహస యాత్రలను గురించి 24 ప్రకరణములుగల గ్రంథమును వ్రాసియున్నాడు. అందులో గ్రీకు వర్ణమాలలోని ఒక్కొక్క వర్ణమును వరుసగా ఒక్కొక్క ప్రకరణములో పరిహరించిన వర్ణముతోడనే ఈ ప్రకరణమును పేర్కొన్నాడట. మొదటి ప్రకరణమునకు పేరు Alpha ఈ ప్రకరణములో 'A' వర్ణము పరిహరింపబడినది. అట్లే 'B' వర్ణము పరిహరింపబడిన రెండవ ప్రకరణము 'Beta'. ఇట్లే తక్కినవి. Try phiodorusను అనుసరించిన చిత్ర కవితా రచయిత Lope de vega. ఇతడు స్పెయిన్ నవలా రచయిత. Spanish భాషలో అయిదు నవలలను a,e,i,o,u, అచ్చుల నొక్కొక్కదానినొక్కొక్క నవలలో పరిహరించుచు వ్రాసియున్నాడు.[1]

పాశ్చాత్య భాషలలోవలె ఒక వర్ణముగాక ఒక వర్గాక్షరములు గ్రహించియో లేదా పరిహరించియో పద్యము వ్రాయబడుట సంస్కృతాంధ్రముల గమనింతుము.

స్థానములను బట్టి ఇందలి భేదములు :

## 1. కంఠ్యము

కంఠస్థానము నుండి పలుకబడు అక్షరములతో నిర్మింపబడిన పద్యమును కంఠ్యమందురు. అచ్చులలో 'అ,ఆ'లు, హల్లులలో క,ఖ,గ,ఘ,ఙ,హ, లు కంఠాక్షరములు.

సంస్కృతమున ఉదా :-

1) అగాగాఙ్గాఙ్గకాకాకగాహకాఘకకాకహా
అహాహాఙ్కఖగాఙ్కాగకఙ్కాగఘగకాకక:

[కా.ద. 3-91]

2) సర. కంఠా. 2-275.

## 2. నిష్కంఠ్యము

పై కంఠాక్షరములను వదలి వ్రాయబడిన పద్యము నిష్కంఠ్యము. సంస్కృతమున. ఉదా :-

---

[1] తిరుపతి సాహిత్య సమితి వ్యాసావళిలో జి. యన్. రెడ్డిగారి "పాశ్చాత్య భాషలలో చిత్ర కవిత్వం" వ్యాసం.

1) భూరిభూతిం పృథు ప్రీతి తిమురు మూర్తి పురుస్థితిమ్.
విరించిం సూచిరుచిధీః శుచిభిర్నౌతి భర్తిను.

[సర. కంఠా. 2-267]

2) సాహిత్యరత్నాకరం, 6-28.

### 3. తాలవ్యము

ఇందు 'చ' వర్గము. అచ్చులలో 'ఇ,ఈ'లు, అంతస్థములలో 'య'ఊష్మాక్షరములలో 'శ' తాలవ్యములనబడును. వానితో నిర్మింపబడినది తాలవ్యపద్యము. అట్టివి సంస్కృతాంధ్రముల కనపడుటలేదు.

### 4. అతాలవ్యము

పై తాలవ్యాక్షరములు పరిహరించి వ్రాయబడిన పద్యము నిస్తాలవ్యము.

సంస్కృతములో మాఘుని శిశుపాలవధ 19-110, సర. కంఠా. 2-268.

ఉదాహరణములు :

తెలుగున ఉదా :- పరమ కృపాకర భూమీ
ద్వర దానవ కమల మత్త వారణ నాపై
గర మనురాగము జూపుము
తిరముగ నిను గొలుచువాడ దీనుడరామా.

[ఇందలి 'చు' తాలవ్యముగాక దంత్యోష్ఠ్యముగా పలుకబడును.]

2) శివకర్ణామృతము...."గంగా తుంగ తరంగ" శార్దూలము.

### 5. మూర్ధన్యము

ఇందు 'ట' వర్గాక్షరములు, అచ్చులలో 'ఋ' కారము, అంతస్థములలో "రళ" ఊష్మములలో 'ష' వాడబడును.

సంస్కృతాంధ్రముల ఉదా :- కనబడుటలేదు.

### 6. నిర్మూర్ధన్యము

పై మూర్ధన్యాక్షరములు పరిహరించి వ్రాయబడినది.

ఉదా :- సం. కంఠా. 2-271.

శలభా ఇవ ధావన్తః సాయకాస్తస్య భూభుజః
నిపేతుః సాయకచ్ఛిన్నాస్తేన సంయుగసీమని.

తెలుగున ఉదా :- కనబడలేదు.

## 7. దంత్యము

'త' వర్గాక్షరములు, అచ్చులలో 'ఌ', ఇంకను హల్లులలో "చ, జ, ల, స" దంత్యాక్షరములు, వానితో కూడిన పద్యము దంత్యము. సంస్కృతం ఉదా :- ఈశ్వర శతకము. 42.

న తనుతాం దథతీ తతతో దితాతుదతి నీతి నిథే నిధనే తనుమ్
నిధి దనాధ తతం నను నూతనం నుతిధనం తదిదం. నిదదానితే.

ఇందు "అ ఆ ఇ ఈ ఉ, ఏ." అచ్చులు వాడబడినవి. కాని 'త' వర్గము తప్పని సరిగ గ్రహింపబడినది.

తెలుగున ఉదా :- కనబడలేదు.

## 8. నిర్దంత్యము

పై దంత్యాక్షరములు పరిహరించి వ్రాయబడినది.

సంస్కృతం. ఉదా :- సర. కంఠా. 2-269.

పాప్మాపహారీ రణకర్మ శౌండ శ్చండీ శమిత్రోమమ చక్రపాణిః
భూయాచ్ఛ్రియాప్రశమ యేక్ష్యమాణో మోక్షా యముఖ్యామరపూగ
పూజ్యః

తెలుగున ఉదా :- కనబడలేదు.

## 9. ఓష్ఠ్యము

'ప' వర్గాక్షరములు అనగా "పఫబభమ", అంతస్థములలో "వ" అచ్చులలో "ఉఊ" మరియు కంఠోష్ఠ్యములు "ఒఓఔ"లు ఓష్ఠ్యాక్షరములు. వీనితో నిర్మింపబడినది ఓష్ఠ్యపద్యము. ఓష్ఠ్యాక్షరములు పెదవుల సాయమున పలుకబడునవి.

తెలుగులో ఓష్ఠ్యపద్యములు మచ్చుకు వెలయించిరి. 'ప' వర్గమును స్వీకరించిరి. అచ్చుల విషయమున శ్రద్ధవూనలేదు.

ఉదా :-1) పాపము మాబాముప బూ
మాపాపపు ముంపుబోవ మాపుము బాబూ
బాపు బుబి మామ మామా
భూపా వామోవమా విభూ భూమ విభా.

[పిక్రాలవారి శ్రీ వేం.చి.ర.కరము. ఉభా. 27].

10)

[భూపా=భూనాథా, వామ=సుందరులకు, ఉపమా=ఉపమానమైనవాడా, భూమవిభా=అధికమైన తేజస్సు కలవాడా].

| | | |
|---|---|---|
| 2) భట్టుమూర్తి | నరసభూపాలీయము | 2-175 |
| 2) కనుపర్తి అబ్బయ్య | కవిరాజమనోరంజనము | 4-167 |
| 4) మిన్నికంటి గురునాథశర్మ | శివగీత | 10-1 |
| 5) బోడి వాసుదేవరావు | చిత్రమంజరి | 5 |
| 6) కొక్కొండవారి | చిల్వేశ్వరీయము | 6-48 |

'వ' వర్గేతరాక్షరములను స్వీకరించికూడ సర్వోష్ఠ్యమును వ్రాసిన కవులున్నారు.

1) కాణాద పెద్దన ముకుందవిలాసము(భద్రాపరిణయం) 3-296

2) మాడభూషి వేంకటచార్యులు-భరతాభ్యుదయము 1-91

అది : "భవ విమతోరు ప్రాభవ
భవ భవ భీభిత్స్వ భావ భావ్యానుపమా
త్మ విభవ సుప్రభూప్రభ
వవిభృత్పావను స్స్వవ త్పద్మశుభా.

## 10. నిరోష్ఠ్యము

ఓష్ఠ్య వర్ణములు పరిహరించి వ్రాయబడిన నిరోష్ఠ్య పద్యమగును. ఇందు హల్లులలో "కచటత" వర్గ వర్ణములు అంతస్థములలో 'యరలళ. వర్ణములు ఊష్మములైన 'శషసహ' వర్ణములు, అచ్చులలో "అ ఆ' ఇ ఈ, ఋ ౠ, ఌ ౡ ఎఏఐ" వర్ణములు అనుస్వారము, విసర్గలు వాడదగును.

అచ్చులలో "ఉఊ, ఒఓఔ," హల్లులలో 'పఫబభమవ'లు ఓష్ఠ్యవర్ణములని పైన ఓష్ఠ్య నియమమున తెలిసికొంటిమి. కాని నిరోష్ఠ్య రచన సందర్భమున ఓష్ఠ్యాచ్చులను కొందరు పరిహరించిరి. ఇంక కొందఱు పరిహరింపకయే రచన సాగించిరి.

ఈ నిరోష్ఠ్యనియమ చిత్రముతో కావ్యములు వ్రాయబడినవి. ఇట్లు వ్రాయుటకు ఓష్ఠ్యాచ్చులు ప్రతిబంధకములని తలచి కొందరు వానిని స్వీకరించియుండవచ్చు. ఓష్ఠ్యాచ్చులు, ఓష్ఠ్య హల్లులు పరిహరించిచి వ్రాయబడిన రచనయే శుద్ధ నిరోష్ఠ్య రచన నియమబద్ధమైనది కాగలదు.

సంస్కృతమున ఉదా:-

1. అథాగ్రేహసతా సాచిస్థితేన స్థిర కీర్తినా
సేనాన్యా తేజగదిరే కించి దాయ స్త చేతసా.

[భారవి కిరాతార్జునీయము 15.7]

మఱియు అందే 15-29.

2. సర కంఠా-2-270.

3. ల. స. చి. స్త. 6

4. శి. పా. కమ స. 16

5. సా. ర. -6-26

నిరోష్ఠ్య కావ్యములు :

1) దండి-దశకుమార చరిత్రలో సప్తమోచ్ఛ్వాసములో నిరోష్ఠ్య రచన కావించినాడు. నియమమును చక్కగా పాటించెను. ఈ రచన సందర్భోచితమై శోభగూర్చుచున్నది. రాజకన్య సంసర్గము వలన తన పెదవులు దంతక్షతములైన మంత్రగుప్తుడు రాజవాహన మహారాజుతో తన సంగతి చెప్పుకొనవలెను. పెదవులు కదిలే స్థితిలోలేవు. ఆ సమయమున కవి నిరోష్ఠ్యరీతిలో అతనిచే పలికించును.

ఆగద్యలో భాగము : "రాజాధిరాజ నందన నగరంధ్ర గతస్యతేగతిం జ్ఞాస్యన్నహంచ గతః కదాచిత్ కళింగాన్ కళి జ్ఞనగరస్య నాత్యాసన్న సంస్థిత జన దాహస్థాన సంసక్తస్య కస్య చిత్కాంతార ధరణిరజస్యా స్తీర్ణ సరసకిసలయ సంస్తరే తలే నిషణ్ణ నిద్రాలీఢదృష్టి రశయషి. [పుట. 161]

అథ కదాచిదా యాసిత జాయారహిత చేతసి లాలసాతి లంఘన గ్లాన ఘన కేసరే, రాజదరణ్యస్థలీ లలాట లీలాయిత తిలకే, లలితానంగ రాజాంగీకృత నిర్ణిద్ర కణికా కాంచనచ్ఛత్రే, దక్షిణ దహన సారథిరయాహ్నృత సహకార చంచల కలికే కాలాండజ కంఠరాగరక్త రక్తాధరారతి రణాగ్ర సన్నాహశాలినీశాలి నీకన్యా కాంతః కరణ సంక్రాంత రాగ లింగితలజ్జే, దర్దరగిరి తట చందనాశ్లేష శీతలానిలాచార్యదత్త నానాలతా నృత్తలీలే కాలే కళింగ రాజస్సహాంగ నాజనేన. [పుట. 164]

క్షీరసాగర రశనాలంకృతాయా, గంగానదీ సహస్రహారయష్ఠిరాజితాయాః ధరాంగనాయా ఏతదాపాదనాయ సాధనం. [పుట. 167]

2) శాకల్య మల్లన నిరోష్ఠ్య రామాయణము వ్రాసినట్లు సింగరాచార్యులు తన

దశరథరాజ నందన చరిత్రలో [1-32] పేర్కొనెను. కాని అది అలభ్యము. తానే చూడలేదని సింగరాచార్యులే అన్నారు.

3) క్రీ. శ. 1850 ప్రాంతమున జటప్రోలు సంస్థానకవి కవి కంఠీరవ కృష్ణమాచార్యులు నిరోష్ఠ్య రామాయణము వ్రాసిరని తెలియుచున్నది.[1]

4) యుణయవల్లి కృష్ణమాచార్యులు-నిరోష్ఠ్య కృష్ణశతకము.[2] తెలుగులో ఈ నిరోష్ఠ్య స్థాన నియమ చిత్రము రెండువిధముల కనబడుచున్నది 1. అచ్చులైన ఉఊ ఒఓఔ, హల్లులైన పఫబభ మవ, లను పరిహరించి వ్రాయుట. 2. ఒక్క హల్లులనే పరిహరించి వ్రాయుట మొదటి విధమే సరియైనదని పూండ్ల రామకృష్ణయ్యగారి మతము.[3]

మొదటి విధమున చిత్రకవి పెద్దన లక్షణము. [ల. సా. సం. 3-131].

తే॥గీ॥ కలయనో ఔలుకార వకారములును
నలప వర్గంబు మాని మిగిలిన లిపుల
నమర పద్యంబు రచియింపనది నిరోష్ఠ్య
ఘనుచుఁ జక్కిరి సత్కవు లనిలతనయ.

అతని లక్ష్యము : 3-132

తనరంగ నేఁ దలంచెద
ఘన దశరథ నందన హితకార్యాసక్తిన్
ఘనరసనిధి దాటిన నీ
కనదతిరయ చరిత తీక్షకర నయహితా.

ఈ లక్షణానుసారము నిరోష్ఠ్య పద్యములను కావ్యము లందక్కడక్కడ వ్రాసిన తెలుగు కవులు.

1) నాచనసోమన. ప్రథముడు [ఉ. హరివంశము. 1-106].

---

1. విజ్ఞాన సర్వస్వము. 4. భా. తెలుగు సంస్కృతి. పుట. 117.
2. ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణ. పుట. 16.
3. అముద్రిత గ్రంథ చింతామణి. పుట. 26. సంచిక. 4. ఏప్రియల్. 1902.

చం॥ చనిచని కాంచె నంత ఋషి సంహతి సారస కేసరాంతరా
సన సరసాళి సంగదట చందనశాఖి చంత్తరంగఁ గాం
చన సరసీ జలార్ద్రియతి సంచిత సైకతలింగ గంగ సం
జన గిరి గాఢ గంధగజ సంగత శృంగ రథాంగ సత్తటిన్.

[సందర్భము : మునులు గంగను జూచుట].

2. కొలవి గోపరాజు—సిం. ద్వాత్రిం 4.24. దండకము.
3. గ. వేం. కవి ప్ర రా. వేం. వి.వి. 32 పంక్తులరగడ. 255.
4. రేకపల్లి సోమనాథకవి—రుక్మవతీ పరిణయం, 1–181, 3–12. సీసం.
5. పుష్పగిరి తిమ్మన. సమీరకుమార విజయము 4–145. దండకము.
6. కంకంటి పాపరాజు—ఉత్త రా.మా. 5–233. సీస
7. చిగురుపాటి వేంకట సుబ్రహ్మణ్యరమణ సోదరులు 'సత్యహరిశ్చంద్ర' కందము.
8. కంకంటి నారసింహకవి—విష్ణుమాయావిలాసము. 5 ఆశ్వా. ద్విపద.
9. పోతరాజు లక్ష్మీనృసింహకవి— మాఘపురాణం.5–69. కం.
10. వేదులవారి— ల. స. చి. స్త. 6. కం.
11. విక్రాలవారి శ్రీ వేం. చి. ర. కరము.చిత్ర. ప్రక. 4. కం.
12. తూము రామదాసు : మిత్రవిందోద్వాహము. 2–28. కం.
[ముని వనజాక్షుని నుతించు సందర్భము]
13. అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి.శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రము. 2–46, 2–1, 49, 4–96,5–115, 118, 1–406, 407.
14. విక్రాల శ్రీదేవమ్మ: వాసవదత్తా పరిణయం. 3–232, చం. ఆశ్వాసాంతము.
15. మరింగంటి నరసింహాచార్యులు—తాలాంక నందినీపరిణయం. 1. 322.చం.
16. కొక్కొండవారి విశ్వేశ్వరీయము. 6–49. కం.
17. హరిభట్టు—నారసింహపురాణము. 1–116 సీస. [పుత్తరభాగము]

అచ్చ తెలుగు :

ఉదా:- 1) రక్కసి తేండ్లఁగలనన్
జక్కడఁ చియల తెఱగంట్ల సాఁకెడి దిట్టా
చక్కగ నెల్లర సేగిం
జిక్కఁగ నియ్యక యరసెడి జేజేరాయా.
[కందుకూరి-రసిక జన మనోరంజనము. 3-138]

2. అల్లమరాజు రంగశాయి- శ్రీ. అం. చం. రామా. అరణ్య చివర. 69.సీస.

3. అబ్బరాజు హనుమంతరాయశర్మా పాకయాజి-శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రము. 2-80. కం.

రెండవ విధమున విన్నకోట పెద్దన, అప్పకవి చెప్పిరి. కొంచెము నియమముల్లంఘించి, అచ్చులలో ఉ ఊ ఒ ఓ ఔ, లు గ్రహించి వ్రాయుట వీరిమతము.

విన్నకోట పెద్దన లక్షణము. [కా. చూ. 6-44]

పంచమ వర్గాక్షరములు
పంచించి హితోచిత్రార్ధ వంతంబులుగా
ఎంచిన కబ్బము వీనుల
కంచితమై యది నిరోష్ఠ్యమన నొప్పారున్.

లక్ష్యము : (6-45)
చాళుక్యక్షితినాథు నూర్జిత యశస్సంక్రాంతిచేఁ దూలు లో
కాలో కాద్రి దనర్చు చీఁకటులు కైలాసోల్ల సద్దీధితుల్
సాలందెల్లని చాయలందనరు నాశాదంతు లంతతకుడ్
గాలాకారత నుజ్జగించు ననుచుం గాంక్షింతు రత్యున్నతులన్.
ఇందు ఉ ఊ ఓ లు వాడబడినవి.

అప్పకవి లక్షణము: (అప్పకవీయము. 4-552)

పావన పాఘా బాభా
మావా యను నాఱులిపులు మఱి పద్యములో
భావింప దొరలకుండిన
భూవలయ మున్నిరోష్ఠ్యము పిసాలంచున్.

లక్ష్యము:

నరహర్యక్ష దయాకర
కరిరక్షణ చక్రహస్త కాంచనచేలా
గరుడ తురంగ జనార్దన
ఖరదైత్య నికృంతన హరికంజదళాక్షా. (అప్పకవీయము. 4-553)

ఇందు 'ఉ' వాడబడినది.

వీరి ననుసరించి నిరోష్ఠ్య పద్యములను వ్రాసిన కవులు.

1. కనుపర్తి అబ్బయ్య. కవిరాజమనోరంజనము. 4-168. అది స్రగ్ధర. ఇట్లున్నది.

కరఖేలచ్చక్ర ధారా ఖర కరకర వినిర్లుంఠి తోద్దండ చండా
సురరాట్చక్రాంధ కారచ్ఛ్రుతి తురగ జటా జూటా రంగత్తరంగో
త్కర గంగా హైరా కరణచణ చరణత్కాంచ నాంచిత్తులాకో
ట్యరు కాంతిచ్ఛిన్న గోత్రారుద్ధ కజజశిరో యుత్తు జత్కీటా

ఇందు ఉ, ఓ లు వాడబడినవి.

2. వెలిదండ్ల వేంకటపతి - రాధా మాధవ సంవాదము. పుట. 121.
3. గుడారు వెంకటదాసు - ప్రకృష్ట బలరామచరిత్ర. 1-18,31, 2-223.
4. అయ్యలరాజు నారయణామాత్యుడు. హంసవింశతి. 5-209.కం.
5. ముడుంబ లక్ష్మణాచార్యులు- నందనందన విలాసము. 4-101. దండ.
6. పురాణం పిచ్చయ్య- విజయాశ్వచరిత్ర. 3-195.కం.
7. కొడవలూరు రామచంద్రకవి- మహాసేనోదయము. 5.286 ఉత్ప.
8. నాదెళ్ళవారి - సోమేశ్వరీయము 1 కం. అ. ఉ. రామా.1 కం.
9. కోట వీరాంజనేయశర్మ- చిత్రాశ్వీయము. 2-125. గీతము.
10. అప్పమిల్లి నారాయణరావు - నారాయణీయము. పుట. 99. చం.
11. గోవర్ధనం వెంకట నరసింహాచార్యులు - సారంగశైల మహాత్మ్యం. దండ.1.
12 బోడి వాసుదేవరావు- చిత్రమంజరి. చిత్ర-4.

1. దశరథరాజనందన చరిత్ర. పీఠిక. పుట. 42. సా. అకా. ప్రచురణ. 1979

అచ్చతెలుగు :

1. కూచిమంచివారి. అచ్చ. తె. రామా. అయోధ్య. 5-93. సీసం.

2. అయ్యనకోటి పార్థసారధిశెట్టి. సత్యవిజయము. 4-20, సీసం.

ముక్కంటి వేలుపుసేవ. సందర్భము, మరియు, 5-312 సీసం.

నిరోష్ఠ్య కావ్యములు :

సంస్కృతమున నిరోష్ఠ్య కావ్యములు కలవని తెలిసికొంటిమి. తెలుగున కూడి అట్టి కావ్యములు, శతకములు పెక్కులు కలవు. నిరోష్ఠ్య పద్యమొక్కటి వ్రాయుటమే కష్టమైనపని. ఏదో ఒకటి రెండు పద్యములు మచ్చుకు వ్రాయవచ్చు. కాని ఆ నియమముతో కావ్యము మొత్తము రచియించుట అసాధారణమైన విషయమే. తమకు ముందు వ్రాయబడిన తెలుగు నిరోష్ఠ్యపద్యములను చూచి కవు లచ్చము నిరోష్ఠ్యకావ్యములు వ్రాయ బూనిరి. అనగా ఆకావ్యమున ప్రతిపద్యము నిరోష్ఠ్యమే.

ప్రప్రథమ తెలుగు నిరోష్ఠ్య కావ్యము మరింగంటి సింగరాచార్య విరచితమైన దశరథరాజనందనచరిత్ర. సింగరాచార్యులు క్రీ శ. 1574 వరకు ఖ్యాతుడై దీనిని రచియించి యుండవచ్చునని పీఠికలో శ్రీరంగాచార్య తెల్పిరి.[1] కృత్యాది, కృత్యంతములయందు నిరోష్ఠ్య నియమములేదు. ఒక్క కథా భాగమునందే కలదు. ఇందలి నిరోష్ఠ్య రచనా విధానము విన్నకోట పెద్దన లక్షణము ప్రకారము నడిచినదని పీఠికలో రంగాచార్యగారు తెలుపుట సమంజసము కాదని నాకు తోచుచున్నది. ఎట్లన, 'ఉ'కారము వాడబడినదని వారు (1-56)ను చూపిరి. ప్రథమాశ్వాసము 55 నుండి 75 వ పద్యము వరకు లేఖకులవ్రాతలో తప్పులు కలవని మనకు తెలియును. కావున అవి లేఖకుల పొరపాటే కాని అసలు రచయిత దొసగుగాదు. ఇక మిగిలిన గ్రంధమం దాశ్వాసమునకు రెండు మూడు చోట్ల ఉ ఓ, లున్నవి కాని అవి కూడ వ్రాతప్రతుల భేదములు, పూరింపుల నుండి వచ్చినవే. అందువలన అవి గ్రంథకర్తవి యెంతమాత్రము కావని మనము దృఢముగా విశ్వసించవచ్చు. అంతేకాదు, ఔ, ఓత్వము, కొమ్ము, మాముడి వలదని కు. అం. సి.సీ.

---

[1]. దశరథరాజనందన చరిత్ర - పీ క. పుట 21. సా. అకా. ప్రచురణ. 1979. సింగరాచార్యులు మల్కిభరాం ఆస్థానములో ఉండి యుండవచ్చును. ఈతని రచనలు నరాంకితములుకావు.

కళ్యాణము 1-34లో స్పష్టముగా అతడే చెప్పియున్నాడు. దీనివలన ఇతని రచనా విధానము చిత్రకవి పెద్దన చెప్పిన రీతిలో ఉన్నదని చెప్పవచ్చు. మచ్చుకొక పద్యము, [3-103]

మ॥ కరవాచ్ఛిన్న దిగంత శాఖియయి విఘ్రాతాహతాగారయై
హరినాగేంద్ర కరాతిచండ శతధారాశ్లేషశ్లేషాహిశే
ఖర గండస్థలియై ఘనాఘన తటిద్గ్రాతిరేక స్థితిన్
ధరమెల్లం జడినిండ సాగె జన చింతాకారణ స్థానియై.

2. నిరోష్ఠ్య సీతాకళ్యాణం. కర్త. పిడుపర్తి బసవప్ప అరివీర. గండాంకిత బసువనృపాల తనూజుడైన వంటచింత భూపతికి (1650 ప్రాంతము) అంకితము కాబడినది. నాల్గాశ్వాసములు సంపూర్ణముగా గలదు. కాని అముద్రితము [1] అందుండి ఒక పద్యము.

అన్నగరి రాజ సదనాం
ధన్న గజద్రత్న కాంతి శశిదీ ధితిన
చ్ఛిన్నగ నెనయ రాకల
న్నెనగ గాళింది గంగ నెనసినరీతిన్.

3 నిరోష్ఠ్య జానకీ కల్యాణము. కర్త, పోడూరి రామకవి.
ఇతడు పోడూరి పెదరామకవి సోదరుడు[2].

4. హరిశ్చంద్ర చరిత్ర : దిట్టకవి విశ్వనాథకవి. దీనికర్త[3].

5 నిరోష్ఠ్య ప్రబంధమును శేషము తిరుమలాచార్యుడు రచించినట్లు అంబరీషోపాఖ్యానము ద్వారా తెలియుచున్నది

---

1. తంజావూరి పుస్తకశాల. గ్రంథం. 169. గ్రంథసూచిక పుటలు. 38, 39.

2. ఆంధ్రకవుల చరిత్ర. కం. వీ. 3. భా. 275 పుట. ముద్రణ. 1949.

3. కవి తరంగిణి. 12.సం. 153 పుట. ముద్రణ 1958.

సీ॥ రూఢిదలిర్ప నిరోష్ఠ్యప్రబంధంబు
నిచ్చి నారలు వేంకటేశ్వరునికి.

6. నిరోష్ఠ్యనలచరిత్ర : కొత్తలంక మృత్యుంజయకవి. ఇవి 5 ఆశ్వాసముల ప్రబంధము. గోదావరి మండల కొమరగిరి కవి నివాసము[1]. మచ్చుకొక పద్య మందలిది. 3వ ఆశ్వాసము.

ఉ:- చంచల రీతిగా నధిక చంచల తంగని నట్టి యింది రా
చంచల నేత్ర నెల్లెడ నచంచలగా నెడదం దలంచి యా
చించిన యర్థిరాజ నిరచించిన నిర్గతకీర్తి కెంత చిం
తించిన నక్కటా ! తగిన నిష్కృతి గల్గన నేరదే గదా.

7. దాశరధి చరిత్ర. నంబెరుమాళ్ళ పురుషకారి కేశవయ్య. (1734-1819) నిరోష్ఠ్య ఉత్తర రామాయణమిది. ఆత్మకూరు సంస్థాన ప్రభువగు రాజా సోమ భూపాలుని మన్ననలను పొందియున్నాడు. మచ్చుకొక పద్యము. [ద్వి. ఆ. 299].

మ॥ నలినీ సంచయ హాని చక్ర నికరాంత గ్లాని చండీట్స్వరః
కలిత స్థాని యశేష సన్నిచయ రక్ష జ్ఞాని లేఖాళి. కిం
గళలీ జాలిన దాని ఖ్యాతి గల రాకాతారక జాని రా
జలెజాలా శచిజేవి దిక్స్థలి నతిశ్రీ నానియా నందియై.

ఇతఁడాశ్వాసాది పద్యముల గూడ నిరోష్ఠ్య నియమము పాటించి వ్రాసెను.

8. ఆధునిక కవి. పోతరాజు రామకవి - నిరోష్ఠ్య నరసింహశతకము. ఏలూర్పురు గ్రామము.[2]

9. నిరోష్ఠ్య దశరధ తనయ శతకము. కర్త, వేదుల నారాయణకవి. 1917 ముద్రణ.

10. నిర్దుష్ట నిరోష్ఠ్య దాశరథీ శతకము. కర్త. పేరయ సూరి.

---

1. ఆంధ్ర కవుల చరిత్రం పుట. 2 5. 1949. ముద్రణ.

2. ప్రకాశం జిల్లా. సాహిత్యప్రకాశిక.2. పుట 184. రచయిత. గో. ప్రకాశరావు. మార్చి 1977 ప్రచురణ.

11. సుసర్ల అనంతరావుగారు. నిరోష్ఠ్యముగా నాటకరచన చేసిరి.[3]

12. నిరోష్ఠ్య శతకము, కర్త. గోవర్ధనం వేంకట నరసింహాచార్యులు.[4]

శుద్ధాంధ్ర నిరోష్ఠ్యకావ్యములు :

లోగడ కొన్ని శుద్ధాంధ్ర నిరోష్ఠ్య పద్యములను చూచితిమి. ఆ పద్యములు శుద్ధాంధ్రకావ్యములో ఒకటో రెండో వ్రాయబడినవి. కాని శుద్ధాంధ్ర కావ్యము మొత్తము నిరోష్ఠ్య నియమముతో రచింపబడిన దానిని శుద్ధాంధ్ర కావ్యమందురు.

ఇందు మొదటిది శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ్యం.మరింగంటి సింగరాచార్య కవి. 3 ఆశ్వాసముల ప్రబంధము. నిరోష్ఠ్య రచనకు, శుద్ధాంధ్ర నిరోష్ఠ్యకావ్య రచనకు సిగరాచార్యులే ఆద్యుడు. ఇష్టదేవతాప్రార్థనమున, కృత్యాదికృత్యంతముల నిరోష్ఠ్య నియమము పాటింపలేదు. కథాభాగమున పాటించిన నియమమును తానే ఇట్లు చెప్పుకొన్నాడు. [శు.ఆం ని.సీ.క. 1-34]

అరయ కగచజటడ తదనా యలసహ
రద్వయమె కాని యొండక్షరములు చొరవు.
మఱియు నౌ త్వోత్వములు కొమ్ము మాముడియు
వలవదా మీద సురభాష నిలుపరాదు.

దీనినిబట్టి అతని నిరోష్ఠ్య నియమమున.అచ్చులు "ఔ ఓ ఒ ఉ ఊ" తర్వాత 'మ' ఒత్తు తీసుకొనబడినదని తెలిసినది.

ఉందుండి 2-63 పద్యము.

మ॥ జిగిచన్గల్లని యాడం దీఱయిన లే చెక్కుళ్ళ చక్కన్నిగ
న్నిగ లీనంగఁగ డారి కంటి సిరిడాల్ నిండంగ గ్గై చిన్నియల్
తెగలై నల్దెసలాని చక్కఁగఁజికిల్ సేయన్ నెఱాసిగ్గెదన్
దగలన్ రానెలఁజేరి కాళ్ళకడ చెంతన్ సాగిలెన్ నాతి దాన్.

నిర్వచన నియమముతో గూడి శుద్ధాంధ్ర నిరోష్ఠ్యకావ్యములు బయలుదేరినవి. శుదాంధ్ర నిరోష్ఠ్య. నిర్వచన నైషధము.కందుకూరి వీరేశలింగము పంతులు. 1848-1919. దీని రచనాకాలము. 1870. వీరు ఓష్ఠ్యాచ్చులను గ్రహించిరి.

---

3. దశరథరాజనందన చరిత్ర. పుట. ౯౩. ఆం. ప్ర. సా. అకా. ప్రచురణ. 1979.

4. చాటు పద్య రత్నావళి. పుట. 88.

ఉదా :- 1-22

అని తనలో ననుకొని కడు
నెనరు గలుగు నట్లు గాగ నెట్టన నలునిం
గను గొనుచు నీరెలుంగున
ననియెం దన తెల్ల ఠెక్కలార్చుచుఁగణకన్.

3) శు.అం.ని వి. కుశచరిత్ర - మచ్చ వెంకటకవి. 185 -1903.
4) శు అం.ని.ని. హరిశ్చంద్ర చరిత్ర. అచ్చిరాజు హనుమంతరాయశర్మ పాకయాజి. 1915 ముద్రణ.
5) శు.అం.ని.ని. కేకయనందన చరిత్ర.వరంగల్లు వాస్తవ్యులైన తంయాల లక్ష్మీ నృసింహాచార్యులు. 1884-1959. అముద్రితము.
6) అచ్చాంధ్ర. ని.ని. సారంగధర చరిత్ర. దేవులపల్లి నరసింహశాస్త్రి.1898 అముద్రితము. ఇది చిత్ర ప్రబంధము. ఉఊలను సంధిగత మగునట్లు ప్రయోగించెను.
7) అ-అం.ని.ని. హరిశ్చంద్ర చరిత్ర. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి 1866-1960. 1938లో ముద్రితము
8) శు.అం.ని.ని. హరిశ్చంద్రోపాఖ్యానము. పోకూరి కాశీపతి. 1900-1975. దీని రచనాకాలము తెలుపు పద్యము.

ఆ॥వె॥ తెల్గు లే చిౙ కస్తి గల్గ గా కయిషేయ
నేను క్రీస్తు ననిన యేండ్లనెన్న
విందుతొంటి యంజక్రింది నాల్గంకెల
యేడు దొడరి దీర్చి నాడ దీని.[ప్ర.63]

ఆ సంవత్సర మాక్రిగీతలు గల అంకెలు. ౧౯౨౧ అనగా 1921
'గ'ఒ౧ తెలుగు అంకెలలో ఒకటి అయినది.

* ౙ రేఫ ఒత్తు 'ర్చి'ని పూర్వమిట్లు 'చిౙ'గా వ్రాయుదురు.ఇది తెలుగుఅంకెలలో తొమ్మిది 'త' ౧ ఒత్తు తెలుగు అంకెలలో రెండవది. తర్వాత 'గ' ఒత్తు ౧ ఒకటి. ఇట్లు అక్షర ఒత్తులు అంకెలుగా చెప్పుట ఇందలి చమత్కారము,

## 11. అనునాసికం

కేవల మను నాసికాక్షరములతో కూర్చబడిన పద్యము ఙ,ఞ,ణ,న,మ' అను నాసికములు. 'న'తో 'నమ'తో వ్రాయబడిన పద్యములందు కుదాహరణము

## 12. నిరనునాసికం

అనునాసిక వర్ణరహితమైనది. సంస్కృతములో ఈచిత్రము సందర్భానుసారము ప్రయోగింపబడినది. ఆదినారాయణుని నిరనునాసిక చంపువు....[1] అనునాసికములన్ని వదిలివేయబడినవి. సందర్భము. శూర్పణఖ ముక్కు పోగొట్టుకొని పలుకుట అనునాసికములు పలకలేదుకదా. కవి ఆమెచేత నిరనునాసికరీతి మాట్లాడించెను.

## 13. అంతస్థం

'యరలవ' గలిగినది. ఉదా :— కనబడలేదు.

## 14. నిరంతస్థం

అంతస్థాక్షర రహితమైనది ఉదా :— లేదు.

## 15. ఊష్మం

శషసహ గలిగిన పద్యము. ఉదా :— లేదు.

## 16. నిరూష్మము

ఊష్మాక్షర రహితమైనది.

ఉదా :— రాయల సీమము వేంకట
రాయలు తత్పిత-మనుమడు రాయలు తానో
రాయల పేరున నభినవ
రాయల బిరుదాంకుడు కవి రాజులలోనన్

[అద్దుమిల్లి నారాయణరావు. నారాయణీయం పుట.99]

---

[1]. History of classical Sanskrit Literatue. by. M. Krishnamachariar. page 374. Printed. Madras, 1937.

## 17. స్థాన చిత్ర మిశ్రమము :

రెండు లేదా అంతకంటె పెక్కు స్థాననియమములు పాటించి పద్యము వ్రాయ బడిన స్థాన చిత్ర మిశ్రమమనబడును. ఆ స్థానముల పేరుతో దానిని పిల్వవచ్చు. ఉదా :- అంతస్థోష్మ : అనగా అంతస్థ, ఊష్మాక్షరములతో నిర్మింపబడిన పద్యము. సంస్కృతమున కా.ద, కా.శా, సా.ర, మున్నగు గ్రంధముల కొన్ని ఉదాహరింప బడినవి.

తెలుగున ఉదా :- 1. ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకరము. ఇందు ఓష్ఠ్య నిరోష్ఠ్య వర్ణములుండును.

A. భూనాథోత్తమ! జంభ భంజన మహాభోగాభిరామక్రియా
దానోజ్జృంభిత వారిపూర భరితోద్యద్వార్థి వీచీవ్రజా
మానామేయ సుధాబ్ధి నిర్మలగుణా! మాద్యన్మహాయోధ ప
శ్రీ నూత్న ప్రథమాన భాగ్యవర! వైరివ్రాత భేదవ్రతా

[నరస భూపాలీయము.4-90]

B. మరింగంటి నరసింహాచార్య. తాలాంకనందినీ పరిణయము. 3-175.

C. కణాద పెద్దన. భద్రాపరిణయం 3-297. కం.

D. గుడారు వెంకటదాసు. ప్రకృష్ట బలరామచరిత్ర. 5-307 ఓష్ఠ్య నిరోష్ఠ్య వర్ణ క్రమకందము. అక్షరము విడిచి అక్షరము ఓష్ఠ్యమైయుండును అది.

శివకమలా భూశర్వా
ణ్యవిరమణ మనఃప్రకామవాబ్జకమల బాం
ధవ దివ్యాంఘ్రి ద్వయమై
ష్ణవ నమ దవన ప్రథాప్రశమిత బుధభయా.

2. నిరూష్మ వినిరోష్ఠ్యము ఉదా :- A. నాదెళ్ళవారి సోమేశ్వరీయం.

కరిదైత్యాంతక కాంచన
ధరణీధర ధారి రాజధరనగ ధీరా
కరుణాకరా గరళ కం
ధర చంద్రార్కాగ్ని నేత్ర తారకగాత్రా.

B. నాదెళ్ళవారి అ.ఉ.రామా. 'ధ రజానాయక' కందము.

C. అద్దుమిల్లివారి. నారాయణీయము. పుట. 100. కం.

కావ్యములు : నిరూష్మ నిరోష్ఠ్య నియమమున కావ్యము వ్రాయబడినది.
ఉదా:- శు.ఆం.నిరోష్ఠ్య నిర్వచన నిరూష్మై కా దశాక్షరి శాకుంతలము.కవి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఇందు ప ఫ బ భ మ వ శ ష స హ''లు రాకుండుట నియమము.

3. నిరూష్మ నిస్తాలవ్యం.ఊష్మ తాలవ్య వర్ణరహితమైనది.

ఉదా :- A. పరమ పవిత్రా రామా
కరమాదర భావ మొప్ప గనుగొను మప్పా
నిరుపాధికుండ భక్తుఁడ
నెఱుగుదువే మొఱలు వెట్టుటిద్దొక తప్పా?
[నాదెళ్ళవారి. అ.ఉ.రామా.]

B. వీరి అ.ఉ.రామా లోని 'పరమకృపా' కందము

4. నిరూష్మ నిరోష్ఠ్య నిస్తాళల్యం. ఉదా:- A. నాదెళ్ళవారి అ.ఉ.రామా
కలలెన్నొ కందు నిన్నం
దులగానగ గలుగు దీన దుఃఖాత్రితా
నల నీర నీర దాంగా
తొలగితానా దరినికేడ దూట నరిగితో.

5. శుద్ధపంచవర్గీయం. 'కచటతప' వర్గాక్షరములతో మాత్రమే నిర్మింపబడిన పద్యము. ఉదా :- కాణాద పెద్దన. భద్రాపరిణయం 3.299.
పద్మా భవద చ్ఛందా
పద్మానందానుగత కృపాబ్బృందపద
త్పద్మాప్త బింబకుందా
పద్మజముఖ కంద భూత బంధ ముకుందా.

6. వర్గపంచకరహితము లేదా అంతస్త్రోష్మ. ఇందు'కచటతప'వర్గాక్షరములుండవు
ఉదా :- A భట్టుమూర్తి కావ్యాలంకారము 5.245.
హర హీర సార సారి హర శైలవాస వో
ర్వీరు హాహి హరశేషవేష హాసలాలస
శ్రీరసోరుయాశసాంశు శీలవైరి వీర సం
హారసార శౌర్య సూర్యహార్యవార్య సాహసా.

B. మహాసేనోదయము. 7_386, కం.

C. మిప్పినకంటివారి. శివగత 11_1 కం.

D. కాణాద పెద్దన. భద్రాపరిణయం. 3.293. కం.

E. అబ్బరాజువారి_శ్రీనందిరాజు లక్ష్మీనారాయణదీక్షిత చరిత్రము. 2_79.

F. బోడి వాసుదేవరావుగారు. చిత్రమంజరి. చిత్ర 7.

G. పోకూరి కాశీపతి. శు. అం.ని. హరిశ్చంద్ర చరిత్ర 'శర్వశైలవాస' పద్యము.

7. అస్పర్శము_నాలుకతాకు అక్షరములేనిది.

ఉదా:_1) సీరిసహాయ వల్లవ విశేష విహార విలాస శీల సం
సారహరా సురారి లయశౌరి హరీ నరసింహ సాహ సా
వారి రుహారి హీర శరవారి విసారి యశో విశాల శ్రీ
సార రహా విలాస సురసాల వరాల యమాయ కృష్ణయా
[సెట్టి నరసింహము_ కృష్ణలీలా తరంగిణి]

(2) కొక్కొండ వారి_విశ్వేశ్వరీయము 6_52. 'స్వయంశోం' పద్యం.

8. పరుష సరళా నునాసికాక్షరలోప పద్యము. కచటతపలు, గ జ డ ద బ, ఙఞణనమ, లేనిదిది.

ఉదా:_ పూడిపెద్ది లింగమూర్తి, సువర్చలా పరిణయం.
రాఘవ వరాభవాసు
శ్లాఘ విధి స్థిర విహార యుషవాసహరీ
సాఘౌ ఘ ఘో రభయహా
రీ ఘోషావార్ధి శైల రేఖాధారా

9. అచల జిహ్వ శుద్ధోష్ఠ్యము : నాలుక కదలని, మఱియు ఓష్ఠ్యాక్షరములు కలిగిన పద్యము.

ఉదా :A. కొడవలూరి రామచంద్రకవి. మహాసేనోదయము. 2_252
భావ భవోవ మవామా
భావి భవా భవ భావ పాపా నివపీ
భూ విభు బోమా వాపా
భావామ విభోవ భవవ భభవ ప్రభువా.

B. దశావతారచరిత్ర. పుట. 275. 'భవ' ద్వ్యక్షరి. కం.

10. అచలజిహ్వం. ఇందు నాలుక కదపని అక్షరము లుండును.

ఉదా.- A. భోగాంబు వాహవాహ వి
భాగేహ భావుకాంగ భావభవ మహా
భాగ మహీ భాగ మహా
భోగావహ బాహుభోగి పుంగవభోగా

[భట్టుమూర్తి, నరసభూపాలీయం. 3-160]

B. సెట్టి నరసింహము- కృష్ణలీలాతరంగిణి. చం.

C. ముత్య సుబ్బరాయదైవజ్ఞమణి-విదుషి 2-76 ఉ

D. విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర. కరము. పూ.భా. చి.ప్ర. 5-కం

E. కామినేని మల్లారెడ్డి- ష. చ. 3-108. కం.

F. కాణాదపెద్దన-భద్రాపరిణయం. 3-300.

G. మాడభూషి వేంకటాచార్యులు. భరతాభ్యుదయము. తే॥గీ

H కొక్కొండవారి. బిల్వేశ్వరీయము. 6-51

11. చలజిహ్వం- నాలుక కదలికగల అక్షరములతో పద్యము.

ఉదా:- A. కం॥ లలనలలోఁ జాలనుతన్
జలనిధినాథుని తనూజ జలజజననుర
క్తిల లచ్చే తనునెంతే
నల లచ్చి నినెదను దాల్చునా దొరఁదలఁతున్.

[విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. ఉభా. 26.]

B. కంకంటి నారసింహకవి-విష్ణుమాయావిలాసము. ద్విపద. 5వ ఆశ్వాసమున ధర్మరాజు విష్ణుమూర్తిని స్తోత్రము చేయు సందర్భము

12. నిష్కేవలస్వర, నిర్బిందు, నిష్పంచవర్గ, నిర్గద్య దశాక్షరీయగ్రంథము కర్త. పోకూరి కాశీపతి. గ్రంథము పేరు, 'శౌరిశైశవలీల,' నిష్కేవలస్వర అనగా కేవలం 16 అచ్చులుండవు నిర్బిందు అనగా సున్నలులేవు. నిష్పం చవర్గమనగా కచటతప అను పంచవర్గాక్షరాలులేవు. నిర్గద్యవచనరహితము. దశాక్షరీ అనగా

'యరలవశషసహళఅ' అను పది అక్షరములతో మాత్రమే పద్యరచన ముండును. ఇందులో అనునాసికాక్షరములులేవు కనుక ముక్కు మూసుకొని చదవవచ్చు.[1]

## 4. గతినియమ చిత్రము

గత ప్రత్యాగతమనియు, ప్రతిలోమానులోమ మనియు ఈ చిత్రమును సంస్కృతమున పిలుతురు. తెలుగున భ్రామకమని కూడ పిలుతురు. పాదము కాని, పద్యము కాని ముందునుండి వెనుకకు, వెనుకనుండి ముందుకు చదివిన ఒకే రీతిగ ఉండును. గణభంగముకాదు.

ఈ చిత్రము సంస్కృతాది భారతీయ భాషలలోనే కాక పాశ్చాత్యభాషల లోను కలదు. ఇంగ్లీషులో ఇట్టి రచన అరుదైనను, చాటువులుగా కొన్ని వాక్యాలు మాత్రమున్నవి.[2]

ఉదా:- 1)"Madam I am Adam" ఈ మాటలు Adam మొదటిసారిగా Eveను చూచినపుడు తన్ను తాను పరిచయము చేసికొనుచు చెప్పినాడు. చమత్కారం. అది వెనుక నుండి చదివిన అదే వాక్యము రాగలదు.

2) Able was I ere I saw Elba -ఈ మాటలు Nepolian తన పతనానంతరము చెప్పుకొన్నవి.

3) Latin భాషతో పద్యభ్రమక మీ క్రిందిది. St. Martin తో Satan చెప్పినట్లున్నది.

" Signa te signa termere me tangis et angis"
" Roma tibı Subito motibus ibit amor."

4) "Dean Swift" అనెడి ఆంగ్లరచయిత Sheridanకు ఒక ఉత్తరము వ్రాసినాడుట. పైకి అది అర్ధంలేని Latin రచనగా తోచును. పరిభ్రమకపద్ధతిలో చదివితే ఇంగ్లీషు వాక్యాలుగా అర్థమగును. మచ్చుకు రెండువాక్యాలు.

---

1. త్రిపురనేని సుబ్బారావుగారి, "కవి సింహ కాశీపతి. జీవితం. సాహిత్యం." విమర్శనము. పుట. 30, 31. ప్రచురణ. కవి రాజ. సాహితీ సదనం. హైదరాబాదు. 1979 ముద్రణ.
2. తిరుపతి "సాహిత్యసమితి వ్యాసావళి"లో "పాశ్చాత్య భాష లలో చిత్ర కవిత్వం" అని జి.యన్. రెడ్డిగారి వ్యాసం.

Misana Odioso nimus rem.

ఆంగ్లము (An ass I am Oso I do in summer)

Moto ima os'illud namai nam. దీనికి ఏ పదమూ పదము భ్రమక మైన ఆంగ్లమిట్లుండును.

O Tom, am I so dull I a man man?

ఇది భాషానులోను విలోమమురీతి నున్నది.

తెలుగున గతి నియమచిత్రమైదు విధముల గోచరించుచున్నది. 1. అర్థ పాదానులోమవిలోమము. 2. పాదభ్రమకము. (పాదానులోమ విలోమము) 3. అను లోమవిలోమపాదద్వయము. 4. పద్యభ్రమకము (గతప్రత్యాగతశ్లోకము) 5. అనులోమవిలోమ పద్యద్వయము.

1. అర్థపాదానులోమ విలోమము

పాదములోని సగభాగము చదివినచో అనులోమముగాను ప్రతిలోమముగాను ఒకే విధముగ ఉండును. ఉదా:- 1) వేదులవారిల స.చి.స్త.9A.

సావిత్రీ వృత్తము: మారామా! కారుణ్యా
ధారా! ధారా పొంగా
సారా సారా కారా
వేరావే నన్ బ్రోవన్

2. పాదభ్రమకము.

పద్యమందలి పాదము ముందునుండి వెనుకకు వెనుకనుండి ముందుకు చదివిన ఒకే రీతిగ ఉండుటను పాదభ్రమకమందురు.

సంస్కృతమున శిశుపాలవధ [19-40], ల.స, ఈశ్వరశతకము, సా.ర. గ్రంథములలో పాదభ్రమక శ్లోకములు గలవు.

తెలుగులో పాదభ్రమక లక్షణమును చిత్రకవి పెద్దన ఇట్లు తెలిపియున్నాడు [ల.సా.సం.3 114]

అనులోమ విలోమంబుగ
ననువొంతగఁ బాదపాద మతి తిరుగంగా
బెనచుక చెప్పినఁ గందము
జనుఁ బాదభ్రమకమనఁగా సత్కృతులందన్.

అందుకు లక్ష్యము. [ల.సా.సం. 3-115]

మాని తనగేన తవిమా
యానగహారియన ఘఘన యరిహా కనయా
దాన వర వార వనదా
మానవష మహిమమతతమ మహిమ వవనమా.

ఏ పాదమున కాపాదమే ముందునుండి వెనుకకు వెనుకనుండి ముందుకు చదివిన ఒకేరీతిగ ఉన్నది.

అప్పకవి లక్షణలక్ష్యపద్య మిటులున్నది [అప్పకవీయం 4-558]

ధీరా నానా రాధీ
ధారా కరతా తరరత తారక రాధా
ధారా సుతత సు రాధా
ధారిత తరిధావనాం బద్రభమక మగున్.

ఈ పాదభ్రమకమును కందములోనే చెప్పవలెనని చిత్రకవి తనలక్ష్య మందు చెప్పెను. అప్పకవి అట్లు చెప్పకయే చెప్పి నట్లాయెను. అందువలన కాబోలు తెలుగు కావ్యములందు కందములలోనే ఈ చిత్ర మగపడుచున్నది. మరి అది చిన్న పద్యమగుట కూడా ఒక కారణము కావచ్చు.

గణనియమము : ఏపాదమున కేయే గణము లెట్లున్న కందములో పాద భ్రమకము సరిపడునో తెలిసికొనుట ఆవశ్యకమై యున్నది.

కంద పద్య లక్షణానుసారము. పాద భ్రమకమునకు సరిపడుటకు 1, 3 పాదముల మూడు గణములు వరుసగా ఈ క్రిందివానిలో ఏదో ఒకటియై యుండ వలెను. (1) భ,జ,స. (2) భ,నల, స (3) భ,భ, స. (4) గగ, గగ, గగ. (5) గగ, నల, గగ, (6) గగ, భ, గగ, (7) గగ, జ, గగ, (8) భ, గగ, స.

2, 4పాదముల 5 గుణము లిట్లుండవలెను.

1) భ,భ, నల, స,స. 2) భ,స, నల, భ,స. 3) భ,భ, జ, స,స. 4) భ,స,జ, భ,స, 5) భ, నల, జ, నల, స, 6) గగ, స, జ,భ, గగ. 7) గగ, స, నల, భ, గగ. 8) గగ, భ, నల, స, గగ, 9) గగ, భ,జ, స, గగ. 10) గగ, నల, జ, నల, గగ, 11) భ, నల, నల, నల, స. 12) గగ, నల, నల, నల, గగ,

మహాకవులు పలువురు తమ కావ్యములలో పాద భ్రమకమును చిత్రించిరి.

ఉదా:- 1) దామోదర రదమోదా
రామా తతరా జయ యజరా తతమారా
రామా జని నిజ మారా
భూమా తతభూమతతమ భూతత మాభూ.
[ఆధునికులు. విక్రాలవారి. శ్రీ. వేం. చి.ర. కరము. ఉభా.]

అర్థము: ర=జంకును, ద=ఖండించువాడా! మోదా=ఆనంద స్వరూపుడా! తత=విస్తృతమైన, రా=బంగారు కలవాడా!. తత=అధికమైన, మా=బుద్ధికి, రా=శాలయైనవాడా! రామా=లక్ష్మి వలన, జని=పుట్టుకకల,నిజ=నిత్యుడై న,మా రా=కాముడు కలవాడా!, భూమా=విరాట్స్వరూపుడా!, తత=పెద్దదియదు, భూ=భూదేవికి, మతతమ=మిక్కిలి ప్రియుడా!, భూ=భూమివలె, తత= గొప్పదియగు, మా=లక్ష్మికి, భూ=స్థాన మైనవాడా!, దామోదర!, జయ=జయించుము.

ఉదా :- 2) పిల్లలమర్రి పినవీరన. జైమిని భారతము, అశ్వమేధపర్వము 8-221.

3) తిమ్మన- పారిజాతాపహరణం. 5-93.
4) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 849.
5) అయ్యలరాజు నారాయణామాత్యుడు- హంస వింశతి. 4-241.
6) పుష్పగిరి తిమ్మన- సమీరకుమార విజయము. 4-80.
7) బుక్క- పట్టణం వేంకటాచార్యుడు - అచలాత్మజాపరిణయం. 1-80.
8) కనుపర్తి అచ్చయ్య - కవిరాజ మనోరంజనము. 4-166.
9) పురాణం పిచ్చయ్య- మైరావణనాటకము 'మారానుతతను' పద్యం[1].
10) కాణాద పెద్దన- భద్రాపరిణయం. 3-293.
11) మాడభూషి వేంకటాచార్యులు, భారతాభ్యుదయము కం....[2]

---

1. యక్షగాన వాఙ్మయ చరిత్ర. పుట. ౨౭౭. యస్వ. జోగా రావుగారి. పరిశోధన గ్రంథం.
2. ప్ర. రా. వేం. వి. వి. పీఠిక— పుట. ౨౯. పూండ్ల రామ కృష్ణయ్య.

12) పోకూరి కాశీపతి_ 'సార సురధీర సురసా' పద్యము.

13) నంది ఘంటల జంట_వరాహపురాణము. 12_77.

14) రాప్తాటి ఓబిరెడ్డి _ కవిజన వినోదిని. వ్రాతప్రతి పుట. 31.

## 8) అనులోమ విలోమ పాదద్వయము

మొదటిపాదమును ప్రతిలోమముగ చదివిన రెండవపాదము, మూడవ పాదమును ప్రతిలోమముగ చదివిన నాల్గవ పాదము ఏర్పడుటను అనులోమ విలోమ పాదద్వయమందురు.

ఇది సంస్కృతమున ప్రచురము. భారవి కిరాతార్జునీయము 15_18,20, కా. ద, కా. శా, దేవీశతకము, ల.స., ఈశ్వర శతక మిత్యాది గ్రంథముల ఈ చిత్రము కలదు.

తెలుగున ఉదాహరణములున్నవి కాని విద్యున్మాలా వృత్తము,లేదా శ్లోకమున ఈ చిత్రము రచింపబడినది.

ఉదా :_ 1) విద్యున్మాలా : సాసా కారా మానా మామా
మామా నామా రాకా సాసా
రాధా రాధా నానూ నాగా
గానా నూనా ధారా ధారా
[వేదులవారి. ల. స. చి. స్త. 10]

అర్థము: సా=లక్ష్మి!, స+అకారా= ఆకృతితో కూడిన దానా, మా=సంపదల యొక్క, నామ=పేరులు, అ=స్థానముగా గలదానా!, మా=తల్లీ!, మా= యొక్క, మాన=చిత్తౌన్నత్యమును, అమారా (న+మారా) =నాశము చేయనిదానా, రా=రమ్యమ్మ క+అ=కా= బ్రహ్మకు స్థాన మైనదానా!, (స+అసా) = విష్ణునియందుండు దానా, సః=Name of Vishnu, రాధా = రాధాదేవి యొక్క, అరాధా= అరాధకుడైన విష్ణువునకు, అనా=ప్రాణమైన దానవును, మా=సంపదచే అనూన = గొప్పవైన, అగా = వృక్షమైన (కల్పవృక్షము) దానవునైనదానా!, గాన= వేణుగానమునకు, అనూన= గొప్ప, అధార= ఆధారుడైనట్టి, కృష్ణరూప విష్ణువు, ఆధారా = నివాసము గలదానా!.

2) శివకర్ణామృతము. 'భావితాది' శ్లోకము.

3) విక్రాల వారి. శ్రీ. వేం. చి. ర. కరము. ఉభా. పుట. 24. శ్లోకము

4) తిరుమామిడి రామస్వామి. ఆం. కిరాతార్జునీయము. 2 విద్యున్మాలలు.

## 4. పద్య భ్రమకము

ఇందు పద్యము మొదటి నుండి చివరకు, చివరనుండి మొదటికి చదివినచో ఒకేరీతిగ ఉండును. పాదపాదానికి భ్రమమిందు కనబడదు. ఇదే పాద, పద్యభ్రమకము లకు గల భేదము. కొందఱు దీనిని అనులోమ విలోమ పద్యమనిరి. విలోమముగ చదివిన అదే పద్యమిందువచ్చును.

శిశుపాలవధ 19_88, కా. ద. 3_75, 76,77, ల. స, ఈశ్వర శతకము, 31, 2,62, సర. కం. వా. మున్నగు సంస్కృత గ్రంథములం దీ చిత్రము కాన నగును.

తెలుగున పద్యభ్రమకమునకు చిత్రకవి పెద్దన లక్షణ మిట్లున్నది.

[ల. సా. సం. 3_111, 112]

గీ॥ మొదలి ప్రాసంబు పద్యంబు తనను తిరుగు
నాది మాత్రాగ్ర మది తృతీయాంఘ్రికగును
బరగ నాల్గోది రెండవ ప్రాస మరుత
బ్రకటి తంబగుఁ బద్య భ్రమకమునందు.

గీ॥ అసమ పదముల మూడవదయిన గణము
నలమె యగుగాని కడమ గణములు చొరవు
షష్ఠముల నట్ల నలములే జరుగునయ్య
తెలియ పద్యభ్రమ కందములను గృతులు.

పద్యభ్రమకమును తెలుగులో కందములోనే వ్రాయవలెననియు, దాని వ్రాయు విధానమును చిత్రకవి పెద్దన పైపద్యముల వివరించినాడు. అప్పకవి లక్ష్యముగూడ కందములోనే కలదు. కవులందఱు కంద మందే ఈచిత్రమును చూపించిరి.

పెద్దన లక్షణానుసారము వ్రాయుటకు నియమములు:

కందము మొదటి రెండుపాదములు వ్రాసి దానిని వెనుకనుండి ముందుకు వరుసగా వ్రాసిన మిగిలిన రెండు పాదము లేర్పడును. అందువలన గణనియమ మెట్లుండవలెను? కందపద్య లక్షణము చెడకూడదుగదా. 1వ పాదమున 3వ గణము 'నల' ఉండవలెను. అనులోమమున ఇది బేసి గణము కావున 'జ'గణము పనికిరాదు. విలోమమున ఇది 6వ గణము కావున ఇచ్చట 'జ' గాని, 'నల' గాని ఉండవలెను. అందువలన రెండు విధముల పనికివచ్చుటకు ఇచ్చట 'నల' వాడవలెను.

అనులోమ కంద ప్రాసాక్షరమే విలోమములో కూడా ప్రాసాక్షరము. అందు వలన అనులోమ కందమున ఈ ప్రాసాక్షరమును విలోమమునకు పనికివచ్చురీతిలో రెండవ పాదమున 2,5 గణములలో వెనుకనుండి ముందుకు రెండవ అక్షరముగా నిబంధింపవలెను.

మొదటి రెండు పాదములకు గణములు తెల్పికొనిన చాలునుగదా. కావున 3,6 గణములు 'నల' లై ఉండవలె. 1వ గణముగా 'గగ' గాని 'భవ' ఉండవలెను 2,7 గణముల 'జ' గణము పనికిరాదు. మిగిలినవి పనికివచ్చును. 4వ గుణమున 'గగ' గాని, 'భ' గాని ఉండవలెను. 5 'వ' గణమున 'స' గాని 'గగ' గాని ఉండవలెను. 8 'వ' గణమున 'స' గాని, 'గగ' గాని ఉండవలెను.

మొదటి పాదమున రెండవ గణము చివరి అక్షరమునకును, రెండవపాదమున రెండవ గణము చివరి అక్షరమునకును యతి పాటించిన విలోమమున సరిపోవును.

ఉదా :- 1) ఆం. సా. సం. 3-113.

మానవ భటనయ జయదయ
యానకతనయా మదదమ హారవ వనదా
దానవ వరహా మదదమ
యానత కనయా యదయజ యనట భవనమా.

అర్థము : మొదటి రెండు పాదములే త్రిప్పి చదివిన తర్వాత రెండు పాదము లేర్పడి పద్యము పూర్తి యగుచున్నది. కావున చివరి రెండు పాదము లకు తగిన అర్థముండి యుండవలెను. ఆ విధముగ ఆ క్రమకము అర్థస్ఫూర్తి గలిగి యుండవలెను. కవి తన ప్రతిభవలన మాటలు వరుసగా అట్లు కూర్చుకొన వలెను. మానవ = మనువంశజుండైన శ్రీరామునియొక్క, భట=భటులతో, నయ= నీతియు, జయ = జయమును, దయ = దయయుగలవాడా!, యాన = నడకయందు, కతనయా=నారదుడైనవాడా!,మదద=గర్వమును ఖండించినవాడా! మహారవ=ధ్వని విశేషముచేత, వనదా = మేఘుండవైన వాడా!, దానవ వరహామదదమ = జితేంద్రి యుడా!, అనతక = శరణాగతులకు, నయ=నయముగా, అయ = భాగ్యమును, ద= ఇచ్చువాడా?, అ = రణరంగమందు, జయ = జయమనెడు, నట=నటునకు, భవనమా= ఉనికిపట్టయినవాడా!

2. అప్పకవీయము. 4-559.

3. నంది ఘంటలజంట - వరాహపురాణం. 9-155.

4. నంది తిమ్మన - పారిజాతాపహరణం. 5-92.
5. అయ్యలరాజు నారాయణామాత్యుడు - హంసవింశతి.
'రామానుజ' పద్యము.
6. చింతలపల్లి ఛాయాపతి - రాఘవాభ్యుదయము. 5-217.
7. ధరణిదేవుల రామమంత్రి - దశావతారచరిత్ర. పుట 277.
8. గోపీనాథ వేంకటకవి - గోపీనాథ రామాయణం-సుందరకాండ. 1537
9. విక్రాలవారి- శ్రీ వేం చి. ర. కరము. పూ. భా. చి. ప్ర. 30.
10. వేదులవారి ల. స. చి స్త. 11 - (సావిత్రీవృత్తమాన)
11. కేశవయ్య - దాశరథీచరిత్ర - 1-150, విద్యున్మాలా, 1-457 కం.
12. అల్లమరాజు రంగశాయి - శ్రీ ఆం. చం రామా. అరణ్య - 80.
13. కుందుర్తి వేంకటాచలకవి - మిత్రవిందా పరిణయం
3 ఆశ్వాసాంతము. కం.
14. బుర్రా కమలాదేవి - ఛందోహంసి. పుట - ౬3.
15. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి - భద్రాపరిణయం. 4-105. స్రగ్విణీ.
16. బోడి వాసుదేవరావు - చిత్రమంజరి చిత్ర 8 సరోజవృత్తము.
17. పొత్తపి వేంకటరమణకవి - లక్షణశిరోమణి. 4-708 కం.
18. పోకూరి కాశీపతి - 'సారసజనుతజ' పద్యము.
19. రాప్తాటి ఓబిరెడ్డి - కవిజన వినోదిని వ్రాతపతి - పుట - 31.

## 5. అనులోమ విలోమ పద్యద్వయము

ఒక పద్యమును విలోమముగ చదివిన వేఱొక పద్యము వచ్చుటను అనులోమ విలోమ పద్యద్వయ మందురు. పద్యభ్రమకమున పద్యము ముందువెనుకల నెటునుండి చదివినను ఒకటే పద్యము, ఒకేరీతిగ ఉండును. కాని ఈ చిత్రమున అనులోమముగ ఒక పద్యము, విలోమముగ తద్భిన్న పద్యము ఏర్పడును.

కిరాతార్జునీయము 15-22,23, రుద్రటాలంకారము, దేవీశతకము, పా.స, ల.స, ఈశ్వరశతకము, సర, కంఠా, మున్నగు సంస్కృత గ్రంథములందీ చిత్ర మున్నది.

తెలుగున అప్పకవి ఈ అనులోమ విలోమ పద్యద్వయమునిచ్చి యున్నాడు. కాని లక్షణము చెప్పలేదు. చిత్రకవి పెద్దన చెప్పియుండలేదు. లక్ష్యాలనుబట్టి తెలియవలెను.

నియమములు : విలోమ పద్యమునకు రెండు పాదములకు రెండు యతులు రావలెనుగదా. అందువలన మొకటి పాదము రెండవ గణము చివరి అక్షరమునకు, రెండవపాద రెండవ గణము చివరి అక్షరమునకు ఒక యతిని, వేరొకదానిని, 3, 4 పాదము లందల్లే కూర్చవలసి యున్నది.

ప్రాస విషయము : పద్యభ్రమకమున ఒకే ప్రాసాక్షరము కలదు. ఇక్కడి వేరే ప్రాసాక్షరము విలోమములో వచ్చునట్లు వ్రాయవచ్చును. రెండు వేర్వేరు పద్యములు కనుక ఇది సరిపోవును. 2, 4 పాదములలోనూ, 2, 5 గణముల వెనుకనుండి ముందుకు రెండవ అక్షరముగా ఒక ప్రాసాక్షరము పాటించిన అది విలోమపద్య ప్రాసాక్షరమగును.

ఇక గణ నియమ విషయమున ఇది పద్య భ్రమకముతో సమానమే,

ఉదా:— 1. ఎక్కాలవారి శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. చి. ప్ర. 3 I

సారాకారా సమరస
సారస గసరాస యనఘ జయ యివ్యసనా
మారాకారా కలియమ
భారవ జసరా సమహిమ భాధవ భసరా.

అర్థము : సారాకారా = శ్రేష్ఠమైన ఆకృతి గలవాడా!, సమరస = లక్ష్మితో గూడిన ప్రేమరసము గలవాడా!, సారసగ = శంఖమును పొందినవాడా!, సరాస = రాసక్రీడతో గూడినవాడా!, అనఘ, అవ్యసనా!, మారా కారా కలియమ = యుద్ధములలో యమునివంటివాడా!, భారవజసరా = కాంతితోను, ధ్వనితోను, జయముతోను, గూడిన బాణములు గలవాడా!, సమహిమ భా ధ.వ = భూదేవియొక్క వల్లభా!, భాసరా = నక్షత్రములయందు గతి గలవాడా!, అనగా వాటియందు నుండువాడా!.

ఈ క్రిందిది, పై పద్య విలోమము :

రాసభవధభా మహిమ స
రాస జసరభామ యలిక తాకారామా
నాస వ్యయ యజఘన యస
రాసగ సరసా సరమస రాకారాసా.

అర్థము : రాసభ=గర్ధభాసురునియొక్క, వధ=సంహారమునందలి, భా=దీప్తికవి, మహిమ=గొప్పదనమునకును, స=స్యందన పథమువంటివాడా!, రాస జపరభామ=రాసక్రీడయందు, త్వరతోగూడిన ఉత్తమస్త్రీలు గలవాడా!, అలిక, రాకా రామా=ముఖమునందు నింతు పున్నమభార్యగా గలవాడా! (చంద్రుడవేయైనవాడా!) నా సవ్యయ=అధిక శుభావహ విధులతో గూడనివాడు కానివాడా!.

2. అప్పకవీయము 4-550, 551.

3. గ. వేం. కవి ప్ర. రా. వేం. వి. వి. 365.

4. వేదులవారి. ఆ.స.చి స్త. 12, 13 విద్యున్మాలావృత్తము.

5. ఇందే - 14, 15 మాణవకవృత్తము.

## 5. ఇతర శబ్ద చిత్రములు

ఇవి 1. అక్షరచిత్రము 2. పాదనియమచిత్రమని రెండు విధములు.

1. అక్షరచిత్రము : అక్షరములొక నియమముతో ప్రయోగించుట ఈ చిత్రమున కననగును. ఇందు (1) అక్షరాంకము (2) పదాదివ్యంజనావళి (3) ఆది వర్ణవృత్తి (4) గుణితము (5) అక్షరచిత్రమిశ్రమమను రకములు గలవు.

(1) అక్షరాంక చిత్రము : లేదా వర్ణమాల చిత్రము.

వర్ణములన్నియు క్రమముగ 'అ' నుండి 'క్ష' వఱకు ప్రయోగింపబడుట.

సంస్కృతమున ఉదా:-సర. కంఠా. లో [2-263] క్రమస్థ సర్వవ్యంజనమ్.

"కః ఖగౌ ఘా జ చి చ్ఛౌ జాఝాజ్ఞో టౌఠీడడణః
తథో దథీ న్పఫర్బా భీర్మయోరిల్వాశిషాం సహః"

పాశ్చాత్య భాషలలో ఇటువంటి రచనము గలదు. ఆంగ్లకవులు పాదాది యందు పెట్టిన వర్ణమునే ఆపాదమందలి ప్రతిపదాదిలోను వచ్చునట్లు నియమము బెట్టుకొని వ్రాసిరి. ఇది ఇటు అక్షరాంకము, ఇటు ఆదివర్ణ వృత్తి రెండు చిత్రములు కలయిక.

Address to the Aurora.

"Awake Aurora! and across all airs
By brilliant blazan banish boreal bores
Crossing cold canope's celestial crown
Deel darts descending dive delusive down

.... .... .... ....
.... .... .... ....
Zenith's zebraic zigzag zodaic zones."[1].

తెలుగులో ఇది పద్యములలో ఉన్న అక్షరాంక పద్యమనియు, గద్యలో ఉన్న అక్షరాంక గద్య అనియు వ్యవహరింతురు.

"అఖిల లోకాధార, ఆనందరసపూర
ఇనచంద్ర శిఖినేత్ర, ఈడితామలగాత్ర
ఉరులింగ నిజరూప, ఊర్జితాజలచాప
ఋష్యంక కోటీర, ౠవర్జితోదార
ఌలిత తాండవకాండ, ౡనికృతాజాండ
ఏకైక వర్యేశ, ఐక్యసౌఖ్యావేశ
ఓంకార దివ్యాంగ, ఔన్నత్యగుణసంగ
అంబికా హృదయేశ, అఃస్తోక కలనాశ

---

1. తిరుపతి సాహిత్య సమితి వ్యాసావళి. 'చిత్రకృత వ్యాసం' కర్త బి. యన్. రెడ్డిగారు.

కనదహీనాభరణ, ఖలజలంధర హరణ,
గలనాయక విధేయ, ఘనభక్తి విజేయ
ఙజ్వాలకాలధర, చరిత త్రిశూలధర
ఛద్మయాగధ్వస్త, జలజజ శిరోహస్త
ఝమ్మార్తి శృంగార, ఞన గుణ విదళధీర
టత్రయాది విదూర, ఠ ప్రభావాకార
డమరు కాది విహార, ఢ వ్రాత పరిహార
ణ ప్రభావాగార, తత్త్వజోనేత
థవిదూర జవపక్ష, దవనపాలనదీక్ష
ధరణీ ధరోల్లీఢ, నందికేశారూఢ
పర్వతీశ్వరలింగ, ఫహుళ భూతవిలాస,
భక్తహృద్వనహస, మంత్ర స్తుతోదార
యక్షరుద్రాకార, రతిరాజ బిసహంస
లలిత గంగోత్తంస,
వరదశైల విహార శరసంభ వాస్ఫార
షట్త్రింశ తత్త్వగత, సకల సురముని వినుత
హరినేత్ర పదపద్మ, అంశిత భూధరపద్మ
క్షరరహిత చరిత్ర, అక్షరాంక స్తోత్ర
శ్రీపర్వత లింగ నమస్తే నమస్తే నమః".

అని ఇట్లు అక్షరాంకమనెడి పేరుతో మల్లికార్జున పండితుడు దీనినిరచించెను. ఒక్కొక్క సంబోధన పదమాడిన ఒక్కొక్క అక్షరము కూర్చబడినది. దీనికి మల్లికేశ్వరగద్య అని నామాంతరము.[1].

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన అక్షరాంకగద్య ఇటులున్నది.

1. శివతత్త్వసారము. పీఠిక. పుటలు. ౩౮ నుండి ౩౯. నిడదవోలు వేంకటరావుగారు.

"అపిచ శివశృంగారే ఓం. అది పద విస్తార ఓం.
ఇహావర సుఖాధార ఓం, ఈషణత్రయదూర ఓం.

— — — — — —

— — — — — —

హరగణసిత చ్ఛత్ర ఓం,శశిత కీర్తి కళత్ర ఓం.
క్షరముఖ చారిత్ర ఓం."

ఇతడు అక్షరాంక పద్యములనుకూడ రచించినట్లు విడుదవోలు వేంకట్రావు గారు శివతత్త్వసారము, పీఠికలో తెల్పిరి.

## 2. పదాది వ్యంజనావళి

పద్యములో ప్రతిపదాదిన (పాదము మొదటకాదు) వర్ణమాలలోని వ్యంజనములు క్రమముగ వాడబడును. కొన్నిచోట్ల పదము మొదటి అక్షరముగా కాక పోయినను వరుస తప్పక పాటింపబడును.

ఉదా :- విక్రాలవారి శ్రీ వేం. చి. ర. కరము ఉ.ఖా. 28.

తేటగీతిమాలిక :

కరుణకు ఖనివి గరుడు గఘన విభాగ్న
చతురుడ ఛలాది దుర్జయ జయ ఝరాజ్ఞ
టంకముల ఠక్కురను డంబు ఢక్కణాణ
తథ్యద ధ్యపఫ లదాన దా బిభూమ
శ్రీలొసగు మాయరాల విశేష సహన.

అర్థము : జయ=అభ్యుదయములయొక్క, ఝర = ప్రవాహములయొక్క, అజ్ఞ = పొందిక కలవాడా!, టంకముల, ఠక్కులను ధనముల దేవుడు, డంబుఢక్కణాణ=ప్రఖ్యాతికైన వగారా గల సమర్థుడా! తథ్యద = సత్యము నిచ్చువాడా!, (చిభూమ = బి,విలు లేదాలేదు గనుక) వి = విశేషముగ, భూమ = గొప్పధనముగలవాడా!, మాయరాలన్ = మాయ = అజ్ఞానము, రాలన్ = రాలిపోవునట్లుగా,

## ౩. ఆదివర్ణావృత్తి

పద్యములో మొదటి అక్షరమే ప్రతి పదాదిన (పాదముకాదు) తిరిగి వచ్చుటను ఆదివర్ణావృత్తి అందురు.

పాశ్చాత్య భాషలలో పాదాదివర్ణమే ప్రతిపదాది వర్ణముగ వచ్చుటను లోగడ గమనించితిమిగదా.

తెలుగులో ఉదా :- (1)

కలకంఠము కరెపులుగును
కలవింకము కంకణంబు కహ్వము కరుడున్
కలరవము కనకభుక్కును
కళకును కంకమును గాకి కిక్కెరకైదున్.

ఇందు 'క' వర్ణావృత్తి [గ.వేం. కవి. ప్ర.రా వేం.వి.వి 230].
2) గ.వేం. కవి. ప్ర.రా.వేం వి.వి. 410. 'అ' వర్ణావృత్తి.

## 4. గుణితము

పద్యమున ఒక అక్షరమునకు గుణితము పాటింపబడుట ఇందలి చిత్రము. మొదట తలకట్టు తర్వాత దీర్ఘము, గడుసు-యీ విధముగ క్రమము పాటించి తీర వలెను గుణితము వ్రాయబడెడి అక్షరము ఇన్ని అక్షరముల తర్వాత వచ్చుచుండ వలెననెడి నియమములేదు. కాని సాధారణముగ ప్రతిపదము మొదటి అక్షరముగా దాని నుంచుచుందురు.

ఒకే వ్యంజనముపై అకారాది స్వరాలు వచ్చుచుండును గనుక ఆ పద్యము వినుట కింపుగా ఉండి అది ఒక అలంకారముగ భాసించును.

సంస్కృతములో భుక్కుండుడనే కవి చెప్పిన గుణితభాగము సందర్భ యుక్తముగా నున్నది. చమత్కారముతో గూడినది. దాని యందలి ధ్వని ప్రభావ ముచే ఆకవి, ఆ రాజుగారు విధించిన మరణశిక్షనుండి తప్పించుకోగలిగెను.

ఆ శ్లోక మిది : "భట్టి ర్నష్టో భారవిశ్చాపినష్టః
భిక్షుర్నష్టో భీమసేనోపినష్టః
భుక్కుండోహిం భూపతి స్త్వంహిరాజన్
భబ్భావళ్యా మంతక స్సన్నివిష్టః॥

యముడు "భ" గుణితము దిద్దుచున్నాడు. "భ" వ్రాసేటప్పటికి భట్టి చని పోయెను. "భా"తో భారవి, "భి" భిక్షువనే మహారాజు, "భీ"తో భీమసేనుని ప్రాణ ములు పోయినవి. "భు" వ్రాయునప్పటికి భుక్కుండనైన నా ప్రాణములు పోవు చున్నవి. ఇక "భూ" వ్రాయుట మొదలిడిన భూపతివైన నీవుగూడ త్వరలో అని ధ్వనితో ఆకవి ఆ రాజును శ్లోకములో హెచ్చరించెను. అది చదువుకొని, రాజు, భయపడి ఆ కవిని ఉరితీయవద్దని విడిచిపెట్టవలసినదని ఆజ్ఞ నిచ్చెను. ఆ కవి సమయస్ఫూర్తి మెచ్చదగినది.[1]

"హంసవింశతి"లో గుణితములో వరుసగా వచ్చు దీర్ఘము, గుడుసు మున్నగు పదములతో వర్ణన మనోహరముగ గన్పడుచున్నది. అది ఇటులున్నది.

"దీర్ఘమై విలసిల్లు దేట వాల్గను దోయి
గుడుసులై కనుబొమల్ గుల్కుచుండు
కొమ్మెచ్చు గతిహెచ్చు గొమరె చేతులరీతు
లుత్వంబు చందాన నొప్పుజఘన
మౌత్వంబు జాతిని నమరుగర్ణద్వయిం
బేత్వమై జడపొంక మెసగ బొసగ
నైత్వంబు విధమున నలయూరు లలరారు
దలకట్టువలె మించు దళుకు నొసలు
సున్న నడుము విసర్గలు చన్నులు సుడి
పొక్కిలి వలపల గిలుకల్ భుజములనగా
సౌష్ఠవముతోడ నున్నది సఖియయనుచు."

1. గుమ్మా శంకరరావుగారి "వ్యాస పారిజాతము" గ్రంథమందలి యముడు దద్దిన "భ" గుణితమువ్యాసము. గ్రంథపుటలు-153, 154. ముద్రణ 1981.

కావి కవులందఱు స్తోత్ర సందర్భములోనే గుణితము వాడియున్నారు. ఈ చిత్రము మత్తేభ చంపకములయందు, కందమునందును కనబడుచున్నది. ఈ గుణితము గూర్చి అప్పకవి తెల్పలేదు. గుణితమునకు లక్షణ లక్ష్యముల నిచ్చినవాడు చిత్రకవి పెద్దన.

లక్షణము : ల.సా.సం. 3-135

తలకట్టు గుడుసు కొమ్మును
నలదీర్ఘము లేత్వమైత్వమట నోత్వౌత్వం
బులు బొట్టు గిలుకలన్నియు
కొలదిగ బంద్రెండు వర్ణ గుణితంబయ్యెన్.

దీనిప్రకారము అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఐ ఓ ఔ ం ః అను పన్నెండు స్వరములు రావలెను.

అతని లక్ష్యము : 1) ల.సా. సం. 3-136

మ॥ సరసా సాహసి సిద్ధవహ్నిహృత రక్షశ్శాల సీతావ్యథో
త్కర నాశా సుగుణాఢ్య సూరి తతి వంద్యా సేవక శ్రీదసై
న్యర సాజాత వసంత సోమనిభ సౌర్యాగ్ర ప్రధానాఢ్య సం
గర చానాక్షక దైత్య సర్వహృత రక్షా నీకు నేమ్రొక్కెదన్.

ఈ లక్షణాను సారము క్రిందివి ఉదాహరణములు.

2) నందితిమ్మన—పారిజాతాపహరణం. 2-57 "శ" గుణితము.

3) తెనాలి అన్నయ—సుదక్షిణాపరిణయం 5-69. "స".

4) గ. వేం. కవి. ప్ర.రా.వేం.వి.వి. 8-69 పద్యం "క"
[ఇందు గుణితముతోపాటు దశావతార వర్ణనమున్నది].

5) దామెరల అంకన్న—ఉషాపరిణయం. పుట. 43

6) రాప్తాటి ఓబిరెడ్డి—కవిజన వినోదిని-వ్రాతపతి-పుట. 42.

రెండవవిధము. బొట్టు గిలుక, వదలి 10 స్వరములతోడనే గుణితమ వ్రాయుట. అది కందములో రెండు పాదములలో పూర్తి కావించుట జరిగినది.

ఉదా :- 1) గ.వేం కవి ప్ర రా. వేం.వి.వి 148. పద్యము మొదటి 2 పంక్తులు.

గడి గాటపు గిరి గిములు
గుడి గూబల గెబ్బ గైత గొల్లలు గౌలన్.

ఆధునికులు :

2) నాదెళ్ళవారి. సోమేశ్వరీయము. కం. మొదటి రెండుపంక్తులలో
3) "క" తర్వాత రెండు పంక్తులలో "స" గుణితము.

ఇప్లేవారి అ.ఉ. రామా.లో మూడు కందములలో గుణితము పాటింపబడినది ఒకదానియందు "ర,న" గుణితము, రెండవకందమునందు "క,న"లు మూడవ కందమునందు "పడ"ల గుణితము వ్రాయబడినది.

మూడవ విధము : గిలుకవదలి, ఋ,ౠ రెండింటిని గ్రహించి మొత్తము 13 స్వరములతో గుణితము వ్రాసిన కవులున్నారు.

ఉదా :- ఏక్రాలవారి. శ్రీ వేం.చి.ర.కరము. 19వ చిత్రము. పుట. 21.

నాల్గవ విధము : కందములోవలె 10 స్వీకరించి, దానికి "ం,ః"లు కలుపుకొని 12 స్వరములతో గుణితము వ్రాయబడినది.

ఉదా :- కంకంటి నారసింహకవి. ద్విపద. విష్ణుమాయా విలాసము. 5వ ఆశ్వాసము.

## ౬. అక్షర చిత్ర మిశ్రమము

అక్షరాంక గుణితముల కావ్యము. ఇటు అక్షరాంకమును, అటు గుణితమును ఈ రెండు నియమములతో కావ్యములు వ్రాసిన కవులున్నారు. ఉదా :- రాయవరపు పూర్ణయాచార్యులు-వేమనసూక్తి రత్నాకరము. ఇందు మొదటగా "అ" నుండి 'ఔ' వరకు, పద్యము మొదటి అక్షరము "అ"గా ఉండునట్లు కొన్ని పద్యములు, "ఆ"గా ఉండునట్లు కొన్ని, అట్లే తక్కిన అచ్చులతో కొన్ని పద్యములు వ్రాయబడినవి. తర్వాత హల్లులు "క" నుండి "హ" వరకు పాటించుచు పైన చెప్పిన విధముగ పద్యములు వ్రాయబడియున్నవి. "క" మొదటి అక్షరముగా కొన్ని పద్యములు, "కా"తో కొన్ని, "కి"తో కొన్ని, "కీ"తో కొన్ని-ఇట్లా కావ్యము మొత్తము వ్రాయబడినది. ఆ కావ్య మొక పదకోశమువలె "అ"నుండి "హ" వరకు అక్షరాంకము గలదు. పద్యము మొత్తమున గుణితముగాక కొన్ని పద్యములలో ఒక అక్షరము గుణితము పూర్తియగును.

## 2. పదనియమ చిత్రము

పద్యమున నాల్గుపాదము లొకటిగాను లేదా రెండుపాదము లొకటిగాను, తర్వాతి రెండుపాదములు వేరొకటిగాను వుండుటను పాదనియమ చిత్రమని పిల్వ నగును. ఇవి యమక బేదములు. శబ్దాలంకారము వచ్చును. కాని నాల్గుపాదము లొకటిగా రచనలో కన్పడి చిత్రముగ నద్భుతము గొల్పుచున్నది. కావున ఇది చిత్రమని చెప్పినవాడు అప్పకవి యని భావింపవలెను. కావుననే కాబోలుసంస్కృత లాక్షణికులెవరును దీనిని చిత్రముగ చెప్పియుండలేదు. కాని తెలుగులో ఇట్టిపద్యము లరుదగుటచేత, అప్పకవి దీనిని చిత్రములో చేర్చియున్నాడు. చిత్రకవి పెద్దన దీనిని గూర్చి చెప్పలేదు. అప్పకవి చెప్పిన పాదనియమ చిత్రభేదములు రెండు.

1) ఏకపాది 2) ద్విపాది

### 1. ఏ క పా ది

స్వర వ్యంజన పౌనరుక్త్యముండి, అర్థభేదము గల్గినచో యమకము. ఏక పాది పంక్తి యమకము. ఇందు మొదటి పాదమే మిగిలిన మూడు పాదములుగ ఆవృత్తియగును. పాదము లొకటి యైనను ప్రతిపాదమున పదముల విరుపుచేతనేమి పదముల కర్థముల చేతనేమి వేర్వేఅర్థములు వచ్చుచుండవలెను. లేనియెడలయందు చిత్రమేముండును!

ఆధునికకవియైన విక్రాలవారి శ్రీ వేం.చి.ర. కరము. పూ భా. చిత్ర. ప్ర. 9 ఈ ఏకపాదికి చక్కటి ఉదాహరణము.

1) తే॥గీ॥ వఱఁగ శ్రీ భారతాధిక ప్రణతుఁడీవు
వఱఁగ శ్రీ భారతాధిక ప్రణతుఁడీవు
వఱఁగ శ్రీ భారతాధిక ప్రణతుఁడీవు
వఱఁగ శ్రీ భారతాధిక ప్రణతుఁడీవు

అర్థము = ఈవు, వఱఁగన్, శ్రీ = లక్ష్మియొక్క, భా = శోభయందు, రత = ఆసక్తుడవై, అధిక = మిక్కుటముగ, ప్రణతుఁడవు, శ్రీ=దీప్తియొక్క, భా.ర.త = అతిశయపుదనముతో ప్రణతుఁడవు (భారస్యభావః భారతా), శ్రీ = శ్రీయుతులైన, భారత = భరతవంశజులగు పాండవులచేత, అధిక ప్రణతుడవు, శ్రీభారత = శ్రీమహా భారత గ్రంథమునందు శ్రీమంతమైన భారతదేశమందు అధిక ప్రణతుడవు.

2) అప్పకవీయము 4-561

3) కనుపర్తి అబ్బయ్య కవిరాజమనోరంజనము 2-.0

సీస నాల్గుపాదము లొకటిగా ఉండును.

4) పోకూరి కాశీపతి ష. అం. వి.వి.హ.చరి. ఉత్సాహపద్యము

5) బుర్రా కమలాదేవి ఛందోహంసి "శ్రీహరివితానమేక పాదాహితమగు" పద్యము

6) వావిలికొలను సుబ్బారావు శ్రీకుమారాభ్యుదయము 2-70

సీసము నాల్గుపాదము లొకటిగా ఉండును

## 2. ద్వి పా ది

పద్యమున రెండు పాదములొకటిగాను, మఱి రెండుపాదములు మరొకటిగా నుండుటను ద్విపాది యందురు.

ఇది రెండు విధములు. 1) 1,3 పాదము లొకటిగాను 2, 4 పాదములు వేరొకటిగాను ఉండును. దీనిని సముద్గకయమకమందురు. 2) 1,2 పాదములొకటిగాను, 3,4 పాదములు మరొకటిగాను ఉండుట. దీనిని యుగ్మక యమక మందురు. ఈ రెండును తెలుగున ద్విపాదు లనబడుచున్నవి.

మొదటి విధము ద్విపాది :- ఉదా:- 1) అప్పకవీయము. 4-562.

తే॥ గీ॥ సౌమ్య గురుకవుల్ వినఁ బ్రీతి సరసిజాక్ష
భోగి భోగాసనుండని పొలుచుట రుదె
సౌమ్య గురుకవుల్ వినుఁ బ్రీతి సరసిజాక్ష
భోగి భోగాసనుండవి పొగడ ద్విపద.

2) ఆతుకూరి మొల్ల మొల్లరామాయణము కందము.

3) కనుపర్తి అబ్బయ్య అనిరుద్ధ చరిత్రము 3-130 కందము.

4) కృష్ణకవి శకుంతలాపరిణయం 2-165 ఉత్పలమాల

5) విక్రమదేవవర్మ మానవతీ చరిత్రము. "అరిదరకర" పద్యము

6) ముదిగొండ నాగలింగశాస్త్రులు-కాదంబరి తెలుగువచనము-పద్యము 'కాదంబరీ రసజ్ఞులు'

7) పోకూరి కాశీపతి ష.అం.వి.వి.మారి. చరిత్ర 1-67

8) కామినేని మల్లారెడ్డి ష.చ. 3-109 తే. గీ.

9) బుర్రాకమలాదేవి చందోహంసి

రెండవ విధము : ద్విపాది 1) ఉదా:- విక్రాలవారి శ్రీ. వేం.చి.ర.కరము.
పూ భా.చి.ప్ర. 10.

తే॥ గీ॥ కానన వసతి కామినీ కలితకీర్తి
కానన వసతి కామినీ కలితకీర్తి
బహూసమిద్ధర సాభ్రవిభాసురనుత
బహూసమిద్ధర సాభ్రవిభాసురనుత.

అర్థము : క=బ్రహ్మయొక్క, ఆనన=ముఖములే, వసతి - గృహముగా, కామినీ=ప్రియైన సరస్వతీదేవిచేత, కలిత=కైకొనబడిన, కీర్తి=కీర్తిగలవాడా! కానన=అడవులు, వసతి=ఉనికిగాగా, కామినీ=ప్రియైన శబరిచేత, కలిత=కైకొనబడిన, కీర్తి=కీర్తిగలవాడవు.

బహూ=అధికమై. సమిద్ధ=ప్రకాశించిన రస=నీరుతోగూడిన, అభ్ర= మేఘమువలె, విభాసుర=వెలుంగు వాడవుగా, నుత=స్తుతింపబడినవాడా! బహూ= మిక్కుటమయిన, సమిత్=యుద్ధములను, హర=కొట్టినవాడా! సాభ్ర, విభా= ఆకసమునందు పక్షితోడను, సూర్యునితోడను, కూడినవాడా!:

2) శ్రీనాథుడు - కాశీఖండము తే॥గీ॥

3) వీరి - చాటువు "రాజనందన రాజ" సీసపాదములక్రింది
"భావ భవ భోగ"మను తే॥ గీ॥

## 6. శబ్ద చిత్ర మిశ్రమము

శబ్ద చిత్రములోని భేదములు రెండు లేక అంతకంటె పెక్కులు కలిపి వ్రాయబడిన శబ్ద చిత్ర మిశ్రమమనబెల్లును.

ఇందు 1) స్వరవ్యంజన చిత్రమిశ్రమము 2) వ్యంజన పాద నియమ చిత్ర మిశ్రమము. 3) స్థానగతి నియమ చిత్ర మిశ్రమము 4) స్వర, స్థాన నియమ చిత్ర మిశ్రమము 5) వ్యంజన, స్థాన నియమచిత్ర మిశ్రమములు గమనింపదగినవి.

### 1. స్వర వ్యంజన చిత్ర మిశ్రమము

ఇందు స్వర, వ్యంజనములకు రెండింటికి నియమము గమనింపదగును.

మొదటిది ఏకస్వర ద్వివ్యంజనము :- ఒకస్వరమయిన "అ" యును, "ఘయ" అను రెండు హల్లులు మాత్రమే ఇందు ప్రయోగింపబడినవి.

ఉదా :- 1) వేదులవారి. ల.న.చి. స్తో. 38. విద్యున్మాలా

మాయా మాయా మాయా మాయా
మాయా మాయా మాయా మాయా
మాయా మాయా మాయా మాయా
మాయా మాయా మాయా మాయా

అర్థము : మా=మేధను, య=పొందినవారి యందు, అమాయా=మాయలేని దానా!, (మాయా+అ=అమాయా), మా=లక్ష్మిని, య=పొందినవాడగు విష్ణువందలి, అ=భావమునందు, అమాయా=మాయలేనిదానా!,

మాయా=మాయాస్వరూపిణీ, మాయ=మాయగలవారియందు, అ=అంతట, మాయా=మాయగలదానా!, అమాయ=మాయలేనివారియందు, అ=స్థానముగలదానా!

మాయ=విష్ణువునందు, అ = స్థానము గలదానా! మా = సంపదలయొక్క, ఆయామ=దైర్ఘ్యమును, ఆయా=పొందినదానా!, మాయా=విష్ణుశక్తి!,

మా=మరణమునకు, యామా=యమసంబంధమైనదానా!, అనగా మోక్షము కూర్చుదానా!, అయా=శుభవిధియైనదానా! ఆమ=రోగములయొక్క, అ=స్థానమైన కారణములను, యామ=నాశమును, అ=అంతటను, యా=పొందించుదానా!, శరీర రోగ, భవరోగ కారణములను పూర్తిగా నాశనము చేయుదువనుట.

రెండవది 'సరిగమపధని'-

ఇందు 'సరిగమపధని'అను సప్త వ్యంజనములును, 'స,గ,మ,ప,ధ'ల పైని 'అ,' స్వరమును, 'రి,ని' రెండిటిపై 'ఇ' స్వరమును, వచ్చును. ఒక్కొక్కప్పుడు వరుసగా 'ఆ,ఈ'లు వచ్చుచుండును. సంస్కృతమున 'షడ్జాది స్వరవ్యంజనమ'ను పేర సర కంఠా. 2-265 గలదు.

"సామామారి ధనుసీ నిధానిసీ సామ ధామ ధనిధామ సాధిసీ
మానిసీ సగరి మాపపాపపా సాపగానమసమాగ మాసమా"

తెలుగులో అప్పకవి [1]. చిత్రకవితా భేదములు చెప్పు సందర్భమున, దీనిని చెప్పెను గాని, వివరించు సమయమున, చిత్రకవిత్వ శీర్షికక్రింద దీనినెత్తుకొనలేదు. విడిచిపెట్టెను.

---

1. అప్పకవీయము. ప్ర.ఆ. శబ్దార్థ లక్షణాలంకారము. సీసమాలిక. వావిళ్ళ ప్రచురణ. 1966.

ఉదా: - 1) మిన్నికంటి గురునాథశర్మ. శివగీత. 12-1. సప్తస్వరకందము

మాపని సరిఁగాఁ గని
మా పాపాగ గరిమపస మాపఁగ దగదా
నీ పాద దరిగని గదా
మాపా సామాగమ పదమాని సదాదా.

2) కా.చూ కర్త. చాళుక్యరాజు విశ్వేశ్వరభూపతిని గూర్చి యీ చిత్రముగల పద్యమును చెప్పెను 'నీ శరిపని నీసరిధని' కం. 6-63 పద్యము.

3) సత్యవోలు సోమసుందరకవి 'జగదాంబానారదప్రసంగము'లో సంగీత స్వర సీసము. "ధానిని ధనిగాగ" మొదలుగా గల పద్యమున్నది.

4) ఒకసారి పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రాజాగారిమీద "సరిగమ ల"తో పద్యము చెప్పినట్లు తెలియుచున్నది[1].

5) బోడివాసుదేవరావు. చిత్రమంజరి. చిత్ర-6. సప్త స్వరకందం "ద"వాడి యున్నాడు. "ధ" వాడలేదు.

## 2. వ్యంజన పాదనియమ చిత్రమిశ్రమము

ఉదా:- ద్వ్యక్షరి, ద్విపాది చిత్రముల మిశ్రమము.

తెనాలి రామకృష్ణుడు ఒక కవికి అర్థము చెప్పుమని ఇచ్చిన చాటు పద్యము అది.

సీ॥ మేక తోఁకకు తోఁక తోఁక మేఁకకు మేఁక
మేఁక తోఁకకు తోఁక తోఁక మేఁక.

ఈ వరుసలోనే సీసము నాలుపాదములు గడిచిన పిదప తేటగీతి పాదము క్రిందివిధముగ నున్నది. సీసపాదములు, తేటగీతి పాదములు వరుసలలో భిన్నముగ నున్నవి కనుక ద్విపాది చిత్ర మందున్నది. "మ, క" అను రెండువ్యంజనములు మాత్రమే ఇందుగలవు.

తేటగీతి పాదము :

మేఁక తోక తోఁక తోక తోఁక తోఁక మేఁక

---

[1] తెలుగులో చిత్రకవిత. వ్యాసం. గుమ్మా శంకరరావుగారు. "తెలుగు" పత్రిక 1979 Ju'y Sept. ప్రచురణ. తెలుగు అకాడమీ. హైదరాబాదు.

### 3. స్థాన, గతినియమ చిత్ర మిశ్రమము

1. నిరోష్ఠ్యము పద్యభ్రమకము.

ఉదా :- 1) కేశవయ్య. దాశరథీ చరిత్ర. 1-150. విద్యున్మాలా.

సీతాశాలా శ్రీజాతా ఖ్యా
ధీతా చ్ఛాద్య హృష్టి తాతా
తాతాష్టి హృద్యాచ్ఛా తాధీ
ఖ్యాతా జాశ్రీ లాశా తాసీ

2) ఇందలి. 1-457 కందము

### 4. స్వర, స్థాన నియమ చిత్ర మిశ్రమము

కం॥ ఘనశంఖ చక్రహస్తా
ఘన సంతత కాంతగాత్ర గజరాడ్రక్షా
ఘన గాన గ్రాహ్య యశా
ఘనగా నరకాంత దక్ష కంజదళాక్షా

[చిత్రాలవారి. శ్రీ.వేం. చి.ర.కరము. ఉ. భా. పుట. 60]

ఇందు అకారస్వరము, నిరోష్ఠ్యము పాటింపబడినవి.

### 5. వ్యంజన, స్థాన నియమ చిత్ర మిశ్రమము

ఉదా :-

1) కం॥ ఓవిభావీ భవ విభవా
భవ భావ భవాభిభావ భావీ భీభూ
భవ భావ భావి వైభవ
భ(వి)భా విభు భావ విబుధభావా విభవా

పొత్తపి వేంకటరమణకవి. లక్షణ శిరోమణి. 4-702. ఇందు ఓష్ఠ్యము, అచల జిహ్వా, ద్వ్యక్షరి చిత్రములు గలవు.

2) సోష్ఠ్యత్రక్షర కందము. "మపభ"లు. కవి, మరింగంటి నరసింహాచార్యులు. తాలాంకనందినీ పరిణయము. 4వ ఆశ్వాసము. 352 పద్యము.

3) ఓష్ఠ్యత్ర్యక్షర కందము. "భవమ"లతో. కవి గుడారు వేంకటదాసు-ప్రకృష్ట బలరామచరిత్ర. 3వ ఆశ్వాసము. 381 పద్యము.

# తృతీయ ప్రకరణము

# ఆకారనియమ చిత్రము

పద్మ ఖడ్గాద్యాకారములు నిర్మించి యందు పద్యాక్షరములు నియమమున కూర్పబడును గనుక ఆకారనియమ చిత్రమని దీనికి పేరు సార్థకము. సంస్కృతమున హేమచంద్రుడు కా శా.లో ఆకారనియమ చిత్రమని పేర్కొనెను.

"తచ్చిత్రం యత్రవర్ణానామ్ ఖడ్గాద్యాకృతి హేతుతా" అని మమ్మటుడు వచించెను.

"Bandha is the name given to verses in which the letters are arranged in the form of sword, lotus, car, serpent, etc;[1].

ఆకారముల పద్యాక్షరములు బంధింపబడును గనుక బంధకవిత్వమను పేరు పెట్టి లాక్షణికు లీ బంధ చిత్రమును ప్రదర్శించిరి. అప్పకవీయమున "బంధకవిత్వ" మనెడి శీర్షిక క్రింద ఈ చిత్రము వివరింపబడినది. ఆకార ప్రాధాన్యతను బట్టి ఆకార నియమ చిత్రమనియు, అక్షర బంధన క్రియాపద ప్రాధాన్యత ననుసరించి బంధ చిత్రము లేదా బంధ కవిత్వమనియు పేర్లు సరివడుచున్నవి.

చిత్రమనగా చిత్తరువు ఆ చిత్తరువు యొక్క ఆకారము లిఖించి యందు పద్యాక్షరము లొక నియమమున వ్రాయుట లేదా బంధించుట ఈ చిత్రమున గమనింతుము. ఇది యొక అలంకారముగ ఉండును గనుక ఈ చిత్రమును చిత్రాలంకారమని కూడ అనవచ్చు.

ఇందు కేవలము బొమ్మను చిత్రించుటకు ప్రాధాన్యము లేదు. అట్లైన అది చిత్రలేఖన మగును. కవి ఈ చిత్రాలంకారమున బొమ్మను చిత్రించి, ఆ బొమ్మ పోకడను బట్టి పద్యములో కొన్ని అవృత్తి యగు అక్షరములను కల్పించుకొని రచనచేసి, ఆ పద్యాక్షరములను క్రమముగ ఆ బొమ్మయందు పొదివి చూపును

---

1. History of classical Sanskrit Literature By M. Krishnamachariar Page. 375.

చిత్రాకారమునకు సరిపడు కావ్యరచన చేయుట ఆకారనియమ చిత్రమనబడును. దీనిని కావ్యములో చిత్రాలంకారమని యనవచ్చును. మరొక విధముగ చెప్పవలె ననిన కవిత్వమునకు చిత్రాకృతి కల్పనమిది.

ఈ చిత్రమున కావ్యకళకు చిత్రకళ తోడగుచున్నది.

కావ్యమున ఒక అలంకారముగ ఈ ఆకారచిత్రము వాడదగును.

ఈ చిత్రమునకు చిత్తరువు, పద్యములను రెండు సామగ్రు లవసరము.

సంస్కృతమున 8వ శతాబ్దమునుండి యీచిత్రము ప్రచారమునకు వచ్చినను, తెలుగున మాత్రము నన్నెచోడుని నాగమురజబంధాదుల నిర్మాణముతో మొదలైనది. అందువలన కాబోలు కావ్యాలంకార చూడామణి కర్త.

"ఉర్వి బద్ధబంధ సర్వతోభద్రాదు

లంధ్రభాష జెప్ప నరిది యంద్రు" —6-72 అని చెప్పియున్నాడు.

పాశ్చాత్యభాషలలో కూడ ఈ ఆకారనియమ చిత్రమున్నదనియు, ప్రాచ్య సాహిత్య ప్రభావమువలన పాశ్చాత్యభాషలలో ఏర్పడిన దందురనియు, జి.యన్. రెడ్డిగారు వివరించిరి. 1. ఈ ఆకార నియమచిత్రమునకు 'emblematic poetry' అని వారు పేరిడిరి ధనస్సు, మధుపాత్ర, సిలువ, ఆకారములలో పద్యము లిముడునట్లు ఆంగ్లరచయితలు కొందరు పద్యములను వ్రాసిరి. ఒక ధనుర్బంధ ముదాహరింప బడినది. అది శరసహితచాపము. 'ఇతరభాషలలో చిత్రకవిత' శీర్షిక క్రింద పాశ్చాత్యభాషలలో చిత్రకవితలో దానిని చూడదగును.అనుబంధములో బొమ్మ ప్రదర్శితమైనది.

ఈ సందర్భమున బెరిడెల్ కీత్ పండితుని వ్రాత గమనించుకొనవలెను. గొడ్డలి, నైటింగేల్ గ్రుడ్డు మున్నగునవి చిత్రితమైనవని యాతడు చెప్పియున్నాడు. "No doubt we hear in the Alexanderian age as in the latter Roman poetry (marti l ii 86) of such things as Sotadean verses to be read backwards of seminar making poems technopaignia, in the form

1. తిరుపతి, సాహిత్యసమితి వ్యాసావళి' లో ప్రొఫెసర్. జి.యన్. రెడ్డిగారి 'పాశ్చాత్యభాషలలో చిత్రకవిత్వము వ్యాసము.

of an axe, or a nightingale's egg of Dosiada's similar feet with an alter so on''.[1].

ఈ ఆకారచిత్రము గూర్చి అప్పకవి యిట్లు చెప్పియున్నాడు.

"గోమూత్రికా ఛత్ర గుచ్ఛ కుండలినాగ కంకణ మర్దల ఖడ్గ చక్ర,
పంకజ సర్వతోభద్ర మాతురీ ప్రముఖబంధంబు లేర్పడగఁజెప్పు
వృత్తములు బంధకవిత్వ విశ్రుతములై కవులకు జెవుల పండువులు సేయు.
బటుతర ప్రౌఢిమ బండితపామర సాధారణంబుగా జగతిలోన"

[అప్పకవీయము. 4-569].

చక్రబంధముతో కవిపేరు గూఢమై యుండుటవలన కార్యకర్తృత్వము తెలియగలదు. దాని కొక నిదర్శనమును రావూరి దొరసామిశర్మగారు చూపించిరి. అది యీవిధముగనున్నది. కృష్ణస్వామి కృతియని చెప్పబడెడి ఆంధ్ర బిల్హణీయములో చక్రబంధము కలదు. అందు సింగరార్య కవిపేరు గలదు. సింగరార్య రచించిన బిల్హణీయమును సింగరార్య కుమారుడు నారసింహకవి ఆకృతిని కొంతమార్చి కృష్ణస్వామికి విక్రయించి యుండునని తెలియగలదనిరి. ఈ ప్రయోజనము సాహిత్య చరిత్ర పరిశోధకుల కెనలేనిదిగదా.

ఈ చిత్రము పాఠకులకు వినోదమును గల్గించును. ఈ చిత్రము స్తోత్ర, యుద్ధాది సమయముల పాఠకులకు ఒక రకమైన భావోద్రేకమును చిత్తరువు పరముగ కలిగించును.

## ఆకార చిత్రము - సాధారణ లక్షణములు:

1. జంతువుల చిత్రములలో తలనుండి తోకవరకు పద్యము వరుసక్రమ ముండును.
2. పర్వతము, రథము మున్నగు వాని శిఖరాగ్రము నుండి పద్యము మొదలగును.
3. హారములందు రెండు కొనలు పద్యాద్యంతము అగును.
4. హలము, ఖడ్గము మున్నగువానికి చేయిపట్టుకొను స్థలమునుండి పద్యము మొదలగును.

---

1. History of Sanskrit Literature. Page.127.
[కావ్యాలంకార సంగ్రహము. పుట-౮౬౯]

5. ఏ ఆకార చిత్ర భేదమునకైనను ఆ వృత్తి స్థలముండును. అచ్చట ఒకే అక్షర మావృత్తి యగును. ఆవృత్తి ఎన్నిసార్లు జరుగునో అనేడిది దాని నియమమును బట్టి ఆధారపడును.

6. వీలున్న వానియందు కవి, కృతి లేదా కృతి పతిపేర్లు గుప్తమొనరించుట సర్వ సామాన్యము.

ప్రతిబంధమునకు లక్షణము దుర్లభము. బంధములలో పెక్కింటికి లక్ష్యములే లక్షణము అగును. కవి ప్రతిభను బట్టి క్రొత్త బంధములు పుట్టుచునేయుండును.

ఇక లక్షణమెంతవర కావశ్యకమో తెలిసికొనవలెను. అందుకీ క్రింద యంశములపై దృష్టి యవసరము.

1. కొన్ని ప్రసిద్ధ బంధములకు లక్షణకారులు లక్షణములు దెల్పిరి. అవి ఆధారము చేసికొనదగును.

2. ప్రసిద్ధ కవులు ప్రదర్శించిన బంధములు (లక్ష్యములతో) అవి నడిచిన తీరునుబట్టి లక్షణములుగా స్వీకరింపనగును. ప్రత్యేక లక్షణము లవసరము లేదు.

3. కొన్ని బంధములకు కొంత అసమగ్ర లక్షణములు కొన్నితావుల చెప్పబడినవి. వాని నాధారము చేసికొని చిత్రమున పద్యము లిఖించవలసి యున్నది. లక్షణములో పద్యాదిమధ్యాంతములు బొమ్మలో ఎచ్చట ఎట్లుండునో కొంతవరకు తెల్పబడును అదియొక వృత్తము నుద్దేశించి వ్రాయబడినది. మరియొక పద్య మెట్లు సరిపోవును? అట్టి సందర్భముల ఆ లక్షణ మాధారముగా గొని కొంత ఊహించి, యా పద్య రచననుబట్టి బంధమును నిర్మింపవలెను.

4 కొన్నిటికి కవుల బంధపద్యములుండునుగాని బొమ్మలుండవు. అపుడు బొమ్మ చిత్రించి యటువంటి బంధ సాధారణ లక్షణాల నాధారముగా గొని యూహించి పద్యములను బొమ్మలలో వ్రాయవలెను. ఇది కొంచెము కష్టము.

5. పద్యము బొమ్మలో ఒక నియమమున వ్రాయబడి కన్పడుటయే బంధ లక్షణము. కనుక ప్రతిబంధమునకు వేఱులక్షణ మవసరము. ఆ ఆకారము (చిత్రము). లిఖించబడి, అందుపద్యము వ్రాయబడి, ఆ పద్యాద్యంతము గుర్తింప బడిన చాలును.

6. ఊహచేత వ్రాయబడు సందర్భములుండుట చేతను, వివిధఛందముల

నొకేబంధము చిత్రింపబడు సందర్భము లుండుటచేతను, కవి ప్రతిభచేత నిరంతరము క్రొత్త బంధములు క్రొత్తఛందములలో వ్రాయబడుచుండుటచేతను, ఈ ఆకారనియమ చిత్రమున ఒకేబంధమున పెక్కుభేదములు గలుగుట కవకాశ మేర్పడినది.

కావున ప్రతిబంధమునకు లక్షణము కావలెననెడి పట్టుదల కూడదు.

## బంధముల పట్టిక

1. మాంగళిక బంధములు.

1, శ్రీ బంధము
2. ఓంకారము
3. సర్వతోభద్ర
4. అర్ధభ్రమకమ్
5. మురజము

2. ఆయుధ బంధములు

1. ఖడ్గము
2. ఛురికా
3. పట్టిసము
4. ధనుర్బంధము
5. శరము
6. త్రిశూలము
7. హలము
8. కుంతము
9. నాగపాశము
10. శంఖము
11. చక్రము
12. గదా
13. పద్మము

3. ప్రకీర్ణ బంధములు

1. త్రిదళ చంపకము
2. గుచ్ఛము
3. పుష్పమాలికా
4. హారము
5. కంకణము
6. ఛత్రము
7. చామరము
8. గంధపాత్ర
9. పుష్పపాత్ర
10. ఆందోళికా బంధము
11. రధము
12. పతాకా
13. సింహాసనము
14. ధ్వజము
15 గిరి
16. గోపురము
17. పంజరము
18. నక్షత్రము
19. షడరంగఘ్ను

20. గవాక్షము
21. వ్యజనము
22. ఆలవట్టము
23. రాట్నము
24. పాదుకా
25. వీణ
26. స్వరకల్పితడిండిమము
27. నవరంగము
28. శకటము
29. లింగబంధము
30. షోడశదళ చక్రము
31. శకట చక్రము
32. ద్విశృంగాటక చక్రము
33. ద్విచతుష్క చక్రము
34. గరుడగతి చక్రము
35. కులాలికా చక్రము
36. పంచశృంగ లేదా వివిడిత చక్రము
37. నాగ బంధము
38. మత్స్యము
39. కూర్మము
40. గౌళికా
41. గోమూత్రిక
42. సుడిగుండం
[వలయభ్రమయమక బంధం].

బంధములను ముఖ్యముగా నాల్గు విధములుగా వర్గీకరింపవచ్చు. అవి. 1. మాంగళిక బంధములు 2. ఆయుధ బంధములు 3. ప్రకీర్ణ బంధములు 4. ఆకారచిత్ర మిశ్రమము.

## 1. మాంగళిక బంధములు

శుభప్రదమైన బంధములను మాంగళిక బంధములనదగును.

1. శ్రీ బంధము

ఉదా:- 1) సదాశివ-శివకర్ణామృత స్తోత్రము

'సదా విభాతు ప్రతిభా మదీయాత్రేది జాపతే
గుణస్తుత్యా మహితయా బ్రహ్మాదిసురకామ్యయా'

[మూ. పటము. 1]

సంస్కృతములో 'శ్రీ:'కి లక్షణమున్నది కాని తెలుగులో కనబడలేదు. ఆ లక్ష్యమును బట్టి యూహించి దీనిని వ్రాసితిని. సంస్కృత లక్షణములో 'శ్రీయో లేఖక్రమేణైవ' అన్నట్లు 'శ్రీ' వ్రాయునట్లే వరుసగా పద్యమును వ్రాసితిని. 'భా, త్రే, యా'లు మూడు ఆవృత్తి అక్షరములు.

ఆకారము-మత్కృతము



శ్రీ బంధము

పటము – 1

2. వ. రకము శ్రీకార బంధము

కం॥ శ్రీవర పరమ దయాకర
భావజ సద్దేహభాస వసుధా ధీశా
పావన నంబుల గిరి గతి
దేవా నరసింహా యేలితివి కలిమధనా



పటము – 2

సర్పమువలె శ్రీ యున్నది. శ్రీ వలె సర్పము చుట్టుకొని యున్నది. శ్రీ కారము, సర్పాకారము రెండును బంధమున చూడదగును.

2. ఓంకార బంధము

సర్పమువలె ఓంకారము బంధింపబడినది. 'ఓం' వలె సర్పము చుట్టుకొని యున్నదని చెప్పవలసి యున్నది. పద్యము సర్పము తలనుండి తోకవరకు ను పోవును. అట్లే 'ఓం' వ్రాసిన రీతిలోనే పద్యము వ్రాయబడినది. అదే రీతి చదువు కొనవలెను.

ఈ బంధము 'ఓం' ఆకారమును, సర్పాకారమును దలపింప జేయుచున్నది. ఇందలి పద్యము.

కం॥ సిరిమురిపెము జూపగ సుర
వరులందరు కరము పొగడ వరదుడవై శ్రీ
నరహరి నంబుల గిరిపా
తిత మొందితి భక్త సజ్జతిమిర విభజ్ఞా.

[చూ. పటము 3.]

కాకతీయ విశ్వవిద్యాలయములో ఆంధ్రోపన్యాసకులు హరి శివ కుమార్ గారు పంపినది వారు సేకరించినదట. కర్త తెలియదు.



పటము - 3

## ౩. సర్వతో భద్ర బంధము.

వందే సదా దాస దేవం
దేవరం వషరం వదే
సరంగ కంకంగ రణస
దాపకంత తకం వదా.

[చూ.పటము-4] [అప్పకవీయము. 4-588]

పాదభ్రమకము సర్వతోభద్ర బంధమునకు సరిపోవును. అంతేకాక యొక సారి యనులోమముగ వ్రాసి పిదప విలోమముగ వ్రాసిన ఈ బంధము పూర్తి యగును.

లక్షణం : "తదిష్టం సర్వతో భద్రం భ్రమణం యది సర్వతః"
[కావ. 3-80]

---

కాకతీయ విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులు. హరిశివ కుమార్ గారు పంపిన బంధమిది. వారుసేకరించుకొనినది.

| వం | దే | స | దా | దా | స | దే | వం |
|---|---|---|---|---|---|---|---|
| దే | వ | రం | ష | ష | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | ష | కం | ఠ | ఠ | కం | ష | దా |
| దా | ష | కం | ఠ | ఠ | కం | ష | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | ష | ష | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

పటము_4

నిలువున అడ్డమున 8 గదులుండవలయునని తెలియుచున్నది. ఇందు శ్లోకమే కాన విద్యున్మాలా వృత్తముగూడ సరిపోవును. నాల్గుపక్కల మొదటి పంక్తుల యందనులోమముగ చదివినను, ప్రతిలోమముగ చదివినను సమానముగ పద్యము యొక్క మొదటిపాదము తిరుగును. అట్లే అనులోమ ప్రతిలోమ గతులతో నాల్గు ప్రక్కల రెండవపంక్తులు చదివిన రెండవపాదమును, నాల్గువైపుల మూడవ పంక్తులు చదివిన మూడవపాదమును, నాల్గువైపుల నాల్గవ పంక్తులు చదివిన నాల్గవ పాదమును తిరుగును.

ఉదా:_ 2) కనుపర్తి అచ్చయ్య. కవిరాజమనోరంజనము. 4.175.

3) కాణాద పెద్దన - భద్రాపరిణయము. 3_302.

4) బుర్రా కమలాదేవి - ఛందోహంసి.

5) వేదులవారి_ ల.సీ. (ఆంధ్ర) చి. స్త. 30.

6) వీరి. " 37.

ఈ బంధమునకు మం.పా.శాస్త్రి. ప్ర.సం.బం.ని.గ్రం.లో చెప్పిన లక్షణము.

"క్రమరీతి జతురంగ చక్రమున నర్ధశ్రేయ లందర్థ న
ద్రప్రమకంబై ప్రథమాంఘ్రివర్ణము లధః పాదాదులందుల్య సం
ఖ్యముగా గల్గిన దైసగంబు తలక్రిందై. సర్వతోభద్ర బం
ధమగుం-బొందిక దీనికెన్మిదవ ఛందంబెన్ని చందంబులన్." —9

## 4. అర్ధభ్రమకమ్.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| నా | కా | సా | రా | సా | రా | వా | సా |
| కా | కా | కా | కా | మా | భా | భా | వా |
| సా | కా | రా | రా | కా | వా | భా | రా |
| రా | కా | రా | జా | స్యా | కా | మా | సా |

పటము_5

విద్యున్మాలా :

నాకా సారా సారా వాసా
కాకా కాకా మాభా భావా
శాకా రారా కావా భారా
రాకా రాజా స్యాకా మాసా.

[చూ.పటము_5]  [వేదులవారి. ల.స. (ఆంధ్ర) చి.స్త. 21.]

లక్షణం: 'అహుఃరర్ధభ్రమం నామ నామ శ్లోకార్ధభ్రమణం యది.'

[దండి. కా.ద.3_8.]

అడ్డముగను నిలువుగనుగూడ మొదటి వరుసలలో మొదటి పాదముయొక్క సగభాగ మొకేరీతిగ నుండును. అట్లే రెండవవరుసలో రెండవ పాద సగభాగమూ, మూడవవరుసలో మూడవపాదము సగభాగము, నాల్గవ వరుసలో నాల్గవపాదము సగభాగ మొకేరీతిగ నుండును.

## 5. మురజము

లక్షణం : "అత్ర పాదచతుష్కేపి క్రమశః పరిలేఖితే
శ్లోక పాద క్రమేణ స్యాద్రేఖాసుమురజత్రయీ".

[సర. కంఠా చిత్ర.ప్ర.....]

చిత్రమున నాల్గువరుసలుగా నాల్గుపాదములున్నవి. ప్రథమపంక్తి యందలి ప్రథమాక్షరమును, ద్వితీయ పంక్తి యందలి ద్వితీయ తృతీయాక్షరములను, తిరిగి ప్రథమపంక్తియందలి చతుర్థ పంచమాక్షరములను మరల ద్వితీయ పంక్తి యందలి షష్ఠ సప్తమాక్షరములను, తిరిగి మొదటి పంక్తి యందలి అష్టమాక్షరమును కలిపి చదివిన ప్రథమ పాదమగును. ఈ విధముగ, ద్వితీయపంక్తి ప్రథమాక్షరము, ప్రథమపంక్తిలో ద్వితీయ తృతీయాక్షరములను, తిరిగి ద్వితీయపంక్తిలో 4, 5 అక్షరములు మరల మొదటి పంక్తిలోని 6,7 అక్షరములను, తిరిగి ద్వితీయపంక్తి యందలి 8వ అక్షరము కలిపి చదివిన ద్వితీయపాదము వచ్చును. ఈ విధముగానే తృతీయ చతుర్థపాదము లేర్పడును.

ఉదా:- 1) గ.వేం. కవి.ప్ర.రా.వేం. వి.వి. 857 పద్యము

విద్యున్మాలా:-

"వీరోదారా వేదారాధ్యా
నారో దారా నాదారాగా
గారోదానా కాదాధారా
వీరోధారా వేదాధామా."

[చూ. పటము 6]



మురజము

పటము - 6

ఉదా : 2) వేదులవారి ల.స. (ఆంధ్ర) చి.స్త. 23. సమానివృత్తము.
3) నన్నెచోడుని కుమార సంభవము. 10-85 కందము. [కొన్ని అక్షరములు పోయినవి.].

మర్దల బంధమను పేర ఈ క్రింది వారు వ్రాసిరి.

1) అప్పకవీయము. 4.578. చిత్రపదము.
2) బుర్రా కమలాదేవి. ఛందోహంసి. చిత్రపదము.
3) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 14. సరోజ వృత్తము.
4) విక్రాల శ్రీదేవమ్మ. వాసవదత్తా పరిణయం. 2-113. చిత్రపదము.
5) ఓగిరాల జగన్నాథం. సుమనోమనోభి రంజనము[1].
6) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 56.
7) తంయాల లక్ష్మీ నృసింహాచార్యులు. శ్రీవేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము. 2-136. చిత్రపదము.

అచ్చతెలుగులో.

1) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు. కుబ్జా కృష్ణవిలాసము 3-125. మాణవకవృత్తము.

"మేలు గడించుదు సాలున్
గ్రాలగ వక్కా హుమాయిన్
మేలుగ నెక్కా హు సారిన్
చాలగ బ్రోచెదు మారా."

హరిచంద్రకవి. ధర్మ శర్మాభ్యుదయములో కొన్ని మురజ బంధములు కలవు. సంస్కృతములో మురజ ప్రస్తారము, ఏకాక్షర మురజములు కలవు.[2] మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. ని. గ్ర. లో దీని లక్షణమిట్లున్నది.

"అరద చదరంగపుంగదుల నంఘ్రులు నాల్గును ద్వ్యత్రిషణ్ణా గా
క్షరములో మధ్య షట్కమొ యొకండుగనూడగగూర్చి వ్రాయగా
మురజ సమాఖ్య బంధమగు మూలకు మూలకు రేఖలుంచి పై
తెరువున వ్రాసి చూచిన నదేయగు రెంటను గామగామియై."

---

1. ప్ర. రా. వే. వి. వి. పీఠిక. పుట. ౬౮. నిర్వహణ. పూండ్ల రామకృష్ణయ్య.
2. చిత్రకావ్య కౌతుకమ్. పుట. 8 నుండి 17 వరకు.

## 2. ఆ యు ధ బం ధ ము లు

ఆయుధముల ఆకారములో ఈ బంధము ఉండును. ఖడ్గము, చక్రము మున్నగునవి యిటువంటివి. చక్రము, శంఖము మున్నగునవి విష్ణ్వాయుధములు త్రిశూలాదులు శివా యుధములు,హలము బలరాముని ఆయుధము, మఱియు ఖడ్గము మున్నగు ఆయుధము లిందు ప్రదర్శింపబడును.

ఇవి యుద్ధ వర్ణన సమయముల ప్రదర్శించిన సందర్భోచితమై యలరారును.

### 1. ఖ డ్గ బం ధ ము:

ఈ ఖడ్గబంధమును సుగంధి వృత్తమున మాత్రమే వ్రాయదగునని చిత్రకవి పెద్దన చెప్పియున్నాడు. ఉత్సాహ వృత్తమున గూడ వ్రాయదగును. కొలదిమార్పుతో కందమున విరివిగ వ్రాయవచ్చునని చెప్పవచ్చు. తెలుగు కవులు కందముననే దీనిని చిత్రించిరి.

బొమ్మమాదిరి, పద్యము మొదలు తుది పాటించుట ఒకటే యైనను కవి తన స్వతంత్రాలోచననతో కొలది మార్పులతో ఖడ్గబంధమును నిర్మించెననవచ్చును అసలు ఖడ్గ బంధ నిర్మాణమునకు దోహదమైనవిగా భావింపబడు మాదిరులు పెక్కులు గలవు. వానినిట వరుసగా ఖడ్గ భేదములుగా పేర్కొనుచున్నాను. ఈ భేదములలో కొన్నిటికి ఛురికా, కటారికా అనిపేర్లు వినబడు చున్నవి.

1. సకలకళా కలితరమా
   ప్రకటిత నృప కృష్ణరాయ ప్రవిమల ధామా
   కుకవి విదారణ సీమా
   యకలంక యశో విరామ ఆంధ్ర నలందా.

   [అద్దేపల్లి నారాయణరావు. నారాయణీయం. పుట. 109. ఖడ్గ. 3].

[చూ. పటము 7.]



పటము-7.

కొనయందు గల 'మా' అవృత్తి కాలేదు. రెండవ యక్షరమైన 'క' నాల్గు సార్లావృత్తి యైనది. ఎట్లన్న, సకల, కళా కలిత, యకలంక, లనుపదములలో గలపి నాల్గుమార్లయినది.

2. 1) శమదమ సమధిక చిత్తా
విమలాంభోజారి హస్త విష్టర కర్ణా
యమ లార్జున తరు భంజన
కమలా ధరణీ స నాథ కందర వర్ణా.

[చూ. పటము. 8]. [అప్ప కవీయము. 4-580].



పటము-8.

ఇందలి కొనగల 'ర్ణా' అవృత్తి రెండు సార్లయినది.

ఉదా:- 2) గ. వేం. కవి. ప్ర.రా. వేం. వి.వి. 808లోని గర్భిత వింశతిబంధ కందము.

3) కొడవలూరి రామచంద్రకవి. మహాసేనోదయము. 1-119. శిష్యనిప్రార్థన సందర్భము

4) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. బంధ. 12

5) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 9.

3. కం॥ శూరవర వార సన్నుత
తారక భూ భృ జ్జిగీషు తత కీర్తి ధనా
నారద తతవిహిత సుధీ
భూరి రణార్జిత విపక్ష పుషిత కవిజనా.

[శేషము వేంకటపతి. శశాంక విజయము. 5-169.]

ఇందు కొనయందలి 'నా' మూడు సార్లు అవృత్తి యైనది.

[చూ. పటము 9.]

'4. కం॥ సమర మహీ మధు మత్సమ
సమధి కతం త్రుంచు విమత శరులన్ లీలన్
హిమ రుక్కులుడు మరుత్వ
త్సమ సత్వత చేర్చు చుండు సర్వ జగములన్.

[కావ్యాలంకార చూడామణి. 6-71].

ఇందు కొనయందలి 'లన్' రెండుసార్లు ఆవృత్తి యగును. అయినను పై రెండవ దానికి దీనికి భేద మున్నది. దీనికి రెండు పిడిగుబ్బలు. పై దానికి ఒకటే పిడిగుబ్బ. రెండు పిడిగుబ్బల మధ్య 'ధు' ఒకే అక్షరము.

[చూ. పటము-10]



ఖడ్గము
పటము - 9

శాల్గవ ఖడ్గ బంధము.



పటము - 10

దీనికి చిన్నకోట పెద్దన లక్షణ మిట్లు చెప్పెను.
కం॥ తరతరమ పూస నుండియు
బిరుజులు దట్టాడి మధ్య వద్ధతిధారా
పరివృతి నుపదేశక్రమ
పరిచితి పరియింప ఖడ్గ బంధం బయ్యేన్

[కా. చూ. 6-70].

ఈ మాదిరి కుదాహరణములు:

2. అప్పకవీయము. 4-581.

3. వావిలికొలను సుబ్బారావు. శ్రీ కుమారాభ్యుదయము. 3-133.

4. అద్దుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 109 ఖడ్గ. 4.

5. నాల్గవ ఖడ్గమందు రెండు పిడిగుబ్బల మధ్య ఒక్క అక్షరము 'ధు' ఉన్నది. అట్లుగాక రెండక్షరము లుండుట ఈ యైదవ దాని ప్రత్యేకత.

ఉదా:- 1. తూము రామదాసు. మిత్రవిందోద్వాహము. 2-38.

2. తంయాల లక్ష్మీనృసింహాచార్యులు - శ్రీవేల్పుగొండ లక్ష్మీ నృసింహ మహాత్మ్యము. 2 180.

5. (A) రెండు పిడిగుబ్బల మధ్య నాల్గక్షరము లుండును.

ఉదా:- నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. ఉత్తమజీవయాత్ర. ద్వితీయాశ్వాసాంతమున.

6. పై 4, 5, 6, యందు రెండవ పిడిగుబ్బ యందలి మూడక్షరములును ఆవృత్తియైనవి. ఆ మూడుక్షరములలో మధ్యాక్షరము మాత్రమే ఆవృత్తి యగుట ఇందలి ప్రత్యేకత.

ఉదా:- హరదర హరసుర వరషర
అరిదర కరసార సాక్ష ఆశ్రిత వరదా
దరదారీ శౌరీ శుభ
కర కవిపాలా! మహాత్మ కలిహా శ్రీదా!

(చూ. పటము.11) (విక్రాల శ్రీదేవమ్మ. వాసవదత్తాపరిణయము. 2-112)



పటము - 11

'దా' ఆవృత్తి రెండుసార్లు. రెండవ పిడిగుబ్బ మధ్యాక్షరమే ఆవృత్తిగలది. మొదటి పిడిగుబ్బ సంగతి మామూలే.

17)

7. ఇందు చివరి అక్షరమావృత్తి మూడుసార్లు. 6పదాని యందు ఆవృత్తి రెండుసార్లే. ఇదియే భేదము.

ఉదా:- కనుపర్తి అబ్బయ్య. కవిరాజమనోరంజనము. 4-188.

8. దీనియందు రెండు పిడిగుబ్బల మధ్య రెండక్షరము లుండును. ఏడవ దాని యందొక్క యక్షరమే యున్నది. ఇది గమనింపదగినది. ఇప్పుడు కొంచెము ఖడ్గబంధమునకు చేరువయగుచున్నాము.

ఉదా:- 1. అప్పకవీయము. 4-582.

2. కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు. భాగవతమహాత్మ్యము.

3. అడ్పుమిల్లి నారాయణరావు - నారాయణీయము. పుట 108. ఖడ్గ-

4. బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 10.

9. దీని యందు రెండు పిడిగుబ్బల మధ్య 3 అక్షరము లుండును. ఎనిమిదవ దానియందు రెండు మాత్రమే. ఇదియే భేదము.

ఉదా:- అడ్పుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 1.8. ఖడ్గ- 2

10. దీని యందు రెండు పిడిగుబ్బల మధ్య 4 అక్షరములుండును. దీనికి 'కటారికా' అని పేరు వినబడుచున్నది.

ఉదా:- 1. గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 830. కందము.

"సారతర శూర బుధమం
దారా హారాభిరామ దాక్షిణ్య నిధీ
ధీరా గ్రేసర రిపు సం
హారాభీమ ప్రతాప యసుర విరోధీ." (చూ. పటము-12)



ఆకారము మత్కృతము

పటము - 12.

ఉదా:- 2. సుబ్బరాజ నామధేయుకు - శ్రీ గోవిందకృష్ణయాచేంద్ర విజయము. 4-72 కందము.

11. దీనియందు తొమ్మిదవ దానివలె రెండు పిడిగుబ్బల మధ్య మూడక్షరము లుండును. రెండవ పిడిగుబ్బ యందలి మూడక్షరము లావృత్తి యగుట ఇందలి ప్రత్యేకత. 9వ దానియందొక్క యక్షరమే అవృత్తియగును.

ఉదా:- 1. అప్పకవీయము. 4-583.

కం॥ శారద రసారమణ దర
పారద రజనీశ కీర్తి పావన చరితా
తారక రిపు వినుత హరియ
పారదయార్ణవ! ముకుంద! భావజతాతా. (చూ. పటము. 13)

ఉదా:- 2. చింతలపల్లి ఛాయాపతి. రాఘవాభ్యుదయము. 6-354.

3. మరింగంటి వేంకట నరసింహాచార్యులు. తాలాంకనందినీ పరిణయము 1-121.

4. నాదెళ్ళవారి. కృష్ణానదీ మహాత్మ్యము. 3-137,

5. విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. బంధ. 13.

6. చింతలపల్లి వీరరాఘవకవి - మధురవాణీ విలాసము. 2-10.

12. దీనియందు రెండు పిడిగుబ్బల మధ్య నాలుగక్షరములుండుటయే 11వ దానికి దీనికి గలభేదము.

ఉదా:- 1. చింతలపల్లి ఛాయాపతి. రాఘవాభ్యుదయము. 1-210, 2-257.
ఈ రెండవదానికి చంద్రహాసము (రావణునికత్తి) అని పేరిడెను.

2. నంది ఘంటలజంట. వరాహపురాణము. 9-41.



ఖడ్గము
పటము - 13

**13.** మొదటి పిడిగుబ్బకు ముందొక యక్షరమునే యిప్పటివఱకు చూచితిమి ఇప్పుడు పదుమూడవదానియందు రెండక్షరములను చూడగలము. రెండు పిడిగుబ్బల మధ్య మూడక్షరాలే.

ఉదా:- (1) తిమ్మన-పారిజాతాపహరణం. **5-96**

కం॥ శ్రీవర వర వర హృతభవ
భావన వనజాయతాక్ష పాలితవిబుధా
ధావిత దనుభవ నియమిన
భావన చతురాస ముద్ధృతార్ణవసుధా.

దీనికి "ఛురికా" అని నందితిమ్మన పేరిడెను. (చూ. పటము - **14**)



పటము - **14**

ఉదా:- (2) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 12.

14. అసలు ఖడ్గబంధ మీభేదమునకు జెందినది. చిత్రకవి పెద్దన "సుగంధి"లోనే చెప్పవలెనని లక్షణమిడి లక్ష్యమును ఆ పద్యములోనే చెప్పెను. **సా. ర.** (సంస్కృతం)లో ఖడ్గబంధ మీ విధముగనే కలదు. ఈ బంధమును "సుగంధి" యందేకాక "ఉత్సాహ" పద్యమునగూడ చెప్పవచ్చును.

ఈ ఖడ్గబంధమునకు లక్షణమును చిత్రకవి పెద్దన ఇట్లు చెప్పియున్నాడు.

ఆ॥వె॥ ఖడ్గబంధమునకుఁ గర్ణికల్ నాల్గగు। రెండుపిడికిని నలుగు రెండు నగుచు
మూఁట నడియు జనవ మూడేసి మార్లగు। నొకట నాల్గుమార్ల నొనరవదువ
ల. సా. సం. **3-137.**

కం॥ చరణాంతాక్షర మావలి। చరణాదుల నిలిచి ప్రాసనహితము వడితో
నరయగ సుగంధి వృత్తమె। పరగును గావ్యముల ఖడ్గబంధ **మవిలజా.**
**3-138.**

కం॥ పిడినడుమ నంచుల న్మోకిన। నిడబంధన మరణరోగ వృతుడగు బతియ
ట్లిడరా దాతని నామము। నడుమనెయును వంగళుభమొనరు ఖడ్గమునన్.
3_139.

అప్పకవి సూక్ష్మముగ లక్షణము చెప్పియున్నాడు___4_579.

కం॥ చరణాంత్యవర్ణమొక్కటి। చరణయుగాద్యంబుచేసి నరసులు నుమ్మా
రిరుగడల మధ్యమొకటిగ। వరుజాల గదియింప ఖడ్గబంధం బొనరన్.

మం. పా. శాస్త్రి—ప్ర. సం బం వి. గ్రం. లో ఖడ్గబంధలక్షణ మిట్లున్నది.

మ॥ పిడికాదిం దుది నాల్గు దళముల్ పీఠాకృతిన్ నిల్పి యొ
క్కడు గండల్గు నచ్చిరోక్షరమె యాద్యంబంత్య మౌనట్లు పై
యడుగుల్ మూడును నాల్గు బంతులుగ వ్రాయన్ ఖడ్గబంధంబిదే
పుడమిన్ నేర్పరి గూర్ప జిత్రగతులం బొందున్ సుగంధ్యాదులన్. _3

రెండవ పిడిగుబ్బ తర్వాతి అక్షర మావృత్తి కల్గియుండును రెండుపిడి గుబ్బలమధ్య మూడక్షరములుండును. చివరి కొనయందలి యక్షరము 3సార్లు ఆవృత్తి. మొదటి పిడిగుబ్బకు ముందొకే అక్షరముండును.

ఉదా:_ (1) సుగంధి. చిత్రకవిపెద్దన. ల. సా. సం.

"శ్రీనవీన జానకీన సేవకావ కావదా
దానవారి యాంజనేయ దారుణ స్ఫురజ్జవా
వానరేంద్ర నిన్నుఁగొల్తు వాంఛితార్థ శితార్థ దా
దాన నిర్జితాబ్జబాణ తాతతార కాధవా."
[చూ. పటము - 15]



ఖడ్గము

పటము - 15

రెండవపిడిగుబ్బ తర్వాత అక్షరము "దా" మొత్తం 4 మాఱులావృత్తి యగును.
ఉదా :-

[2] అప్పకవీయము. 4-584. సుగంధి.
[3] మరింగంటి సింగరాచార్యులు. దశరథరాజనందనచరిత్ర. 5-309. ఉత్సాహ.
[4] గ. వేం. కవి. ప్ర రా. వేం. వి. వి 856 పద్యము. ఉత్సాహ.
[5] కామినేని మల్లారెడ్డి. ష. చ. 3-111. ఉత్సాహము.
[6] గోపీనాథవేంకటకవి. గోపీనాథరామాయణం. కిష్కింధాంతము. 1409.
[7] కోడూరు వేంకటాచలకవి. శివరహస్యఖండము. యుద్ధకాండ. చతుర్థాశ్వాసము చివర. ప్రశాంతవృత్తము. 316.
[8] బుర్రా కమలాదేవి. ఛందోహంసి సుగంధి.
[9] పక్కి వెంకటనర్సయ్య. శకుంతలాపరిణయము.[1]. సుగంధి.
[10] తురిమెళ్ళ రామన. శేషధర్మము.[2]. 5వ ఆశ్వాసాంతము. సుగంధి.
[11] తంయాల లక్ష్మీనృసింహాచార్యులు. కుబ్జాకృష్ణవిలాసము. 3-124. (అచ్చతెలుగు.)

15. మొదటి పిడిగుబ్బకు ముందు రెండక్షరములుండుట, మొదటిగుబ్బ తర్వాత 7 అక్షరాలుండుట. రెండవగుబ్బ లేకుండుట. "రా" అక్షరము 4 మారులావృత్తియగును.

ఉదా:- ఈదులపల్లి భవానీశ. ధర్మఖండము. 9-293. ఉత్సాహము.

16. విచిత్రఖడ్గము.

తంయాల లక్ష్మీ నృసింహాచార్యులు. శ్రీవేల్పుగొండ లక్ష్మీ నృసింహ మహాత్మ్యము. 1-31.

---

1. ప్ర. రా. వేం. వి. వి. పీఠిక. పుట. 27. నిర్వహణ. పూండ్ల రామకృష్ణయ్య.
2. ప్రొ॥. బి. రామరాజుగారి - "మరుగుపడిన మాణిక్యాలు" గ్రంథము. పుట. 30. ప్రచురణ. గోలకొండపత్రిక. 1981.

కం॥ ధీరా మారాకారా। తారాహారాభరాజ ధర ధర నిరతా
తారకపతనువి రధరా। ధారాధర వినుతవ కరతా రవిరధరా.

[చూ. పటము - 16]



పటము - 16

ముందుకు చివరిదాకాపోయి వెనుకకు తిరిగివచ్చుట ఇందలి ప్రత్యేకత.

2. ఛురికాబంధము

"ఛురికా" అనగా మంగలికత్తి. ఈ బంధము సరోజవృత్తములోనే తెలుగులో వ్రాయబడియున్నది.

ఉదా :- (1) అప్పకవీయము. 4-591. అప్పకవి లక్షణమీయలేదు.
సరోజము:

"చేసి తాసిరి సిగ్గుచే। వాసి వాదరి చేరిరా
రాసుతాదిని బోసిగా। గాసి బోనిది తాసురా." [చూ. పటము. 17.]

ఇందు మూడవపాదము విలోమముగా చదివిన నాల్గవపాదము వచ్చును.

పిడిగుబ్బకు ముందు ఒకఅక్షరము, పిడిగుబ్బకు తర్వాత రెండక్షరాలు, తర్వాత అక్షరము ఆవృత్తి రెండుసార్లు, తదుపరి ఒక అక్షరము విడిచి మరియొకటి ఆవృత్తి అక్షరము.తదుపరి 2వ పాదము చివరి అక్షరమే మూడవపాదము మొదటిఅక్షరముగా వుండి పిదప అదే నాల్గవపాదము చివరి యక్షరముగా ఉండును. కనుక అది మూడుమారులావృత్తి. "రాసుతాదిని బోసిగా" అను మూడవపాదము వెనుకకు చదివి 'రా'తో ఆపవలెను. కనుక, చివరి రెండుపాదము లీభాగమున సరిపోవును.



పటము-17

"సి" మూడుసార్లు 'వా', 'రి' రెండుసార్లు, 'రా' మూడుసార్లు. మిగతా భాగము 'సు' నుండి 'గా' వరకు రెండుసార్లా వృత్తి.

ఉదా:- (2) విక్రాలవారి. శ్రీ. వేం చి. ర. కరము. పూ. భా. బంధ. 14.
(3) అద్దమిల్లి నారాయణరావు- నారాయణీయము. పుట. 112.
(4) బుర్రాకమలాదేవి. ఛందోహంసి.
(5) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 13.

## 3. ప ట్టి స బ ం ధ ం

పట్టిస మనగా అడ్డకత్తి.దేవేశ్వరమహాకవి తమ "కవికల్పలత"లో ఈబంధ మును ప్రదర్శించి యున్నాడు. అది యిట్లున్నది.

"మహేశ మమతా రామ
మరమా మమరోత్తమ
మహాత్తమ మహోద్దామ
మతిస్తోమ మనోరమ."

[చూ. పటము-18]

మధ్యలో "మ" ఒక్కొక్కటి రెండు సార్లావృత్తియైనది



పటము 18

## 4. ధ ను ర్బ ం ధ ము

మం.పా.శాస్త్రి. ప్ర.సం.బం.ని.గ్రం.లో. చాప బంధ లక్షణమిట్లున్నది.

"చిలుకున నాది పాదమిడి సింగిణి శింజిని చిల్కుతోడ సం
ధిలిన దళంబు లాది నిరుదందగు చాందమునన్ ద్విపాద ము
ల్నిలిపి, చతుర్థ మాదివదలీనముగా నొనరించి యీగతిం
జిలిపిన జాపబంధమగు సంగతి మార్చిన మార్చిగా దగున్."

శివకర్ణామృత స్తోత్రమున ధనుర్బంధమున్నది. సంస్కృత శ్లోకము బంధ మున గలదు.

"హర శంకర సర్వేశ త్రిపురారే మహాప్రభో
పాహి పాహి భవార్తం మాం హరీష్ట జితమన్మథ."

[చూ. పటము. 19] అకారము మత్కృతము.

చిలుక-శింజినితోడ సంధిల చోట "హి" ఆవృత్తియైనదిగాని, ఈ శ్లోకమున రెండవ పాదాంత్యాక్షరము, మూడవ పాదాద్యక్షర మొకటిగా ఉంతవలెనుకాని ఇక్కడలేదు. కొందరు మొదటి పాదము రెండవ అక్షరము, నాల్గవ పాదము చివరి యక్షర మొకటై చిలుకు శింజిని కలియుచోట నుంచిరి. అది ఇక్కడలేదు. మొదటి పాదము చిలుకుననుంచి, రెండవ పాదము శింజినినంటి నడుచుట లక్షణము. అది ఇక్కడ సరిపోయినది



ధనుర్బంధము

పటము_19

2. అల్లమరాజు రామకృష్ణకవి-కవిజన చంద్రోదయము నందలిచాపబంధము.

ఉ॥ సార విమత్త పుణ్యజన సార్థ ప్రరిష్టకరాతి సాహసా
సారసలోచనా లసిత సాగరకన్య రతీ ప్రలాలసా
సారస సూర్యనేత్ర బుధ సంఘ నుతాకరుణార్ద్రి మానసా
సారవిమత్త పుణ్యజన సార్థ ప్రరిష్టకరాతి సాహసా.

[చూ. పటము -20]

ఇందొకటవ, నాల్గవ పాదములొకటిగా ఉన్నది. మొదటి పాదాంత్యాక్షరము, రెండవ పాదాదిగ వున్నది. అంతేగాక మూడవ పాదాంత్యాక్షరము, నాల్గవ పాదాద్యక్షరముగా వున్నది. 1,4 పాదములొకటిగా వుండవచ్చును. అందువలన ఒక పాదమే రెండుసార్లావృత్తియైనట్లగును. ఇంక సంధ్యాక్షరము లటునిటు కొనలయందు "సా"లు రెండుసార్లు ఆవృత్తియైనవి. అకారము మత్కృతము

దీనికి మఱియొక ఉదాహరణము. రావు కొండలరాయుడు. చిత్రకవిత్వ దర్పణం. కందము.

3. శార్ఙ్గబంధము.

ఉదా:- శివకర్ణామృత స్తోత్రము. శ్లోకము.

"శంకరం పరమం కామ మకామం లోకరక్షకం
కందర్ప దమనం శాంతం సదానందం భజే నిశం."

[చూ. పటము- 21] ఆకారము మత్కృతము.

4. శార్ఙ్గబంధము. రెండవరకము.

ద్విపద :- "మేరు ధీర సుగుణ మేదినీ రక్ష
మేరు కార్ముక హస్త మిత్ర ప్రశస్త."

[రాప్తాటి ఓ.బి.రెడ్డి కవిజన వినోదిని. పుట. 73.]

[చూ. పటము- 22] [వ్రాతప్రతి]

దీనికి మఱియొక ఉదా:- కపిలవాయి లింగమూర్తి కృతము. కొంతభేదముతో తేటగీతిలో నిర్మింపబడినది.



2. చాపబంధము

పటము-20



శార్ఙ్గబంధము

పటము-21



శార్ఙ్గబంధము

పటము-22

## 5. శరబంధము

ఈ బంధము ప్రమాణి, నారాచవృత్తములలో గలదు. తెలుగులో దీని నిర్మాణ రీతి ఒక్కటే.

శరము యొక్క పిడికొనల యందలి యక్షరములు, పదముయొక్క పూర్వోత్తరార్థములందు సంబంధము గల్గియుండును. పిడియందలి యక్షరములు పూర్వార్థమునపై గడులతోను మధ్యగడులతోనూ పైకి క్రిందికి కలుపుచు చదువుకొనవలెను.

మం.పా.శాస్త్రి-ప్ర.సం.బం.వి.గ్రం.లో దీనికి లక్షణమిట్లున్నది.

"ప్రథమ తృతీయ వర్ణములు పార్శ్వములందు ద్వితీయ మగ్రమం
దధిగత మౌగతిన్ నిలిపి యమ్మున పూర్వపదమ్ముగూర్చి త
త్ప్రథమ పదంబునం బరమపాదము క్రిందుగ జేర్చి యల్లునన్
బుధుడిరు చోట్ల నున్న పదముల్ నెరవన్ శరబంధమై తగున్."

సంస్కృతములో ల.స; పాదుకా, శివపాదకమలరేణు సహస్రాది గ్రంథముల గలరీతినే తెలుగున అనుసరించుట జరిగినది.

ఉదా:- 1) వేదులవారి. ల.స. (ఆంధ్ర). చి. స్థ. 24

ప్రమాణి :

"సముద్ర జోన్నతా మహా
క్షమా సుధీప్రతారికా
సముద్ర జోన్వితా రిహా
కుమార్గ ధీవ తారికా."

[చూ. పటము-23]



శ ర బ ం ధ ము

పటము 23

ఉదా:- 2) విక్రాలవారి. శ్రీ.వేం.చి ర. కరము. పూ భా పుట. 45. శరనామమైన నారాచవృత్తమున దీనిని లిఖించెను.

3) విక్రాల శ్రీదేవమ్మ. వాసవదత్తా పరిణయం. 2-79 'నారాచము'న.

4) తంయాల లక్ష్మి నృసింహాచార్యులు. శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము 2-137

## 6. త్రిశూలము

లక్షణం : "మధ్యేధస్తా ద్ద్వపదే చహ్యానులోమ విలోమతః
ఉపర్యధో మధ్యతోపిచోర్ధ్వన్న ధ్యే త్రిశూలకే."
[సంస్కృతం, చిత్రబన్ధ కావ్యమ్, పుట. 37].

మం.పా.శాస్త్రి. ప్ర.సం.బం.ని గ్రం.లో దీనికి లక్షణ మిట్లున్నది.

"ఏమైమమ్మోనవాలుగా నలరునట్లే రేఖలం దీర్చి యం
దా మూలాగ్రముగాగ నాళమున నాద్యముంద దంత్యాక్షరం
చా మూలాగ్రము లొంద శాఖలను మధ్యాంఘ్రుల్ చతుర్థాంఘ్రి క్రిం
దైముఖ్యాఘ్రిం జేర్చి కూర్చిన త్రిశూలాకారబంధం బగున్."

నిర్మాణపద్ధతి : క్రిందినుండి స్తంభాకారమున దాదాపు రెండుపాదములు పట్టును. ప్రస్తుతోదాహరణములో 'రకాఘనాయతాన' అను భాగము మూడు సార్లా వృత్తియైనది. పద్యము పెద్దదగుటవలన ఈ యావృత్తి యవసరమైనది. 'దా' నాల్గు సారులావృత్తి, నాళమున 'దా' దంత్యాక్షరమున్నది. ఇంక కొనలలో పార్శ్వకొనలలో ముందు పద్యమునడిచి యదియు ననులోమ విలోమముగ తర్వాత మధ్య కొనలో అక్లే తిరిగి పూర్తియగును.

సంస్కృతమునందును పద్ధతి యిదియే. స్తంభాకారమున రెండు పాదములు, కొనలయందు కడమ రెండుపాదములు నడుచును.

ఉదా:- 1) గ.వేం.కవి. ప్ర.రా కేం. ఎ.వి. 858 పద్యము. పంచచామరము,



"సతీపతీ రసా రసాను సారకా ఘనాయతా
నతాయ నాఘ కారకాఘనా యతానదాన సూ
తతా జయాజ తాతసూన దామధార తారకా
రతార ధామ దాస దాజరాధిరాజదాసదా."
[చూ.పటము 24] అకారము మత్కృతము.

ఉదా:- 2) గ.వేం. కవి. ఆంధ్రకౌముది. త్రిశూలము. పంచచామరము

త్రిశూలము

పటము-24

## 7. హాలబంధము

మం.పా.శా స్త్రి. ప్ర.నం.బం.వి.గ్రం.లో హాలబంధలక్షణము.

"హాలకాండంబు యుగంబు సంధి నొసచో నారబ్ధమై దానినే
వలగొంచున్ హల మధ్యమందు ప్రథమంబౌ నంఘ్రియా మధ్యాంఘ్రులా
హాలసంధ్యాక్షర మాద్యమంత్యముగ నర్ధావృత్తి, నందేక నుం
దల క్రిందై ప్రథమాంఘ్రి నొందు హాలబంధంబందు దుర్యాంఘ్రియున్"

నాగటి కఱ్ఱు వద్ద "నవిభోశంకా" అనునది యనులోమ విలోమమగును. హాల కాండము పూర్తియైన పిదప పై పిడియొద్ద అక్షరము లుంచవలెను. పిదప మధ్యన అనులోమ విలోమరీతి పద్యము చివరి పాదాక్షరము లుంచవలెను.

కందపద్యమున దీనిని ప్రదర్శించినవాడు గ.వేం.కవి.ప్ర రా వేం.వి.వి. 851 పద్యము. ఈ పద్యమైదు బంధములకు సరిపోవునని చెప్పబడినది. అందులో హాల బంధమొకటి.

ఈ బంధము శివకర్ణామృత స్తోత్రమున శ్లోకమున గలదు.

"కనద్జ్ఞ నవిభోశంకా కాశంభోవిన శక్యతే
మమదీన దయా సింధో నవనాఘఘ నావన."

అకారము మత్కృతము. (చూ. పటము-25)



హాలబంధము

పటము-25

## ౬. కుంతబంధము [బల్లెము]

ఖడ్గలక్షణ మీ కుంత బంధమునకు సరిపోవును. ఖడ్గమునందువలెనే దీని యందును పిడిగలదు.కాని అక్కడ పిడి చిన్నది.దీనియందు పిడి పొడవైనది.ఎక్కువ అక్షరములు పట్టును. అసలినుప ములికిలో ఖడ్గమునందువలె పద్యక్రమము సాగును.



కుంతబంధము [బల్లెము]

పటము. 26

ఉదా :_ విక్రాలశౌరి. శ్రీ.వేం.చి.ర.కరము. ఉ.ఖా.పుట.58.

కం॥ ఖలహా దవాలి పకగా
కర శ స్త్రర సాలపీ నగాకుల బలకా
బలకా లతాల ఒక కో
కంపప్రద లీల శ్రీశకా ఖలబలకా.

[చూ.పటము_26]

టీక :_ ఖలహా+క్షుద్రనాశకా, బల = దేహమునందు, కా = అద్భుతమైనవాడా! ఖల = ఖరాసురునియొక్క (ర,ల యోరభేదము) మూకకు యముడైనవాడా!

## ౭. నాగపాశము [వరుణుని ఆయుధము]

త్రాడువలె నాగుని చుట్టి చుట్టి చేతబట్టుకొని యుండినట్లగపడును. అవసర మైనప్పుడది విసరివేయబడును.

ఉదా:_ 1) కోలాచలం శ్రీనివాసరావు. సునందినీ పరిణయం. ఇష్టదేవతా ప్రార్థన సమయము.

చం॥ దశరథరామ! శ్రీశ! నతదాత దురత్యయ ప్రీతిప్రోవరా
కుశ లరసేర!యీశ! యజకుంజరసఖ్య! మహాదికారణా
పశుపతి చింతనా! శమిత పాతక! నిర్జరనాథ! యీ సదా
యశము దినాయమున్ శుచిమహామతి వర్ణిత సారథీ నిధీ.

[పటము_27] ఆకారము మత్స్యాకృతము.

2) భువనగిరి విజయరామయ్య. మల్లికార్జున సహస్రము. 168,274,1169, 1194.



నాగపాశము [వరుణుని ఆయుధము]

పటము_27

## 10. శంఖబంధము

లక్షణం :

"ముఖాత్పాదద్వయం వాచ్యం పుచ్ఛాత్పాదద్వయం తథా
మధ్యేచ విరతాః సర్వే శంఖబంధేవా నూతనే."

[సంస్కృతం. చిత్రబన్ధ కావ్యమ్. పుట 7]

మం. పా. శాస్త్రి. ప్ర. బం. సం. ని. గ్రం. లో. దీనికి లక్షణమిట్లున్నది.

"ఘన శంఖాకృతిగా ప్రదక్షిణపు రేఖల్ దీర్చి పూర్వార్ధ మం
దునెఱుం పూర్వపదంబుపైకి నెరపం దుర్యాంఘ్రి యుంగూడనం
దెని గూఢంబగు క్రిందుగా నువరి సంధిస్థాక్షరంబూతగా
జను నర్ధభ్రమకంబు తాను బెరయం బల్శంఖ బంధంబునన్"

ఉదా:- 1) గ. వేం కవి. ప్ర రా. వేం. వి. వి. 608 పద్యములోని గర్భిత వింశతి బంధకందము

"సార వరహార వారా
సార హరీ నరహరి హరశర కరసారా
గౌరధర ధీర చారా
సార హరీ సురహరి నరసర సారభరా." [మా.పటము-28]

నాల్గు పక్తులలోని చివరి యక్షరము 'రా' సంధ్యాక్షరము. అది నాల్గు మాఱులావృత్తి. శంఖము ముఖమునందు రెండు పాదములు, తోకయందు రెండు పాదము లుండుట దీని నియమము.

ఆకారము మత్కృతము

ఉదా:- 2) ఈః కవి. గారి. ప్ర.రా.వేం.వి.వి. 853 కం.

3) కపిలవాయి లింగమూర్తిగారి కృతము. ఆటవెలది. కొలది భేదముతో నిర్మింపబడినది.




శంఖము

19) పటము-28.

## 11. చక్ర బంధము

ఈ చక్రబంధ మిటు తెలుగున అటు సంస్కృతమున విరివిగ ప్రదర్శింప బడినది. నిర్మాణ విషయమున కొంచెము తేలికైన బంధమిది. చక్రమనగా షడర చక్రమే.

ఈ చక్ర బంధమును 19 అక్షరములు గల శార్దూల విక్రీడితమందే సంస్కృత కవులు వ్రాసిరి. అట్లే తెలుగు లాక్షణికులు నిర్దేశించి ప్రదర్శించి చూపిరి దానిని కవులందరు అనుసరించిరి. తరళవృత్తమునకు గూడ 19 అక్షరములు పాదమున కుండును గనుక ఆ పద్యమును గూడ వ్రాసిన వారున్నారు.

చంపకమాలతో గూడ ఈ చక్రబంధమును నిర్మించిన వారున్నారు. మధ్య స్థాక్షరముంక రేకున 10 అక్షరము లిందు కనబడును. శార్దూలమందు రేకున 9 అక్షరములే యుండును.

కంద పద్యముతో గూడ ఈ చక్రమును నిర్మించవచ్చు. నామాంక చక్ర బంధమని యీ చక్ర బంధమునకు పేరు గలదు. అనగా ఇందు కవి, కృతి కృతి పేళ్ళు వీలునుబట్టి యీ మూటిలో ఏ రెండిటినైన 3, 6 వలయములందు గుప్త మొనరింతురు. ఈనామ గోపనము సంస్కృతమున మాఘుని శిశుపాలవధ కావ్య మున మొదటగా కనుగొందుము. [19-120] ఇందు బయటనుండి 3 వ వలయ మున 'మాఘ కావ్య మిదం' అనియు, 6వ వలయమున 'శిశు పాలవధః' అనియు పొందుపరుపబడినవి. ఇట్లే ల. స; శివపాదకమలరేణు సహస్రాదులందు గలవు.

తెలుగున ఈ బంధమును నిర్మించిన మొదటి కవి నన్నెచోడుడు. అతడు కవి, కృతి, నామములనందు రచింపలేదు.

తర్వాతి వాడు విన్నకోట పెద్దన ఈతడు సంస్కృతమున పాటించినట్లే బయటనుండి మూడవ వలయమున కవి పేరు, 6వ వలయమున కృతిపేరు వ్రాసెను

ఇతని బాటనే సింగరార్యుడు, గ వేం.కవి; తూమురామదాసు, ఇంక నాధుని కులు కొందరు నడిచిరి.

ప్రతాప ముద్రీయమందలి చక్రబంధమున బయటనుండి 3వ. వలయమున కృతిపతి పేరు. 6వ, వలయమున కవి పేరు వ్రాయబడినవి.

దీని ననుసరించి, నందితిమ్మన, రామరాజ భూషణుడు, కనుపర్తి అబ్బయ్య చింతలపల్లి ఛాయాపతి మున్నగు ప్రాచీన కవులు, అధునికులు కొందరు నామ

గోపన మొనరించిరి. చిత్రకవి పెద్దన గూడ ఈ బాటనే నడిచి, "కృత్యధిపతి, కవులపేర్లు నిలుపంగవలయు' అని వరుస పేర్కొనెను. [ల.సా.సం. 3_142].

ఈ నామగోపన మెటులైన మండదగునని అప్పకవి 'మూట నాట నాలవ ముల రచించి' [అప్పకవీయము 4_585] అని దాటవేసినాడు తాను 3,6 వలయ ముల దన పేరునే వ్రాసికొని యున్నాడు.

ఇకభైరవకవి "3"న శ్రీరంగ వర్ణదే" అని కృతిపేరు, 8న 'భైరవరచిత' అని తన పేరు వ్రాసి యున్నాడు.



చక్రబంధం

పటము_29

మతమేదైనను కవికృతి, కృతిపతి నామములు గోప్య మొనరించుటముఖ్యోద్దేశము.

## 1. షడర చక్రము

ఇది ప్రసిద్ధ బంధములలో నొకటి. మాఘుడు శిశుపాలవధ కావ్యమున యుద్ధసమయమున దీనిని ప్రదర్శించుట సమయోచితము. ఇది విష్ణు చక్రాయుధమన్న మాట. ఎక్కువగా శార్దూల పద్యమున నిది రచింపబడినది. షడర చక్రమనగా ఆరు రేకులుగల చక్రమని అర్థము.

ఉదా:- 1) గ.వేం కవి.ప్ర.రా.వేం.వి వి. 861 పద్యము. శార్దూలము

"సత్యా కల్పక ప్రస్ఫుటా శరభి దాచారావి శంక్రమా
మత్యావిష్కృత బంధురాదర్శణ భూమా జంతుకూటాశ్రితా
దిత్యావేంధన ధర్మ సార రత మూర్తీ ముత్కరాద్రిక్షమా
మాత్యుల్లాస పదా మహా విదిత ధామా సాధుతారక్షమా."

[మా. పటము. 29]

పది గీట్లు వర్తులాకారమున గీసిన మధ్యస్థాక్షరముకాక ఒక్కొక్క రేకున 9 అక్షరములు పట్టును. కావున వలయములు మధ్యస్థమైనదికాక తొమ్మిదేర్పడును. పద్యమున అర్థపాద మొకరేకు చొప్పున 6 రేకులకు మూడు పాదములు సరిపోవును. మధ్యాక్షరము మూడు పాదములకు మూడుసారులావృత్తియగును. మూడవ పాదాంత్యాక్షరము, నాల్గవ పాదము మొదటి యక్షరమొకటిగా ఉండును. పై పద్యమున "మా" అన్నమాట. అదే మరల నాల్గవ పాదము చివరి యక్షరమగును దానితో పద్యమంతమగును కనుక ఆ"మా" మూడుసారులావృత్తియగును. బయటనుండి మొదటి వలయము రేకుల సంధిచోట్లగల మిగిలిన 5 అక్షరములు రెండు సారులావృత్తియగును. పై దానియందు "స,మ,ది,మా,తా,"లు.

3వ వలయమున కోరిన అక్షరములు రావలెనని ప్రతిపాదము 3వ అక్షరములు మూడు, 17వ అక్షరములు 3 వ్రాయవలెను. అట్లే 6వ వలయమున కోరినవి 6,14 అక్షరములుగా కూర్పవలెను.

దీని నిర్మాణవిషయమున ఆలంకారికులందరును ఒకే విధముగ జెప్పిరి. పది చుట్లు, ఆరురేకులు, మూట నాటిట నామములుంచుటయును పేర్కొనిరి. సర కం ఠా. లో లక్షణమిట్లు చెప్పబడినది.

"పురః పురో లిఖేత్పాదా న్మత్రీన్ షడరీకృతాన్
తుర్యన్తు భ్రమయే న్నేమౌ నామాంకశ్చక్ర సంవిధిః"

"వలయ నవకంబు నాభిరేకలు, కవికృతి, పేర్లు" [కా. చూ. 6_66].
"అందపు చక్రరేఖల పది, యందంచుల నాభిరేఖలగు"
[ల.సా.సం 3_141, 142]
"పః చుట్లు నారరేకలు" [నరసభూపాలీయము 4_86]
"వర్తులాకృతులుగా పదిగీటులు-నాభిరేఖలు-మూటనాఱిట నామములు"
[అప్పకవీయము. 4_585].

| | | |
|---|---|---|
| ఉదా :_ 2) నన్నెచోడుడు | కుమారసంభవము | 12_201 |
| 3) చిన్నకోట పెద్దన | కా.చూ. | 6_67 |
| 4) భైరవుడు | శ్రీరంగమహాత్త్వము | 5_263 |
| 5) అప్పకవీయము | 4_586 | |
| 6) సింగరార్యకవి | రాఘవ వాసుదేవీయము | |
| 7) వీరి | బిల్హణీయము ప్రథమాశ్వాసాంతము | |
| 8) తూమురామదాసు | మిత్రవిందోద్వాహము 2_40 | |
| 9) కొడవలూరు రామచంద్రకవి | మహాసేనోదయము | 1_76 |
| 10) రావిపాటి లక్ష్మీనారాయణ | ని.భా రామా.పుట. 81 పద్యం 125 | |
| 11) చిత్రకాలవారి | శ్రీ. వేం. చి. ర కరము. పూ.భా. బంధ 4 | |
| 12) చెలమచర్ల రంగాచార్యులు | ఆంధ్ర ప్రతాపరుద్రయశో భూషణము | |
| 13) నందితిమ్మన | పారిజాతాపహరణము 5_97 | |
| 14) రామరాజ భూషణుడు | నరసభూపాలీయము | |
| 15) వెంకయ్య | రామరాజీయము 336 | |
| 16) చింతలపల్లి ఛాయాపతి | రాఘవాభ్యుదయము 4_245, 6_62 | |
| 17) కేశవయ్య | దాశరధి చరిత్రము 2_516 | |
| 18) కనుపర్తి అబ్బయ్య | కవిరాజమనోరంజనము 4_174 | |
| 19) పూడిపెద్ది లింగమూర్తి | సువర్చలాపరిణయం | |
| 20) పోతరాజు లక్ష్మీనృసింహకవి | మాఘపురాణము | |
| 21) చిత్రాల శ్రీదేవమ్మ | వాసవదత్తా పరిణయము 4_142 | |
| 22) బోడివాసుదేవరావు | చిత్రమంజరి. బంధ 5. | |
| 23) బుర్రా కమలాదేవి | ఛందోహంసి | |
| 24) అబ్బిరాజు హనుమంతరాయశర్మ | పాకయాజి నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రము | |

25) వావిలికొలను సుబ్బారావు కౌసల్యాపరిణయం 1_194
26) కామినేని మల్లారెడ్డి పద్మపురాణం 5_236
27) అల్లమరాజు రంగశాయి శ్రీఆంధ్ర చంపూ రామాయణం. అరణ్య78
28) నాదెళ్ళవారి అ.ఉ.రామా. 7_153
29) అద్దేపల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 114.
30) వేదుల వారి ల. స. (ఆంధ్ర): చిత్ర. స్త్ర. 40
31) సింహాద్రి వెంకటాచార్యుడు చమత్కార మంజరి 2_59
32) వావిలాల వాసుదేవశాస్త్రిలు ఆంధ్ర రఘువంశము[1] శార్దూలము.
33) త్యాగరాజమొదలి సుబ్రహ్మణ్యవిజయము ఆశ్వాసము రెండు
34) దామెరల అంకన్న ఉషాపరిణయం 5 ఆశ్వా. పుట. 146.
35) పక్కి వెంకట నర్సయ్య శకుంతలా పరిణయము.[2]

36) చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీవిలాసము 3_107
[మూడవవర్తులమున "రాఘవకవి" కవిపేరు, 6వ వర్తులమున "వేంకటాద్రీకృతి" కృతి భర్తపేరు]

37) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 72.
38) కపిలవాయి లింగమూర్తి చక్రతీర్థ మహాత్మ్యము 5_64
39) కోలాచలం శ్రీనివాసరావు సునందినీ పరిణయం (దేవతా ప్రార్థన స్థలములో)
40) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము 2_179

తరళవృత్తమున

1) మాడభూషి వేంకటాచార్యులు భరతాభ్యుదయము[3]

---

1. ప్ర.రా.వేం.వి.వి.పీఠిక. పుట. 26 నిర్వాహణ. పూండ్ల రామకృష్ణయ్య

2. అందలి 27

3. అందలి 25

చంపకమాలలో

1) గోపీనాథ వేంకటకవి–గోపీనాథ రామాయణము. అయోధ్య – 2262

కందపద్యమున

ఈపద్యములో 6 రేకుల చక్ర నిర్మాణమిక్రింది విధముగ ఉండును.

మొ॥ 57 అక్షరాలుండునట్లు కందము రచియింపవలెను. పద్యము మొత్తము 6 రేకులకు సరిపోవును. కాని శార్దూలములోవలె బయటి వలయము చుట్టు తిరిగి వచ్చుట కక్షరములు చాలవు. కనుక ఆ పద్ధతి మాత్రమే లేదు.

6 రేకులకు 6×9 = 54 అక్షరాలు. పైన మధ్యస్థాక్షరము 3సార్లు ఆవృత్తి యగును. కనుక కందపద్యమున మొత్తము 57 అక్షరాలుండవలెను.

శార్దూల చక్రమున ఒక రేకుకు చక్కగా నున్న అడుగురేకు వరకు పాదము సాగును. కాని యిందొక రేకు మధ్యస్థాక్షరము తాకి రేకు ప్రక్కరేకున పాదము నడిచి బయటి వలయమునకు చేరును. తర్వాత బయట వలయమునుండి 3వ రేకున మొదలై మధ్యస్థాక్షరమునకు తగులును. ఇట్లేతక్కినవి.

ఉదా:– 1. నాదెళ్ళవారి, గురుభక్తి ప్రభావము. 4–199. [చూ. పటము-30]

వలపుము తగు కృప ధరధర
పరిచిత రుచిర విదుషోక్త ప్రమథ శివరతిన్
పరహిత మిత్త్రని యడుగన్
మురిపెమగుఁగు దురఁ దరుణము మున్నిడు సాంబా.

3వ వలయములో 'పురుషోత్తముడు' అని కవి పేరుకలదు.

2. వీరి సోమేశ్వరీయము. 'హరనాస' పద్యము; అ. ఉ. రామా. 7–154.

3. నాదెళ్ళ మేధా దక్షిణాముని. శ్రీ హనుమద్రామాయణము. అయోధ్య.328

4. వీరి ఉత్తమ జీవయాత్ర, తృతీయా శ్వాసాంతములో.



చక్రము
పటము - 30.

## ౭. అష్టార చక్రబంధము.

ఈ యెనిమిది రేకుల చక్రమునను శార్దూలవిక్రీడిత పద్యమునే వాడుదురు. రెండు రేకు లొక్కొక్క పాదము చొ౹౹న. 8 రేకులకు 4 శార్దూల పాదములు సరి పోవును.

పైన చూపిన కంద చక్రమునకువలెనే బయటవలయము చుట్టివచ్చు పద్ధతి కింద స్పష్టి చెప్పబడినది. ఇక మిగిలిన నియమములన్నియు షడరచక్ర శార్దూలమునకు వలెనే వర్తించును.

సంస్కృతమున ఈ అష్టార చక్రబంధమున్నది. దానిని జూచి తెలుగున బయలుదేరినదనుకొనవలెను

ఉదా:- 1. వేదులవారి. ల. స. (ఆంధ్ర). చి.స్త. 41. శార్దూలము.

"ఆదిధ్యేయ రమా ! ప్రశాస! మహిజాతా! భాగ్యదాయామ శ్రీ
యాదేయున్ హృదయాలయున్ శమములన్ ప్రారబ్ధమున్ జించు శ్రీ
శ్రేదున్! వేంకటపాదు బ్రోవు మహిరాట్ఛ్రీద్వారు వేశర్మ మా
యాదా! కట్ కట యీ భవంబు మటుమాయన్ జార్చికర్మన్ననున్."

(చూ. పటము - 31.)

పేరును దాపరిక మొనరించునట్లే ఇందు విద్యున్మాలా పద్యము దాచబడినది. 1, 3, 6, 8, వలయాలలోని యక్షరములు వరుసగా విద్యున్మాలా నాల్గుపాదము లగును.

ఉదా:- 2. విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. బంధ.5 మరియు 49 పద్యములు. 5వ పద్యములో 1వ వలయములో కవిపేరు కూర్చ బడినది.




అష్టార చక్రము

20) పటము - 31.

## 3. పంచావరణ చక్ర బంధము

ఐదు చుట్లు మాత్రమే యిందుండును.

ఉదా:- రావు కొండలరాయుడు. చిత్రకవిత్వ దర్పణం. వ్రాతప్రతి. మంజుల వృత్తము.

"కరివేదన నీ మనస క్కర కమ్మిన త్రాణనవి
త్తరిటన్దున మౌక్యవగా వరరమ్మనగాతి ధరా."

ఆకారము మత్కృతము (చూ. పటము – 32)



పటము –32

ఇది యెనిమిది రేకుల చక్రము. మూడవ వలయమందు 'వేంకటరమణకృతి అని యేర్పడినది.

## 4. సుదర్శన చక్రము

ఈ పేరు పెట్టి ప్రస్తుతము వేంకటేశ్వరస్వామి చెంత కనబడురీతి చక్ర బంధమును నిర్మించినకవి, రాప్తాటి ఓబిరెడ్డి. వీరి "కవిజనవినోదిని." వ్రాతప్రతి. పుట. 75.

చిత్రపద వృత్తము : "మానిత దాత సుమాన్యా
మానుగ నన్ గను మార్యా
మానుష పోష క్షమాత్మా
మానక సాకవె మాపా." [చూ. పటము –33]



సుదర్శన చక్రము

పటము_ 33

## 12. గదా బంధము.

సంస్కృతమున ఈక్రింది శ్లోకముతో గదా బంధ మున్నది. అది పట సహితము ప్రదర్శింపబడుచున్నది.

'రామ నారాయణ త్రాహి కామోదకీ గదాధర
దరం హర వరస్మేర ధీర వీర ధురం ధర' [చూ. పటము 34]
[రామరూప పాఠక. చిత్ర కావ్య కౌతుకమ్ 20, గదా].

లక్షణం: 1. [చిత్ర బంధ కావ్యమ్. పుట 9.]

"అధస్తాద్ ద్వేపదే మధ్యే ద్వేపదే పరితస్తథా
గోమూత్రికా క్రమేణైవ గదాబంధే హినూతనే"

గద పట్టుకొను చోటు నుండియే పద్యము ప్రారంభమగును.

తెలుగులో. గ. వేం. కవి. ప్ర. రా. వేం. ఏ. ఏ. 808లో గర్భిత కందమున గదా బంధమున్నది.

---

1. చిత్రకావ్య కౌతుకమ్. పుట. 41 నుండి గ్రహింపబడినది.

సారవర హర వారా
సారహరీ నరహరి హర శరకర సారా
గౌరధర ధీర చారా
సారహరీ సురహరి నరసర సారభరా.

[చూ. పటము. 35] [ఆకారము మత్కృతము].



గదా బంధము

పటము – 34 పటము – 35

మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. ని. గ్రం. లో లక్షణ మిట్లున్నది.

"గద చందంబున రేఖ లేర్పరిచి తద్గర్భంబునం దొమ్మిదే
గదులుండం బొదలించి మధ్య కలితా గారంబె యారంభమై
పదముల్ నాల్గును మూలమంటు కరణిన్ వ్రాయంగ చిత్ర ప్రదా
స్పదమై శత్రు భయం ప్రదంబగు గదా బంధం బదేయగు గదా."

గర్భమున 9 గదులుండవలెనని నియమము. తెలుగు, సంస్కృత లక్షణముల నాధారపడి యూహించి కందపద్యమును గదా చిత్రమున లిఖియించితిని.

ఉదా :– దావకొండలరాయుడు. చిత్రకవిత్వ దర్పణం. కందము.

## 13. పద్మ బంధము

పద్మ మనిన అష్టదళ పద్మమే ప్రచురము. కాని చతుర్దళ, ద్వాదశ దళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మములుకూడా వ్రాయబడియున్నవి.

ఒక లక్షణమున్న దాని నాధారము జేసికొని యూహించి కొత్త కొత్త పోకడలు త్రొక్కి, అందు భేదములను సృష్టించుట కవుల లక్షణము. ఈ పద్మ బంధ విషయమున గూడ అంతే.

పద్మ బంధమునకు మం. పా. శా. వారి ప్ర. సం. బం. ని. గ్రం. లో లక్షణ మిట్లు చెప్పబడినది—4.

"కల సంజ్ఞల్ దళసంఖ్య నొప్ప దళవర్ణ శ్రేణితోఁ గర్ణికా
తల వర్ణంబు లగించు చొప్పొకటి లేదా స్రగ్ధ రాద్యంత విద
గ్దళ వర్ణాది ప్రవేశ నిర్గమన సాధారణ్య మొందన్ విది
గ్దళ వర్ణంబుల గూడి యష్టదళ సంజ్ఞం బద్మ బంధం బగున్."

దళ సంఖ్యనుబట్టి పద్మనామముండును. బొడ్డు నందొక యక్షరముండి దళ వర్ణములతో కలుపుకొనుచు పోవుట ఒక విధము. స్రగ్ధర పద్యముతో అనులోమ విలోమమున నడిచి యష్టదళ పద్మ నామమున ప్రసిద్ధమై యుండునది వేఱొకటి అని లక్షణము. బొడ్డున అక్షరము లేకుండ పద్మ ముండును.

1. చతుర్దళ పద్మము.

దీనికి లక్షణము : సర. కంఠా. పుట. 14. చిత్రప్రకరణమ్.

"కర్ణికాతో నయే దూర్ధ్వ పత్రా కారాక్షరావలీమ్
ప్రవేశ్యేత్ కర్ణికాయాం పద్మేతచ్చతుర్దళమ్."

ఉదా :- సంస్కృతం. సర. కం. ఆ. 2-290.

"సాస వాత్వా సుమన సా
సార తాపీ వరో రసా
సార ధామైతి సహ సా
సాహ సర్థ సువా ససా."

[మా పటము - 36]



చతుర్దళ పద్మము
పటము- 36

2. షట్పత్ర పద్మ బంధము.

ఉదా:- రాప్తాటి ఓబిరెడ్డి, కవిజన వినోదిని. వ్రాతప్రతి పుట. 76.
బొడ్డున అక్షరములేదు. "రాప్తాడోబిరెడ్డి" అనికవిపేరు మధ్యలో ఏర్పడును.

తే॥గీ॥ రావులేల పంచాననాప్తాపయోరు
దక్షభూరుదోషాజి సామేక్షణార్య
బిట్టుగా మాటి కిట్లునేరెట్టిగా సు
రాధ్య నేర్పొడ్డి వేడనేయద్రి ధీర. [చూ. పటము_37]



షట్పత్ర పద్మము

పటము_ 37.

౹. అష్టదళపద్మబంధము.

ఇది ప్రచుర మైనది. పద్యము నిడివినిబట్టి బొమ్మ మారుచుండును. కాని
క్షణమొకటే. ఏ పద్యముతో గూడిన అష్టదళ పద్మమునకైనను ప్రవేశనిర్గమనము
ండును. నిర్మాణరీతి యొకటే. బొడ్డున అక్షరము వుండవచ్చును. లేదా లేక
వచ్చును.

(1). 8 ఛందము పట్టెడి యష్టదళ పద్మము.

లక్షణం. "కర్ణికాయాం న్యసేదేకం ద్వే ద్వే దిక్షు విదిక్షుచ
ప్రవేశ నిర్గమౌ దిక్షు కుర్యా దష్ట దళామ్బుజే"

[సర. కంఠా. చిత్ర. ప్ర. పుట.27].

ఈ పద్మ భేదము సర.కంఠా; పా.స; ఇత్యాదుల ప్రదర్శింపబడినది.

ఉదా:— మాణవకవృత్తము. వేదులవారి. ల.స. (ఆంధ్ర) చిస్త. 19.

"మారము మామేరరామా
మ్మారర గాంజేయు రమా
మారయు తానీ వరమా
మారవ మమ్మోము రమా". [చూ.పటము .38]




అష్టదళము
పటము— 38.

ఇచ్చట బొడ్డున అక్షరముకలదు. ఆ అక్షరముతో పద్యము మొదలగును. నాలుగు దళముల ప్రవేశ నిర్గమనము లున్నవి.

(2) 12 ఛందము. స్రగ్విణి. పాదమునకు 12 అక్షరాలు. 4×12=48. బొడ్డునందలి అక్షరము పాదమునకు నాలుగు సార్లుచొ॥న.4×4=16పోగా వత్రమునకు 4చొ॥న 8×4=32 అక్షరాలు సరిపోవును.

(3) 14 ఛందము. వత్రమునకు 4 అక్షరాలు. బొడ్డు నందొక యక్షరము 2 సారులావృత్తి. కనుక 14–4 వత్రములకు రానుపోనులు 4×8=32. మిగిలిన నాల్గింటికి 4×4=16, మొత్తము 48. బొడ్డునందలిది 8సార్లు. కనుక 8 అక్షరాలతో సమానము. 48+8=56. 4×14=56. పద్యమున కక్షరాలు.

(4) 15 ఛందము. ఉత్సాహము. దళమునకు 5 అక్షరాల చొ॥న, 8 దళములకు 8×5=40 4దళములకు అనులోమ విలోమములో ఆవృత్తి జరుగును. గనుక 4×5=20 అక్షరాలు. మొత్తము 60 అక్షరాలు సరిపోవును. దీనికి బొడ్డున అక్షరము లేదు.

ఉదా:– తెనాలి రామభద్రకవి. ఇందుమతీ పరిణయం.4–256. 'ఉత్సాహము'

"వీరభావభాసి సత్త్వ విద్విజారి వారహా
హారవారి జారికీర్తి హారితా సుధీరసా
సారధీసుతా ధ్వ సూన చంపమానదార కా
కారదాన మా నితా ధిక ప్రభావ భారవీ".

[అకారము మత్కృతము.] [చూ.పటము–39]

(4.A) సగటున పాదమునకు 15 అక్షరాలు. తేటగీతి. బొడ్డున అక్షరము కలదు.

ఉదా:–[రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి.పుట.‹2]

"జనవర స్తోత్ర మాధవ వనజనజ
జనన జపితాంగ రాఘవ స్వామి జలజ
జలజ మిత్రాక్ష శౌరి ప్రశస్తపాద
యజ జయద పాహిధృత చంచదమర వనజ". [చూ.పటము–40]



అష్టదళ పద్మము

పటము – 39

(4.B) పంచచామరము. 16 అక్షరాలు. బొడ్డున అక్షరముకలదు. ప్రతి దళ మున కేడక్షరాలు.

ఉదా:– తంయాల లక్ష్మీనృసింహాచార్యులు– శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము. 2–138.

(5) 21 ఛందము. ఈ అష్టదళపద్మభేదము సంస్కృతాంధ్రముల స్రగ్ధర లోనే నిర్మింపబడినది.

సంస్కృతములో. పా.స; ల.స; ఈశ్వరశతకం, సా.ర; ప్రతాప రుద్రీయ మిత్యాది గ్రంథములందు స్రగ్ధరా వృత్తమున నిది ప్రదర్శితము.



అష్టదళ పద్మము.
పటము_ 40

చక్రమునవలె నిందు నామగోపనము సాధ్యమగును.

నామాంకాష్ట పత్ర కమలబంధమని పా.స.లో చి. ప్ర. వెం.న. వేంకటపతి అని 8 పత్రాగ్రముల కవి పేరును నిబంధించియున్నాడు.

అష్టదళ పద్మ బంధమునకు పైన పేర్కొనబడిన దానికితోడు మఱియొక లక్షణము.

"కనుగొన రేకు లెన్మిదియుఁ గర్ణిక చుట్టిడి ప్రస్గరాంఘ్రులన్
మునుపటి యేడు వర్ణములునుం గడయేడుఁ బ్రవేశ నిర్గతుల్
పనుదగడ నాల్గు దిగ్దళములన్ లిఖియించి విదగ్ధళంబు లం
దెన యఁగఁబాద మధ్యగములేడును వ్రాయఁగ బద్మబంధమౌ"

[రామరాజభూషణుడు_నరసభూపాలీయము]

ఉదా:_ కనుపర్తి అబ్బయ్య-కవిరాజ మనోరంజనము 4_173,

"హరీ నిష్ఠాలిబల్యాద్యభినుత సమరోగ్రాఘసుశ్రీవరాహా
హా రావ శ్రీ సుఘ గ్రాహక రతిముఖ లౌల్యా వనస్థాసురీహా
హరీ సుస్థాన వల్యాయ తవికిన సమగ్రాటక ప్రాక్షరోహా
హారోక్షప్రాకట గ్రాహ్యాసిత యశసకల్యా బలిష్ఠా నిరీహా"

(చూ.పటము-41)



అష్టదళ పద్మము.

పటము - 41

నిర్మాణపద్ధతి : ప్రతిపాదమున మొదటి 6 చివరి 6 ప్రవేశనిర్గమనాక్షరములు మధ్య 7 చలనములేనివి మొదటి, చివరియక్షర మొకటిగా ఉండును. అదే బొడ్డు నందలి యక్షరము. అది 8 సార్లు ఆవృత్తి యగును. చలనములేని 7 అక్షరము లొక పత్రమునకు చొ॥న 4 పత్రములకవి సరిపోవును. పత్రము ఒక ప్రవేశము ఒక

నిర్గమనముండును. ప్రవేశ నిర్గమనాక్షరాలొకటి గాన లెక్కకు పాదమున కారక్షరాలే వచ్చును. అవియొక పత్రమునకు సరిపోవును. అట్లు నాల్గుపాదములలోనివి 4 పత్రములకు సరిపోవును. అనులోమ విలోమగతి 7 అక్షరముల కుండును గనుక చివరినుండి రెండవ యక్షరమున ప్రాస పాటింపవలెను.

అసలు పద్మ బంధమన విదియే.

బంధమందలి పద్యము చదువుకొనురీతి :

బొడ్డునందలి 'హా' తో ప్రారంభించి యొక పత్రమునకు వరుసగా పైపైకి చదువుకొని రెండవపత్రమునుగూడ ఇట్లే క్రిందినుండి దళాగ్రమువరకు చదువుకొని, తర్వాత మూడవ పత్రము దళాగ్రమునుండి బొడ్డువరకును, బొడ్డునందలి యక్షరమును గూడ కలుపుకొని చదువుకొనవలెను. అప్పటికొక పాదము పూర్తియగును. బొడ్డునందలి 'హా'తో మరల మొదలిడి మూడవ పత్రము పైపైకి చదివి, నాల్గవ పత్రమును రెండవదానివలె చదివి, 5వ పత్రము దిగువకు బొడ్డునకు జేరునట్లు చదివి 'హా'ను కలుపుకొనవలెను. అప్పటికి రెండుపాదములు పూర్తియగును. ఇట్లే తక్కినవి చదువుకొనవలెను.

ఈరీతి యష్టదళపద్మభేదమున కుదాహరణములు.

2) రామరాజభూషణుడు_నరసభూపాలీయము.85

3) అప్పకవీయము. 4_587.

4) వేదులవారి. ల.స. (ఆంధ్రము) చి.స్త. 39.

5) చెలమచర్ల రంగాచార్యులు. ఆంధ్రప్రతాపరుద్రీయ యశోభూషణము

6) విక్రాలవారి. శ్రీ.వేం చి.ర.కరము. పూ.భా.పుట. 47.

7) అల్లమరాజు రంగశాయి. శ్రీ. ఆంధ్ర. చంపూరామాయణము ఆరణ్య.

8) వీరరాఘవాచార్యులు. యథాశ్లోకతాత్పర్య భారతము. ఉద్యోగపర్వం. 6వ ఆశ్వాసాంతము పుట. 319.

9) ఉేకుమళ్ళ రంగశాయి. వాణీవిలాస వనమాలిక. పుట. 405. శ్లోకము.

10) బుర్రా కమలాదేవి. ఛందోహంసి.

11) గ వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 870.

12) కొక్కొండ వేంకటరత్నం. బిల్వేశ్వరీయము. 3_207.

(5.A) ఇందలి రెండవరకము. బొడ్డున అక్షరము లేకుండుట. ఇట్టిది ధరణి



అష్టదళ పద్మము
పటము_42

దేవుల రామమంత్రి. దశావతార చరిత్ర (277 పద్యము)లో వ్రాసియున్నాడు. వశిష్ఠ నుతి సందర్భము. మొదటి చివరి యక్షరము లొకటిగా ఉండునట్లు వ్రాసిన సరిపోవును. అప్పుడు ప్రతివత్రమున కేడక్షరా లుండును.

(5.B) ఇందలి మూడవరకము. ప్రతిపాదమున 10,11,12, అక్షరస్థానముల నొకే యక్షరముంచినట్లు పద్యనిర్మాణముండుట ఈ రకమునకు చెందినది. సంస్కృతములో పా.స;ల.స;సర.కంఠాలలో ఇదిగలదు. పద్యమున మూడు స్థానముల ఒకే అక్షరము కనబడినను, అది బొమ్మలో ఒకే స్థానమున ఉండును. అంతేకాక ప్రతి పాదమున మధ్యలో అనులోమ విలోమము కొంత పాటింపబడును. అందలి మధ్యా

క్షరమే యిది. ఉదాహరణ పద్యములో త్,మ్మ,ర్,న అను నాలు గటువంటివి కలవు అవి 3సార్లు ఆవృత్తియగు నక్షరములు.

బొడ్డునందలి యక్షరమునకు చుట్టును ప్రతివరుసలోను 3 అక్షరము లనులోమ విలోమములో ఉండుట ఈ భేదమందలి ప్రత్యేకత.

ఉదా :- పా.స.చి.ప్ర. 30.

"సాకేతత్రాణవేళా జనితతత నిజపాఙ్క్తిజశ్రీప్రభాసా"

ఇందు "వేఙ్కటపతి కమల" అని పత్రాగ్రముల అక్షరములు కలుపుకొనిన ఏర్పడును.

[చూ. పటము 42]

4. ద్వాదశదళ పద్మ బంధము

తెలుగున. గ.వేం.కవి. అనుష్టుప్ శ్లోకములో దీనిని రచించెను. ప్ర.రా.వేం.వి.వి. 852 పద్యము. పద్మమునకు 12 దళములుండును.



ద్వాదశదళ పద్మము

పటము_43

"రావదే ప్రోవమాధారా। రాధా మహాత్మ్య సాగరా
రాగ సాహిత్య వాజీరా। రాజీవాకార దేవరా."

[చూ. పటము-43] [ఆకారము మత్కృతము]

**4. A.** ద్వాదశదళ పద్మము. రెండవరకము. చంపకమాల. రావు కొండల రాయుడు. చిత్రకవిత్వ దర్పణం. వ్రాత ప్రతి.

రేకుల చివరినుండి 3వ అక్షరము కలుపుకొనుచుండిన "కొండమహీకాంత వరకృతి" అని ఏర్పడును. "ద" కేంద్రాక్షరము. ప్రతిరేకున 6 అక్షరములుండును 12 రేకులకు 12×6=72. "ద" 12 సార్లు ఆవృత్తి. మొత్తము 84 అక్షరములు

"దనుజ విరామునిన్ దమిత దానవు సాదర భావుకొంకృతిన్
దనుభవ డంబిరున్ దరుణ తా మహితున్ ద........దితున్
దనురుచి కాండదున్ దమి హృదంతరునిన్ దవనాదివంది తున్
దనరకరంచినే దలతు నాకృతముల్ దతరీతి దీరగన్."

పద్యములో రెండవ పంక్తిన 4 అక్షరములు పోయినవి.

[చూ. పటము] ఆకారము మత్కృతము



పటము-44

## 5. చతుర్దళ దళ పద్మము

[విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. ఉ.భా. పుట. 54లో ఒకసీస మీ చతుర్దశదళపద్మ బంధమున కుపయోగించిరి.సీసపాదములనే యిందు కుపయోగించిరి. తేటగీతి పద్యము బంధమునలేదు. ఒక్కొక్క దళమునకు 7 అక్షరాల చొ॥న 14×7=98 అక్షరాలు సీసము నాల్గుపాదాలకు సరిపోయినవి.బొడ్డునందలి యక్షరము పాటింపబడలేదు. దళాగ్రములందు "శ్రీ వేంకటాచలపతి పరమాత్మనుతి" యనియు వృత్తప్రతి నాల్గవ యక్షరము కలుపుకొని చదివిన "విక్రాలశేషాచార్య చిత్రరత్నాకరము" అని కవి, కావ్యముల పేర్లు నిబంధింపబడినవి.



చతుర్దశదళ పద్మ బంధము

పటము_45

సీ॥ శ్రీకాంత విబుధ సంసేవ్య చక్రాబ్జాఢ్య
వేంకటశైల వ పంకహరవి
శేషభటా చంద్ర భూషాన తాంఘ్రి సం
భాత చారూపల వ్రతవర్య
అనఘ సత్కృతప చిత్తయతి పతిగోత్ర ప
స్వామి సర్వేశ్వర సమరమాధి
రత్నాకరాలయ రక్షికవిశ్వాత్మ
నుతికర శుభకర నతముల గతి
తే॥ గీ॥ సతత ధర్మప్రవర్తక సారసాక్ష
సర్వభువన శివంకర చరణనలిన
వినత వినతాను తాదిక వినుత విమల
భార్గవీ వసుధానాథ భవ్యగాధ.

[చూ. పటము _45]

౧. షోడశదళ పద్మ బంధము

లక్షణం : "మధ్యేమ వర్ణవిన్యా సా త్పద్మోయం షోడశచ్ఛదః"

[సం.కంఠా]

సంస్కృతములో ల.స; శివపాదకమలరేణు సహస్రం. సా.ర; పా.స; సర. కంఠా, మున్నగు గ్రంథములందిది ప్రదర్శితము. మధ్యాక్షరము "మ" వర్ణమేకాక ఏదైనను వాడవచ్చును.

1) 8 చందమున

తెలుగున ఉదా :_ సుమగుళచ్ఛ బంధమను పేర మరింగంటి వేంకట నృసింహాచార్యులు - తాలాంకనందినీ పరిణయము [5. 330]లో వ్రాసియున్నారు. మధ్యాక్షరము "రా".

"సారా చారా సౌరా ధారా
మారా కారా పరాత్పరా
పారా వారా గారా శూరా
హీరా హారా ధరా ధరా".

[చూ. పటము_46]



షోడశదళ పద్మము

పటము-46

ఉదా:- 2) వేదులవారి ల.స. (ఆంధ్రము) చి. స్త. 20 ప్రమాణీవృత్తము.

3) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 58. విద్యున్మాలా.

2) కందమున. ఈ షోడశదళ పద్మము. మొదటిరకము.

ఉదా:- "సారవరహార వారా
సారహారీ నరహరి హరశరకర సారా
గౌరధర ధీర వారా
సారహారీ సురహరి నరసర సారధరా."

గ.వేం.కవి - ప్ర.రా.వేం.వి.వి. 808 పద్యములోని గర్భిత కందము]

[చూ. పటము- 47] [అక్షరము మత్కృతము]



షోడశదళ పద్మము

పటము_47

(2. A). కందమున. షోడశదళపద్మము. రెండవరకము.

ఉదా:_ రాప్తాటి ఓబిరెడ్డి. కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట. 66.

"నారాయణ నాదైవమ
నారక్షక నామనౌక నా లాలస నా
నారూప నామరచనా
వైరిహరణ విమల. కనకవసన వరచరా."          (చూ. పటం. 49)

(3) మత్తేభమున. షోడశదళ పద్మము.

ఉదా:_ రావు కొండలరాయుడు_చిత్రకవిత్వ దర్పణం_వ్రాతప్రతి.

"సమరార్థీలు సభావుకవ్య సమవక్ష శ్రీ సమాంశక్రియా
సమకోకీరస చండదాము సవన స్వామిన్ సమారంభకున్
సమునాధుల్ రసయాభసంప్రసవ _ _ _ సమున్ రంత్రుకా
సము చింతింతు సదాతలంచి సఖాచిత్యంధాస చిత్రంబుగన్."

మూడవపంక్తిలో 3 అక్షరములు పోయినవి. (అకారము మత్కృతము).

(చూ. పటము-48.)



పటము-48

రేకుకు 4 చొ॥న. 16×4 = 64, కేంద్రాక్షరము 16సార్లు ఆవృత్తి. మొత్తము 80 మత్తేభమున కక్షరాలు.

[4] సీసమున. షోడశదళ పద్మము.

కవులు వారివారి బుద్ధివిశేషము చేత వివిధ ఛందముల ఒకే బంధమును వెలయించిరి. రీతి ఒకటేయైనను ఛందము భేదము.

ఉదా:- అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయం. పుట. 115.

సీ॥ పూజ్యుండు విద్యల పోషించు సుగుణుండు
కవులపాలిటి మేటి కల్పకమ్ము.
లలితకళావేది లక్షణలక్ష్య శా
స్త్రరతుడు ప్రవిమల చారుమూర్తి.

రాజితాంధ్రధనలంద రక్షణ దక్షుండు
విమలయశోధన విస్తృతుండు
విలసత్కవిత్వ వివేకి విజ్ఞులగొల్చు
వినయ ధురీణుడా లనవినోది.

తే॥గీ॥ క్షమ వంశాబ్ధి లబ్ద మృగాంకుడతడు
మిగుల నుపకారి బాంధవ మిత్రులనధి
కముగ జూచు బాంధుల గృపగాంచు, కులమ
తముల సమత, జూచు మునులదలను గొలుచు.

(చూ. పటము-50.)



షోడశదళ పద్మము.

పటము-49

ప్రతి దళమున 6వ అక్షరము బొడ్డునందలి యక్షరము. అది 'ల'. అట్లు దళమున కొకసారి దానిని కలుపుకొనుచు పోవలెను.

ఉదా:- (2) మిన్నికంటి గురునాథశర్మ. శ్రీ మద్గురు భాగవతము. 12-13. "ఇందు మిన్నికంటి గురునాథశర్మగారి భాగవతము" అని ఏర్పడును.



షోడశదళ పద్మము.

పటము-50

7. ద్వాత్రింశద్దళ పద్మబంధము.

లక్షణము: మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. ని. గ్రం. 88. పద్యము

"పత్రంబుల్ పదియారు లోపలఁ బయిం పత్రంబులా మాత్రమే
పాత్రంబౌనటు వ్రాసి సీసము లిఖింపం గేసరాగ్రము లం
బత్రాగ్రంబుల నున్న వర్ణములచే బత్యాంతరంబౌనిదే
ద్వాత్రింశద్దళ పద్మబంధము ప్రబంధశ్రీకి పద్మంబగున్."

ఉదా:- (1) వావిలికొలను సుబ్బారావు. శ్రీ కుమారాభ్యుదయము.
3-136, 137.

(2) విక్రాలవారి శ్రీ. వేం. చి. ర. కరము. పూ భా.
పుట. 48. సీసము. తేటగీతి, తోటకము.

సీసము, దానిక్రింద తేటగీతి, తోటకము ఈ బంధమునకు వ్రాయుదురు. దళాగ్రమందు తోటకమును వాడుదురు.

16 దళములు లోపల వానిపైన బయట 16 మొత్తము 32. లోపల 16 దళముల కొక్కొక్క దానికి 10 చొ॥న. 16×10= 60 అక్షరములు. పై షోడశ దళసీస పద్యమునకువలె సీసము, తేటగీతి సరిపోవును. బయట దళాగ్రములు పదు నాఱింటికి నొక్కొక్కదానికి 3 చొ॥న 16×3 = 48. తోటకములోని యక్షరములు సరిపోవును.

ఉదా:- (3). తాని సీసము, తేటగీతి, తేటగీతి పద్యములతో ఈ బంధమును రాప్తాటి ఓబిరెడ్డి-కవిజనవినోదిని. వ్రాతప్రతి. (పుట. 77)లో వ్రాసియున్నారు.

శ్రీదనిత్యస్తుత్య పాద సార ప్రోక్త మాస్యప్రవక్త రామా విరాధ
మర్దనా శృంగార మాధవ శ్రీసౌఖ్య దాతా మహీవరా ధన్యభావ
వాణీశ నారద వసువాసవస్తుత రాధికా రాధ్య స్వారస్య నామ
మతఙ్గహితధీర మకాపు సదయాబ్ధి రసభావ యక్షయా రాజవదన.

తే॥గీ॥ రారశ్రీకర శౌర్యప్రకార సుకర।
వర్త నాహరి సుస్థిర వాసధీర
దైత్యరాడ్భంగ సుశ్రేయదమున ధిషణ।
దేవసంస్తుత్య వాక్యనన్ బ్రోవరార.

తే॥గీ॥ శ్రీరమా రమణీవర ధీరవర్య।
నారదస్తుత్య మాధవ రారరామ
కావ రార సురాధిక్య పావనాఖ్య।
భాసురాఙ్గ దయాకర వాసుదేవ.

ఈ చివరి తేటగీతి, దళాగ్రములందు వాడబడినది. (చూ. పటము - 51)



ద్వాత్రింశద్దళ పద్మము
పటము – 51

## 3. ప్రకీర్ణ బంధములు.

### 1. త్రిదళ చంపకము

తెనాలి రామభద్రకవి ఇందుమతీపరిణయములో (4-256). ఉత్సాహవృత్తమును రచించెను. త్రిదళ చంపకబంధమను పేర గుర్తింపబడినది పై గ్రంథములో ప్రదర్శింపబడినది. కాని ఇది నిజమున కష్టదళ పద్మబంధ పద్యము. ఎట్లన రచన మందుకు సరిపోవును.

అందువలన అష్టదళ పద్మబంధభేదములలో దీనిని ప్రదర్శించితిని. ఇప్పుడు త్రిదళ చంపకముగ ప్రదర్శింపబడుచున్నది.



త్రిదళచంపకము

పటము - 52

ఆ పద్య మిది.

వీరభావభాసిసత్త్వ విద్యుజారి వారహా
హారవారి జారి కీర్తి హారితా సుధీరిసా
సారథీ సురాఢ్యమాన చంపమాన దారకా
కారదా సమానితాధిక ప్రభావ భారవీ. (చూ. పటము - 52)

౬. గుచ్ఛబంధము

సంస్కృతములో కుసుమోచ్చయ బంధమను పేర రచింపబడినది. ఇది ఈశ్వర శతకము (86) సా. ర. (24)ల గలదు. సా. ర. లో గుచ్ఛబంధమనియే

పిలువబడినది. రిఘందమున చిత్రింపబడినది. సంస్కృతములో ఇది మాలికా బంధము వలె నున్నది.

తెలుగునను అరిఘందమైన మాణవకవృత్తమున ఎక్కువగా ప్రదర్శింపబడినది. విద్యున్మాలలోను కనపడుచున్నది.

ఉదా:- 1. విక్రాలవారి. శ్రీ. వేం. చి. కరము. పూ. భా. పుట. 46.

2. అప్పకవీయము. 4-574.

3. పూర్ణ ప్రజ్ఞాచార్యులు. శ్రీరామతత్త్వము.

4. వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము. 3-131.



గుచ్ఛబంధము

పటము - 53

5. ఓగిరాల జగన్నాథం. సుమనో మనోభిరంజనము.[1]
6. బుర్రా కమలాదేవి – ఛందోహంసి.
7. మాడభూషి వేంకటాచార్యులు. భరతాభ్యుదయము.[2]
8. తంయాల లక్ష్మీనృసింహాచార్యులు శ్రీ వేల్పుగొండ లక్ష్మీ నృసింహ మహాత్మ్యము. 2–140

ఉదా:– 1

మాణవక వృత్తము.

"సారసనేత్రా సురసా। సారసుఖ శ్రీతరసా.
సారతరాత్మీదరసా ।। సారదరాఢ్యా సరసా."
(చూ. పటము. 53). (విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. పుట – 46)

బొడ్డునందలి యక్షరము 'సా' నుండి ప్రారంభమై దానితో నంతమగు చున్నది. కుడివైపుకు క్రిందికి దిగుచున్నది. అట్లు చుట్టివచ్చుట జరుగును. ఇందు ప్రవేశనిర్గమనమున్నది. నాలుగు ప్రవేశ నిర్గమనములు.

రెండవరకము. స్రగ్విణి పద్యమున ప్రదర్శితము.

"భారతానంద పాపాద భూసార భా
భారసా పానభా భాన సంభారభా
భారభా బాలధా భాలసత్ మారధా
భారమా భారివా వారిదా తారభా". —విక్రాలవారి శ్రీ.వేం.చి.ర.
(చూ. పటము. 54) కరము ఉ భా. పుట 55.

మాణవకమున 12 పుష్పములు. స్రగ్విణియందు చుట్టు మూలలు నాలుగు కలుపుకొని 16 అయినవి. ఆ నాల్గు మూలలగల యక్షరాల కావృత్తి గలదు.

మూడవరకము గుచ్ఛబంధము. కందముతో తయారైనది.

---

1. ప్ర. రా. వేం. వి. వి. పి 8క. పుట. 28. పూ డ్ల రామకృష్ణయ్య.

2. అదే. పుట. 25.



గుచ్ఛము
పటము-54

కం॥ సురవర దరకర ఖరకర
కరఖర శరధార ధీర ఖరహారి హార
స్ఫురదుర నరవరధీర
త్రరమా రము రమ్య రక్షి రణిరతరధ్యా.

—పొత్తపి వెంకట రమణకవి లక్షణ శిరోమణి 4-705

(చూ. పటము. 55)

ఉదా :- 2) గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 851 పద్యము

3) మరింగంటి సింగరాచార్య, నిరోష్ఠ్యసీతాకల్యాణం. ప్రథమాశ్వాసాంతము కమలగుచ్ఛము [1]

[1] దశరథరాజ నందన చరిత్ర. అకాడమీ ప్రతి. 1919. పీఠిక, పుట. 48.



పటము_55

4) పురాణం పిచ్చయ్య. మైరావణ నాటకములో పుష్పగుచ్ఛము.[1]

### 3. పుష్పమాలికా బంధము

పువ్వులను మాలగా గట్టుగ ఇందు గననగును. పువ్వుకట్టు దగ్గర ఒకేయక్షర ముండునుగాని మూడుసార్లు చదువవలెను. రచనలో మాత్రమొకే యక్షరము మూడు సార్లు ఆవృత్తి యగును.

కావ్యముల ఆభరణముల వర్ణన సమయమున ఈ మాలికాబంధమును చెప్ప దగును.

ఈ బంధమును విరివిగా తెలుగు కవులు ప్రయోగించిరి. దీనిని పుష్పగుచ్ఛ బంధమనికూడ కాణాద పెద్దన మున్నగువారనిరి కాని నిర్మాణపద్ధతి ఈ మాలికా బంధమువలెనే యుండును.

---

1. యక్షగాన చరిత్ర. డా. యస్వి. జోగారావు. పుట. ౨౮౯.

మొదటగా కామినేని మల్లారెడ్డి ఉత్సాహవృత్తమున దీనిని చిత్రించెను.

ఛందమేదైనను నిర్మాణపద్ధతి, రచనా విధాన మొకేరీతిగ నున్నది,

కాని పెక్కుమంది కవులు చంపకమాల స్రగ్ధరలలోనే వ్రాసినారు. ఎక్కువ పుష్పములు, పొడవైన మాలిక తయారగుట కివియనుకూలము.

ఈ బంధ లక్షణము మం.పా శాస్త్రి ప్ర.సం.బం. ని.గ్రం.లో ఇటులున్నది.

సంధి నొకక్షరంబు నలుచక్కుల రేకుల నాల్గు వర్ణముల్
సంధిలునట్లు స్రగ్ధరయొ చంపకమాలికయో మిథోగ్ర సం
బంధము గల్గుత త్కుసుమ మండలిలో నిడ బుష్పమాలికా
బంధమ గుం బ్రతిప్రసవ వర్ణము లెడగు గూడ బాల్కినన్.

1. మొదటగా "ప్రమాణి"యందు మాలికాబంధము.

ఉదా :- అప్పకవీయము. 4-589.

అనంత నంద నందనా
సనాతనా జనార్దనా
ఘనాట రత్న రక్షర
మ్యనాగ నాధ నాశనా.

[చూ పటము-56]



పుష్పమాలిక

పటము-56

పుష్పము మధ్యలో అక్షరము మూడుసార్లు ఆవృత్తి. పై చిత్రమున మొత్త మైదు పుష్పములున్నవి. పుష్పము పుష్పము మధ్యలో ఒకే యక్షర మున్నది. కాని చివర కొకటి యెక్కువ మిగిలినది. లక్షణములో చెప్పినట్లు పుష్పమునకేడు వర్ణములు పట్టును.

ఉదా :– 2) పూర్ణప్రజ్ఞాచార్యులు–శ్రీరామ తత్త్వము

3) అడ్డమిల్లి నారాయణరావు నారాయణీయం. పుట. 120

4) మిన్నికంటి గురునాథశర్మ గౌరీకల్యాణము. 3–61, 62.

రెండు ప్రమాణ పద్యములు

5) బుర్రా కమలాదేవి చందోహంసి

6) బోడి వాసుదేవరావు చిత్రమంజరి. బంధ. 3.

2 ఉత్సాహవృత్తమున. కామినేని మల్లారెడ్డి. ష.చ. ద్వితీయాశ్వాసాంతం.

ఇందు 8 పుష్పము లేర్పడును.

3. పంచచామరము. కొణాద పెద్దన. భద్రాపరిణయము 1 283

ఇందు 8 పుష్పము లేర్పడును.

3.A. సుగంధి. చింతలపల్లి వీరరాఘవకవి. మధురవాణీవిలాసము. 5–135

8 పుష్పములు. గుచ్ఛ బంధమని పేరిడెను.

4 చంపకమాల. పుష్పమాలికాబంధ మీ పద్యములోనే విరివిగ చిత్రించుట జరిగినది.

ఉదా:– అప్పకవీయము. 4–590

"ఖరహర ధీర దేవ కనక ప్రకటాంబర వీరసార దు
ర్ధర ధరవార వేణు రవరమ్య రమేశ మధా మహా మహీ
ధర గరహార సన్నుత కృతజ్ఞత శిష్ట పరా పరావరా
శరణర జోరమా విశద శస్త్ర శమాత్మక శ్రీకళాకర."

[చూ. పటము–57]

మొదలు చివర ఒకే యక్షరము మిగిలినది. పువ్వు కేడక్షరాలు ఉదా:–మొదట పువ్వు నకు 'ఖరహారదిరదే' పుట్టినది. కాని బొమ్మలో మాత్రము నాలుగక్షరాలే కనపడును. చంపకమాలా పుష్పమాలికాబంధమందు 12 పుష్పము లుండును.

ఉదా:– 2) కామినేని మల్లారెడ్డి–శివధర్మోత్తరము. 7–91



పుష్పమాలికా బంధము

పటము. 5

3. కనుపర్తి అబ్బయ్య. కవిరాజమనోరంజనము 1-187
4. గోపీనాథ వేంకటకవి. గోపీనాధరామాయణము. బాలకాండము చివర 1348.
5 వీరి శిశుపాలవధము నాల్గవ ఆశ్వాసాంతము
6. రేకపల్లి సోమన రుక్మవతీ పరిణయం. 5-184 ఆస్వాసాంతము
7. ధరణిదేవుల రామమంత్రి. దశావతార చరిత్ర పుట. 277 [చిత్రగతుల రాముని వినుతించు సందర్భము]
8. నాదెళ్ళవారి అ. ఉ రామా 7-159
9. వీరి కృష్ణానదీ మహాత్మ్యము. 2-137
10. కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు భాగవతమహాత్మ్యము 'వరవర సారకార' పద్యము.
11. పురాణం పిచ్చయ్య. విజయాశ్వచరిత్ర పూ. భా. 6-765
12. కొడవలూరి రామచంద్రకవి. మహాసేనోదయము. 6-324
13. ఓగిరాల జగన్నాధం, సుమనో మనోభిరంజనము.[1]
14. అబ్బరాజు హనుమంతరాయశర్మ. శ్రీ నందిరాజులక్ష్మీనారాయణ దీక్షిత చరిత్ర. 2-195

[1] పూండ్లవారి ప్ర.రా.వేం.వి.వి.పీఠిక. పుట26

15. సుబ్బరాజ నామధేయుడు. శ్రీ గోవిందకృష్ణయాచేంద్ర విజయము.
16. అద్దువిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 121
17. విక్రాలవారి శ్రీ. వేం.చి.ర. కరము. పూ.భా బంధ 2
18. విక్రాల శ్రీదేవమ్మ. వాసవదత్తా పరిణయము 4-141
19. వీరి రసిక శరణాగతి పుట 58
20. బుర్రా కమలాదేవి. ఛందోహంసి
21. బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ-4
22. శ్రీపాద వేంకటాచలకవి. రామకృష్ణోపాఖ్యానము[1]
23. రాప్తాపి ఓబిరెడ్డి, కవిజన వినోదిని వ్రాతప్రతి.పుట 51
24. కోలాచలం శ్రీనివాసరావు. సునందినీ పరిణయము [ఇష్టదేవతా ప్రార్థన సందర్భము]
25. వెలగపూడి కృష్ణయామాత్యుడు. భానుమద్విజయం 5వ ఆశ్వాసాంతము
26. భువనగిరి విజయరామయ్య. మల్లికార్జున సహస్రము 1175 పద్యము
27 తంనూల లక్ష్మీనృసింహాచార్యులు. శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము. 2-139
28 మచ్చ వెంకటకవి. శు.అం. నిరోష్ఠ్య నిర్వచన కుశ చరిత్ర. 1-115 [అచ్చతెలుగు]
29 అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి. శు.అం. నిరోష్ఠ్య దాశరథీ చరిత్ర 23-277 [అచ్చతెలుగు]

5) స్రగ్ధరా. ఈ వృత్త పాదమునకు చంపకమాలలోవలె 21 అక్షరాలు కనుక దీని యందును 12 పుష్పములే ఏర్పడును

ఉదా:- 1) గ.వేం. ప్ర.రా.వేం.వి.వి. 863
2. పిండిప్రోలు లక్ష్మణకవి, లంకావిజయము. 2-228

---

[1] పూదండ్లవారి ప్ర.రా. వే.వి.వి.పీఠిక పుట. 2

[2] K.V. సుందరాచార్యులవారి 'అచ్చ తెలుగు కృతుల పరిశీలనము' సిద్ధాంత గ్రంథము. పుట 89 నుండి గ్రహింపబడినది. ఉస్మానియా విశ్వవిద్యాలయం.

3. కోడూరు వేంకటాచలకవి. శివరహస్య ఖండము. దేవకాండము. ద్వితీయాశ్వాసాంతపద్యము.

4. బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ -15

5. సింహాద్రి వేంకటాచార్యుడు. చమత్కారమంజరి. 2-60

6. చింతలపల్లి వీరరాఘవకవి. మధురవాణీ విలాసము 4-88

7. ముక్తినూతలపాటి సీతారామయ్య. శ్రీ వేణుగోపాల శతకము

6 కందము. కందపుష్పమాలికలో సామాన్యముగ 9 లేదా 10 పుష్పము లేర్పడును. పుష్పములమధ్య ఒక్క యక్షరమే యుండును. 61 అక్షరాలైన 10 పుష్పములువచ్చి మొదలు తుదల 1 అక్షరమే మిగులును.

ఉదా:- 1) గ. వేం. కవి. ప్ర.రా.వేం.వి.వి. 851

2. వీరి. ,, 808లో గర్భిత కందము
3. చింతలపల్లి చాయాపతి. రాఘవాభ్యుదయము 3-294
4. ఈదులపల్లి భవానీశ. ధర్మఖండము 9-291
5. తూము రామదాసు. మిత్రవిందో ద్వాహము 2-41
6. తెనాలి రామభద్రకవి. ఇందుమతీ పరిణయం 4-255
7. కుందుర్తి వేంకటాచలం మిత్రవిందా పరిణయము. నాల్గవ ఆశ్వాసాంతము
8. నాదెళ్ళవారి సోమేశ్వరీయము
9. వీరి అ.ఉ. రామా 3 పద్యము
10. వీరి గురుభక్తిప్రభావము 5-139
11. శ్రీరావూరి దొరసామిశర్మ. కందములో. 38 అక్షరాలు. 5 పుష్పములు
12. నాదెళ్ళమేధా దక్షిణామూర్తి శ్రీ హనుమద్రామాయణము సుందర-273
13. వీరి ఉత్తమ జీవయాత్ర 4 ఆశ్వాసాంతము
14. త్యాగరాజమొదలి సుబ్రహ్మణ్య విజయము. ఆశ్వాసము 2లో

7. సీసము

సీస, తేటగీతులకు కలిపి 22 లేదా 23 పుష్పము లేర్పడును.

ఉదా:- 1)అబ్బరాజు హనుమంతరాయశర్మ. శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రము 2-74 సీసమున ఈ బంధముకలను

2) మాడభూషి వేంకటాచార్యుడు. భారతాభ్యుదయము1
3) త్యాగరాజ మొదలి సుబ్రహ్మణ్య విజయము 2వ ఆశ్వాసములో

## 4. హారబంధము

ఇది మౌక్తిక మాలా, చంద్రహారము, తరలహారము పేర్లతో పిల్వబడుచు కొద్దితేడాతో వ్రాయబడును.

ఉదా:- పూడి పెద్దిలింగమూర్తి సువర్చలాపరిణయం. మౌక్తికమాలా అని కవి దీనికి పేరిడెను. కంఠమాల, వలయములనికూడా అనవచ్చు.

విద్యున్మాల : "రామా రామా రామా రామా। రామా రామా రామా రామా
రామా రామా రామా రామా। రామా రామా రామా రామా

[చూ. పటము 58]

రెండవది మౌక్తికమాలావృత్తమున ఛందమున. ముక్తహారబంధమను పేర త్రినావిలికొలను సుబ్బారావు- కౌసల్యాపరిణయమున రచించెను. ముక్తహారము మౌక్తిక మాలా వృత్తమున రచియించుట ఉచితము. ఈ రచనము గోమూత్రికా రీతిలో నడుచును.

"సారస నేత్రాయజభవ నాశా
నారద కాయా మనన వరత్రా
గౌర వినేత్రా యఘభయనాశా
నారద గేయాఘన సువిత్రా" [6-118]

[చూ పటము 59]

1, 3 పాదముల యక్షరము విడిచి యక్షరమొకటిగానే యుండును. అట్లే రెండు, నాల్గు పాదములును.

ఇట్టి హారబంధము సంస్కృతములో ల.స; చిత్ర. 20. న గలదు అందు దాని లక్షణ మిట్లున్నది

"హారాన్తరే తుదలయోరాద్యవర్ణా చతుష్టయమ్
రసాష్టదిగ్ర విమన తిధి భూపాః సమాస్తదా"

చదువుకొను రీతి : 'సా' నుండి మొదలై మధ్య పైవరుసలు కలుపుకొనుచు 'త్రా' వరకు చదివిన రెండుపాదములు పూర్తియగును. పిదప 'గౌ' నుండి, మధ్య

1 పూండ్ల రామకృష్ణయ్య ప్ర.రా.వేం.వి.వి. పీఠిక పుట. 26

క్రింది వరుసలు కలుపుకొనుచు చదివిన 'త్రా' తో మిగిలిన రెండు పంక్తులు పూర్తి యగును.



హారబంధము

పటము_58



హారబంధము.

పటము_59

మూడవది తరలహారము. చంపకమాలా వృత్త రచనము పుష్పమాలికా బంధమునకువలె ఉండును. కాని ఆకారము తరళహారము వలె ఉండును.

ఉదా :- **తూము రామ దాసు. మిత్రసంవో ద్వాహము 2-36.**

మురహర నీరజాక్ష మునిముఖ్య ముఖాధిప గోపరూప ని
ర్జరధర ధీరకుంజర పరక్షరమావర హీర శారదా
రరశర వార హాసరగరత్న రథాశ్రిత పాతకాంతశ్రీ
కరచరణార వింద కవికల్పక నీరద బృంద సుందరా."

ఆకారము మత్కృతము[మా. పటము. 60.]

ఉదా :- (2) రావు కొండలరాయుడు చిత్రకవిత్వ దర్పణం. మణిమాలికా బంధమని పేరిడెను. చంపకమాలలో పద్యము గలదు.



తరలహారము

పటము-60

## 5. కంకణ బంధము

సంస్కృతములో వలె తెలుగున కంకణబంధము విద్యున్మాలా వృత్తమున చిత్రితమైనది.

అప్పకవి లక్ష్యము నిచ్చినాడు.కాని లక్షణము చెప్పలేదు.

మం.పా.శాస్త్రి.ప్ర.బం.సం.ని.గ్రం.లో దీనికి లక్షణ మిట్లున్నది.

"కవియొక దానిలో నొకటిగా వలయాకృతిగా ద్విరేఖలం
గవియునటుల్ ఘటించి కడకం గడియంబున నాద్యమంత్యమో
యవునొక పద్యముంచబడినది యక్షర సంఖ్య సితస్తగతిం
దివియ ననేక రూపులగు దీనిన కంకణ బంధమండ్రిలన్"-15.



కంకణము [కడియము]

పటము-61

ఉదా:- అప్పకవీయము. 4-577.

"సేవే గోపాలం కేశిఘ్నం గోవృద్ధ్యద్రిధ్రంకం శంభుం
శ్రీదంభూనాథం వీనార్ద్యం కందాభాసం నీహాగారం."

[చూ. పటము 61]

అప్పకవీయములో ప్రదర్శింపబడిన పటమిది. ఇందు 5,3,8 అక్షర పదములు వరుసగా రెండుసార్లు పాటింపబడినవి. 5 అక్షరముల పదమునకైదక్షరముల పదము, మూడక్షరములదానికి మూడక్షరములది, 8 అక్షరముల పదమునకు 8 అక్షరముల పదము లెదురైనవి. కాని లక్షణము ప్రకారము రెండు వలయాకృతిరేఖల నొకదానిలో నొకటిగా వ్రాయుట జరుగును. కడియమున విద్యున్మాల వ్రాయబడును. విద్యున్మాలలో 32 అక్షరము లుండును. ఒక్కొక్కయక్షరము విడిచిపెట్టి ఆ విడిచిపెట్టిన అక్షరము నంత్యంగా చదివిన యెడల మరి 32 విద్యున్మాల లేర్పడినట్లగును. కంకణ బంధమున ఆద్యంతములు లేవని దీని వలన తెలియుచున్నది. ఏ అక్షరమునుండి మొదలిడినను వరుస దిరుగును. ఇదియే దీని ముఖ్య లక్షణము.

ఉదా:- 2. అద్దేపల్లి నారాయణరావు. నారాయణీయం. పుట. 110.

3. బుర్రా కమలాదేవి. ఛందోహంసి.

4. 8 ఛందమున. మహబూబ్‌నగర్. పాలెం. శ్రీరంగాచార్యవద్ద లభించినది,

"దీనాధారా మావాశీమే
శాలీవీనా క్రీశీభీదా
నీలాభీతం త్వంకి బీదీ
రాగీ భీరా కాకారావా."

బ్రహ్మశ్రీ వఠ్యము వరబ్రహ్మ శాస్త్రిలు. బంధములనేకముల వ్రాసిరి. అందలి కంకణ బంధ శ్లోకము మిగుల చిత్రము. ఆ శ్లోకమున 32 అనులోమమున 32 విలోమమున మొత్తము 64 విద్యున్మాలో వృత్తములుగల కంకణ బంధము లేర్పడుచున్నవి.

"వ్యాసాద్యావా కామా ధ్యాయా
పాల్యా త్వాగా త్రీలీ త్రాశా
స్త్రాద్రిధారా భాటీ క్యాఖ్యాప్యా
లీనా మేహా వైస్యా స్యాభా."[1]

ఈ కింకణబంధ మెచట నుండి నారంభించి చదివినను శ్లోక మేర్పడును. అసలు కంకణ బంధ చిత్రమిది యని నేను భావించుచున్నాను.

౯. ఛత్రము.



పటము _ 12

1. పూండ్ల రామకృష్ణయ్యగా ప్ర. రా. వేం. వి.వి. పీఠిక.పుట. 27 25)

సంస్కృతములో 8 ఛందమున ఛత్రబంధ మొకరేకము గలదు. మం. పా. శాస్త్రి. కాశీవిశ్వనాధ శతకములోని ఛత్రబంధ శ్లోకము.

"రాకరాక త్రిరాకారా । రాజతాగ గతాజరా
రాగసార రసాగారా । రాకారాత్రి కరాకరా."

(చూ. పటము - 62)

బొమ్మ యందలి శ్లోకమిదియే.

సంస్కృతమున 16 ఛందము లోకూడఛత్రబంధముకలదు. తెలుగున మాత్రము కందములోనే ఛత్రము కనబడుచున్నది.

మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. ని. గ్రం. లో ఛత్రబంధ లక్షణ మీ క్రిందిది.

"ప్రథమ చతుర్థ పాదముల ప్రాలనులోమ విలోమగామితా
గ్రథితములున్న రెండును సగంబునకే క్రమకంబు లిట్ల వి
శ్లథ విధినుండ దండమున ఛత్రమునం గ్రమ తన్ లిఖింపగా
బృథివిని ఛత్ర బంధమగు వృత్తము చిత్రముగీతిదే యగున్."

ఇట్లు ప్రథమచతుర్థ పాదములలోను విలోమముగా ఉండుటయే దీనిలక్షణము.

ఉదా :- 1. అప్పకవీయము. 4-573. కందము.

(చూ. పటము - 63)

"వారద మదనక వసుధర। వారవ సమసమస నా సదర మరీచా"
"చారీ మార సదానా సమసమ వరదార ధసువక నదమదరవా."

ఇందు 8 చువ్వలు గలవు.

ఉదా:- 2. గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 859.

3. కాకాద పెద్దన - భద్రాపరిణయం. 2-259.

ఇందు 10 చువ్వలు ఉండును.

4. కనుపర్తి అబ్బయ్య - కవిరాజమనోరంజనము. 4-172.

5. చింతలపల్లి ఛాయాపతి - రాఘవాభ్యుదయము. 2-258.

6. వీరి " 4-246

7. ఓగిరాల జగన్నాథం - సుమనో మనోభిరంజనము1.
8. వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము. 3-128.
9. పూర్ణప్రజ్ఞాచార్యులు. శ్రీరామతత్త్వము.
10. విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. బంధ. 15
11 బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 8.
12. బుర్రా:కమలాదేవి - ఛందోహంసి.
13. రాప్తాటి ఓబిరెడ్డి - కవిజనవినోదిని వ్రాతప్రతి. పుట - 50




ఛత్రము.

పటము - 63

1. పూండ్ల రామకృష్ణయ్య. ప్ర. రా. వేం. వి. వి. పీఠిక. పుట. 26

14. ఎల్లూరి నరసింగ కవికృతము[1].

15. రావు కొండలరాయుడు - చిత్రకవిత్వ దర్పణం. వ్రాతప్రతి.

16. తంయాల లక్ష్మీ నృసింహాచార్యులు. శ్రీ వేల్పుగొండ లక్ష్మీ నృసింహమహాత్మ్యము. 2-134.

ఛత్రము. రెండవరకము.

ఉదా:- ధరణిదేవుల రామమంత్రి - దశావతార చరిత్ర. 277. కందము.

"సురవర దరకర ఖరకర
కరఖర శరవారహిర ఖరహరహర
స్ఫుర దరనరవర ధీర
త్రరమారఘు రమ్యరక్షి రణరతరధ్యా."

ఆకారము మత్కృతము. (చూ. పటము - 64)

సంస్కృతం. చిత్రకావ్యకౌతుకమ్. పుట 85- పటం- 42.లో ఇటువంటి చిత్రమున్నది. అందు దీనికి లక్షణమిట్లు చెప్పబడినది.

"అశ్వతః పరతో గచ్ఛేత్తతోనేమి ద్వయేపిచ
స్వేష్టం కోష్ఠేషు విన్యస్య ఛత్రబంధే విదాం పరః."

(చిత్రబంధకావ్యమ్. పుట - 69)

మూడవరకము. శ్వేతచ్ఛత్రము.

ఉదా:- 1) వావిలికొలను సుబ్బారావు. శ్రీ కుమారాభ్యుదయములో రెండు పద్యములతో ఈ బంధము నిర్మింపబడినది

దోధకము:

"రామహామస్తమ రావటయుక్తా.
శ్రీమదమచ్ఛమరీ కచకస్థా
సామ జరక్షరసారమణీ పా
యాపరశీస్త జనార్దన కృష్ణా" -3-129.

---

[1]. కపిలవాయి లింగమూర్తిగారివద్ద లభించినది. [నాగకర్నూల్. మహబూబ్‌నగర్ జిల్లా.]

సుగంధి:

"తార హీరహార భూష ధాతతాత పూతకా
కారణ:స్వరూప పాదకుంజ జాగ్రధ దీర్ఘికా
కారికా వినాశ కాసుకామిత ప్రదాయకా
కారుమావ మిత్రనీల కంఠ శస్త్ర నామకా." -3-130

(చూ. పటము - 65)

ఉదా:- (2)

రాప్తాటి ఓబిరెడ్డి - కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట - 71
రెండు కందముల ఈ శ్వేతచ్ఛత్రమును చిత్రించెను.



ఛ త్ర ము
పటము-64



శ్వేతచ్ఛత్రము

పటము-65

## 7. చామరబంధము

సంస్కృతములో 8భందమున మన్దార మరంద చంపూ.5- 0లో ఈ చామర బంధము గలదు.

"మారసార తరస్ఫార
స్ఫూతిథారం పరం సురమ్
సీతానేత్ర చకోరేన్దు
బింబంవందే రమేశ్వరమ్."

మం.పా.శాస్త్రి. వారి ప్ర.సం.బం.ని.గ్రం.లో. చామర బంధ లక్షణ మిట్లున్నది.

"తొలియడు గిందునందరయ దుల్యము ప్రద్ర్భమకత్వమున్నయం
ద్రులకు సగంబునంద యొదగూడును దీనికి బంక్తులారుపై
యలుగున ఖడ్గబంధమున కంగ్రులు మూడును నాల్గుబంతులో
సలుపుదు రిట్టి కీలెరిగి చామరబంధము చామలాదులన్"–2.

తెలుగులో గ.వేం.కవి.యొక్క ప్ర.రా.వేం.వి.వి. 808లోని గర్భిత కందమునందు చామరము గలదు. అది వింశతి బంధకందము.

"సార వరహార వారా
సారహారీ నరహరి హర శరకర నారా
గౌరధర ధీరచారా
సారహారీ సురహరి నరసర సారఖరా" [చూ. పటము–66]

పై లక్షణము నాధారముగా గాని యూహించి యాకారము నిర్మించితిని.కావున ఆకారము మత్కృతము.

రెండవ రకము రావు కొండలరాయుడు–చిత్రకవిత్వ దర్పణం. కందము.

పట్టుకొను పిడియందు మొదటి పాదమందలి యక్షరములుండి తిరిగి యా యక్షరములతో నంతమగును. ఇట్లు ఛత్రబంధములోవలె పద్యము ప్రథమ చతుర్థ పాదభాగ మనులోమ విలోమము లగును.



చామరబంధము

పటము – 66

"నేను చనువును వయ మికని
ధానమున మనముననిడి పద్మాజీతలన్
పూనికిని కొలుతు నిరతము
లానంగన ధానికమియ వనువును చనునే." [చూ. పటము–67]



పటము _ 67

ఈ ఆకారము మత్కృతము

మూడవ రకము. తంయాల లక్ష్మీనృసింహా చార్యులు. శ్రీవేల్పుగొండ లక్ష్మీ నృసింహమాహాత్మ్యము 2_132. కందము. ఇది రెండవరకము వలెనే ప్రథమ చదుర్థ పాదభాగములనులోమ విలోమముగ నుండును కానిబంధము చివరలు కలుపుచు రెండక్షరములా వృత్తిరీతి యుండుట ఇందలి ప్రత్యేకత.

"ధీరవ విమల తదాజ్ఞా
భారశ్రీ రత్న గర్భ వశపా సార
అరక్ష దేవ షరస
గ్వార శ్రీరమ్య వక్షవలమ విషరధీ" [చూ పటం_68]



పటము _ 68

8 గంధపాత్ర బంధము

బోడి వాసుదేవరావుగారు [చిత్రమంజరి. బంధ. 24.] ఈ గంధపాత్ర బంధమును వ్రాసియున్నారు.

చం॥ కరస! విరాట్తురంగ! కిటికచ్ఛపరూప! యశోవిశాల! శ్రీ
కర! శ్రితదాన సత్ బిరుద! కంసహ! వాసవపుత్రమిత్ర! సు
స్థిరధర! దేవదేవ! హరి! శ్రీధర! భావజతాత! భూవరా!
కరివరదా! వరా! సుజనకామద! ప్రోవుము నన్ను సత్కృపన్.

కరస = మేఘమువంటి దేహకాంతి గలవాడా! [చూ- పటము, 69]

బారుల కక్షర సంఖ్యా నియమము లేదు. పై వరుసలో అంచున అడ్డముగ 'కవికిశోర బి. వాసుదేవరావు' అని కవినామము గోపన మొనరింపబడినది.



గంధపాత్ర

పటము-69

"కవియిచ్ఛ వచ్చినగతిం శకలంబులుగా లిఖియించి" యని. మం. పా. శాస్త్రి హరి ప్ర. సం. బం. ని. గ్రం. పద్యము. 79 శాసించియున్నది అట్లే యిచ్చట అక్షర సంఖ్యానియమములో కవికి స్వేచ్ఛ గలిగినది.

## 9. పుష్పపాత్ర బంధము

బోడి వాసుదేవరావుగారు. చిత్రమంజరి. బంధ. 23 ఈ పుష్పపాత్ర బంధమును చిత్రించిరి.

చం॥ వరద! రమావరా! సదయపంకజనాథ! రసాసమేత! భీ
కరనర కాంతకా! రసవికాస! గదీ! నతరాగ! దేవరా
యరిధర! కేశవా! సుజనభావన! కాయజ సుందరాంగ కా
పురహర సాయకా! వరద! ప్రోవవెనన్దయ వర్థిలంగమున్.



పుష్పపాత్ర
పటము_70

ఇది గంధపాత్రవలెనే 12 దారులు. పైవరుసన "వరద సారసనయన కావలె" అని కలదు. [చూ. పటం. 70.]

## 0. ఆందోళికాబంధము [పల్లకి]

ఆందోళికా లక్షణము పం. పా. శాస్త్రి. వారి ప్ర. సం. బం. ని. గ్రం. లో ఇట్లు చెప్పబడినది. పద్యము. 12.

"క్రమవక్రంబులుగా గ్రమేళకము జోకన్ దండఖట్వాది రూ
పములున్ సంధులయందు జిత్రకలశ ద్వంద్వంబు పూజాంతి మ
ధ్యము నందుం దల్క్రిందుగా జదువ వర్ణంబైన పద్యంబు హృ
ద్యముగా నందును జేర్చికూర్చు చతురుం డాందోళికాబంధమున్."

అన్నిటియందును మొదలు చివర నాలుగక్షరములుండుట నియమమైనది. వంపులో ఎక్కువ సంఖ్యలో అక్షరములుండుట గూడ సాధారణమే. ఈ బంధము తెలుగున కందమందే కలదు.

ఉదా:- (1) గ. వేం. కవి. ప్ర. రా. వేం. ఏ. ఏ 808. సీసము. అందలి గర్భిత పద్యక్రమక కందమే ఆందోళికా బంధమునకు సరిపోయినది.

"మారామా సాదయభర
భారశరా సా జలజసు వదనని జరసా
సారజవిన దవ సుజలజ
సారాశర ధార భయద సామారామా."

ఆకారము మత్కృతము [చూ. పటం. 71.]

ఉదా:- (2) సుబ్బరాజు నామధేయుడు. శ్రీ గోవిందకృష్ణయాచేంద్ర విజయము. 4-73. కందము.

రెండవవిధము : (1) బోడి వాసుదేవరావుగారు. చిత్రమంజరి. బంధ. 2. కుచ్చును కూడా పాటించి వ్రాసిరి. కుచ్చుకలిగియుండుట ప్రత్యేకత.



ప ల్ల కీ

పటము-71

"సారస నేత్రాధీరో
దారా! యరిదర వర గిరిధర మురహరణా
సార రసాబ్ధీ! సారర



పల్లకి
పటము_72

సారమణా! నిన్ బొగడవశమె. నే. సరసా." [చూ. పటము. 72.]

(2) రావు కొండలరాయుడు. చిత్రకవిత్వదర్పణం. వ్రాతప్రతి. కం.

### 11. రథము

ఈ బంధమును కందమునచిత్రించిన మొదటికవి. గ.వేం.కవి. కందరథమున మధ్యలో నిలువున 9 గళ్ళు. అడ్డము మధ్యలో 9 గళ్ళు ఉండును. పై శిఖరము నుండి పద్యము మొదలగును. ఇందులో మధ్యలో నిలువున ఏర్పడే 9 గళ్ళలో కవి తనపేరునుగాని, కృతిపతిపేరునుగాని దాచిపెట్టును.



పటము_73

ఉదా:-1) గ.వేం.కవి.ప్ర.రా.వేం.వి.వి. 854 పద్యము. కందము. బొమ్మలో ప్రదర్శింపబడినది. ఆపద్య మీ క్రిందిది.

"శ్రీ మీ వేంట న్గూడుక
రామ కరివి పెక్కడించి రమ్యగ జేశ
గ్రామణి గావన్ రాదా
నీ మాయాలీల నూవె నీలంగవతీ" [మా పటము-73]

ఈ కందమున 41 అక్షరములు 41 గళ్ళలో సరిపోయినవి.

చదువుకొనురీతి : పైన మొదలై తర్వాత క్రిందకు కుడినుండి ఎడమకు మరల ఎడమ నుండి కుడికి అట్లు వరుసగా అడ్డగళ్ళలో పద్యమును పూర్తి చేయవలెను. పై ఉదాహరణమందు మధ్యలో నిలువున "శ్రీ వేంకటేశ నీవెగతీ" అని ఏర్పడినది.

ఉదా:-2) పూడిపెద్ది లింగమూర్తి సువర్చలా పరిణయము.[1] ఇందుమధ్యలో "శ్రీగోపాలకృష్ణయాచేంద్ర" అని ఏర్పడును.

3) పురాణం పిచ్చయ్య విజయాశ్వచరిత్రము. ఉ.భా. తృతీయాశ్వాసాంతం. పద్యము. 252. మొత్తము 44 అక్షరాలు. క్రిందిమూడుగళ్ళు రెండుసార్లు వచ్చును. మధ్యలో "శ్రీ పిచ్చయ్య" అని కృతికర్త నామముగలదు.

4) నాదెళ్ళవారి సోమేశ్వరీయము. "శ్రీదాసోదా" పద్యము.

5) వీరి అ.ఉ.రామా. 5-194

6) వీరి కృష్ణానదీ మహాత్మ్యం 4-150

7) వీరి రంగదాసీయము. "నారేదెల్" పద్యము.

8) నాదెళ్ళమేధా దక్షిణామూర్తి. శ్రీహనుమద్రామాయణం. బాలకాండ. 28८ పద్యము. నడిమిని కృతి పేరు గలదు.

9) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి బంధ. 18. మధ్యలో నిలువున "వాసుదేవరాయకవిని" అని కలదు. 43 అక్షరాలు. 41 గళ్ళు మామూలే. మిగిలిన రెండు రెంకు చక్రముల కొక్కొక్కటి చొ॥న అక్షరముల నమర్చెను.

---

1. కాళిదాసు పురోషోత్తమ విరచిత సిద్ధాంత గ్రంథము. "గోపీనాథ వేంకటగిరి కవి. వేంకటగిరి సంస్థాన కవులు" పుట. 485. ఉస్మానియా. 1910.

10) ఎల్లూరి నరసింగకవి కృతము. కావ్యముపేరు తెలియదు. కందము.[1] మధ్యలో "శ్రీ రాజాలక్ష్మీరాయనత" అని యేర్పడును.

11) కోలాచలం శ్రీనివాసరావు. సునందినీ పరిణయం. ఇష్టదేవతా ప్రార్థన సమయమున వ్రాయబడినది. మధ్యలో "శ్రీరామా నీపేర నాగతి" అని ఏర్పడును. తేటగీతిన రథము.

పద్ధతి యొకటే యైనప్పుడే పద్యమునకైనను రథమును చిత్రించి చూప వచ్చును. 50 అక్షరములుగల తేటగీతి. మధ్యలో అడ్డము 9 గళ్ళు, రెండుసార్లు వచ్చిన మొత్తము 50 సరిపోవును. అప్పుడు నిలువు 10 అక్షరములు. అడ్డము 9 అక్షరము లుండును. క్రింది పద్యమున రథబంధములో మధ్యలో నిలువున "శ్రీ చంద్రశేఖరేంద్ర భారతి" అని పదిగళ్ళలో ఏర్పడినది.

తే॥ గీ॥ శ్రీశచంద్రాభ భద్ర కీర్తి ప్రభావ
శేవధీ శంకర నిభా ఖలావళీ వి
రాస చతురేంద్ర మస్కరి రాజచంద్ర
మౌళి జోహారుభాను సంస్ఫారకాంతి

[రావూరి దొరసామిశర్మ. "తెలుగులో చందోరీతులు".]

2) కొక్కొండ వేంకటరత్నం. బిల్వేశ్వరీయము. ప్ర.బింబము. 224.
మత్తకోకిలతో రథము
రావు కొండలరాయుడు-చిత్ర కవిత్వ దర్పణం. 4×8=72 అక్షరములు.
71 గళ్ళు. "శ్రీ వేంకటాచలరమణ వినుతి" అని మధ్య ఏర్పడును.
మత్తేభమున రథము
80 అక్షరములు. 80 గళ్ళు

కొండూరి సీతారామకవి. సావిత్రీ నాటకమున రథబంధ మత్తేభము కలదు.[2] సీసము దావిక్రింది తేటగీతిలో మహారథ బంధము.

ఉదా :- గోపీనాథ వెంకటకవి. శిశుపాలవధ కావ్యమున "శ్రీరాజ గోపాల కృష్ణయాచేంద్ర మహీరమణ" అని మధ్యలో ఏర్పడును.

---

1. కపిలవాయి లింగమూర్తిగారి వద్ద లభించినది. నాగర కర్నూల్. మహబూబ్‌నగర్ జిల్లా.

2. యస్వీజోగారావుగారి. యక్షగాన చరిత్ర. పుట. ౩౭౪.

అక్షరసంఖ్యనుబట్టి గళ్ళు గీసికొనవలెను.

ఉదా :-2) అబ్బరాజు హనుమంతరాయ శర్మ పాకయాజి. "శ్రీనందిరాజా లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్ర"లో చక్రములతో గూడిన రథము-ఆ పద్య మీ క్రిందిది.

సీ॥ శ్రీజలజాక్ష! లక్ష్మీరమణీయ
నానందదేహ! సత్యాభిరామ
ధీభార! బుధవరధ్యేయ! శ్రుత్యర్థాను
భావితమత్య గ్ర్యబాణవాగ్మి
ప్రాగ్ బంధహర! ధర్మబద్ధ దీప్తాశ్రితో
త్కర! విశ్వమూర్త్యక్షి సరసముఖ్య
వరకళా విలసిత సరస వాగ్యుత! కృతి
విరచనాచణ పరభృతి విరహిత

తే॥ గీ॥ నంది రాజాన్వవాయ రత్నాకర శశి
లక్ష్మి నారాయణాఖ్య! సల్లక్షణయుత
భవ్య దీక్షిత బిరుద విభ్రాజమాన
ధృతి చిదానంద సారస్వతీ నమోస్తు.

తేటగీతి పద్యము నాల్గుపాదములు నాల్గు చక్రములకునరిపోవును. రథములో మధ్య నిలువున "శ్రీ లక్ష్మీనారాయణ దీక్షితకృతి" అని కృతిపము గలదు.

[చూ. పటము-74]

3) నాదెళ్ళవారి అ.ఉ. 7-150 17 గళ్ళు

4) వీరి. గురుభక్తి ప్రభావము 1-159. 17 గళ్ళు.

5) వీరి. ధార్మికోల్లాసిని. ఏకాశ్వాసం. 332. 17 గళ్ళు.

6) విక్రాలవారి శ్రీ.వేం.చి ర.కరము. పూ.భా. బంధ. 3.

7) అద్దుమిల్లి నారాయణరావు, నారాయణీయం. పుట. 118, 119.

8) రాపూరి దొరసామిశర్మ. నిలువు 17 అడ్డము 15. మధ్యలో నిలువున "శ్రీ బాలసరస్వతి దొరసామిశర్మ రవిపర్మ" అని ఏర్పడును.



రథము

పటము – 74.

## 12. పతాకా బంధము

మరింగంటి వేంకట నృసింహాచార్యులు. తాలాంక నందినీ పరిణయములో ప్రథమాశ్వాసాంతములో (1–320) పతాకాబంధము నుత్పలమాలలో రచించి యున్నాడు.

ఉ॥ వేదప్రదర్శన! నవీన ఘనద్యుతి దేహ! దేవదే
వా! దర సారధారణ! శుభప్రభవాళరణ ప్రదీప్త! దా
మోదర! వాసభేదన దమోదయ! మానసవాస వాజరు
ద్రాది మభావ! భావిత పదాంబుజ! తాపసబృందమోదదా.

[చూ. పటము–75]

మం.పా. శాస్త్రి. ప్ర. సం.బం.వి.గ్రం.లో పతాకాబంధ లక్షణము.

"స్తంభాకారమునందు బ్రాక్చరణముం దత్రత్య వర్ణంబు లా
రంభం బంతము నౌనటుల్ ధ్వజ పటాగ్రం బట్ల యౌనట్లు త
చ్ఛుంభత్పార్శ్వములందు మధ్య పదముల్ శ్లోకాంత మాద్యాంఘ్రిగా
గంభీరాశము లిట్లొనర్తురు పతాకా బంధ మందంబుగాన్"

2) భారతీయ పతాకాబంధము.

[చూ.పటము.76]



పతాకము

పటము _75

## భారతీయ పతాకబంధము



పటము_76

కం॥ భారతలక్ష్మి కరవర
రార ధురన్దర సురత్న రమ్యారక్షా
కారణ నంబుల నరహరి
మారాకారాంగ కాసు మవిమల తరభా

కాకతీయ విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులు హరి శివకుమార్‌గారు పంపినది, ఈ భారతీయ పతాకబంధము. వారిచే సేకరింపబడినదట.

## 18. సింహాసన బంధము

ఉదా:- రావు కొండలరాయుడు-చిత్రకవిత్వ దర్పణం. కందము.

శ్రీకరము లగుచు మహిలో
నీ కరుణకు పాత్రమగుచు విన్వినుతింపన్
పాకారి వంద్య వినుమిది
చేకొని సిరులొసగుకృతి సిద్ధము జగతిన్.

"శ్రీరమణవినుతి" అని మధ్య ఏర్పడును. [చూ. పటము-77]

అకారము మత్కృతము.




సింహాసన బంధములు

పటము -77

మం.పా.శాస్త్రి.ప్ర.బం.సం.ని.గ్రం.లో లక్షణము—89 పద్యము.

"జలధి కరేందు హస్తయుగ సద్మము లేర్పడునట్లు నేర్పునం
జెలువగురేఖలం గలిపి సింగపు గద్దియ దిద్దికూర్చిన
ట్లలరిచి బల్వ చిత్రగతి నంఘ్రులు నాల్గును బూవి దానిలో
పల నిమిడింపగా నడియ భాసిలుగేసరి పీఠబంధమై."

## 14. ధ్వజ బంధము



కవి రావు కొండలరాయుడు. చిత్ర కవిత్వ దర్పణం.

కం॥.... ధరవిభ గాత్రా
ధారా ధర పాణినుద వితత గుణరామా
మారాస్త్రరిన్వేసు.ధా
ధారాక్లైపైక వాద దరిసుచరిత్రా.

[చూ. పటము_78]

ఆకారము మత్కృతము.

1వ పాదమున రెండక్షరములు, 3వ పాదములో 1. అక్షరము పోయినది.

పటము_78

## 15. గిరిబంధము

దీనిని శైల బంధమని, మేరుబంధమని కూడ పిలుతురు. తెలుగున కందము ఛందస్సత్నమాలలో ఈ బంధము కనబడుచున్నను సీసమునగూడ నిర్మింప వీలైనది,

రథ బంధమునకు వలెనే దీని నిర్మాణ పద్ధతి యుండును. కాని రథమున క్రిందకు పోనుపోను మరల సన్నగిల్లును. చివరకొక గడియే వచ్చును. గిరిబంధమున క్రింద అడ్డగళ్ళు గరిష్ఠ సంఖ్యలోనే యుండును.

ఉదా :_ ) శైలబంధము. కాణాద పెద్దన._ భద్రాపరిణయము. 1_282

కం॥ శ్రీశాగరు డాంచ ద్వా
హాశిప సఖలలిత శిలియాదృతకేళీ
దాశరధి కనక రశనద
యాశరది శ్రితాంబుజ భపయుంచిత విభవా.

[చూ. పటము_79]

గిరిబంధము.

శ్రీ
రు గ శా
డాం చ ద్వా హా శి
శీ త లి ల ఖ స ప
లి యా దృ త కే ళీ దా శ ర
ర శ యా ద న శ ర త న క ధి
భ శ్రి తాం బు జ భ ప యుం చి త వి భ వా

పటము_79

ఈ కందములో మొత్తము 49 అక్షరాలు. 49 గళ్ళు. క్రింద గరిష్ఠ సంఖ్య. 13 గళ్ళుండును. నిలువున మధ్యలో 'శ్రీ గద్వాలకేశవ' అని ఏర్పడినది. 7 గళ్ళు. సప్తశైలాత్మకమునకు సంకేతమేమో. 7 గిరులకు 1కి. 7 చొ॥న 7×7=49 గళ్ళు.

ఉదా :_ 2) కొడవలూరి రామచంద్రకవి మహాసేనోదయము శూర పద్మాదులు శివుని స్తుతించు సందర్భము [౨_166]47 గళ్ళు. క్రింద 11 గళ్ళవి రెండేర్ప

డును. విలువున మధ్యలో 'శ్రీరామలింగవందే' అని ఏర్పడును. 'దేహజ గర్వాద్రి కులిశ' అని యనుచు గిరిబంధమును వ్రాయుట సమయోచితము

3) జోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 1. 49 గళ్ళు.
'శ్రీగరుడాచలేశ' అని మధ్య ఏర్పడును.

4) త్యాగరాజ మొదలి. సుబ్రహ్మణ్య విజయము[1]. ప్రథమాశ్వాస కందము.

5) రామచంద్రకవి. చిత్రించినది[2]. కం. మధ్యలో "రామచంద్రసుకవి" అని ఏర్పడును.

6) కపిలవాయి లింగమూర్తి కృతము కం. మధ్యలో "ప్రతాప గిరి ఖండం" అని కావ్యనామ ముండును.

చంపకమాలతో గిరిబంధము. కొండూరి సీతారామకవి. సావిత్రీ నాటకము[3], సంస్కృతంలో, మేరుబంధము. చిత్రకావ్య కౌతుకము. పుట, 87, పటము. 43.

## 16. గోపురము

గిరిబంధము వలెనే దీని నిర్మాణము సాగును. శిఖరమునుండి పద్యము మొదలగును. అడ్డమున ఎడమనుండి కుడికి మాత్రమే ప్రతిసారి చదువుకొనవలెను ఇదియే దీని యందలి ప్రత్యేకత. విలువు మధ్యలో ఏదైన పేరు నుంచవచ్చును.

తెలుగున ఈ బంధమ కందమున చిత్రితమై కనబడుచున్నది.

ఉదా :-1) నాదెళ్ళవారి అ.ఉ.రామా. రామకృష్ణస్తవము. సందర్భము.

రామా మహితా మనమున
నీమంబును గొని తలంతు వినుగను గతి నీ
నామమునె యనుదు మనువు
ప్రేమన్వతతంబు మీకు భృత్యుండగదా.

"రామ నమగనుమో" అని మధ్య 7 అంతస్తులలోను పైనుండి క్రిందకు చదువుకొనిన వచ్చును. 49 గళ్ళు. [చూ. పటము-80]

---

1. పూండ్ల రామక్రిష్ణయ్య. ప్ర.రా.వే. వి.వి. పీఠిక. పుట. 26.
2. కపిలవాయి లింగమూర్తిగారి వద్ద లభించినది. నాగరకర్నూల్. మహబూబ్‌నగర్ జిల్లా.
3. యస్వీ జోగారావుగారి, యక్షగాన చరిత్ర. పుట. 2 9.

రా
మా మ హి
తా మ న ము న
ర ముం బు ను శో ని త
లం తు ని ను గ ను గ తి నో
నా మ ము నై యు ను యు ము ను ప వె
ప్రే మ స్నే త తం బు మి కు భృ త్యుం డ గ దా

గోపుర బంధము

పటము 80

ఉదా :- 2) నాదెళ్ళవారి. అ.ఉ.రామా. 7. 49. మరియు "స్వామిమిత్ర" పద్యము.

3) నాదెళ్ళ దక్షిణామూర్తి. శ్రీ హనుమద్రామాయణము కిష్కింధా. 205.

4) రావూరి దొరసామి శర్మ. శ్రీ ఘటికాచల నరసింహశతకము. షడ్గోపుర ద్వార బంధము. 49 గళ్ళు. "శ్రీ ఘటికాద్రీశ్వర" అని మధ్య ఏర్పడును. 2వ రకము. సీసపద్యమున గోపురము. "శ్రీరాఘవాచార్యకృతము [1]. మధ్యలో "శ్రీ సీతా రామచంద్రస్వామికి శుభము" అని క్రిందనుండి పైకి చదివిన వచ్చును.

## 17. పంజరము.

తెలుగున పంజరబంధము కందమున కనబడుచున్నది. నాదెళ్ళవారు దీనిని చిత్రించిరి.

1. మహబూబ్‌నగర్ జిల్లా. పాలెం. శ్రీరంగాచార్యగారి వద్ద లభించిన దడి. పద్యము.

ఉదా:- వీరి-అ-ఉ-రామా.

"శివనుత వెంపార హిమము
వివశుల నొనరు పగలట్టు వేసి విడకుపో
పవలకు నానది యొదవగ
లవు వరమిడు ముదమమున సలఘుతన్ బ్రతుకన్." [చూ. పటము-8]



పంజరము

పటము-81

ఇందు 57 అక్షరములు. నిలువు 9×అడ్డము 6 మొత్తము 54 గదులు. పైనకొంకి. కొంకియందక్షర మొకటి. అది ఆవృత్తి 3సార్లు. కనుక 54+3=57 మొత్త మక్షరములు సరిపోయినవి. చదువుకొనురీతి: క్రిందనుండి పైకి మొదటి నిలువునపోయి కొంకిలో అక్షరము కలుపుకొని రెండవ నిలువున క్రిందకు దిగి రావలెను. ఇట్లే తక్కిన బారులు చదువుకొనవలెను.

క్రిందనుండి రెండవ అడ్డబారున 'వరులదలతు' 5వ బారున 'వెలసినరఘు, 8వ బారున 'రవికులమున' అని ఏర్పడును.

ఉదా:. 2) వీరి. అ.ఉ.రామా. 7-151. దేవీస్తుతి సందర్భమున కందము. 47 గదులు. 9×5=45-2సార్లు ఆవృత్తి=మొత్తము 47.

3) వీరి. అ.ఉ రామా. భగవన్నుతి సందర్భము. 'విమలహృదయ' పద్యం.

## 18. నక్షత్ర బంధము

విక్రాలవారి శ్రీ.వేం.చి.ర.కరము. ఉ.భా. బంధశేషము. పుట. 53.లో కందములో నక్షత్ర బంధమున్నది. ఈ బంధమునకు లక్షణము కనబడలేదు. ఈ లక్ష్యమే ప్రదర్శితమైనది కనుక లక్షణముగ భావింపవలెను.




నక్షత్రబంధము

పటము-82

కం॥ ఫలవ వృషగిరి విహరణా
గిరిపీఢి నుతించితి నిటు గృపగొను శ్రీశే
షల షదురుమణి స్యందన
విలసనుత సురరిపు వితతి ఖిద శేషయుతా.

శ్రీశేష=శ్రీయుక్తుడైన శేషుడుకలవాడా! లషదుర=వెలుగుచున్న, వి=అధిక మైన, లస=భక్తిరసముతో, నుత, శేషయుతా=బలరామునితో గూడినవాడా!

[చూ.పటము-82]

కోణాగ్రములందలి యక్షరములు కలియగూడిన 'ఫణిగిరిప' అనియు, కూడలి యక్షరములు గలుప 'శేషవినుతి' అనియు వచ్చును.

మొత్తమైదు రేఖలతో నక్షత్రము పూర్తియగును. 5 అంకెలగల చోట్ల కోణాగ్రములు 1నుండి మొదలిడి రేఖ వెంబడి చదువుకొనుచుపోయిన నక్షత్రము పూర్తియగును.

## 19. చదరంగము.

చదరంగ కందపద్యము నాదెళ్ళవారి, అ.ఉ.రామా.లోనిది

[చూ. పటము-83

| న | గు | మొ | గ | ము | న | న | ను |
|---|---|---|---|---|---|---|---|
| భ | వ | మ | యి | ల | గు | వి | గు |
| ల | శ | హి | శె | య | స | మ | ప |
| ద | దు | డ | వ్ర | న | నా | శి | నై |
| బ | గ | ర | కు | బ | ల | ము | డు |
| ఫు | ల | ఘు | త | బా | గ | ర | డ |
| గు | ర | వ | యు | నా | ద | వ | వు |
| ఫు | రి | కొ | ను | వ | ల | ను | ల్ |

పటము - 83

ఆ పద్యము : "నగుమొగము ననను భవమయి.
తగుమిగుల రహియె యనమపదదుడవన నొగిన్
బగరకు బలముడు పులఘుత
బొగరడగు రవయు నొదవవు పురికొనువలనుల్."

చతురంగ అశ్వపదమిది. చదరంగములో అశ్వపు నడకల వెంట నడిచి చూచిన కోరుకొనిన పదములు వచ్చును. ఇందు గుఱ్ఱపు గంతులందు క్రమముగా "వరదుడ" "రఘువర" "వరములు" "నొసగుమి" అని ఏర్పడును.

నిలువు 8 అడ్డము 8 మొత్తము 64 గదులతో గూడినది చదరంగము.

సంస్కృతములో తురంగ పదబంధమని యందురు. కందమున సర్వలఘువులు పాటించి రెండవ నాల్గవ పాదాంతముల 'న్, ల్' వాడిన ఆ పొల్లులతో గూడి మొత్తము 64 అక్షరము లగును. 64 గదులలో సరిపోవును. ప్రతి బారున అడ్డముగ ఏడమ నుండి కుడికి వ్రాయుటయే జరిగినది. పైనుండి క్రిందకు ఆవిధముగ వ్రాసి పూర్తిచేయవలెను.

ఈ నాదెళ్ళవారే ఇంకొకదానిని యేనుగులు, శకటము నడకలతో కలిసి మంత్రి నడకలు గానంబడునట్లు రచించిరి.

తేటగీతిన చదరంగము.

నాదెళ్ళవారే దీనిని రచించిరి. తేటగీతి ప్రతి పాదమునకు 16 అక్షరాల చొ॥న. $4\times16=64$ అక్షరా లుండునట్లు రచియింపబడినది. అది.

"ఇచ్చ జలిమల జరుగంగ నెరుపు దువది
పసువు తగు రీతియో యామె సణగు కొనక
అ కనుడి మురుల బాయగు లు కుపడు మజ
మలిపడి దియోదు ముకరుద్ధ రిలరసాలు."

## చదరంగము. రెండవ రకము

వేదులవారి ల.స. (ఆంధ్ర). చి. స్త. 26. విద్యున్మాలావృత్తము పైబధమున 32 గదులకు సరిపోయినది. ఆపద్యమునే మరల వ్రాసిన మిగిలిన 32 గదులకు సరిపోవును.

ఆపద్యము : "రారా రావా రాధా తామా
ధ్యారా మాభా మాకా మారా
జేరా జాతా సారా భావో
మా రా జే మా ధీ పే తా మా."—26.

[చూ. పటము-84]

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా | రా 30 | రా 9 | వా 20 | రా 3 | ధా 24 | తా 11 | మా 26 |
| ధ్యా 16 | రా 19 | మా 2 | భా 29 | మా 10 | కా 27 | మా 4 | రా 23 |
| జే 31 | రా 8 | జా 17 | తా 14 | సా 21 | రా 6 | భా 25 | వో 12 |
| మా 18 | రా 15 | జే 32 | మా 7 | ధీ 28 | పే 13 | తా 22 | మా 5 |
| రా | రా | రా | వా | రా | ధా | తా | మా |
| ధ్యా | రా | మా | భా | మా | కా | మా | రా |
| జే | రా | జా | తా | సా | రా | భా | వో |
| మా | రా | జే | మా | ధీ | పే | తా | మా 1 |

పటము - 84

తురంగపదములు కలుపుకొనిన మఱియొక పద్యమేర్పడుట ఇందలి ప్రత్యేకత. ఈ చదరంగమున గుఱ్ఱపు నడక లంకెలతో చూపబడినది. అవి చదివిన మరియొక పద్యము వచ్చును. అది 27వది. పై చదరంగమున వేసిన అంకెల ననుసరించి 1 నుండి 32 వరకు చదివిన గుఱ్ఱపు నడకలతో పద్యమేర్పడుచున్నది. అదే పద్యము మిగిలిన గదులలో మరల ఏర్పడును.

గుఱ్ఱపు నడకలతో ఏర్పడిన పద్యమీ క్రిందిది.

"రామా రామా మా రామా రా
రామా తావో పేతా రాధ్యా
జామాతావా సాతా రాధా
భామా కాధీ భారాజేజే" —27.

చతురంగములో వ్రాయబడిన 26 పద్యమునకు 'ర'కార ప్రాస. గుఱ్ఱపు నడకలతో అందుండి పుట్టిన పద్యము (27). "మ" కార ప్రాస కలిగినది.

ఇటువంటిది వేదులవారి ల.స. (ఆంధ్ర). చి.స్త. 28,29. గలదు. సర. కంఠా.లో. చిత్రప్రకరణము 20 లో దీనికి లక్షణ మిట్లు కలదు.

"క్రమాత్పాద చతుష్కస్య పంక్తిశః పరిలేఖితే
తురఙ్గపద యానేన శ్లోకోన్య ఉపజాయతే."

## 20. గవాక్ష బంధము

సంస్కృతంలో ల స. వ్యాఖ్యలో గవాక్ష బంధ లక్షణ మిట్లున్నది.

"ఏకౌక కోష్ఠాద్య పఙ్క్తి-ర్యూర్ధ్వాధో ద్వ్యధికాగ్రతః
నవ కోష్ఠాం యత్ర మధ్యాః సవ్యం వా పవ్యమాలిఖేత్
ఆద్యపఙ్క్తిం మమారభ్య జాలబంధః స ఉచ్యతే."

[ల.స.చి.స్త. 37. వ్యాఖ్య]

ఉదా:- (1) వేదులవారి ల.స (ఆంధ్ర) చి.స్త. 13 కందము.
పై నుండి క్రింద కద్దగావులలో ఎడమనుంచి కుడికి వరుసగా చదువుకొనవలెను

(2) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి బంధ. 11. కందము మధ్యలో 'వాసుదేవరాయ సుకవిన్' అని యేర్పడును. వీరు రధములోవలె ఎడమనుండి కుడికి, కుడినుండి యెడమకు వరుస పాటించుచు వ్రాసిరి.

(3) గుడారు వేంకటదాసు. ప్రకృష్ట బలరామచరిత్ర చతుర్థాశ్వాసాంతము. కందము మధ్యలో "శ్రీరామచంద్ర నీవేగతి" అని యున్నది.

కం॥ వే వేడ్కల వక్షోటన
దేవీ! మాతా! మహత్త్వ దీప్తి నిక సుఖి
త్వావా సంబడు మానీ
శ్రీవాసా పాంగ వినుతిఁజేసితి జైజై.

[వేదులవారి ల.స. (ఆంధ్ర). చి.స్త. 43.] [చూ. పటము-85]



గవాక్షబంధము
పటము-85

నిలువున పైనుండి 'వేఙ్కటమఖి శ్రీనుతి జై' అని యేర్పడినది.

## 21. వ్యజనము (విసనకఱ్ఱ)

ఉదా:- రావు కొండలరాయుడు. చిత్రకవిత్వ దర్పణం. పంచచామరము:

"రణత్క్రమాహతాహితాధి రాజశార్ఙ్గ చాపచా
రణాధికస్తు తీర్యమానరాజితప్రమోద వా
రణప్రియాతి భావబంధు రాదితాలి బాణర
క్షణా హితానుభావ - - -శారివందజాతిభా."

మధ్య దండమునందు 'రమాధిపత్రిపణతి' అని యేర్పడవలెను. కాని పద్యమునందు తప్పుకలదు. పద్యములో చివరి పంక్తిలో మూడు అక్షరములు పోయినవి.

ఆకారము మత్కృతము. [చూ.పటము-86.]

## 22. ఆలవట్టము. (గుడ్డవిసనకఱ్ఱ)

ఉదా:- రావు కొండలరాయుడు-చిత్రకవిత్వ దర్పణం.

కం॥. సారస వత్ర - - -
దారుణరణ రభస భగ్న దంభా హంభా
వారాసుర పద్మవరా
శూర కులా భరణ సకల సురవర వరదా.

పై పద్యములో మొదటి పంక్తిలో 3 అక్షరములు పోయినవి.

ఆకారము. మత్కృతము. [చూ.పటము-87]



వ్యజనము (విసనకఱ్ఱ)
పటము-86.



ఆలవట్టము. (గుడ్డవిసనకఱ్ఱ)
పటము-87.

## 23. రాట్నబంధము

బోడి వాసుదేవరావుగారు. [చిత్రమంజరి. బంధ. 16 కందము] రాట్న బంధమును వ్రాసిరి.



రాట్నము

పటము-88

"శ్రీరమణా! నాగశయన!
నారాయణ! వరద! కంజన యనా! కృష్ణా
వీరవర! వీనతురగా
సారస నాభా! హరీ! వెసన్ నను గనుమా".

[చూ. పటం-88]

## 24. పాదుకా బంధము.

మం.పా. శాస్త్రి. ప్ర.సం. బం.వి.గ్రం.లో. పాదుకా బంధ లక్షణ మిట్లున్నది.

"ఛత్రాకారకదారు మస్తక తలస్థంబైన వర్ణంబుతో
దత్రత్యాంగుళి సంగతార్ణములు ప్రాదక్షిణ్యముంజెంది పా
దత్రాణ ద్వయినొంది హృద్యమగు పద్యంబేర్పడం గూర్పగా
ధాత్రిం జిత్రతరంబుగా దనరు గాదా పాదుకా బంధమై". -43

ఉదా:- గ.వేం. కవి. ప్ర.రా. వేం.వి.వి. పద్యం 852 లో గర్భిత శ్లోకము పాదుకా బంధద్వయమునకు సరిపోవును. మొదటి రెండు పాదములొక పాదుకా బంధము చివరి రెండు చరణములు మఱియొకటియగును. శ్లోక మీ క్రిందిది.

"నావదే ప్రోవమాధారా | రాధా మాహాత్మ్య సాగరా.
రాగ సాహిత్య వాజీరా | రాజీ వాకార దేవరా."

ఆకారము మత్కృతము[చూ. పటము_89]



**పాదుకలు**

**పటము_89**

**శ్లోకములోని మొదటి రెండు పాదములతో ఏర్పడిన పాదుకాబంధము.**

**29. వీ ణా బ ం ధ ము**

మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం వి.గ్రం. లో. వీణా బంధ లక్షణ మిట్లున్నది. (పద్యము_59).

మృదు భేకప్లుతి బర్వ బూర్వ పదమున్ మెట్లున్నచో వ్రాసిత
త్పద మూర్ధాక్షర మాద్యమంత్యముగ సా. జా. లేగియో సాగియో
మొదలంటం బొది గొంచు రానడి పదంబుల్ వ్రాయ బూర్వాం ఘ్రియం
దదువాళించు దురీయ పాదమిది వీణాబంధ లక్షణంబగున్"_

29 )

ఉదా :- గ. వేం. కవి. ప్ర. రా. పేం వి.వి. 808 లోని గర్భిత వింశతి బంధ కందము.

"సార వర హార వారా
సార హారీ నరహరి హరశర కరసారా
గౌరధర ధీర చారా
సారహారీ సురహరి నరసర సారభరా." [చూ. పటము-90]

ఆకారము మత్కృతము.

ఉదా :- 2) రావు కొండలరాయుడు చిత్రకవిత్వ దర్పణం. (వ్రాతప్రతి) కందము
3) బండ్ల సుబ్రహ్మణ్యకవి. ఆంధ్రమహాభ్యుదయం.



వీణాబంధము

పటము-90

బండ్ల సుబ్రహ్మణ్యకవి - ఆంధ్రమహాభ్యుదయము నందు సరస్వతీ ప్రార్థన సమయమున వీణా బంధమును చిత్రించుట సందర్భోచితము.

ఉ॥ పావన భావమ్యా గుణి - పాలన సజ్జన లక్ష్యంలక్షణ
శ్రీవిధి వేదమోద వర - చిహ్న సుధారస రమ్య రాజ్య పా
పావ్రతజిత్ స్వభావ విజ - యాఘన ధీజన వంద్య సత్కళా
దేవిక్ప్రతీ యమోఘ ధృతి- ధీనిధి నీతిమతీ లసత్కృపా.

ఈ బంధములో మెట్లు వరుసలో పద్య పాదములు నడిచినవి. వీణ పైనుండి పద్యము 'పా'తో మొదలై, మొదటిబారు 'ణ'తో అంతమై, 2వ బారున వచ్చి "పా" ను కలుపుకొని మూడవ బారున పోయి నాల్గవ బారున వచ్చి "పా"తో అంతమగును. రాజున "పా" నాల్గుసార్లు ఆ వృత్తి 4వ అడ్డబారున "సరస్వతీ" అనియు 14వ అడ్డబారున 'ఏమోనమో' అని కలదు. మెట్లు తప్ప వీణాకారముసందెక్కడను పద్యాక్షరములు లేక పోవుట ఇది లక్షణబద్ధ మైనది కాదేమో యనిపించుచున్నది.

## 28. స్వరకల్పిత డిండిమము

ఉదా :- రావు కొండలరాయుడు. చిత్రకవిత్వదర్పణం. వ్రాత ప్రతి.



28. స్వరకల్పిత డిండిమము.
పటము-91

ఆకారపు మత్కృతము. [చూ. పటము-91]

కం॥ ధీరా మరగణ సేవిత
శ్రీరమణీయుర స్థలంబు చెన్నొందు నుతా
జేరెన్ తగ శంకరనుత
శ్రీ రంజిత సుగుణపరిధి శృంగారనిధీ,

## 29. నవరంగము

నవరంగమన గృహవిశేషము

మం.పా శాస్త్రి. ప్ర.సం.బం:ని.గ్రం.లో. పటీర కుటీర బంధమను పేర లక్షణ మొకటి గలదు. అది యిట్లున్నది.

"క్రమముగఁ బీఠనాళముల ప్రాథమికాంఘ్రి త దూర్ధ్వ పార్శ్వప
త్రములను మధ్యమాంఘ్రులు శిరశ్ఛషక మున నంతిమాంఘ్రి గూ
రిమి దళకొంద వ్రాసి తలక్రిందుగ బల్కిన బల్కవచ్చు ను
చ్ఛ మహిమ దెచ్చు కర్తకిది సార పటీర కుటీర బంధమై."



నవరంగము [గృహ విశేషము]
పటము _ 92

ఉదా:_ 1 గ. వేం కవి. ప్ర. రా. వేం. వి. వి. 808.లోనిగర్భిత వింశతి బంధ కందము. "సారవరహారవారా
సారహరీ నరహరి హరశర కర సారా
గౌరధర ధీరధారా
సారహరీ సురహరి నరసర సారభరా."
ఆకారము మత్కృతము. [చూ.పటము_92]

## 28. శకట బంధము

మం.పా.శాస్త్రి. ప్ర సం.బం ని గ్రం.లో దీనికి లక్షణము. పద్యము.71.
"నిడుపుగ రెండు దండలుగ నిల్పిన రేకుల కడ్డు రేకులా
బిడి పట నై దునయి దిండ్లుగ నుండలు రెండమర్చి రెం
డడుగుల నుండలందు నడి యంజల రేకులయందు సంధి చొ
ప్పడ నడపింపుమన్ శకటబంధముగా బ్రకటింత్రు సత్కవుల్."



శకటము [బండి]
పటము_93

ఉదా:_ గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 808లోని గర్భితవింశతి బంధ

కందము. "సారపరహార వారా
సారహారి నరహరి హరశరకర సారా
గౌరధర ధీర వారా
సారహారీ సురహరి నరసర సారధరా."

అక్షరము మత్కృతము

[చూ. పటము. 93]

## 29. లింగ బంధము

మం.పా.శాస్త్రి. ప్ర.నం.బం. వి.గ్రం.లో.లింగబంధ తులసీబంధముల కొకే లక్షణమిట్లు చెప్పబడినది. (పద్యము. 17)

"శశి హయసాయ కానల నిశాకర-వహ్నిశరాశ్వ కోష్ఠముల్
విశదముగా సమర్చి యొకవృత్తమునందు బొనర్చి కుక్షిలో
గుశలకవుల్ నిజేష్టమైన గూర్చి యొనర్చిన లింగ బంధమౌ
ఘళుపతి కింపుగా దులసి బంధమిదే యుగు కౌటికింపుగా."

తులసి బంధము విదేమాదిరి నిర్మింపదగునని లక్షణములో చెప్పబడినది. ఆ లక్షణానుసారము. పైనుండి క్రిందకు 9,7,5,3,5,7,9 గదుల నేర్పరచుకొన వలెను. కాని క్రింది ఉదాహరణములో 7,5,3,1,3,5,7 ఏర్పరుపబడినవి.

ఉదా :- శరభోజి రచన. సంస్కృతము. లింగబంధము.[1]

[**Manuscript. No. 2178**-5వ శ్లోకము.]

ఆ శ్లోకము.

"శర్వభక్తి రతః కోరాడ్వృష భోర్య పద్మార్జితః
మనోహారీ జితారాతిః సద్విద్వద్వ్రజ ఈశితా." [చూ. పటము-94]




లింగ బంధము

పటము-94

1. Vol. No. 1. in 1961. The Journal of T. M. S. S. M. Library. Tanjavur,

ఇందు మధ్య వరుసలో నిలువున 'శరభోజి మహారాజు' అని యేర్పడినది.

ఉదా:_2) ఆటవెలది. కపిలివాయి లింగమూర్తి కృతము. లక్షణానుసారము నిర్మింపబడినది. మధ్యలో నిలువున "లింగమూర్తి కృతి కపిలవాయి' అని వున్నది.

3) పురాణం పిచ్చయ్య [1910 ప్రాంతం] "రాజగోపాల కృష్ణయాచేంద్రుని పై పార్థివ లింగ బంధమును చెప్పినట్లు తెలియుచున్నది.

## 80. షోడశదళ చక్రము

ఇది షోడశదళ పద్మ బంధమువలె ఉండును. ఇది సింహ రేఖా, ప్రమాణి వృత్తముల గనబడుచున్నది. మధ్యలో అక్షరమొకటి ఆవృత్తి 16 సార్లు. మిగిలినవి చుట్టను 16 చెల్లి మొత్తము 32 అక్షరముల వృత్తము దీనికి సరిపోవును.

ఉదా :_ అప్పకవీయము. 4_'92 సింహరేఖా వృత్తము.

రామ రాత్రీ రాగ రాధా
రామ రాణా రాక రానా
రామ రాజీ రాచరాజా
రామ రాజీ రాపు రాచన్ [చూ. పటము_95]




షోడశదళ చక్రము
పటము_95

ఉదా :- 2) అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము పుట. 111.
సింహ రేఖా వృత్తము.

3) బుర్రా కమలాదేవి. ఛందోహంసి. సింహరేఖా వృత్తములో.
ప్రమాణిలో.

ఉదా :- 1] మిన్నికంటి గురునాథ శర్మ. గౌరీ కల్యాణము. 3-61,62 రెండు ప్రమాణి వృత్తములు కలిసి రెండు షోడశదళ చక్రము లగును. రెండును కలిపి వ్రాసిన మాలికా బంధమగును. అందలి మొదటి ప్రమాణి యిటులున్నది.

"హరా! సురాసురా దరా । పరాత్పరా గరాద్మరా
ధరా ధరా కరావరా । అరాళరాజ రాద్ధరా." 3-61.

## 81. శకట చక్రము [చతురస్ర చక్రబంధం]

ఈ శకట చక్రమను పేర చింతలపల్లి ఛాయాపతి. రాఘవాభ్యుదయము (3-293)లో బంధమును వ్రాసియున్నాడు. ఇది గుచ్ఛ బంధమువలె నున్నది. కాని దీనిని చతురస్ర చక్రబంధమను పేర సంస్కృతములో ల.స; శివపాదకముల సహస్రము; పా.స; గ్రంథముల ప్రదర్శించుట జరిగినది.

ఉదా :- పా. స. 927 శ్లోకము. 17 బొమ్మ.

ల. స. చి. స్త. లో ఈ బంధ లక్షణ మిట్లు గలదు.

"ఆద్యంతాః సర్వ పాదేషు సమాః పాదాన్త తమ్రయమ్
అన్యత ప్రాతిలో మ్యాచ్చే చ్చక్రం స్యాచ్చతురస్రకమ్."

తెలుగున ఉదా :- చింతలపల్లి ఛాయాపతి. రాఘవాభ్యుదయము. 3-293.

"వశకేశ మహా రావ
వరాహా కార తోత్సవ
వత్సతో షావ భో దేవ
వదే భోద్ధర కేశవ."

[చూ. పటము-96]

మొదటి పాదము చివరి మూడక్షరాలు, రెండవ పాదము మొదటి మూడక్షరాలును అనులోమ విలోమముగా ఉండును అట్లే తక్కినవి. నాల్గు పాదాలలోని మొదటి అక్షరములుగా ఒకే యక్షరముండును. అది కేంద్రాక్షరము- ఇక్కడ 'వ' కేంద్రమందు గలదు. అక్కడనుండి పద్యము మొదలె దానితో నంతమగును.




శకట చక్రము [చతురస్ర చక్రబంధము]
పటము-96

ఉదా :- 2) మాణవక వృత్తము. రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాత ప్రతి. పుట. 70.

## 32. ద్విశృంగాటక చక్ర బంధము.

సంస్కృతములో సర. కం. రా; చిత్రకావ్య కౌతుకం; ల.స; పా. వ; ఇత్యాది గ్రంధములలో ఈ బంధము చూపబడినది.

ఉదా :- వేదులవారి. ల.స. (ఆంధ్రము). చి. స్త.17

"రారా మావే రాగే సంసా
రారజ్యాప్తుల్ రాగోద్ధామా
మారెవ్వార్ రామాతా సంస్తు
త్యారాధ్యా వాణ్యా ధారారా." [చూ. పటము-97]

30)

పటము_97

ధాదాపు మొదటి రెండుపాదాల యక్షరములు శృంగములను కలుపుచు పోవును. 'గోద్దామా' మొదలుకొని చివరివఱకు శృంగాక్షరములను కలుపుకొనుచు వలయమున చుట్టివచ్చును.

సర. కంఠా.లో దీనికి లక్షణము కలదు. [చి ప్ర. పుట.44]

"శృంగాత్ గ్రంథిం పునః శృంగం గ్రంధేః శృగం వ్రజేదితి
ద్విశృంగాటక బంధే స్మిన్నేమిః శేషాక్షరైర్భ వేత్"—

## ౮౮. ద్వి చతుష్క చక్రబంధము

సంస్కృతములో. ఇది. క. స, సర. కంఠా; పా. స; చిత్రకావ్యకౌతుక మిత్యాది గ్రంథముల ప్రదర్శితము.

సర. కంఠా.లో దీనికి లక్షణ మిట్లున్నది. (చి.ప్ర. పుట. 43)

"ఇహ శిఖర సంధిమాలాం బిభృయాదర్ధపమాశ్రితైర్వ
ద్విచతుష్క చక్రబంధే నేమివిధా చావరంభ్రమయేత్
ఉదా:- వేదులవారి ల. స. (ఆంధ్రము) చి. స్త. 18.

**విమానవృత్తము:**

"భజింతు శ్రీదేవిన్ భక్తిన్
త్యజింతు సంసారా సక్తిన్
సృజింప శ్రీభావిన్ రక్తిన్
యజింతు సంభారా శక్తిన్"

[చూ. పటము-98]




ద్విచతుష్క చక్రబంధము

పటము-98

వెలుపలి వలయము మధ్యవలయము కలుపుకొనుచు పోయిన మొదటి పాదములు పూర్తియగును. తదుపరి లోపలి, మధ్యవలయముల కలుపుకొనుచు చదివిన 3,4 పాదములు పూర్తియగును.

ఉదా:- 2) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ 6. సరోజవృత్తము.

## 64. గరుడగతి చక్ర బంధము

సంస్కృతములో ల.స. చి. స్త 23; పా.స.చి.ప్ర. 14 లలో ఈ గరుడగతి చక్రబంధమున్నది. ప్రదర్శింపబడినది.

లక్షణం :

"మధ్యే స్యాత్ప్రథమాది ద్వ్యంతర పఙ్క్త్యక్షర స్స్యగే వోర్ధ్వమ్
గరుడగతి చక్రబంధో ద్వర్ధే ద్వ్యన్తైక గత్రిమండలకః"

[ల.స.]




పటము_99

వేమల వారి ల.స (ఆంధ్ర) చి స్త 25, విద్యున్మాలావృత్త మిందు కుదాహరణము.

"మాతా యావే భూజాతాసీ। తాతా యాభూతా జా సీమా
మాతా పాతా పాయా వేప్ర। స్మృతాగ్ర్యా సంతార్థ శ్రీమా"

మొత్తము 32 అక్షరములును అంకెలతో చూపబడినవి. అట్లు వరుసగా చదువుకొనవలె.

### 35. కులాలికా చక్రబంధః

ఈ బంధము చతురర చక్రబంధమువలె నున్నది. ఈ కులాల చక్రమునకు మం.పా. శాస్త్రి. ప్ర.నం. బం. ని.గ్రం.లో లక్షణ మిట్లున్నది.[పద్యము-6']

"కుమ్మరసారె చందమున గుద్రన రేఖలు నడ్డుగీట్లు న
ద్రమ్ముగ గీసి చిత్రగతి బ్రాక్పద మంతర మందు మధ్య పా
దమ్ములు చుట్టునుందగు విధమ్మున వ్రాయ గులాలచక్ర బం
ధమ్మగు దుర్యమాదిమ పదమ్మున నేకత నొందు గ్రిందుగాన్".

తెలుగున చింతలపల్లి చాయాపతి - రాఘవాభ్యుదయము. 1-211న యీ బంధము చిత్రితమైనది. అది శ్లోకము.

"కమలా ముఖనాళీక
కళీనా ఘని వారక
కరవా మాంగ దాశ్రీక
కశ్రీ దాధ్యలలా మక". [చూ. పటము-100]




కులాలికా చక్రబంధము

పటము-100

## 32. పంచశృంగ లేదా వివిడిత చక్రబంధము.

సర. కంఠా. లో (2-315) ఈ బంధము ప్రదర్శితమైనది. చిత్రకావ్య కౌతుకమ్. పుట. 94 పటము. 47 న. కూడ ఇది రచితమైనది.

దీని లక్షణము చిత్రబంధకావ్యము.[1] పుట. 60. లో ఇట్లు కలదు.

"శిఖరాదన్య స్మాద్వై ప్రతి పర్వభ్రమతి రేఖయాద్యర్థమ్
నే మా తదితర మర్థ వివిడిత చక్ర భిధే బంధే"

ఉదా:- సర. కంఠా. 2-315.




పంచశృంగ లేదా వివిడిత చక్రము

పటము - 101

---

1. రామరూప పాఠకి. విరచిత. "చిత్ర కావ్య కౌతుకమ్". సంస్కృతము — పుట. 94. చూడుడు.

"సానతీ జయ తాదత్ర
సరం తీ యమిత్వాత సా
సారంపరం సచ జయా
శమితాస్యన్ద నే న సా."

(చూ. పటము. 101)

ఇందు మొదటి రెండు పాదములు పంచశృంగములను కలుపురేఖల ద్వారా పోయి పూర్తియగును మిగిలిన రెండు పాదములు చుట్టును శృంగాక్షరములను కలుపుకొనుచు తిరిగి వచ్చును. మొదటి యక్షరము 'సా' నాల్గుసార్లు ఆవృత్తి యగును.

## 37. నాగబంధము

దీనికి కుండలి నాగబంధమని కూడ పేరున్నది. (హమాన్యముగ)

సంస్కృతములో చిత్రకావ్య కౌతుకమ్ మన్దారమరన్ద చంపూ; సా.ర ప్రతాపరుద్రీయ మిత్యాది గ్రంథము లందీ బంధము ప్రదర్శింపబడినది.

సంస్కృతములో కవులు స్రగ్ధర యందు దీనిని చిత్రించిరి. ప్రముఖమైన బంధమిది. కాని తెలుగున వ్రాయబడినంత విరివిగ సంస్కృతములో వ్రాయబడి నట్లు నాకు కనబడదు. ఈ బంధము హిందీలో కలదు. ఇంత విరివిగ రచించుటకు నాగుని దేవతగా భావించుట కారణమేమోయని నామట్టుకు నాకనిపించుచున్నది. తెలుగున చంపకమాలలో నెక్కువగును, కొలదిగ స్రగ్ధరా వృత మందును ఈ బంధము ప్రదర్శించుట జరిగినది.

మత్తేభోత్పలమాల, కంద సీసపద్యముల గూడ యీబంధము చిత్రింప బడినది.

అప్పకవీయము 4-575. న దీనికి లక్షణము.

కం॥ ఇలలో నెనుబది నాలుగు
నిలయంబులకుం బయోదనిభ సీలాంగా
మెలిగొన్న పామువలె వెలు
పలగున్ దల తోంక నాగ బంధంబునకున్.

మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. ని. గ్రం. లో. నాగబంధ లక్షణము.

"సరిగా నల్ నవకోష్ఠముల్ నెబపిలో సందంశ రీతిం బర
స్పర రేఖల్ గడియించి పార్శ్వము లధో భాగంబు కోణంబు లుం
బరివేష్టింపగఁ జుట్టి పుచ్ఛముఖముల్ ప్రాగ్రేఖలందీర్చి స్ర
గ్ధరయో చంపకమాలయో యొగి నిడంగా నాగబంధంబగున్."

ఈ బంధమునకు స్రగ్ధరయో, చంపకమాలయో వ్రాయవలెనని లక్షణము; అప్పకవి "ఏమబదినాలుగు" అనుటలో గూడ చంపకమాల, స్రగ్ధరలలోనే వ్రాయ వలెనని అర్థము. ఆతడు చంపకమాలలోనే వ్రాసి యున్నాడు.

స్తోత్ర సందర్భము లందు దీనినెక్కువగ కవులు వాడిరి.

రంగాజమ్మ మన్నారుదాస విలాసములో మన్నారు దాసు కాంతిమతినిగూర్చి ప్రలాపించి, ప్రేమాతిశయ ప్రదర్శన సందర్భమున ఈ నాగబంధ చిత్రణ ముండుట – ఆతని మనసంతగా పెనవేసికొనినదని తెలుపుటకని యనిపించును.

చంపకమాలలో నాగబంధము.

తలతోకల యందొక్కొక్క యక్షరము, ప్రక్క క్రింద కుండలుల మూట యందు రెండు చొ॥న. ఉండవలెను.

కాని కొద్దిమందికవులు తలతోకల రెండేసి చొ॥న ఉంచి ప్రక్కకుండలులలో ఒక్క యక్షరము తగ్గింతురు క్రింద కుండలిలో తగ్గదు. ఒక్కచోట తోకలో మూడక్షరములుంచి ప్రక్కలక్రింద ఉన్న మూడు కుండలులలో ఒక్కొక్క యక్షర మునే యుంచుట కూడ జరిగినది. 84 అక్షరములు పటమున 64 అక్షరములుగా కనబడును. 20 సంధి స్థలముల 20 అక్షరములు 2 సార్లు ఆవృత్తి యగును.

పద్యము తలతో మొదలై తోకతో అంతమగును. నాగబంధమును మొదట ప్రదర్శించిన తెలుగుకవి నన్నెచోడుడు

ఉదా:– 1. నందితిమ్మన 'పారిజాతాపహరణము' – 5–94

చంపకమాల:

"జలజవితాన నీల ఖల సాల కులక్షితి వారణేశ ని
శ్చలముని వార సాల సురచారణ యక్షనవానుకూల కుం
డలి వరహారలోల నరనారద తత్పర భూ విధేయయు
జ్జ్వల మహనీత శీలిత వశంవద శక్ర రమా నికేతనా" (చూ. పటము – 102)

ఉదా:_ 2.

నన్నెచోడఁడు. కుమారసంభవము. నాగాభరణముగ జెప్పు సందర్భము.

3. భైరవుడు _ శ్రీరంగమహత్త్వము. 5_291.



నాగబంధము.

పటము_102.

4) మరింగంటి సింగరార్యుం. దశరథ రాజనందన చరిత్ర.5_308.

5) గ.వేం. కవి. ప్ర.రా.వే. వి.వి. 862.

6) అప్పకవీయము.4_576.

7) రంగాజమ్మ. మన్నారు దాసవిలాసము. చతుర్థాశ్వాసము.

8) చింతలపల్లి ఛాయాపతి. రాఘవాభ్యుదయము. 5_215.

9) పుష్పగిరి తిమ్మన_ సమీర కుమార విజయము. 4_78.

10) కనుపర్తి అబ్బయ్య. కవిరాజ మనోరంజనము.4_171.

31)

11) వెంకయ్య. రామారాజీయము.337.
12) తెనాలి రామభద్రకవి. ఇందుమతీ పరిణయం. 4_254.
13) వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము, 3_135.
14) మరింగంటి నరసింహాచార్యులు. తాలాంక నందినీ పరిణయం. 2_293.
15) ఓగిరాల జగన్నాథం. సుమనో మనోభిరంజనము.[1]
16) అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి. శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్ర.
17) తూము రామదాసు_ మిత్రవిందో ద్వాహము. 2_35.
18) నాదెళ్ళవారి. అ.ఉ. రామా. 7_155,156.
19) వీరి. గురుభక్తి ప్రభావము. 2_159.
20) వీరి. కృష్ణానదీ మహాత్మ్యము. 1_122.
21) ఘనగిరి విజయరామ. గణేశ్వరీయము. 2_53.
ఇందు 'విజయ రమయకవి. గణపతికృతి' అనియు వచ్చున ట్లక్షరములు కూర్చబడినవి.
22) పురాణం పిచ్చయ్య. విజయాశ్వ చరిత్ర. ఉ.భా. 3_198.
23) పోతరాజు లక్ష్మీనరసింహకవి. మాఘపురాణము.
24) కొడవలూరి రామచంద్రరాజకవి. మహాసేనోదయము. 8_254.
25) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర. కరము పూ. భా. బంధ. 1. [తల తోకల గళ్ళలో 'శేషాచార్య' అని కవిపేరు కలదు].
26) అప్పుమిల్లి నారాయణరావు. నారాయణీయము పుట. 117.
27) విక్రాల శ్రీ దేవమ్మ. వాసవదత్తా పరిణయం. 4_140.
28) బోడి వాసుదేవరావు_ చిత్రమంజరి. బంధ. 7.
29) బుర్రా కమలాదేవి. ఛందోహంసి.
30) సుబ్రహ్మణ్య విజయము[2]. ఆశ్వాసము1.

---

[1] పూండ్ల రామకృష్ణయ్య. ప్ర.రా.వే.వి.వి. పీఠిక. పుట. ౨౯.

[2] ప్ర.రా.వే.వి.వి. పీఠిక. పుట. XXXIV. ప్రచురణ. ఆం.ప్ర.సా.అకా. 1977

31) దామెరల అంకవ్న. ఉషాపరిణయం. ఆశ్వా.5.పుట. 146.

32) చింతలపల్లి వీరరాఘవ కవి. మధురవాణీ విలాపము. 5-133.

33) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 57.

34) కోలాచలం శ్రీనివాసరావు. సునందినీ పరిణయము. (ఇష్టదేవతాప్రార్థన సందర్భములో).

35) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు. శ్రీవేల్పుగొండ లక్ష్మీ నృసింహ క్షేత్ర మహాత్మ్యము. 2-131.

36) బండ్లసుబ్రహ్మణ్యకవి. ఆంధ్రమహాభ్యుదయము. 2వ భా. 1-146. (నాగాభరణమని పేరిడిరి.)

నాగబంధము.

పటము-103.

## 2. స్రగ్ధరా నాగబంధము

ఉదా:- 1) ధరణిదేవుల రామమంత్రి. దశావతారచరిత్ర. 277.

"భవ్యారామక్షితీశా భవనవ జలజ ప్రాయ వైశవ్యకీర్తి
దివ్యాగత్యాగరాజ ద్విమలరణ రమా ధీనభద్రాపరాయ
త్రక్వ్యారాకీర్ణ నానాగహన వినత పక్షిజరా తీతధీరా
నవ్యా వద్మేశభవ్యా నరభరణదిశా నాథ గణ్యోపసేవ్యా".

[చూ. పటము-103]

ప్రక్క క్రింద కుండలుల నొక్కొక్క యక్షరమున్నది. కనుక 3అక్షరాలు తగ్గినవి. అవి తలతోకలలో 3 అక్షరాలుపైన 'వ్యా' 2సార్లు ఆవృత్తి యక్షరము, మొత్త మయిదు.అసలు రెండు పోను మూడు అధికముగా అక్కడ చేరినవన్నమాట. స్రగ్ధరా నాగ బంధము లన్నియు నిట్లేయున్నవి.

ఉదా:- 2) పిండిప్రోలు లక్ష్మణకవి. లంకావిజయము. 1-181.
3) గోపీనాథ్ వేంకటకవి. గోపీనాథ రామాయణం. సుందర. 1538.
4) చెలమచర్ల రంగాచార్యులు. ఆంధ్రప్రతాప రుద్రీయ యశోభూషణము.
5 అల్లమరాజు రంగశాయి. శ్రీ. ఆం. చంపూరామాయణం. అరణ్య.79.

## 3 మత్తేభ నాగబంధము

చిన్నకోటపెద్దన. కా.చూ.లో మత్తేభ నాగబంధము జెప్పి లక్షణము గూడ చెప్పియున్నాడు. అతని లక్షణము.

ఎనుబది పదములుగా చెన
గొని యుపదేశమున దెలియ కుండలి బంధం
బన జను తత్పదముల జ
క్కని వ్రాలిడి వరుసజదువ గబ్బంబమరున్. 6-68.

మత్తేభోత్పలమాలలకు 80 అక్షరములు నాగబంధములో ఉండవలెననెడి లక్షణము సరిపోవును. కాని యాతని లక్ష్యము (6-69) మత్తేభము. నిర్మాణమున బొమ్మ వచ్చుటలేదు. మనకు లభించు పద్యమందలి యక్షర క్రమము కొంతవఱకు దెబ్బతిని యుండవచ్చు.

### 4. ఉత్పలమాలా నాగబంధము

ఉదా:- 1) రంయాల లక్ష్మీనృసింహాచార్యులు. కుబ్జాకృష్ణ విలాసము. 3-127 కుండలి నాగబంధము. [అచ్చతెలుగు]

"బంగారు నక్కు సాలువలె వాటు తటుక్కున వెల్గు సామి లె
స్సంగల వారు బత్తి మది సంతసమై లిలితారుచున్నసన్
రంగ నినుం దలంచిరి. సరాసరి గచ్చగునున్న చిన్ని పెం
కింగాన ట్రోవమయ్యె గిడిగిళ్ళ కిలార్చిన లేమచేగమై." [చూ.పటము. 104]



నాగ బ ధము

పటము-104.

పై తల, తోకలలో మొత్తము 6 అక్షరాలు. కాని బొమ్మలో 5 అక్షరములుగ కనబడును.

ఉదా:- 2) వీరి శ్రీవేల్పుగొండ లక్ష్మీనృసింహక్షేత్ర మహాత్మ్యము.2-130.

## ౫. కందద్వయ నాగబంధము

రెండు కందపద్యములకు కలిపి మొత్తము ౬4 అక్షరము లుండునట్లు రచిం నాగబంధమునకు సరిపోవును.

ఉదా:- పురాణం పిచ్చయ్య. విజయాశ్వచరిత్ర-ఉ భా 1-20,21;

1) నారాయణ దేవేశా
శౌరీ మురముఖ్య రాక్షసక్షయ సకలా
ధారా వరద యజరాశ్ళం
గారాంగా శుభనివేశ నాగారాధ్యా.

2) ధీర పరమ వివే కద
మారా మాకాంత భాస మానా స్యా శౌ
ర్యా రంభప్రీణ నయ
జ్ఞారా ధ్యా జలజధరణ విషాయుత తత్త్వా.

## ౬. సీస నాగబంధము

దీనికి మహా నాగబంధమని గ.వేం కవి. పేరిడెను. ప్ర.రా.వేం.వి.వి. 831 పద్యము. సీసము దానిక్రింద తేటగీతి.

సురభిభావగ రాగ సూరా గణిత ధామ
వర్ణిత శాశ్వతైశ్వర్య ధామ
వర్ణిత దానవ వార పారా వార
మధ్యమస్థా మహా మత్తవార
నమ్రమతా మరజాత నవ్యభవ్య యుతాసి
రక్షిత తాపస రత్నవర్య
వర్ణి రూపారూఢ వాసవాదర లావ
హార గౌరద్యుతి సారహార

వరమురజ దమిత సుతహా సరసహాస
రాసలీలాభిలాష వరతమ పార్థ
భద్రవస్ఫురర వారణాపార భయద
ఫణివరాచల పాల ప్రవఖాతిరమ్య.

## 7. కృష్ణసర్పబంధము

ఉదా :- రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 64.



కృష్ణసర్ప బంధము
పటము - 105.

కం॥ గురువక్ష దీనవత్సల
వరదా సురపక్ష తపన భాద్ధువరమ్య
స్థిర మస్కర్యజ సన్నుత
సర సాకర భవన నీ భజన నే మరువన్. [చూ. పటము..105]

## 8. నాగద్వయ బంధము

ఇది తమిళమున నున్నది. బొమ్మ ననుబంధములో తమిళ పద్యమును జూపితిని. [పటము-143]

తెలుగున ఉదా:- రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 69. రెండు కందములు.

1. శారద నీరద సితకర
తారస్ఫుర కీర్తి సుజనదర్శన వర్తీ
ధీరా సంగర ధీరా
రారా వీరా సుదక్ష రాధారమ్యా.

2. ధీరా సుధీవర ముదక
రా రా రా సారమూర్తి ప్రారాధితదే
రారాజనీతి సంస్థా
రారాయవ్యయ భవహర రాజశరణ్యా.

ఒకపద్య మొకపాము తలనుండి తోకవఱకు మఱియొక పద్యము రెండవ పాము తలనుండి తోకవఱకు వ్రాసియుండును. అట్లు చదువుకొనవలెను.

## 9. అష్టనాగబంధము

కర్త తెలియదు. కావ్యము తెలియదు. కపిలవాయి లింగమూర్తిగారివద్ద లభించినది. అందలి పద్యము కందము. బొమ్మ కలదు.




పటము_106

కం॥ శ్రీరమణ సురపదాంబుజ
వార ద్విజరాజ సార వాత జరక్ష
నారద కిల్బిష హరవర
సూరిగణస్వాంత తోష శూరముకుందా. [పా. పటము -106]

**ఒక్కొక్క** సర్పము తలనుండి తోకవఱకును ఇదే పద్యము వ్రాయబడి యుండును. అక్షరము విడిచి యక్షరము రెండుసార్లు ఆవృత్తియగును. అనగా పై పద్యములోని మొదటి రెండు పాదములలోని సరి అక్షరములు "ర,ణ,ర,దాం" మున్నగునవి రెండుసార్లు ఆవృత్తియగునవి. అట్లే 3,4 పాదములకూడ జరుగును.

## 10. అష్టకోణఫణి.

ఉదా:- రావుకొండలరాయుడు- చిత్రకవిత్వ దర్పణం వ్రాతప్రతి.
ఆకారము మత్కృతము.



అష్టకోణఫణి
పటము-107

ఉ॥ రామసరాగ – సకలిరాండ సవర్ధిక త్రోవవేదయన్
భామితరీతి ద్రోయు రసభావుకలీల వహింపదేవశ్రీ
భూమహిళా వలా వినత పోషణ దక్షయు లౌగళాలి స
త్కోమల .... .... రహిగోపదదన్యు విభూజి సాదరా.

(చూ. పటము-107.)

పై పద్యమున కొన్ని అక్షరములు పోయినను కొన్ని తప్పులున్నను బొమ్మ మాత్రమిదియే. ఊహించి నిర్మించితిని. ఎనిమిది కోణముల యందు 'రావు కొండ భూపభాష' అని కలదు. దీనిని ఒట్టియే ఆకారము నేను నిర్మింపగలిగితిని.

1. నవకోణఫణి.

రావుకొండలరాయుడు–చిత్రకవిత్వదర్పణం. వ్రాతప్రతి.
పంచచామరపద్యము.

అష్టకోణఫణియందు మధ్యలో 2 కోణములు విడువబడినవి. నవకోణఫణి యందు మధ్యలో ఒక కోణము విడువబడును.

కోణముల 'మురహరచరణస్తుతి'ము అని ఏర్పడును. ఈ బంధమున ఆవృత్తి అక్షరములు 9. మిగిలినవి. 53 మొత్తము 64.



నవకోణఫణి

పటము-108

రెండుకోణాగ్రాక్షరముల మధ్య 6 అక్షరములుండును.

"మురారి వీరదర్పహ ప్రముగ్ధవాద ధీచణా
ప్రవరావర ప్రణప్రమద త్త భావకా-వేదరీ
హారీ పరప్రద క్షమాముఖారవిందపద్మ ప
.... .... ప్రమోద శ స్త భూవరేంద్ర దండముల్. (చూ. పటము-108)

పద్యము. రెండవ పాదములో ఒకటి, నాల్గవపాదమందు నాల్గు అక్షరములు పోయినవి. ఆకారము మత్కృతము.

దీని పద్యమందలి రెండవ పాదములో పోయిన అక్షరము 'వ' గాను, నాల్గవపాదములో పోయిన నాల్గింటిలో రెండవ అక్షరము 'ర' గాను, నాల్గవ యక్షరము 'ర' గాను నేను పటమును బట్టి గుర్తించితిని. పద్యము రెండవ పాదము మొదటి యక్షరము మూడవ పాదము చివరి యక్షరమొకటిగా ఉండవలెను. అప్పుడా యక్షరము పటములో సరిపోవును కాని పద్యమున ప్ర ష లు ఉన్నవి. అవి వ్రాతప్రతిలో తప్పులుగా వ్రాయబడినవని యూహాజేయుచున్నాను.

2రి మత్స్యబంధము (చేరప)

లక్షణము: మం. పా. శాస్త్రి. ప్ర.సం.బం. ని. గ్రం.లో మత్స్యబంధమునకు లక్షణమిట్లు చెప్పబడినది. పద్యము 95.

"నలుపంక్తులు పుచ్ఛముం గలుగు మీన వ్యక్తి గల్పించి త
జ్జల విక్షేపణ పక్ష గాక్షర చతుష్కంబాది మాంత్యాక్షరం
బులుగా బాదచతుష్టయం బిటునటుం బొంకంబుగా బోయి రా
గల బింకంబున నందు వ్రాయనది సాక్షాన్మత్స్య బంధంబగున్."

ఉదా :- 1) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు కుబ్జా కృష్ణవిలాసము. (అచ్చ తెలుగు)లో 3-123. మత్స్యబంధము కలదు

ఇది భద్రికావృత్తము నందు కలదు.

"రార కన్నయ హుటాహుటీ
కోరి జేరితిని మేరగా
గార వించి కొలం ద్రోలఁగా
ఘేర యోర యెద నెంతురా."

(చూ. పటము. 109)



మత్స్యము (చేప)

పటము-109

కన్ను నుండి మొదలై కాళ్ళను గలిపికొని తోకను జుట్టి మరల మరొకవైపు కాళ్ళను జుట్టి కలుపుకొనుచు పోయి కన్నుతో పద్యమంతమగును.

ఉదా :- 2) పీఠి. శ్రీవేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము 2-133. "భద్రికా"

2) తూమురామదాసు. చిత్రవిందోద్వాహము. 2-37. "భద్రికా."

## 39. కూర్మ బంధము [తాఁబేలు]

మం.పా.శాస్త్రి. ప్ర.సం.బం.ని.గ్ర లో కూర్మబంధమునకు లక్షణమిట్లుచెప్ప బడినది.

"ఆది పదాంత్య పాదముల యక్షరముల్ మఱి పద్య మాంఘ్రియం
దాదిమ తుర్యముల్ చరమమైక్యము పొందునటుల్ ముఖాక్షి కం
ఠాదిగ జుట్టి వచ్చుగతి నచ్చపువృత్తము కచ్ఛపాకృతిం
బాదుకొనం జుమీ కమఠబంధమగుం గ్రమ గుంఫనంబునన్."

వారి లక్ష్యశ్లోకము. నిరోష్ఠ్య బంధకళ గర్భితమైనది ఇదే బంధమున ప్రవర్తింపబడుచున్నది.

"రాక రాక త్రిరా కారా
రాజ తాగగతా జరా
రాగా సార రసా గారా
రాకా రాత్రి కరా కరా."

ఆకారము మత్స్యాకృతము. [చూ. పటము-110]

ఉదా:-

2) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు కుబ్జా కృష్ణవిలాసము. 3 126.జలద వృత్తమున ఈ బంధమును వ్రాసిరి. [అచ్చు తెలుగు]

కారడిమేల్ మెఱుంగు మెయికన్నయ సిం
గారపు హొం న్ను కోకవరగ న్వెనుకన్
దార వెదాయల న్మెదుపదాఱు జగా
మేరలుపాము కస్ద పులి మెల్పడుకో.

కృష్ణావతార కథవర్ణించు సందర్భముల మత్స్యకూర్మ బంధముల చిత్రించుట ఈకవి సమయస్ఫూర్తి మెచ్చదగినది.

మత్స్యమునకువలె కూర్మబంధమునందును తల, కాళ్ళు, తోక, వేరొకవైపు కాళ్ళు చుట్టి తిరిగి ముఖమునకు పద్యము చేరును.




కూర్మము [తాబేలు]
పటము-110

## 40. గౌళికా బంధము [బల్లి]

ఈ బంధమును చిత్రించినవారు కపిలవాయి లింగమూర్తిగారు.

ఇది తేటగీతి పద్యమున సరిపోయినది. పద్యము బల్లి తలనుండి ప్రారంభమై తోకకుపోయి తర్వాత ఒకవైపు కాళ్ళనుచుట్టి చివరకు మరియొకవైపు కాళ్ళను చుట్టుటతో పద్యాంతమగును.

తే॥ గీ॥ శ్రీకాళాధిప భవబంధ శేష శోష
భక్తజన పారిజాతక భవ్యరూప
పతిత పాతక హర! హర! నతనరశుభ
పరమధామ విభవ! వసు! సరససులభ.

[కపిలవాయి లింగమూర్తి కృతము]

[చూ. పటము-111]



పటము-1 1

## 41. గోమూత్రికా బంధము

గోవు (ఎద్దు) నడుచుచు విడుచునప్పుడు మూత్రమిరు ప్రక్కల వంకరగా మూలలుదేలి యాకార మేర్పడును. అట్టి యాకారములో పద్యాక్షరములు లిఖింపబడి కన్పడుటయే గోమూత్రికా బంధమనబడును

సంస్కృతమున నిది 8వ శతాబ్దమునుండి వాడుకలోనున్నది. శిశుపాలవధ, కిరాతార్జునీయము, దేవీశతకము, ల. స; సా. ర; పా. స; శివపాదకమలరేణు సహస్రం; సర. కంఠా; ఇత్యాది సంస్కృతగ్రంథముల గోమూత్రిక ప్రదర్శింపబడినది.

సంస్కృతములో దండి కా. ద. లో. (3-78) లక్షణమిట్లున్నది.

"వర్ణానామేకరూపత్వం యద్యేకాన్తర మర్ధయోః
గోమూత్రికేతి తత్ ప్రాహుర్దుష్కరం తద్విదోవిదుః."

తెలుగులో "యెద్దుచ్చరేఖల మూలలందు" వ్రాయవలెనని అప్పకవీయము (4-570); చెప్పుచున్నది

కా. చూ. లో (6 64). లక్షణమిట్లున్నది.

"వర్ణములు మూడుపంక్తుల వరుసవ్రాసి
మూలలందోలి గోమూత్ర లీలచదువ
నుక్తి పద్యంబు దానగు చుండెనేని
దసరు గోమూత్రికాఖ్య బంధంబుననగ."

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి ఆంధ్ర కా. ద. లో (3-80). గోమూత్రికా లక్షణమిట్లుగలదు.

తే॥గీ॥ పద్యమున రెండు సగముల వర్ణములను
నడుమ నొక్కొక్క వర్ణంబు విడిచిపెట్టి
వర్ణముల కేకరూపత వరలజెప్ప
నమరు గోమూత్రికాబంధ మసుకరంబు.

మం. పా. శాస్త్రి. ప్ర. సం. బం. నిగ్రం. లో. గోమూత్రికా లక్షణము.

"కుటిలంబై పొడవై మిధోభి ముఖమౌ గోమూత్ర రేఖాకృతి
స్ఫుటరేఖాద్వయ రెండుగీట్ల నడుమం బొందించియో లేక త
త్పట రేఖాంతర గేహపంక్తియుగళిన్ వ్రాల్నింపి యొండొంట బ
ల్కుట కర్హంబుగనో ఘటింతురు కవుల్ గోమూత్రికాబంధమున్."

తెలుగు కవు లెక్కువగ కందముననే ఈ బంధమును రచించిరి.

ఉదాః- (1) తిమ్మన. పారిజాతాపహరణము. 5-94.

కం॥ విదళిత దైత్య రమాగృహ
పద సారసవినతదేవ పతగేశహయా
చిదమిత చైత్య శమావహ
మదవారణ విమతభావమత పాశజయా [చూ. పటము. 112.]

మొదటి రెండు పాదములు పైమూలల్లో వ్రాసి తర్వాతి రెండు పాదములు

క్రిందిమూలల వ్రాసి చదువ గోమూత్రిక యగును. మూలలలో పైనుండి క్రిందకు పైకి చదువుకొనుచుపోయిన రెండుపాదములు పూర్తియగును. తదుపరి మొదటి క్రింద మూలనుండి పైకి మరల క్రిందికి మూలలగల యక్షరములు చదువుకొనుచు పోయిన చివరి రెండు పాదములు పూర్తియగును.

వి ద ళి త శై ప్ర ర మా ప్ర హా ప ద సా ర స వి న భ శే వ ప భా గే శ శా యా

చి ద మి త శై ప్ర శ మా వ హా మ ద వా ర జా వి మ భ ఘా వ మ భ పా శ జ యా

పటము_112

కందములోని మొదటిరెండుపాదములను పైవరుస మూలలలోను,చివరి రెండు పాదములను క్రిందివరుసమూలలలోను వ్రాయుటజరిగినది.కానిరేఖలననుసరించిపైనుండి "వి"తో ప్రారంభించి తర్వాత క్రింద"ద"ను కలుపుకొనిపైన"ళి"తర్వాత"త" ఇట్లు పైన క్రిందిరేఖ మూలల యక్షరములు చదువుకొనిన మొదటి రెండుపాదములు వచ్చును. అట్లే క్రింద "చి" తో ప్రారంభించి పైన "ద" ను కలుపుకొని క్రింద "మి"ని కలుపుకొని తర్వాత పైనున్న "త"ను కలుపుకొని యిట్లు క్రిందపైన మూలల యక్షరములు కలుపుకొని చదువుకొనిన చివరిరెండు పాదములు వచ్చును. కావున రచనములో అక్షరము విడిచి యక్షర మొకటిగా ఉండవలెను. ఈ లెక్కను పద్యములో సగభాగమునకు చూచుకొనవలెను. అనగా మొదటి సగభాగములోని సరి అక్షరములు రెండవ సగభాగములోని సరియక్షరము లొకటిగా ఉండునట్లు రచింప వలసియున్నది.

దీనినే ఇంకొక విధముగా వ్రాయదగును. పైవరుస క్రిందివరుస కలిపెడి ఏకరూపతగల యక్షరములు (ఆవృత్తిగల యక్షరములు) మధ్యలో వ్రాసిన దానిని పైవరుస చదువుకొను నప్పుడును, క్రిందివరుస చదువుకొనునప్పుడును కలుపు కొనవలెను. ఆ రూపమిది. [చూ పటము. 113.]

వి ళి శై ర ప్ర ప సా స న శే ప గే హా

ద భ ల్ల మా హా ద ర వి భ వ భా శే యా

చి మి శై శ వ మ వా జా మ ఘా మ పా జ

పటము_113

ఇది మూలలమధ్యలో పైవరుస, క్రింద వరుసలలో వ్రాయబడినవేరు. కాని మూలలపై అక్షరములు వ్రాసిన రీతిగూడ గలదు.

ఉదా:- సర. కంఠా. సంస్కృతములో బొమ్మ ప్రదర్శింపబడినది.

బొమ్మలో వ్రాయు విధానమేదైనను రచనారీతి మాత్ర మొకటే. పద్యరచనములో భేదములేదు. కందమున.

ఉదా:- (2) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి 808. గర్భితకందము. మరియు 827, 851.

(3) కనుపర్తి అబ్బయ్య-కవిరాజ మనోరంజనము. 4-170.

(4) కందుకూరి వీరేశలింగం-రసికజన మనోరంజనము. 1-170.

(5) పురాణం పిచ్చయ్య-విజయాశ్వచరిత్ర. 3-197.

(6) ఈదులపల్లి భవానీశ-దర్మఖండము. 4-271.

(7) ఓగిరాల జగన్నాథం-సుమనోమనోభిరంజనము. [1]

(8) వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము 3-132.

(9) నాదెళ్ళవారి. అ. ఉ. రామా. 6-213; "శ్రీరమణీయ", "భగవంత" పద్యములు.

(10) వీరి సోమేశ్వరీయము - "ధరనాయక" పద్యము.

(11) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి శ్రీహనుమద్రామాయణము.అరణ్య.309.

(12) వీరి. ఉత్తమజీవయాత్ర-55. ఆశ్వాసాంతము.

(13) రావూరి దొరసామిశర్మ-శ్రీఘటికాచల మహాత్మ్యము. "హరిహాయ" పద్యం.

(14) విక్రాల శ్రీదేవమ్మ-వాసవదత్తా పరిణయం. 4-143.

(15) విక్రాలవారి-శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా. పుట. 53.

(16) వావిలాల వాసుదేవశాస్త్రులు. రుక్మిణీస్మరణము. [2]

(17) దామెరల అంకన్న-ఉషాపరిణయం. పుట. 51.

(18) కోలాచలం శ్రీనివాసరావు-సునందనీ పరిణయం. దేవతా ప్రార్థన సమయములో.

---

[1] పూండ్లరామకృష్ణయ్య. ప్ర. రా. వేం. వి. వి.పీఠిక.పుట.28.

[2] పూండ్లరామకృష్ణయ్య. ప్ర. రా. వేం. వి.వి.పీఠిక.పుట.28.

(19) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు-శ్రీవేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము. 2-135.

ర. ఛందమున

(1) కవికల్పలత, "నారాయణ" శ్లోకము.
(2) తిరుమామిడి రామస్వామి. ఆంధ్రకిరాతార్జునీయము. [అచ్చ తెలుగు]

వీడే వేల్పా వీడే వెజ్జా
వేఁడ ప్రాఁడా వీడం బోడా
పేఁడే బొల్పా వీఁడే రజ్జీ
వేడం గోడా వీడంగిడా. [1].

గోమూత్రికకు రచన తీరు ప్రధానముగాని వృత్తమేదైనను గావచ్చును. వివిధవృత్తముల వ్రాయబడినది గోమూత్రికము. అట్లు వ్రాసిన కవులు, వారి కావ్యములను పేర్కొనుచున్నాను.

1) ధరణిదేవుల రామమంత్రి దశావతారచరిత్ర. 277. చంపకమాల.
2) కనుపర్తి అబ్బయ్య. కవిరాజ మనోరంజనము. 4-189. ఉత్సా
3) నాదెళ్ళవారు. అ ఉ. రామా. 7-157. పంచ చామరము.
4) వీరి. గురుభక్తి ప్రభావము. 3-199. కవిరాజ విరాజితము.
5) కొక్కొండ వేంకటరత్నం - బిల్వేశ్వరీయము. 5-619. శార్దూ.

సంస్కృతములో పాద గోమూత్రిక యని సర. కంఠా. లో కలదు. ఆ పక్కిలో తెలుగులో వ్రాసిన వారున్నారు. పద్యమున మొదటి రెండు పాదము లొక గోమూత్రిక తర్వాత రెండు పాదములు మరియొక గోమూత్రిక యగును.

ఉదా :- కా. చూ. 6-65 మాలిని

"వివిధ నయ విధిజ్ఞాన్ విద్ధ వీరారి గర్వాన్
భువి దన దవిధిజ్ఞానేబుద్ధ సారాభిగమ్యాన్"

ఈ రెండు పాదము లొక గోమూత్రిక.

---

[1] చిం. చిం. శాస్త్రులుగారి "అచ్చతెలుగు కృతుల పరిశీలనము" సిద్ధాంతగ్రంథము. పుట. 118.

"ప్రవరగుణ గరిష్ఠున్ ఖ్యాత విశ్వేశు గాంతున్
ధవళ గుణ గరిష్ఠున్ ఖ్యాత విశ్వేశు గాంపున్"

ఇవి రెండును ఒక గోమూత్రిక.

ఉదా :- 2) అప్పకవీయము. 4-571 మాలిని.

గోమూత్రికా బంధ విశేషములు.

1. గోమూత్రము బొట్లు బొట్లుగా పడుటను కవులు గుర్తించిరి. ఆ బొట్లు మొదటగాని, చివరగాని ఉండవచ్చును. అట్లుండుటకు వీలున్నదికదా.

ఉదా :- 1) భైరవుడు- శ్రీరంగమహత్త్వము. 5-164. కం.

హరిపద సరసిజ మధుకర
మురభిద సితమూర్తి రామ భోగయరామా.
కరిరద సురకుజ విధుకర
శరదుద సితకీర్తి ధామ చాగయరామా. [మా-పటము-114]

ఇందు చివరకు బొట్లు కలవు. మధ్యలో గూడ కొన్ని కలవు. మొదలు కూడ బొట్లుండునట్లు వ్రాసిన కవులున్నారు

ఈ మాదిరి కుదాహరణములు.

2) తూము రామదాసు. మిత్రవిందో ద్వాహము 2-39. కం.
3) కొడవలూరి రామచంద్రకవి మహాసేనోదయము. 2-253. కం.
4) వెంకయ్య- రామరాజీయము. 338. కం.
5) అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయం. కం. గోమూత్రి క. 1. మరియు గోమూత్రిక. 2. ఇందు మొదటి 4 అక్షరాలు బొట్లుగా పటమున గుర్తింప వీలగును.
6) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 17. మొదటి నాల్గు అక్షరాలు.
7) బుర్రా కమలాదేవి. చందోహంసి చివరి ఆరక్షరాలు.
8) కోట వీరాంజనేయశర్మ. చిత్రాశ్వీయము. 3-39. కం
9) అప్పకవీయము. 4-572,

## గోమూత్రికా బంధ విశేషములు

### 1వ రకము బొమ్మ



పటము-114.

2. ఏపదమావదమునకే గోమూత్రికా లక్షణముండునట్లు రచించుట.

ఉదా:- గ.వేం. కవి. ప్ర.రా. వేం. వి.వి. 8-2. చక్రవాళ చంపక వృత్తము

"హరిహరి భోగిభోగి శయనాశయ నారజ చక్రచక్ర భృ
ద్ధర ధర ధామ ధామ శరదా శర దారిత తారతారకా
ధరధర ధారిధారి వరదా వరదానవదానవాన శే
ఖరఖర మారమార జనకా జనకా వనిధీ హరీ హరీ."

ఆకారము మత్కృతము [చూ. పటం-115]



గోమూత్రిక

పటము-115

3. క్రింది వరుస చదివి పై వరుస చదివిన మఱియొక కందమేర్పడుట ఇంకొక గోమూత్రికా విశేషము. రచన దాని కనువుగ ఉండును.

ఉదా :- వేదులవారి. ల.స. (ఆంధ్ర) చిత్ర. స్తు. షట. 213. కం,

కలుముల చెలికరుణా శ్రీ
తలదృష్టి:సమస్త వాక్సృతాఘము లొందుగన్
పలుకుల చెలి కరుణా శ్రీ
తల దృష్టి సమగ్ర వాగ్వ్రతార్థము లెదుగన్.

పై రెండు పంక్తులు పై వరుస వ్రాయుదుము. క్రిందిరెండు పంక్తులు క్రింది వరుస వ్రాయుదుముగదా క్రిందివరుస చదివి పై వరున చదువ రెండవ కందము వచ్చును. ఆ కంద మిట్లుండును.

పలుకులచెలి కరుణాశ్రీ
తలదృష్టి సమగ్ర వాగ్వ్రతార్థము లెదుగన్
కలుముల చెలి కరుణా శ్రీ
తలదృష్టి సమస్త వాక్సృతాఘము లొందుగన్.

4. బేసి వరుసలలో ఒకవృత్తము (13,5,7) సరి వరుసలలో మరియొక వృత్తము (2,4,6,8) గోమూత్ర పద్ధతిలో చదువ నగును

ఉదా :– వేదులవారి.ల.స. (ఆంధ్ర). చి. స్త. 44, 45.

వంశస్థవృత్తము: 1. ప్రవాహసంసారి విపద్వి వాదినీ
3. స్తవింతు రమ్మమ్మ! భృశమ్మునన్ నతిన్
5. వివేక దీక్షమ్మున వేఁగ బోవునన్
7. ద్రవించి మా చిక్కులు దవ్వ వాఱఁగన్.

ఇంద్రవంశము : 2. భావార్తి సంతారిణి! పద్మవాసినీ
4. శ్రావింతు రమ్మమ్మ! భృశమ్మునన్ నుతిన్
6. వేవేయి దీవ్రమ్ములు. వేగఁ బ్రోచినన్
8. ద్రావించుమా దృక్కులు దప్పి వాయఁగన్.

5. అనులోమ స్రగ్విణీ, ప్రతిలోమ చతుష్పద ద్విపద వచ్చు గోమూత్రికా రీతి.

ఉదా:– 2) వేదులవారి ల.స. (ఆంధ్ర) చి. స్త. 46, 47

1 వే ద భూ జా త మా వేం క టే శాం గ నా
ఫే ధ భూ రు త క ఫే వి టే ద గ త 7

3 చే దు మీ వే వ తిన్ జెం ది నే రా గ నన్
చే దు మీ తి వ ద చెం ను నే తి గ ప్ర 5
5 నీ దు సే వా ని ధిన్ నే ను మై నీ గ నౌ
నీ దు సే ధి వి ను నే న మై త గ వి 3
7 గా దె నీ వీ వి తో కా వ గా రా గ దే
గా దె నీ ధి వి చు కా క గా తి గ వి 1

ఎడమవైపు 1,3,5,7-ప్రసగ్విణీవృత్తము.

కుడివైపు 1,3,5,7-ప్రతిలోమగతి చదువుకొనిన చతుష్పద ద్విపద వచ్చును.

6. నారాచ, ప్రమాణి, నాగరవృత్తముల మూటిలో మొదటి రెండింటికి గోమూత్రవిధము, మొదటి, మూడవదానికి గోమూత్ర విధముచెల్లునట్లుండును. దీనికి

ఉదా:- వేదులవారి ఆ.స. [ఆంధ్ర] చి. స. 52, 53, 54 పద్యములు.

## 42. సుడిగుండము (వలయభ్రమయమక బంధం)

దీనిని తమిళమున సుడిగుండమని పేరిడిరి. బొమ్మను అనుబంధములో చూడవచ్చు.

3) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట. 59.

విద్యున్మాల:

"మారా ధారా మాస్యా రామా
ధారారారా రాజా ధారా
ధారాశాఖ్యాతా రాజా స్యా
రారాఖ్యాత త్రాతా రామా."

ఇది అర్ధభ్రమక బంధమువలె నున్నది. "సుడిగుండము" బొమ్మలో పద్యం వ్రాసి సుడులుగ చదువ పద్యము క్రమము తప్పక వచ్చును.

## 4. ఆకార నియమ చిత్రమిశ్రమము

రెండు లేదా అంతకంటె పెక్కు బంధములుగల పద్యము నాకార నియమ చిత్రమిశ్రమము క్రింద చెప్ప వీలగును. ఉదా :-

1. ధామెరల అంకన్న - ఉషాపరిణయం 2-61. కందమ్ము. అందు

1) పంచదళపద్మ, దశదళ పద్మ, చక్ర, షడ్దళపద్మ శ్లేష కంకణ బంధము లిమడ్చ బడినవి.

2) ఇతడే కందములో ప్రదక్షిణమాన విష్ణుస్తుతి పద్యాలు 54, అప్రదక్షిణ మాన శివస్తుతి పరాలైన పద్యాలు 54, మొత్తము 108 పద్యములు వచ్చునట్లు రచించెను. ఆ కందమిది :

వరదా పరదా భరదా
వరద పరద భరద వరద పరదా భరదా
వరదా పరదా భరదా
వరద పరద భరద వరద పరదా భరదా.[1]

ఇందు ఖడ్గ, అష్టాదళ దళపద్మ, చక్ర, ద్వాదశ దళపద్మ, ద్వాత్రింశద్దళ పద్మ, షడ్దళదళపద్మ, షట్కోణ, గోమూత్రికా మున్నగు బంధములు గలవు.

2. కాణాద పెద్దన-ముకుందవిలాసము.'దారవతనువభ.' కం

3. 1) గ.వేం.కవి - ప్ర.రా.వేం వి.వి. 808 లోని గర్భిత వింశతి బంధ కందము.

2) వీరి. ప్ర.రా.వేం.వి.వి. 852. లోని అనుష్టుప్ శ్లోకము. అందు చతుర్దళ, ద్వాదశదళ, పాదుకా బంధద్వయము కలవు.

4) ఈదులపల్లి భవానీశ ధర్మఖండము 9-292. ఇందు గోమూత్రికా, పద్మ, పుష్పమాలికా బంధములు కలవు.

అది:

ఖేద శాద భేద రాద మోద ప్రద
శ్రీద పాద వేద వాద మోద
కాద భేద యాద వాద రీదర్పద
ఛేద వాద సూద నాద వాద

5) వేదులవారి. ల.స. (ఆంధ్ర). చి.స్త. 55. ఇందులో అర్థభ్రమ,ద్విపాది అనులోమ విలోమ గోమూత్రికా బంధములు కలవు . అది భద్రకవృత్తము.

---

1. హైదరాబాదు. ప్రాచ్యలిఖిత గ్రంథాలయం. A. C. C. 6405. 5వ ఆశ్వాసము. 150 పుట.

'మాసవా సరసరా సమా
మాసరా సరస వాసమా
మాసవా సరస రాసమా
మాసరా సరస వాసమా'. —55.

అర్థము : అసవ=దుష్కర్మములను, అస=చిమ్మివేయుటయందు, రస=ఆసక్తిగలదానా, సమ=సమబుద్ధి గలదానా, రా=రమ్ము, మా=బుద్ధియందున అస=ఉండుదానా, రాస రసవాస=రాసక్రీడా రసమందు నివసించుదానా, మా=లక్ష్మీ, మా+అస=సంపదకు స్థానమైనదానా, వాసర=వాసరమునందు, సరా=సంచరించు నట్టిదానవును, అసమా=సాటిలేనిదానవును, మా=మాయొక్క, సర+అసర=చరాచరములందు, సవాస=నివాసముతో గూడుదానా, మా=తల్లీ!

6) మం.పా.శాస్త్రి. కాశీవిశ్వనాథ శతకమునందలి నిరోష్ఠ్య బంధశతగర్భిత ఛత్రబంధ శ్లోకము.

'రాక రాక త్రిరా కరా
రాజ తాగగతా జరా
రాగా సారర సాగారా
రాకా రాత్రి కరాకరా.'

7) నాదెళ్ళవారి. అ.ఉ.రామా. 7-210. ఇది పుష్పమాలికా గోమూత్రికాద్యనేక బంధ విరాజమాన కందరాజము.

మురహర శర పురహర దొర
ధర ధర ధర స్మర హరహర ధర గర ఖర ఛా
రరి రక్షర హరసుర వర
దరకర గరగర ధరదర ధరసర వరదా.

8) 1. విక్రాలవారి. శ్రీ వేం.చి.ర. కరము. పూ.భా. బంధ. 6,7,8.ఇందు షోడశదళపద్మ, ద్విచతుష్కచక్ర గోమూత్రికా బంధములు గలవు. శ్లోకము.

'రామకామ సమశ్యామ
శ్రీమ స్థిమస్థమ క్రమ
క్షేమనామ న్వామభీమ
భూమధామ స్నమస్నేమ'.

2) వీరి. శ్రీ వేం.చి.ర. కరము పూ.ఖా. బంధ. 9, 10, 11, మాణవక వృత్తమును రచించెను. ఇందులో అష్టదళపద్మ, చతురర చక్ర, గుచ్ఛ బంధములు గలవు.

"సారస నేత్రా సురసా
సారసుఖ శ్రీ తరసా
సాళతరాత్మా దరసా
సారద రాధ్యా సరసా."

9) 1) విక్రాల శ్రీదేవమ్మ. వానవదత్తా పరిణయము. 1-89. ప్రమాణి వృత్తము. ఇందు షోడశదళపద్మ, మాలికా, గోమూత్రి, ద్విచతుష్క చక్ర బంధములు గలవు.

"ధరా ధరా పరాత్పరా
చరా చరా స్తరా చరా
చరా చరా వరా పరా
ఖరారి రామ రా దొరా"

అర్థము : చరా = శ్రీకిన్ని, అచరా=భూమికిని, వరా=భర్తా

2) అందలి. 1-9?. మాణవక వృత్తము. అందు గుచ్ఛ, అష్ట దళపద్మ బంధములు గలవు.

10. 1) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. బంధ. 21. ప్రమాణివృత్తము. ఇందు ద్విచతుష్కచక్ర, మాలికా, శరబంధములు కలవు.

"ధరా వరా వరా సురా
వరాగరామ రా సరా
ధరావరాగ రామరా
జరాగ రాగ రా సరా."

2) అందలి బంధ. 20. సింహరేఖా వృత్తము. ద్విచతుష్క, షోడశదళ పద్మ బంధము లిందుగలవు.

3) అందలి. బంధ 19. మాణవకవృత్తము. అష్టదళపద్మ, గుచ్ఛబంధము లిందుగలవు.

4) అందలి. బంధ. 22. ప్రమాణీ వృత్తద్వయము. షోడశదళచక్ర, ద్విచతుష్కచక్రబంధద్వయ, మాలికాబంధద్వయ, గోమూత్రికాబంధము లిందుగలవు.

# చతుర్థ ప్రకరణము

# చ్యుత గూఢ చిత్రములు

## 1. చ్యుత చిత్రము

ఒక వర్ణము లేదా బిందువు మున్నగువానిని చ్యుతముచేసి పద్యము రచించుటను చ్యుత చిత్రమందురు. ఏది చ్యుతమగునో దాని పేరున చ్యుతకమందురు. 'అక్షరస్య చ్యుతిర్యత్ర తదక్షర చ్యుతకమ్' అని కొల్లూరి లక్ష్మణశాస్త్రిగారి నిర్వచనము. ఆ చ్యుతము జరుగకముందు తర్వాత గూడ ఆ పద్య మర్థవంతమై యుండవలెను.

కొన్ని చిత్రములు ఉక్తి వైచిత్ర్యామాత్రములు. అలంకారములుగ పనికి రావు. వానిలో ఈ చ్యుత చిత్రమొకటి. దీనినే 'ఉక్తి వైచిత్ర్యామాత్రం సాచ్యుత దత్తాక్షరాదికా' అని సాహిత్యదర్పణం 10-13 రెండవ పంక్తి సమర్థించుచున్నది.

అంతేకాదు. ఇది క్రీడా మాత్రముగ ఉపయోగపడును. ఈ విషయమునే రుద్రటకావ్యాలంకారము 5-24 ఇట్లు చెప్పుచున్నది.

"మాత్రాబిందు చ్యుతకే ప్రహేళికా కారకక్రియా గూఢే
ప్రశ్నోత్తరాది చాన్యక్రీడా మాత్రోపయోగమిదమ్"

అందువలన కావ్యములందు ఫలాని పద్యమం దీ చిత్రము కలదని చెప్పిన గాని తెలియదు. అవధానము లందిది చెల్లును.

ఈ చ్యుత చిత్రము నాల్గు విధములని కా.శా.లో హేమ చంద్రుడు తెల్పి యున్నాడు.

"చ్యుతం మాత్రార్ధమాత్రా బిందువర్ణగ తత్వేన చతుర్ధా"

### 1. మాత్రాచ్యుతకము

ఒక మాత్రను చ్యుత మొనరించుట ఇందలి చిత్రము. సంస్కృతం.

ఉదా:- కా.శా. V 470.

భూతియోజిత భర్తవ్యః కృపణాత్కాంత మండలః
మహోవద శుభా వాసత్వత్సమః కృపతిః క్షతః

ఇందు 'కృపాణ'కు బదులు 'కృపణా' అని వాడబడినది. కనుక ఒక మాత్ర తగ్గినది.

ఇంకను ఇది సు.ర.భాం., కవీంద్ర కర్ణాభరణకు మున్నగు గ్రంథముల చూడ నగును.

తెలుగున మచ్చుకు మాత్రమే కనబడుచున్నది మాత్రాచ్యుతకము.

ఉదా:- 1) చిత్రాలవారి. శ్రీ.వేం.చి.ర. కరము.పూ.భా. 15,17,18.

తే॥గీ॥ ఆదరము నుంచు మాయెడ నంబుజాక్ష

కాదనము నీవలన నెపుడేదియు నెట

నిత్య మంతః కరణమున నిలిచియుండు.

మచ్యుతా! చేయు మరుల కర్థచ్యుతులను.

దీనియందు 'కాదనము'లో 'కా' మీద ఒక మాత్ర తగ్గి 'కదనము' అగును. మాత్రచ్యుతము కానప్పుడు నీ వలన నెపుదేది యెచట జరిగినను మేము కాదనము అని అర్థము. చ్యుతమైనప్పుడు శత్రువుల పరమగు అర్థములో శత్రువులకు కదనమే చూపుమని భావము.

ఈ మాత్రాచ్యుతకము ద్వారా సంస్కృతములో ఒక శ్లోకమును మరియొక శ్లోకముగా మార్చదగును. అనుష్టుప్ శ్లోకము ప్రమాణికా వృత్తమగును.

ఉదా:- పయోధి కన్యకారామా భయార్తి భంజన క్షమా

జయాభివృద్ధి, సన్ధానా స్వయోగానన్ది తాశ్రితా

ప్రమాణికావృత్తము.

పయోధికన్యకారామా భయార్తి భంజనక్షమా

జయాభివృద్ధి సన్ధనా సయోగనంది తాశ్రితా.

మొదటి పాదమున 'రా' ర, ర్తీ-ర్తి.

రెం.పా. న్ధా-న్ధ, గా-గ. అని మాత్రాచ్యుతమైనవి.

## 2. అర్థమాత్రా చ్యుతకము

అర్థ మాత్రను చ్యుత మొనరించుట ఇందలి చిత్రము. సంస్కృతం. ఉదా: కా.శా. V.471

పయోధర భరాక్రాంతే విద్యుల్లే ఖా విరాజితే

కాంతః సర్వ జనాభీష్టో బాలే దుఃఖేన లభ్యతే.

'బాలేదుఃఖేన' ఇది 'బాలేన్దుఃఖేన'గా ఉండవలసినది. 'న్' అర్ధమాత్రాచ్యుత మైనది.

తెలుగున ఉదా:- తేటగీతి పాదము. మదీయము

తల్పమందున జేరగా దలఁపులుఁడుగు'.

ఇందు 'ల్' అర్ధమాత్ర లోపించిన 'తపమందున' అగును.

3. బిందు చ్యుతకము

బిందువును చ్యుత మొనరించుట ఇందలి చిత్రము సంస్కృతం ఉదా:-కా.శా. V. 472.

సహసా నలినీ తారా శారితాగగనా వనిః
శోభతే భూమి పాలానాం సభాచ విబుధాశ్రితా.

'సహసా'లో బిందువు విడువబడినది బిందువు చేర్చినచో 'సహంసా'అగును.

తెలుగున ఉదా :- విక్రాలవారి,శ్రీ.వేం.చి ర.కరము. పూ.భా. 15.

1) తే॥గీ॥. బహువిధాంధః కృతోల్లాసభరుఁడవీవు
సంగత శ్రీవి నీవు యో సరసిజాక్ష
అహితులకు సంజ్వర ప్రతియాతనుఁడవు
అన్నిటనుఁజేయు మరులకు సున్నచ్యుతుల.

ఇందు 1) అంధః 2) సంగత 3) సంజ్వర. అను మూడు పదములలో మూడు బిందువులు కలవు. 1. అంధః. అంధః=చక్కెర పొంగలి మొ॥ వంటకముల చేత, కృత=చేయబడిన, సంజ్వర=వేడిమియే, ప్రతియాతనుడవు=సాటిగాగలవాడవు; అరులకు=పగవారికి, అన్నిటను;సున్న=లేమిని,చ్యుతులను = పడుటను న్ను చేయుము. పై మూడు సున్నలను పోగొట్టవలెను. బిందువుచ్యుతమైన 'అధః.' అగును. అప్పు డర్థమిట్లుండును. పగవారికి పలుకీతుల, అధఃకృత=నిరాకరింపబడిన, ఉల్లాసభరుడు.

2. సంగతలో బిందువు పోయిన 'సగత' అగును. సగత=పోఁకతోఁగూడిన, శ్రీ=సంపదలు గలవాడు.

3. సంజ్వర=లో బిందువు చ్యుతమైన "సజ్వర" అగును. సజ్వర ప్రతియాతనుడు=జ్వరముతోను, సర్వవిధములైన తీవ్ర బాధలతోను గూడినవాడు.

2) ఉదా :-శ్రీనాథుని శృంగార నైషధము-4-90. తే॥ గీ॥.

కాంత యశ్రుబిందు చ్యుతికై తపమున
చిపిరి బిందు చ్యుతక కేళి దవిలెదీవు

సారె సారెకు నాదు సంసారమును స
సారముగ జేయుచు న సార సారసయన.

"సంసార"ము బిందుచ్యుతకమై 'ససార' మగును.నలుడు దమయంతి తోడి మాటలు.

## 4. వర్ణచ్యుతకము

ఒక వర్ణమునుగాని, పలువర్ణములనుగాని చ్యుత మొనరించుట ఇందలి చిత్రము.

సంస్కృతమున మాత్రా,వర్ణచ్యుతకములు గర్భకవిత్వమునకు మూలములు. ఒక పద్యములో ప్రతిపాదము నుండి కొన్ని వర్ణములు తొలగించిన వేరొక పద్య మగును. కా. శా. లో వర్ణచ్యుత మిట్లే చూపబడినది. V. 473.

"సిర నృశిరః ప్రసజారచిత మౌళి శిరోమణి మౌక్తికై స్తథా
శిఖి రూచి రోర్ధ్వదుక్ వృథులలాట తచే తిలక క్రియా చసా
స్ఫుట వికటాట్టహాస లలితం వదనం స్మితపేశలం చతత్
అభినవ మీశ్వరో వహతి వేష మహో తుహినాద్రి జార్థయుక్."

ఇది సిద్ధి పద్యము. ఇందుండి ప్రతిపాదములో మొదటి రెండు వర్ణములు చివరి ఏడక్షరములు చ్యుత మొనరించిన ప్రమితాక్షరా పద్యమగును. దాని యందు శంకరుని వర్ణన ముండును.

పైపద్యము ప్రతిపాదములో మొదటి ఏడక్షరములు. చివరి రెండక్షరములు చ్యుత మొనరించిన 'ద్రుతవిలంబిత వృత్త' మగును. దీనియందు పార్వతి వర్ణనము గలదు.

ఇట్లుకాక ఒక్కవర్ణమే శ్లోకమున చ్యుతమొనరించి సు. ర. భాం; పర కంఠా. లలోను, కొల్లూరి లక్ష్మణశాస్త్రిగారి రచనమున చూపబడినవి.

తెలుగులో ఉదా:- మాత్రాచ్యుతకమందలి ఉదాహరణ పద్య మందలి 'ఆదరము నుంచు మాయెడ సం బు జా క్ష' అను పాద మందలి "ఆదరము" పదములోని 'ఆ' చ్యుతమై 'దరము' అగును. చ్యుతము కానప్పుడు "ఆదరము మాయెడ నుంచుము" అని అర్థము. చ్యుతమైనప్పుడు శత్రువుల యెడ 'దరము నుంచుము' అనగా భయము కల్గించుము అని అర్థము మాకు "ఆదరము" వారికి 'దరము' చూపుమని భావము.

ఉదా — 2. అప్పకవి అక్షర విలోపమును చిత్ర కవిత్వ శీర్షిక క్రింద ఇచ్చి ఉన్నాడు. అది వర్ణచ్యుతకమని భావింపదగును.

ఆతని లక్ష్యలక్షణ పద్యమిది. అప్పకవీయము. 4-557.

రవికన్యా సుందరకర
మవలంబన మొర్చి యూఁదె నచ్యుతుఁడనియే
నవ వర్ణ విలోపముగా
నవనిం బరియింపవలయు నార్యులు మెచ్చన్.

పద్యము చివరి రెండు పాదాలలో లక్షణమున్నది. 5వ వర్ణమును లోపము చేసి చదువవలెనన్నాడు. అట్లా చెప్పని పక్షమున ఏ వర్ణము చ్యుత మొనరించవలెనో ఈ చిత్రమున తెల్పికొనుట పాఠకులకు కష్టము. పై పద్యమున 5వ వర్ణము 'సుం' దానిని చ్యుత మొనర్చిన "రవికన్యా!" సంబోధనమగును. దర=శంఖమును, కరమ వలంబన మొర్చి అచ్యుతు డూదెనని అర్థము.

ఈ పద్యమున ఏనవవర్ణముకావచ్చు. కాని పద్యమున ఏ వర్ణమునైనను చ్యుత మొనరింపదగును. అవధానములో నిషేధాక్షరివలె ఇది కూడ పృచ్ఛకుడు ఫలానా అక్షరము చ్యుతమొనరించి పద్యము చెప్పుడని యడుగుట, అట్లా కవి ఈ చిత్రమును వెలయించుట జరుగునని భావించుటకు వీలున్నది.

ఉదా:- 3. పోకూరి కాశీపతి. త్ర్యర్థికావ్యము "సారంగ ధరీయం"లోని "కుధర సమాకృతి లాభము" పద్యమునందలి పాదములోని అక్షరము లొక్కొక్కటి తీసివేయుచుపోయినా - ఆ పద్యములో చెప్పిన వర్ణనార్థము స్ఫురించును. ఆ పద్య మిది.

కుధరసమాకృతి లాభ
మ్మధికముగా గొనె కుచద్వయం బొండొండా
కుధము ఖలి పుసవినగ
ట్యధర దృగం గోక్తి నాసికాస్య నఖములా.

మొదటి పాదము "కుధర సమాకృతిలాభము" = కుచములు, అందుండి ఒక్కొక్క వర్ణము తొలగింప "ధర సమాకృతి లాభము = పిరుదులు, రసమాకృతి లాభము = అధరము, సమాకృతి లాభము = దృక్కులు, మా కృతి లాభము = అంగము, కృతిలాభము = ఉక్తులు, తిలాభము= నాసిక, లాభము=అస్యము, భము - నఖములు.

ఈ నాల్గు చ్యుతములనే కా. శా. కర్త తెలిపినను, ఇంక కొన్ని చిత్రములు

సంస్కృతమున ప్రదర్శింపబడినది. వానిలో విసర్గ చ్యుతక మొకటి. ఇది. సు. ర. భాం; కవీంద్ర కర్ణాభరణము మొ॥ గ్రంథముల గలదు.

ఉదా 4. నగతనయన్ ధరన్ సిరిని నాలుగ వర్ణములన్ లిఖించి యా
చిగురున నక్షరంబిడిన చొప్పున నొక్కొక్క యక్షరంబునన్
అగును గజాననుండు నొకటాదిగ దీయ చతుర్ముఖుండు రెం
డుగ నటుదీయ షణ్ముఖుఁడు, వెంటనే పంచశరుండు వహ్నియన్

ఉమా కుమార = వినాయకుడు
మా కుమార = బ్రహ్మ
కుమార = కుమారస్వామి
మార = మన్మథుడు
ర = అగ్ని

పద్యములో చెప్పబడిన ప్రకారము అక్షరములు లిఖించి ఒక్కొక్క యక్షరమును తొలగించు చుండగా ఆయా అర్థములు స్ఫురించుచున్నది.

## ౫. విసర్గ చ్యుతకము

విసర్గను చ్యుత మొనరించుట ఇందలి చిత్రము. తెలుగులో ఉదా:- మాత్రా చ్యుతక మందలి ఉదాహరణపద్య తృతీయపాదము. అది.

"నిత్య మంతః కరణమున నిలిచి యుండు"

"అంతః కరణమున" అనుపదములో విసర్గపోయినచో "అంతకరణమున" అని అగును. నిత్యము మా అంతఃకరణమున నిలువుమని విసర్గ చ్యుతము కానప్పటి అర్థము. విసర్గచ్యుతమైనపుడు "అంతకరణమున"—అంత= నాశముయొక్క, కరణమున = చేయుట యందు, అనగా శత్రువుల నశింప జేయుట యందు ఉండు మని భావము.

అచ్యుతా! అని సంబోధన మెంత సార్థకమైనదో "నాశరహితుడా!" శత్రువు లకు తగిన విధముగ నాశన మొనర్చుమయ్యా. అనుట యుక్తముగా ఉన్నది.

## ౬. వ్యంజన శతకము

వ్యంజనమును చ్యుత మొనరించుట ఇందలి చిత్రము. సంస్కృతములో ఈ వ్యంజన చ్యుతకమునకు లక్ష్యము సు. ర. భాం లో గలదు.

తెలుగులో మచ్చుకు, మదీయము. తే॥ గీ॥ పాదము.

పీడు జూడఁగ నందంబు పీడుచుండె.

పీడు= పట్టణము, క్రమేపి అందమును పోఁగొట్టుకొనుచున్నది, అని అర్థము. "పీడు" లోని 'ప్' వ్యంజనము చ్యుత మొనరించిన 'ఈడు'. అనగా వయసు. అప్పుడర్థము. వయసు అందమును మెల్లగా తగ్గింపజేయుచున్నదని.

### 7. చ్యుత దత్తాక్షరా

ఒక వర్ణము చ్యుతమై,మరొక వర్ణముదత్తమగుటను చ్యుత దత్తాక్షరామందురు. సంస్కృతములో. సాహిత్యదర్పణము 10–13, సు. ర. భాం. చ్యుత 13, సర. కంఠా. 2–360. పద్యములు గలదు.

తెలుగున మచ్చుకు ; మదీయము. తేటగీతి రెండుపాదములు.

ఆకలియె హెచ్చె ధరహింస లధికమయ్యె
పురము నందుండి జీవింప దరమె మనకు?

ఇందు "ఆ" చ్యుతమైన కలిబాధలు మిక్కుటమైన వనియు, పురము నందుండి జీవించుట దుర్లభము అని అర్థము. "కా" దత్తాక్షరమై కాపురము= భార్యా బిడ్డలను పోషించుచు, జీవించుట మన తరముకాదు అని భావము. కనుక ఇచ్చట 'ఆ' చ్యుతమై 'కా' దత్తాక్షరమైనది.

## 2. గూఢ చిత్రము.

ఒక పద్యమును లేదా పద్యపాదమును లేదా పద్యమును గూఢ మొనర్చుటను గూఢ చిత్రమందురు. క్రియా పదమును గూఢ మొనర్చిన క్రియాగూఢ మనియు, చతుర్థపాదమును గూఢ మొనరించిన గూఢ చతుర్థపాది అనియు, తేటగీతిని చంపక మాల యందు గూఢ మొనరించిన తేటగీతి గర్భ చంపకమనియు పిలువదగును. ఈ గూఢతకు గుప్తము, గోపనము, గర్భితము, పర్యాయపదములుగా వాడు చున్నారు. వంచన మని కూడ పిలుతురు.

హేమచంద్రుడు గూఢ చిత్రము నాలుగు విధములని ఇట్లు చెప్పియున్నాడు.

'గూఢం క్రియా కారకానంబంధపాద విషయత్వేన చతుర్థా'.

చిత్రకవి పెద్దన 'చిత్ర కవితలానరు' 3–100 పద్యమున వృత్త గర్భిత ములు, కొన్ని గోపనములు గలవవి సూచించినాడు. చిన్నకోట పెద్దనయు, చిత్ర

కవియు గూఢ చతుర్థ పాదమును వివరించిరి. అప్పకవియు గూఢ చతుర్థ చరణ వర్ణపని గర్భకవిత్వము క్రిందకు వచ్చునని చెప్పియున్నాడు. కాని లక్ష్యము నివ్వియుండలేదు. కనుక గర్భకవిత్వమునకు ప్రాతి పదిక ఈ గూఢ చిత్రమే. ఈ చతుర్థపాద గోపనమే. ఎట్లన, పాదమును గూఢ మొనరించినట్లే పద్యమున గూఢ మొనరించుట గర్భకవిత్వమున జరుగునుగదా.

తెలుగు లాక్షణికు లెవరునుపైన పేర్కొనబడిన క్రియాకారకా సంబంధముల గూర్చి వివరింపలేదు. పాద గూఢమును గూర్చి తెలిపిరి అట్లే హేమచంద్రుడు గర్భకవితను గూర్చి చెప్పలేదు. ఏలన, సంస్కృతమున చ్యుత చిత్రముననే వృత్తి గోపనము కలదని తెలిపితిమి గదా. పైన తెల్పిన క్రియా, కారకా, సంబంధ గూఢములే గాక సంస్కృతమున కర్తృ, కర్మ గుప్తములు, ఏదో ఒకపద గుప్తము సమాస, సంధి, లింగ, వచన, సంబోధన మాది గుప్తములు వివిధ లక్షణ గ్రంథ ముల, కావ్యముల కనబడుచున్నవి.

తెలుగునను పాదగూఢము, పద్యగూఢము (గర్భకవిత) విరివిగా కన్పడు చున్నను, కవినామ గుప్తము, తెలుగుసంవత్సరముల పేళ్లు గూఢపరుచుటలు మున్నగునవి మచ్చుకు వెలయింపబడినవి.

చిత్రమనగా ఆశ్చర్యము కలిగించుననుట బట్టి ఈ గూఢ చిత్రము కూడ చూడ చోద్యముగా ఉండి, అప్పకవి చెప్పినట్లు శ్రవణ సుఖం బొనర్చును [1]

తెలుగులో ఇప్పటివఱకుండిన ఈ గూఢచిత్రము వాడకమునుబట్టి ఇది రెండు విధముల వాడబడినదని చెప్పవచ్చు. 1) అవధాన సమయమున లేదా రాజసభలందు కవిప్రతిభను ప్రదర్శింపజేయుటకు పనికివచ్చు గూఢ చిత్రము. 2) కావ్యరచనలో చూపదగు గూఢ చిత్రము. కవినామ, క్రియాది గోపనములు, పాదగోపనము మొదటి విధము క్రిందకు వచ్చును. పద్యగూఢము (గర్భకవిత) రెండవ రకము నకు చెందినది.

---

1. అప్పకవీయము. ప్ర.ఆ. శబ్దార్థాలంకార సీసమాలిక. పుట. 18. ప్రింటు. 1966.

తెలుగులో గూఢ చిత్రము నాలుగురూపములఁ గనఁబడుచున్నది. అవి. 1. పద గూఢము 2. పాదగూఢము, 3. భాషాగోపనము 4. పద్యగూఢము.

## 1. పదగూఢము

పదగూఢము ఏడురకములుగ నాచే గుర్తింపబడినది. 1) క్రియావంచనము 2) సంబుద్ధి, విశేష్యవంచనములు, 3) సప్తవిభక్తి వంచనము, 4) నామగుప్తము 5) అంకగణితము 6) త్రిపద గోపనము 7) వివిధపదగోపదనము.

### 1. క్రియావంచనము

సంస్కృతమున కా శా. 5.474, శి.పా.కమ న,కవీంద్ర కర్ణాభరణమ్. మనార మరంద చ. పూ.లలో క్రియాగోపనమున్నది. క్రియ యుండియు లేనట్లగపడుట క్రియా వంచనము. తెలుగులో, ఉదా:- వేదులవారి ల స, చి. స్త.7.

రామా దైవతమణి! నీ
ప్రేమా పాగంములఁ భయము వెడలిచి నిత్య
మ్మేమొనరించు నఘములని
స్సీమమ్ములఁగెడపి మమ్ముఁ జేదుకొనంగన్.

ఇందు మొదటి 'రా' అనునది క్రియ. 'రా! మా దైవతమణి!'' అని అర్థము. 'రామా దైవతమణి' అని సమాసము చేసినపుడు క్రియ కనబడదు.

సంస్కృతములో కృష్ణ కవి క్రియాగోపన రామాయణము లేదా చంద్రకళా విలాసమును వ్రాసి యున్నాడు. అది రామాయణకథ 14సర్గలు కలది. ప్రతిపద్య మున క్రియాపదము దాగియుండును [1]

### 2. సంబుద్ధి, విశేష్య వంచనములు

ఇందు సంబోధనము, విశేష్యపదము వంచనము చేయబడును. తెలుగులో ఉదా:-

ఆ॥వె॥ మమ్ము నోమరమ్మ మంగళదేవతా
ధవతినిం దయాళు దేవమౌని
లోకపాల లోలు లోనమ్మి యుంటిమ
సంత సమ్ముతోఁడ సంతతమ్ము.

(విక్రాలవారి. శ్రీ.వేం చి.శ.కరము. ఉదా.22)

---

1. History of classical Sanskrit Literature, by M. Krishnamachary, page. 377. print 1937.

ఇందు 'మంగళదేవతాధిపతి'!=ఓ శ్రీపతీ!అనెడి సంబోధనపదము వంచనము గావించబడినది.

మంగళదేవతాధిపతి అయిన 'నిన్'+విన్న=అనుటలో 'నిన్' అనెడి విశేష్య పదము వంచనమైనది.

౩౦. సప్తవిభక్తి వంచనము

సప్త విభక్తులను వంచనము చేయబడిన పద్యము గమనింపదగినది.

ఉదా:- [వేదులవారి. ల.స. చి. స్త.8].

సీ॥ మా పాపములఁ బాపుమాత నిత్యము మాను
గనునెడ సుఖములు గలుగుచుండు
మాచేత సర్వమ్ము మహితఫలమ్మగు
మాకై సమస్త మమర్పనగును.
మావలన జరుగు మహనీయ సౌఖ్యముల్
మాఁబదవవని సంపద నొసంగు
మాయం దొలఁగుదుము మఱఁగిన భక్తిచే
ఓ మాకృతిన్ ప్రీతి నొందు దగదె

తే.గీ॥ అనుచు నుతితతి పరవశులైన స్త్రీయ
భక్తజనులకు మాకు సంపదల నొసగి,
కోరికలఁ దీర్చి తుదిని వైకుంఠ మొసగ
ధవుని బ్రతిమాలు తల్లి ప్రత్యక్షమగుత.

ఇందు 'మా' అనుదానిని ఒకప్పుడు విభక్తి ప్రత్యయములతో గూడినదిగను మఱొకప్పుడు లేనిదిగను జదువనగును. ఇందు సంబోధనము కూడ ఉన్నది. ఓమ్+ ఆకృతిన్=అన్నప్పుడు సంబుద్ధి ఉండదు ఓ! మా! అన్నది సంబుద్ధి రూపము.

ఉదా:- 2) (కృష్ణలీలా తరంగిణి)

కృష్ణుడు నాకుదిక్కు- మది కృష్ణు దలంచెద నిట్టు కృష్ణుచే
గృష్ణునికై నమస్కృతులు కృష్ణుని కంటె బలుండు లేడు శ్రీ
కృష్ణుని కేను దాసుడను గృష్ణుని యందు వసించు డెందమా
కృష్ణ యటంచు నంచు వచియింపగ దయామయ మాయకృష్ణయా.

3) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర కరము. ఉ-భా.25

4) బుర్రా కమలాదేవి. ఛందోహంసిలో సార్వవిభక్తిక మున్నది. [1] విభక్తి, వంచనము లేకపోయినను 2,3,4 ఉ.దా లు. సార్వ విభక్తిక ములు.

## 4. నామ గుప్తము

ఇందు కవుల, కావ్యముల, వృత్తముల, సంవత్సరముల మున్నగు వాని పేర్లను గూఢ మొన ంచుట జరుగును.

1. కవినామ గోపనము. కవి తన పేరును గద్యమున గూఢ మొన రించుకొనుట కవినామగోపనమందురు. ఇది రెండు రకములు కన్పడుచున్నది పద్య ప్రతి పదాదినో లేదా పాదాంత్యముననో నామాక్షరములు వరుసగాచూపుట మొదటిది. పద్యములో ఎచ్చటైనను నామాక్షరములు వచ్చునట్లు కూర్చుట రెండవరకము. మొదటి పద్ధతినే ఎక్కువగా అనుసరించుట జరిగినది.

ఆంగ్లముల Acrostics [2] అను పేరుగల రచన కలదు దానివివరణమిట్లున్నది "As series of lines or verses in which the first, last or other particular lettrs form a word, phrase etc." గ్రీకు లాటిన్ భాషలలోగూడ ఇట్టి చిత్రకవిత్వము కనిపించును. Dryden కవిని గుఱించిన ఈ ఇంగ్లీషు పద్యము చూడండి.

1) Deep rolls on deep in thy majestic line.

Rich music and the state liest march combine;

Yet who that hears its high hamonious strain,

Decens not thy genius thou did'st half profane

Exhausting the great power of song on themes

Not worthy of its strong, effuflgent beams.

---

1. ఆంధ్రపత్రిక. వారపత్రిక. 8-6-77 ద్వా.నా. శాస్త్రిగారి వ్యాసం.
2. తిరుపతి "సాహిత్య సమితి వ్యాసావళి"లోని జి. యన్. రెడ్డి గారి "చిత్రకవిత్వం" వ్యాసం.

ఇందులో పాదాది అక్షరాలను చేర్చిన Dryden అను పదమేర్పడుచున్నది.

ఉదా:- Stephans అనెడి గాయకురాలి గురించిన ఈక్రింది రచనలో పాదాది వర్ణము పాదములోని ప్రతిపదాదిని పునరుక్తముకూడ కావింపబడినది. ప్రతి పాదాది వర్ణమును వరుసగా చేర్చిచదివిన Stephens అను పదమేర్పడును.

She sings so soft so sweet so soothing still

That to the tone ten thousand thoughts there thrill

Elysian ecstasies enchant each ear

Pleasures pure pinions poise-prince, pleasant pure

Hushing high hymns, Heaven hears her harmony

Earth's every ends, enthralled each ear, each eye,

Numbers need ninefold nerve or nearly name,

Soul stiring Stephen's skill sure seraphs sing the same.

తెలుగులో మొదటి రకమునకు ఉదా: —(1)
గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 845. పద్యము.

సీ॥ వెంటాడి యసురుల విదళించుదేవ వేం

కట రాజితాభిద్రగావ తిలక

వెక్కైన వేల్పుల సొక్కించు నెఱజూట

శయ బలాతిశయాస్త్ర శంభుచాప

విబుధ సుధామృతి విశ్రుత నిజప్రీతి

లావణ్య కారణ లలిత తిలక

సకల భక్త వ్రాత సారసోదిత రవి

ముని జనానంద కృష్ణాఖ్య చరిత.

ఇందు ప్రతిపాదము మొదటి అక్షరములు గ్రైకొనిన "వెంకటేశ విలాసము" అని కావ్య నామము, చివరి అక్షరములు చేర్చిన "వేంకటపతికవిత" అని కవి నామము వచ్చును.

2) ప్రభాకర రచన 'విదుషి' లో 'ప్రబలశాత్రవ' అను సీసపద్య పాదముల మొదటి అక్షరములు చేర్చి చదువ "ప్రభాకర" అని కవినామము వచ్చును.

3) సదాశివ "శివకర్ణామృతస్తోత్రము" లో "సమస్త జగదాధార" అను పద్య పాదాది అక్షరములు "సదాశివ" అని సూచించును.

4) అద్దుమిల్లి నారాయణరావు - నారాయణీయము పుట. 101 చంపకమాల, సీసముల రెంటను కలిపి పాదాదిన "అద్దుమిల్లి నారాయణరావు కృతి" అని వచ్చును.

5) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 19. సీసగీతము లందు 'కవితాచతురానన' అని బిరుదనామము, "విక్రాలశేషార్యకృతి" అని కవి నామము పొందుపరుపబడినవి.

6) అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి - శ్రీనందిరాజు లక్ష్మీ నారాయణ దీక్షిత చరిత్రము లో సీసము. 2-73- "అష్టావధాన్యబిరాజ" అనియు, క్రింద తేటగీతిన ఆద్యంతాక్షరములు "హనుమంతరాయకవి" అనియు వ్రాయుట జరిగినది.

7) గురువుగారి శివరామదాసు 'శ్రీవేంకటకృష్ణయాచేంద్ర బహదరువారిని స్తుతించిన విధానము. సీసము. "వెంకట కుమారకృష్ణ" అని వచ్చును [1]

8) పోకూరి కాశీపతి. సిద్ధని చరిత్రలో రామునిచే సీతపేరు చెప్పించిన విధము చరణముల తుది అక్షరములు పేరగును.

ఆ|| వె||. చరణముల కడన్ బొసంగెడు మీకిసీ

వధువు పేరు దెల్పవలెనె మహిత

---

1. "గోపీనాథ వేంకటకవి. వెంకటగిరి సంస్థాన ఇతర కవులు." కాళిదాసు పురుషోత్తమ్. ఉస్మానియా విశ్వవిద్యాలయం, 1970 July. పుట. 410.

నయ యటంద్రుగాన నారాణి పేరుగా

తెలిసికొనుడు మీకు తెలివి లేదె

రెండవ పాదకమునకు చెందినవి. ఉదా 1. మిన్నికంటి గురునాథకవి. "శివగీత"లో
కం॥ గురు రుచిర సినాకముతో

సురథమ్ముగ భూమి యుండ సుకరముగ రాత్రిం

చరక్షిసంతతి విక్రమమున్

హరించిన మహాత్మ వీని నరయవె ప్రేమన్.

"గురునాథకవిని" అని కవి నామ మిందు పొందుపరుపబడినది.
కాని ఆ అక్షరములను, కవి ఇష్టము వచ్చినట్లు గూఢపర్చెను.
2. ఉదా :_బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. చిత్ర 1.
3. మం. పా. శాస్త్రి. 'శ్రీరాధాకృష్ణ సంవాదము.' లో "వాలాయంబుగ" పద్యము.

## 2. సాంవత్సరి

ఇందు తెలుగు సంవత్సరముల పేర్లు గూఢ మొనరింపబడును.
ఉదా:_ గ. వేం కవి. ప్ర. రా. వేం. వి. వి. 389 సీసము.

శ్రీముఖ ప్రభవ సుస్మేరాభ కౌస్తుభ
సర్వజి ద్విక్రమ చక్రహస్త.
సౌమ్య భావ మునీంద్ర సన్మనోంబుజ భృగ
యవ్యయానంద హృద్భవ్యరూప
ధాత్ర సాధారణ స్తవనీయ నిజచర్య
విభవ ప్రమోదాప్త విబుధనాథ
జయ దుందుభి ధ్వాన చకితాసురాధ్యక్ష
దుర్మతి రాక్షస శర్మహరణ.
గీ॥ చిత్రభాను స్వభాను జిత్సిద్ధతేజ
విజయ నందన ఖరస్తూత విధివినోద

మన్మథ క్రోధి ధర్మ విర్మథన సార
వృష గిరీశ్వర సంకాశ వేంకటేశ.

2. ఉదా:- నాదెళ్ళవారి - సోమేశ్వరీయము. "శుభకృచ్ఛ్రీ" కందము
వారి అ. ఉ. రామా. "తారణభావా" అను కందము.

## ౩. దశావతారి.

దశావతారముల పేర్లు గూఢ పరుపబడిన పద్యము. ఇది స్తోత్రము వేసినట్టులె ఉండును. ఉదా :- నాదెళ్ళవారి. సోమేశ్వరీయము.

కం॥ హర మీనాంకారి కమఠ
కర మిత్ర వరాహ ధీర ఘనరహరీ వా
మురమద్రామా రామా
వర రామ స్తుత సుబుద్ధి వరిజనకలికా.

వారి అ. ఉ. రామా. లో "పరభూమీ" అను. కందము.

## 4. నవగ్రహి

నవగ్రహనామపదముల కూడిన పద్యము.

ఉదా:- నాదెళ్ళవారి. అ. ఉ. రామా. లో. కందము.

రవికుల వనధి శశికుజా
ధవ బుధులును గురుల గవుల ధనగుణ నైపు
ణ్యవిభవ యుతులను జేయదు
రవి జాసుర సేవ్య వృషభ రాడ్ధ్వజ భావ్యా.

(2) వారి. సోమేశ్వరీయమున 'రవిసోమ' కందము

౫. షోడశరాజయుక్త కందము. గ. వేం. కవి-ప్ర.రా. వేం. వి వి.౯౯౭

భువి భరత భగీరథ భా
ర్గవ మాంధాత్రంబరీష రంతి శిబి సుహో
త్రి విభు దిలీప మరుద్రా
ఘవ వృథ్వంగ శశిబిందు గయ నహుషులనన్.

## ౬. వృత్తనామ గోపనము.

వృత్తనామములు గూఢమొనరింపబడిన పద్యము.

ఉదా:- మిత్రవిందోద్వాహము. 2-62. సీసము.

మత్త కోకిల బింబ మదన దర్పణములు
విమల గండోష్ఠ స్వరముల కోడి
మత్తేభ సరసిజ మణిగణ నికరముల్
కర సంభ వానన గతుల కడలి
చంపక చంద్రికా జలధర మాలలు
కచ దరస్మిత నాసికముల కదరి
యుత్పలమాల విద్యున్మాల మంజరి
కుచ గాత్ర దీప్త దృక్కులకు బెదిరి
తే॥ గీ॥ చంచ రీ కావళి నలిన చంద్రరేఖ
కామినీపాల హస్తాల కములకదరి
వృత్తరూపములయ్యె కవిత్వసరణి
కావ్యముఖమునబడి భువిగానబడియె.

ఈపద్యము మిత్రవిందవర్ణన సందర్భమున చెప్పబడినది. సందర్భోచితముగ సలరారుచున్నది.

ఉదా:- (2) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 2. వింశత్యుత్తరశత వృత్తనామ గోపనవచనము. ఇందు 120పైగా వృత్తనామములు గోపనమై యుండును.

## 7. రాగముల పేర్లు

రాగములపేర్ల పదములను గూఢమొనర్చిన పద్యము లున్నవి.

ఉదా:-(1) పోకూరి కాశీపతి. కు. అం. వి. వి. హరి. చరిత్ర.

[అచ్చతెలుగు]

కం॥ అలించగదే కన్నడ
నేలాసకి కోర్కులిడనిది దిసిరి యగునే
గోలన్‌గద యీనాటజ
గాలలినీతోడి గూడ గనరా దానాన్.

చండాలాంగన పాటలో సంగీతశాస్త్ర రాగముల పేర్లతెల్పు సందర్భమిది

(2) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి 95 నుండి 98 పద్యమువరకు, భైరవ, శ్రీరాగమాది రాగములు పేర్కొనబడినవి.

౬. నామగోపన మిశ్రమము

(1) ఉదా:- నవగ్రహాష్టదిక్పాలక దశావతార నామగర్భకందము.

హరి శశికుజ బుధగురుకవి
హరిసుత తమకేతు హరి యమాస్రపకధనే
శ్వర శంకర శరచర యుగ
కిరి నరహరి వటుత్రిరామ కితవముఖహయా.

[అందుగుల వెంకయ్య-రామరాజీయము]

(2) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. అవతారిక. 31. పద్యం. సీసము. ఇందు నవగ్రహ. నవరత్న, నవనిధి, నవరస—నామములు దెల్పు పదములు కూర్పబడినవి.

[5.] అంకగణితము

ఇందు అంకెలు క్రమముగ అక్షరములలో చెప్పబడును.

ఉదా:- నాదెళ్ళవారి. అ. ఉ. రామా. లో. కందము.

ఏకాద్విజవర త్రిభువన
శోకహ చతురాప్రపంచ సుమషట్పరణా
శ్రీకర సప్తాశ్వాన్వయ
మాకష్టము మానవలయు మంచి దశయదే. ఇందు 'ఏక' నుండి "దశ" వరకు అంకెలు క్రమముగా పద్యార్థమున కలిసిపోవునట్లుగా అక్షరరూపమున పొందుపఱుపబడినవి.

ఉదా:- (2) వీరి. సోమేశ్వరీయమున ఇట్లే పదివఱకు కూర్పబడినవి.

(3) కొత్తపల్లి సూర్యారావు "వెట్టికి వేయివిధములు" కావ్యములో ఒకటవ వెట్టికి ఒకటవపద్యము, రెండవవెట్టికి రెండవపద్యము ఇట్లు వేయివెట్టులకు వేయి పద్యములు చెప్పుట జరిగినది.

6. త్రిపద గోపనము

ఏకపాది, ద్విపద చెప్పిన పిదప "త్రిపద"ను అప్పకవి చెప్పియున్నాడు. ఏకపాది, ద్విపదల లక్షణానుసారము త్రిపద నడపలేదు. ఆ ఏకపాది ద్విపదులను

పాద నియమచిత్రము క్రింద పరిగణించితిమి. కాని యీ "త్రిపద" గూఢ చిత్రము నకు సంబంధించినదిగా భావింపబడుచున్నది.

గుమ్మా శంకరరావుగారు తమ వ్యాసములో [1]. ఒకేపాదము మున్మాత్రము కావలసినది, అసలదే లక్ష్యమనియు, కాని కాలేదనియు, మొదటి మూడుపాదాలలో చెప్పబడిన మూడుపదములను నాల్గవపాదములో వరుసగా చెప్పుట దీని లక్ష్యమని అప్పకవి భావించినాడేమో అని అభిప్రాయపడిరి.

రాయవరపు రామస్వామి తనకవితాసాగరములో దీనిని ఉదాహరించెను. పదముల గోపనముగా వారు భావించిరి. అనగా నాల్గవపాదములోని పదముల మూడింటిని మొదటి మూడుపాదాలలోను గూఢ మొనరించబడినదని వారి భావము.

దీనినిబట్టి మొదటి మూడుపాదాలలోను వరుసగా ఒకటవ, రెండవ, మూడవ పదములుగా దాచబడి, నాల్గవపాదములో వరుసగా పేర్కొనుట ఈ త్రిపద చిత్రముగా భావింపదగును. త్రిపదములను దాచియుంచుచున్నాము కనుక త్రిపద పేరు సార్థకము.

పైపెచ్చు అప్పకవి పాదగోపనము గూర్చి చెప్పెను. గాని లక్ష్యము చూపి యుండలేదు. పదగోపనమును గూర్చి ఎక్కడను చెప్పియుండలేదు. కనుక ఇది పదగోపనముగ చెప్పి యుండవచ్చునని యనుకొనవలె.

అప్పకవి చెప్పిన త్రిపద. అప్పకవీయము. 4-563.

తే॥ గీ॥ దేవమునివంద్య గోవింద దితిజహరణ
పుండరీకాక్ష అవ్యక్త పుణ్యపురుష
యమరసన్నుత గోపాల హరి ముకుంద
దేవ యవ్యక్తహరియు నాద్రిపదమయ్యె.

మొదటిపాదములో "దేవ" మొదటిపదముగాను, రెండవపాదములో రెండవ పదముగా "అవ్యక్త", మూడవపాదములో మూడవపదముగా "హరి"-చెప్పి నాల్గవపాదములో వానిని వరుసగ చెప్పుట జరిగినది.

బుర్రాకమలాదేవి-ఛందోహంసిలో "త్రిపద"ను ప్రతిపాదమున మూడు పదములుండునట్లు వ్రాసిరి. అది సరికాదు. అందులో విశేషములేదు.

---

1. "తెలుగు" "త్రైమాసపత్రిక" 1979 july-Sept. "తెలుగులో చిత్రకవిత" వ్యాసం. Published by Telugu Akademy, Hyderabad.

## [7] వివిధ పదగోపనము

పద్యములో వివిధపదములను గూఢ మొనరించుట ఈచిత్రమున కననగును. ఆ వివిధ పదములు లేదా ఒక వాక్యమునందలి పదములలోని అక్షరములొక నియమమున పద్యపాదముల దాచబడి యుండును. ఇది కవిపేరు దాచబడినట్లే యుండును.

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో ఇట్టి చిత్రము కలదు. విక్రమార్కుని చెంతకు పేద బ్రాహ్మణుడొకడు తనకుమార్తెను వెంటవిడుకొని వచ్చి స్తుతించు సందర్భము

సీ॥ రాజ్యంబు వదలక రసికత్వ మెడలక

జయశీల ముడుగక నయము చెడక

దీనులఁ జంపక దేశంబు నొంపక

నిజముజ్జగింపక నేర్పు గలిగి

విప్రులఁ జుట్టాల వెన్నుసొచ్చినయట్టి

వారిని గొల్చిన వారి ప్రజల

హర్షంబుతో గాచి యన్యాయ ముడుపుచు

మున్ను జెప్పినరీతి జెన్నుమీరి

ఆ॥ వె॥ చేతలొండు లేక పాత్రల విడువక

యశము కలిమి తమకు వశముగాగ

వసుధ యేలు రాజవర్గంబు లోన న

య్యాది విష్ణుమూర్తి వంద్రుడు నిన్ను.

[సింహాసన ద్వాత్రింశిక. 7 76]

ఈపద్యములో పేదబ్రాహ్మణుడు విక్రమార్కుని స్తోత్రము చేయుటయేగాక ఒక విన్నపముగూడ గూఢముగ చేసియున్నాడు. సీసపద్యములో 8 చిన్నపాదముల మొదటి అక్షరములను, ఆటవెలదిలో ప్రతిపాదము మొదటి అక్షరములను గలిపి చదివిన. "రాజ! దీని వివాహము చేయవయ్యా" అని వచ్చును. కుమార్తెకు వివాహ నిమిత్తము ద్రవ్యసహాయము రాజుగారు చేయవలెనని పేదబ్రాహ్మణుని నిగూఢ విన్నపము.

## 2. పాదగూఢము

పద్యములో ఏదేని ఒకపాదమును మిగిలిన మూడుపాదములలోను గూఢ మొనరించి చెప్పుటను పాదగూఢ మందురు.

తెలుగున అర్ధపాదగూఢమును వ్రాసిన కవి గ. వేం. కవి.

ఉదా :- ప్ర. రా. వేం. వి వి. 350 పద్యం. కందము.

భువన జతర జయసన్నుత

గవా ధిపా ధన్య కలిత కారుణ్య రమా

ధవ వరమ పురుష తీవ్రవరి

పుంఫాల మహా విశాల భుజగధరపతీ

ఇందు "భుజగ ధరపతీ". అనునాల్గవ పాదభాగము మొదటి మూడుపాదము లందు గూఢ మొనర్పబడినది అక్రీగీతల అక్షరములు వరుసగా చదువుకొనదగును. అవి పదాది అక్షరములుగ గుర్తింపదగును.

### 1] గూఢ ప్రథమపాదము

ఇది ఎక్కువ ప్రచారములో లేకపోయినను మచ్చుకు చిత్రించుట జరిగినది. సంస్కృతము. ల.స. చిత్రం. 4. ఈ క్రిందిది.

చివరి మూడుపాదాలలో మొదటి పాదాక్షరములు గూఢ మొనర్చుట జరిగినది. కాని ఒక నియమము పాటించలేదు,

పాహి దేవి కలశోదధేః సుతే
దేహి పాప విలయం దయానిధే
శేషశాయి దయితే తమోముషం
శేముషీం కలయనః సుశోభనామ్.

ఒక వరుసలోలేక ఇష్టమువచ్చినట్లు వెనుకముందు ఆ ప్రథమ పాదాక్షరములు కూర్చబడినవి. ఇది సరియైన పద్ధతికాదు.

తెలుగున ఉదా :- వేదులవారి ల.స.చి ర్త 4.

సంస్కృతములోని నియమ రహితముగ మొదటిపాదముగూడ మొసర్చబడి నది. మొదటి పాదమున 12 అక్షరములు కలవు. యతికి సరిపడు అక్షర మొకటి యుండునట్లు కవి చూచుకొనవలెను ఆ పద్యమిట్లున్నది.

తే॥ గీ॥ పాలమున్నీటి పుత్రి మాం పాహి పాహి
కోటి పాపము లడంచి కన్నీటి దుడిచి
తేల్చి పాలింపు మమ్ము ముక్తిప్రదాత్రి
భవ్య మాం గల్య వైదేహి పాలిత మహి.

## 2) గూఢ చతుర్థపాదము

చతుర్థ పాదాక్షరములను మొదటి మూడు చరణములందు గూఢము చేయుట ఇందలి చిత్రము. ఇది బహుళ ప్రచారమునందినది. అటు సంస్కృతమున ఇటు తెలుగునను ఎక్కువగా ఇది చిత్రింపబడినది

సంస్కృతమున ఇది రెండు విధముల రచింపబడినది. తెలుగునను అట్లే. నాల్గవ పాదాక్షరములు క్రమరహితముగ మొదటి మూడు పాదములందు ఎక్కడో అక్కడ వచ్చునట్లుగా వ్రాయబడుట మొదటివిధము. అక్షర క్రమముతోపాటు నియమమునుగూడ పాటించి వ్రాయబడుట రెండవ విధము. పైన చూచిన ప్రథమపాద గూఢము మొదటి విధమునకు చెందినదే.

ఏ విధమైనను తెలుగున మాత్రము ఆ గూఢపాదమున ప్రాసాక్షరము, యత్యక్షరము ఆయాస్థలముల వచ్చునట్లు రచింపవలెను.

మొదటి విధము :

సంస్కృతములో ఉదా :- కా.శా.477.

ద్యు వి యద్గామి సీతార
సందావ విహత శృతిః
వై మేఘ మాలా శుశుభే
విద్యుతా మివ సంహతిః

ఇట్లే శిశుపాలవధ, ల.స, మున్నగు సంస్కృత గ్రంథములందిది గలదు.

తెలుగున విన్నకోట పెద్దన ఈ మొదటి విధముగనే తన లక్షణ లక్ష్యముల నిచ్చినాడు. లక్షణం. కా.చూ. 6-46. కం.

మొదలి చరణ త్రయములో
బదిలముగా గవితనంత భాగాక్షరముల్
గదియం గ్రమమున నిల్పిన
నది గూఢ చతుర్థమనఁగ నద్భుతమయ్యెన్.

అద్భుతము గొల్పును గనుకనే ఇది చిత్రమైనది. ఇతని లక్షణము ప్రకారము మొదటి మూడుపాదములందలి గూఢ చతుర్థ పాదాక్షరములు వరుసగా చదువ కొనిన వచ్చును. సంస్కృతములో ఈ వరుసగూడ పాటింపబడలేదు. అంత మాత్రము చాలదు. ఎన్ని అక్షరముల కొకసారి ఈ గూఢ చతుర్థ పాదాక్షరముల నుంచవలెనో క్రమము పాటించి తీరవలెను. అది రెండవ పద్ధతిలో చూడగలము.

ఇక విన్నకోట పెద్దన లక్ష్యము. కా.చూ. 6-47

చం॥ చతుర బరార్థ్య శీలు గవి శశ్వద భీప్సిత భూరి దానదున్
వితత భుజాని సర్గబలు విక్రమ సన్నుతి సేవితో దయున్
మతికె దురెల్ల సేసికొని మాన్యులకాలము కానిమానులై
చతురులు విశ్వభూవిభుని సన్నుతి సేయుదురెల్ల కాలమున్.

ఇతని లక్షణానుసారము వ్రాసిన కవులు.

2) ఈదులవల్లి భవానీశ ధర్మఖండము. 9-284. చం. వాల్మీకి విష్ణుదేవుని స్తుతించు సందర్భము.

3) విక్రాలవారి. శ్రీ. వేం.చి.ర. కరము. పూ భా 20 చం
4) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. చిత్ర-2. ఆ॥వె॥
రెండవ విధము.

సంస్కృతములో ఉదా:- ఈశ్వర శతకము. 90.

తుభ్యం జగత్రయ త్రాణ

స సంవజ్జయతే నమః

శివ సంయత్ప్రభాశీల

జయ సజ్జన వత్సలం

ఇచ్చట అక్షరక్రమమే కాక, ప్రతి రెండక్షరములకొకసారి నాల్గవ పాదాక్షరములు పొందుపరుపబడినవి. ఎక్కువమంది తెలుగు కవులీ పద్ధతిన చంపకమాలలో వ్రాసిరి. కందములోకూడ వ్రాయుట జరిగినది.

చిత్రకవి లక్ష్యమిచ్చినాడు: కాని లక్షణ మీయలేదు. అదే లక్షణమను కొనవలెను. అప్పకవి 'ప్రథమాశ్వాసము'లో 'సరళిగూఢ చతుర్థ చరణవర్ణము' అని పేరెత్తెనుగాని లక్షణ లక్ష్యముల నీయలేదు.

ఉదా:- 1) చిత్రకవి పెద్దన. ల.సా.సం. 1-99

చం॥ ఘనహరి భాను జాస్తమతి కుంజ భవాయతుల ప్రతాపభా
గ్యనిధి కృపాక రాజనక జాయత శుక్రకచా మహాత్మ పా
వని పటుకేన శూరచయవర్య సుధీసర సాధ్య హృద్య శా
హనుమ జయప్రభాది కనయక్రమ పానిన చర్యసద్యశా.

చంపకమాలలో గూఢ చతుర్థపాద రచనా నియమము గమనింతము. రెండక్షరములను వదలుచు మూడవ అక్షరమును తీసికొనుచు పోయిన, ప్రతిపాదమున 7 అక్షరాల చొ॥న మూడు పాదములకు 3×7=21 అక్షరాలు వచ్చును. చంపకమాల పాదాక్షరాలు 21. వానితో నాల్గవ పాదము పూర్తి అగును. ఆ నాల్గవ పాదమునందలి ప్రాసయతులు గుర్తుంచుకొనవలెను. దాచబడిన రెండవ అక్షరము ప్రాసాక్షరము. 11వది యతిస్థానాక్షరము. నాల్గవ పాదమున 5,7,11,14,17,19,21లు గుర్వక్షరాలుగా ఉండవలెను, కాని వీనిలో 5,11,17,19,లు మొదటి పాదాలలోను లఘ్వక్షరాలుగా దాచబడినవి. నాల్గవపాదములో అవి గుర్వక్షరాలు కావలెనుగదా.

దీనికొక ఉపాయము. 6,12,18,20,లు సంయుక్త, లేదా ద్విత్వాక్షరములుగా ఉండునట్లు రచింపవలెను.

ఇట్లు నిర్మింపబడిన గూఢ చతుర్థ పాదమునకు దగిన అర్థముండవలెను. అంతేకాదు. మిగిలిన మూడు పాదములకు దీనికి అర్థము విషయమున పొంతన ఉండ వలెను.

ఉదా :- 2) గ.వేం కవి-ప్ర.రా.వేం.వి.వి. 220 పద్యం.

3) కొడవలూరు రామచంద్రరాజకవి-మహాసేనోదయము. 1-219.

4) గోపీనాథ వేంకటకవి- గోపీనాథ రామాయణము. సుందర. 1536.

5) ధరణి దేవులరామమంత్రి. దశావతార చరిత్ర. వాలఖిల్యస్తుతి. 277 పద్యం.

6) విక్రాల శ్రీదేవమ్మ. వాసవదత్తా పరిణయము. 2-230

7) పొత్తపి వేంకటరమణకవి. లక్షణశిరోమణి. 4-707. చం.

కందములో గూఢ చతుర్థ పాదచిత్రము.

ఉదా:- గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 850.

అది : వెలలియు దార మధుర దయ
నిలుపు గుహన్ దత్తినలరు నీవిడు భక్తిన్
గలిని ఘనదేహ శౌరీ
వెలిదామర యజ్ఞగు దనరు విభుగనినహరీ.

పై పద్యమున మూడు పాదము లందును వరుసగా బేసి అక్షరములు గైకొనిన నాల్గవపాద మేర్పడును. గ్రహించు రెండవ అక్షరమే ప్రాసాక్షరము. గ్రహించు మొదటి అక్షరమునకు, రెండవపాదమునందలి 4వ గణములో ఒక అక్షరమునకు యతిచెల్లుబడి యగునట్లు చూచుకొనవలెను.

2) నాదెళ్ళవారి. అ. ఉ. రామా. 7-148.

3) వారి. కృష్ణానదీ మహాత్మ్యం. 1-123.

4) వారి సోమేశ్వరీయము. 'నినునుతి జేసి' పద్యము.

5) వావిలికొలను సుబ్బారావు. శ్రీకుమారాభ్యుదయము. 3-134.

6) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట. 22.

౭) శృతీయ, చతుర్థ పాదగూఢము

సంస్కృతములో ఇది ఈశ్వర శతకమందు కలదు. ఇందు మొదటి రెండు పాదములందు చివరి రెండు పాదాల అక్షరాలు దాచబడును. మొదటి రెండు పాదాల లోని బేసి అక్షరములు గ్రహించి వ్రాసిన 3వ పాదము, సరి అక్షరములు గ్రహించి వ్రాసిన నాల్గవపాదమున్ను ఏర్పడును. అవి ఇట్లున్నది.

సుధీరారజ్ఞతా భస్య
జయమాసా భగక్షమ
సురాజ్ఞభ జమాభక్ష
ధీరతావ్యయ సాగమ

[ఈశ్వరశతకం. 91.]

తెలుగులో దీని మాదిరి కనబడలేదు.

౭. భాషాగోపనము.

తెలుగు పద్యమం దాంధ్రేతర భాషను గోప్యముగ ఉంచుటను భాషా గోపన మనబడును. అనగా రెండు భాషలు పద్యమున ఉండునన్నమాట. ఆయా భాషలలో వాని అర్థసమన్వయము కుదురును. ఇందు గో రెండవరకము అనులోమ విలోమము. దేవీశతకములో సంస్కృతభాషలో సూరసేన, మహారాష్ట్రి భాషల గోపనము చేయబడినది. (78, 76 పద్యములు.)

తెలుగు పద్యమున సంస్కృత మిమిడియున్నది. తెలుగులో భాషా గోపనము నకు క్రింది పద్యము నుదాహరణముగా చెప్పవచ్చును. ఈ పద్యములో తెలుగు సంస్కృత భాషలు గలపు దీనికి ఇటు తెలుగు భాషా పరముగను,అటు సంస్కృత భాషా పరముగను అర్థము చెప్పుకొనుటకు వీలున్నది.

ఆ పద్యము. పింగళి సూరన కళాపూర్ణోదయములో 6-161. అది :

మాయమ్మా నను నీవే
రాయలమై కావ దేవరా జేజేజే
మాయాతుమ లానిన యది
పాయక సంతోసమున్న ఫలమిలసామీ.

తెలుగులో అర్థము :

దేవరా! = ఓ ప్రభువా! జేజేజే = మున్మాటికి జయము. ఇలసామీ! =

ఓ భూనాయకా! నీవు రాయలవై = రాజువై, కావన్ = రక్షించుట చేతనే, సంతోషము, పాయక = విడువకుండ, మాయాతుమలు = మాఆత్మలు, అనిన యది = అంటియున్నది, ఉన్నఫలము = సిద్ధించిన ఫలము, మాయమ్మానసు = మా తల్లితోడుసుమా,నీవు రాజువై రక్షణ భారము వహించుట వలన మామనస్సుల్లో సంతోషము తాండవించిన దని భావము.

సంస్కృత పరమైన అర్థము :

హే, సునీవే = శుభ్రప్రదమైన మూలధనముగల ఓ రాజా!. ఆయమ్ = రాబడిని, మామాన = లెక్కించకుము. అలవా = ఛిన్నాభిన్నం కానట్టి, రాః = ధనము, ఏకైవ = ఒక్కటే, అవత్ = కష్ట సమయమందు రక్షించునదగును. కావున మూలధనము వ్యయపరుపరాదని భావము. అజేజే = భాగపశువులతో యజ్ఞము చేయునట్టి, రాజే = రాజుకొరకు, మా = లక్ష్మి, ఆయాతు =వచ్చెడును, మలాని = పాపములు, న = పొందవు. పాయక! = ఓ రక్షక!, సంకః = సత్పురుషులు, యది = దర్శింపవచ్చిరేని, అనముత్ = సంతోష రహితుడవై సఫల = దర్శనమీయక పోకుము మిల = వారితోకలియుము. అమీ = వచ్చిన యీ పండితులు, సా = ఆ లక్ష్మి అని విశ్వసింపుము. ఓ రాజా! రాబడిని గురించి యోచించవోకు. దానిని మంచి కార్యములకు వినియోగించు. బ్రహ్మను గూర్చి యజ్ఞము చేసేవారికి సంపదకెప్పుడు తక్కువకాదు అని భావము.

సందర్భము : కళాపూర్ణోదయములో మదాశయునా స్థానమున ప్రశ్నహూగ మాదులు చిత్రముగ జవాబిడు తీరు.

ఈ పద్యము తెలుగై రాజడిగిన ప్రశ్నకు సమాధానమగుచున్నది. సంస్కృతమై యతనికి హితము నుపదేశించుచున్నది.

ఈ పద్యములో చిత్రమిది యని పాఠకులకు తెలియపఱచుటకు 6-1‘6 పద్యములో సంస్కృత పరమైన అర్థ భావములను పాత్రలచేతనే చెప్పించును.

ఉదా :- 2. కనుపర్తి అబ్బయ్య. కవిరాజ మనోరంజనము. 4-176. ఇందాంధ్ర - గీర్వాణ భాషలు గలవు.

3) పిండిప్రోలు లక్ష్మణకవి. లంకావిజయము. 2-230. ఉభయభాషా కందం.

4) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 11. తత్సమాంధ్ర పదములతో భగవత్పక్షమున, సంస్కృత పదములతో లక్ష్మీస్తుతి పరమైన అర్థము గోచరించును.

5) అల్లమరాజు రంగశాయి. శ్రీ. అం. చం. రామా అరణ్య. 77. కందము.

6) అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి. భద్రాపరిణయం. 3 60 (సంస్కృతాంధ్రములు).

ఈ పద్ధతిలో "సంస్కృతాంధ్రశ్లిష్ట నారాయణస్తవము" అను పేర విక్రాల శేషాచార్యులుగారు గ్రంథమును గూర్చిరి[1]. అందులోని పద్యములు తెలుగు అర్థమున నారాయణస్తవమును, సంస్కృతార్థమున లక్ష్మీస్తుతియును నగును.

Dyglolt peoms. Consists of verses that can be read in any two or more languages. Two examples [2]

1. ప్రాకృత సంస్కృతములు గలది.

"సరలే సాహసరాగం పరి హరరంభోరు ముఞ్చసంరంభమ్,
విరహం విరహాయాసం వో దురితవ చిత్తమసహం మే."

2. శ్రీనివాసకవి సార్వభౌమ (19 శతాబ్ది). మైసూరు మహారాజాస్థానకవి. "క్రిష్ణరాయజయోత్కర్ష" పద్యగద్యములలో విరచితము. విరామచిహ్నముల మార్పుతో అకావ్యమటు సంస్కృతము, ఇటు కన్నడములలో అర్ధవంతముగ ఉండును.

భాషా గోపనము - అనులోమ విలోమము.

ముందునుండి వెనుకకు చదివిన ఒక భాషలో అర్థము వచ్చును ఆ పద్యమునే వెనుకనుండి ముందుకు చదివిన మఱియొక భాషలో అర్థము వచ్చును. అందువలన ఈ చిత్రము భాషా గోపనముతో అనులోమ విలోమముగా చెప్పబడు చున్నది. రచనా విధానము ఇట్టియేగాక, భాషాక్షరముగ గూడ అనులోమ విలోమము లిందు చూపనగును.

1. శ్రీ. వేం. చి. ర. కరము. III Vol. Print. 1980.

2. History of Sanskrit Classical Literature by Krishna machariar, Page. 377. Print. 1937.

సంస్కృతములో "భాషాం తరగతం" అనే పేరున సర. కంఠా. ఇత్యాది గ్రంథముల నిది గలదు.

తెలుగులో 1. ఉదా :— పింగళి సూరన. కళాపూర్ణోదయము. 6-172.

కం ॥ రా వినువారికి సరవిగ
భావనతో నానునతి విభావసుతేజా
దేవర గౌరవ మహిమన
మావలసిన కవిత మరిగి మాకు నధీశా.

అనులోమముగ తెలుగులో అర్థము. అతి విభావసు తేజా = మిక్కిలి ప్రకాశించు పరాక్రమముగల, అధీశా = మహారాజా! దేవర గౌరవమహిమన = మీ ఘనత యొక్క మహిమచేతనే, మావలసిన కవిత = మా ప్రియమైన కవిత్వము, తాన్ = అది వినువారికి, సరవిగన్ = యుక్తముగా, భావనతో = భావించుటతో, మాకుమరిగి = అలవడి, ఆనున్ = కనిపించును.

విలోమములో శ్లోకరూపమున పై పద్యమిట్లుండును.

"శాధి + ఇనకు మా గిరి మతివికన సిలవమాన మహిమ వర గౌరవదే
జాతేసువ భావి తిననునాతో నవభాగ విరసహిరి వానువితా."

ఇప్పుడు విలోమముగ సంస్కృతములో అర్థము. ఇన = రాజా!, ఆగిరి = పర్వతములున్నంతకాలము, కుమ్ = భూమిని, శాధి = శాసింపుము. మత = సర్వసమ్మతుడ!, వికనసి = మిక్కిలి ప్రసిద్ధి పొందినవాడా!, లవమాన = లవుని మానంవంటి మానం గలిగిన, నను = ఓ భూవరా!, మహిమవరగౌరవదే = గొప్పదనముచే శ్రేష్ఠమైన గౌరవమొసంగు, సువభా = నీ వంటి మంచిరాజు, ఇతి = ఈవిధము, జాతే = కలియుండగా, నా = పండితుడైన మనుష్యుడు, అతః = ఇట్టి గౌరవమువలన, నవభాః = కొత్త విలాసము గలవాడై, రసకిరి = రసముచిప్పిలు నట్టి, గవి = భాషయందు, అనువితావా = స్తుతింపని వాడగునా! కాదని భావము.

సందర్భము : కళాపూర్ణుని ఆస్థానములో ప్రథమాగమాదులు చిత్రకవితకు ప్రదర్శించిన తీరు. 6-176లో దీని సంస్కృతపరమైన అర్థభావములు పాత్రచేతనే కవి చెప్పించను.

2. విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 32. అనులోమ తేట గీతి తెలుగు భాషలోను, విలోమమున శ్లోకము సంస్కృతార్థమున గోచరించును,

3. విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. మూడవభాగము. 8వ పద్యము, తెలుగున అనులోమముగ తేటగీతి. సంస్కృతమున విలోమముగ వంశస్థవృత్త మగును. తేటగీతి భగవత్ స్తుతి, వంశస్థవృత్తము శ్రీస్తుతి వివరించును.

తేటగీతి: మారతా! స్తుత! నక్షర! సారదాస!
భారతార్ణవ సువ్యక్త వర్ధిత స్వ
సార సాస్థల క సృజ! రారనోమ
యాచకార్థద! సచ్ఛయ! హావచారు!.

వంశస్థవృత్తము. విలోమము .
రుచావహా యచ్ఛ సదర్థకాచ యా
మనో రరాజ స్వకలస్థ సారసా
స్వతర్ధి వక్తవ్య సువర్ణ తారభా
సహారసా రక్ష నతస్తుతా రమా!

4. పద్య గూఢము [గర్భకవిత్వము]

పాద గూఢ చిత్ర ప్రాతిపదికపై పద్య గూఢము నిర్మింపబడినది. పాదమును ముందలి మూడు పాదములయందు దాచినట్లే లేదా గర్భస్థ మొనరించినట్లే ఒక పద్యమున మరొక పద్యమును గర్భస్థ మొనరించుట పద్య గూఢ చిత్రమున జరుగును.

అప్పకవి గర్భకవితా భేదములు దెల్పుసందర్భమున మొదటగా గూఢ చతుర్థ చరణ వర్ణమని పేర్కొనెను. [అప్పకవీయము. 1-33]. కావున పద్యగూఢమునకు పాదగూఢమే ప్రాతిపదిక అని చెప్పవచ్చును.

వర్ణచ్యుతకములో ఒక పద్యమున ప్రతిపాదమున ముందు వెనుకల కొన్ని వర్ణములు చ్యుత మొనరించిన నింకొకపద్య మేర్పడును. ఈ పద్ధతిలో సంస్కృత ములో గర్భకవిత కలదు. వృత్తములకీ పద్ధతి సరిపోవును. ఉదా:- గీత గర్భ ఉత్పలమాలలోని ప్రతిపాదము మొదటి ఆరక్షరములు చివరి ఒక అక్షరము తొల గించిన తేటగీతి వచ్చును.

కాని తెలుగున దేశీయ ఛందమున ఈ పద్ధతి సరిపోదు. కావున చ్యుత చిత్రముక్రింద కంటె గూఢ చిత్రముక్రింద పద్య గూఢము (గర్భ కవిత) పరిగణింప దగును.

దీనికి గర్భ కవిత్వమని తెలుగు లాక్షణికులు పేరిడినను, అది సమ జనసము కాదనిపించును. ఒక పెద్ద పద్యమున చిన్న పద్యము గర్భస్థమైయుండిన గర్భ కవిత్వమని పించుకొనును. కాని, ఈ చిత్రములో అన్నియెడల ఇట్లుండదు. 'కంద మణిగణనికరము'న ఒక పద్యమందు మఱియొకటి గర్భస్థమైయుండదు. ఏ ఒక్క అక్షరమైన నెటూ మిగులదు. అక్షరము లన్నియు సరిపోవును దీనికి గర్భకవిత్వమని పేరిడుట సమంజస మనిపించదు. కనుక ఈ చిత్రమునకు పద్య గూఢమనుటయే సముచితము. కాని ఈ చిత్రము తెలుగులో "గర్భకవిత్వము" పేరప్రసిద్ధి వహించి నది.

సంస్కృతములో పద్య గూఢ చిత్రము కొంచెముగానే యున్నది. అవియు అక్షర చ్యుతకమువలన పద్యములో ఇతర పద్యములు ఏర్పడుచుండును. దీనికిగూర్చి ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు[1] వివరించిరి సంస్కృతమున "చతు చిత్ర గర్భ"అను విశేషరచన యొకటి కనపడుచున్నది[2].వర్ణ గూఢ చిత్రములో పద్యముల నుండిపద్యములు ఏర్పడును. ఉదా :- విర్థల ఉపమాక వేంకటేశ్వరుని "రామాయణ సంగ్రహము" 30 సర్గలు. ఈ కవి విజయనగరము దగ్గర నివసించెను. క్రీ. శ. 1866 న రచించబడిన దిది.

బాల కాండము నందు కవి పేరు వివరములు గూఢ పరచబడినవి ఈ కాండ మందలి ప్రతి పద్యము మొదటి అక్షరములు కలుపుకొని చదివిన 'రామకవచము' ఏర్పడును.

అయోధ్య నుండి యుద్ధ కాండమువరకు గల ప్రతి పద్యము మొదటి పాదము అక్షరములు గ్రహించి చదివిన "గౌరీ వివాహం" కావ్య పద్యములు వచ్చును.

పై కాండముల యందలి ప్రతిపద్యము రెండవపాదము మొదటి అక్షరములు కూర్చుకొని చదివిన "శ్రీరంగ దీక్షేత్ర మహాత్మ్యము" కావ్య పద్యములు వచ్చును.

పై కాండముల ప్రతిపద్యము మూడవ పాదము మొదటి అక్షరములు కూర్చు కొనిన "భగవదవతార చరిత్ర" కావ్య పద్యము లేర్పడును. పై కాండముల ప్రతి

---

1. "భారతి" 1963 ఏప్రియల్ "సంస్కృత వాఙ్మయమున గర్భకవిత్వము లేదా వ్యాసము."

2. History of Classical Sanskrit Literature- Page.375. Print 1937

పద్యము నాల్గవ పాదము మొదటి అక్షరములు కూర్చుకొనిన "ద్రౌపదీ కల్యాణం" కావ్య పద్యములు వచ్చును.

పద్య గూఢ చిత్ర ప్రక్రియను తెలుగు వారభివృద్ధి పరచి, ఆసాంత మీ చిత్రముతో కావ్య నిర్మాణము జేయుస్థితికి దెచ్చిరి.

ఉదా :- 1. గాదె పాపరాజు. చతుర్విధ కందరామాయణము.

2. రావిపాటి లక్ష్మనారాయణ. వి. భా. రామా.

తెలుగులో లిట్టి రచనకు మార్గ దర్శకమైనది గ. వేం కవి రచన ప్ర. రా. వేం. వి. వి.

తెలుగులో చిత్రకవి పెద్దన, అప్పకవి కొన్ని గర్భ కవితా భేదములు లక్ష్య లక్షణ సహితము పేర్కొనిరి. వానికి దోడుకవుల లక్ష్యముల గ్రహించితిని. ఏ పద్యము లేయే పద్యముల గూఢ మొనరింప దగునో పరిశీలించుట కొక్కొక్క పద్యమును గైకొని, అందుపట్టు పద్యములను జూపుచు ఒక ప్రణాళికాను సారము రచించితిని. ఉదా:- కందము. ఇందుకందములెన్ని ఎట్లు గూఢ మొనర్ప వచ్చు. తర్వాత అందితర పద్యము లేవి ఎట్లిముడును? తేటగీతి. దీనియందేయే పద్యము లిముడును? ఇట్లే తక్కిన వానిని గూర్చి వివరించితిని.

1] దేశీయ ఛందము.

1) కందము. 2) తేటగీతి. 3) ఆటవెలది. 4) ద్విపద. 5) సీసము. 6) రగడ.

2] వృత్తములు

1) మదన విలసితము. 2) భుజంగప్రయాతము. 3) స్రగ్విణి 4) ప్రమితాక్షరము. 5) ప్రహరణకలితము. 6) మణి గణనికరము. 7) చంద్రశేఖరవృత్తము 8) పంచచామరము. 9) ప్రియకాంతా 10) శార్దూలము 11) ఉత్పలమాల 12) చంపకమాల. 13) స్రగ్ధరా 14) మత్తాక్రీడ 15) క్రౌంచపదము 16) సరసిజము. 17) భాస్కర విలసితము. 18) లయగ్రాహి 19) లయ విభాతి.

3. పద్య గూఢ చిత్ర కవితా కావ్యములు.

## 1. కందము

తెలుగు కవులు కందమన చిత్ర విచిత్రమైన పోకడలు పోయి కందకములో కందములనే కాక ఇతర పద్యములను గూడ మొనరించిరి.

1) చతుర్విధకందము. దీనికి లక్ష్యము ముందు లక్షణము వెనుక పుట్టినది. ఇందలి రకములు. 1వ రకము. నన్నెచోడుడు_ కుమార సంభవము 12_217

ఉదా :_ [1] సుజ్ఞాన యోగ తత్త్వవి
దిజ్ఞుల్ [2] భవబంధనముల, ద్రెంచుచు భువిలో
[3] నజ్ఞాన పదము బొందక
ప్రాజ్ఞుల్ [4] శివుఁ గొల్తు రచన భావన దవులన్.

'జ్ఞ' కార ప్రాసతో 1,3 పద్యములు రెండు, "వ" కార ప్రాసతో 2,4 పద్యములు రెండు మొత్తము నాల్గు కంద పద్యములు పై కందమున గూఢ పరచి బడినవి.

చతుర్విధ కంద పద్య లక్షణము చిత్రకవి పెద్దన ఇట్లు తెల్పియున్నాడు. ల. సా. సం. 3_109.

అసమ పదము లారెఁడవదైన గణము
నలజములలోన నొక్కటి నిలుపవలయు
సమపదం బుల రెండవ స్థలము గణము
నందు పద్యాది యగు చతుష్కందమునకు.

కందములోని 1,3 పాదముల రెండవగణము "నల" గావి "జ" గావి నిలుప వలయును. 2,4 పాదములందలి రెండవగణముతో పద్యము మొదలగును.

ఇంక ఉదా :_ 1) విన్నకోట పెద్దన. కా. చూ. 6_49.

2) చిత్రకవి పెద్దన. ల. సా. సం.3_110.

3) కామినేని మల్లారెడ్డి. ష. చ. 3_110.

4) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 817.

5) అప్పకవీయము. _ 4. 622.

6) లక్ష్మణకవి_లంకావిజయము. _ 1_183

7) తూము రామదాసు _ మిత్రవిందో ద్వాహము 2_29.

8) ధరణి దేవుల - దశావతార చరిత్ర. కృష్ణావతారము 303.
9) మంగళగిరి ఆనందకవి - విజయ నందన విలాసము. 3వ. ఆశ్వా. సాంతము. పుట. 125
10) ఈదులపల్లి భవానీశ - ధర్మ ఖండము. 6_393
11) కొడవలూరి రామచంద్రకవి - మహా సేనోదయము. 2_251
12) పురాణం పిచ్చయ్య - విజయాశ్వ చరిత్ర. 3_196. ఉ. భాగము.
13) పెద్దాడ నాగరాజు - శకుంతలా పరిణయం. 2_304.
14) మల్లన - రుక్మాంగద చరిత్ర. 5_66
15) కూచిమంచి సోమసుందర కవి - లక్ష్మీప్రియ విలాసము[1].
16) నాదెళ్ళవారి - సోమేశ్వరీయము, అ. ఉ. రామా. లలో.
17) తిరువేంగళా మాత్యుని - నీలాచల విలాసము.[2].
18) రా. ఆ. నా. - ని. భా. రామా. 28 పద్యం.
19) విక్రాలవారి - శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 2 8.
20) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి - గర్భ. 1. లో మూడు చతుర్విధ కందములు కలవు.
21) కేశవయ్య - దాశరథీ చరిత్ర. నిరోష్ఠ్య కావ్యము. 1_310
22) వెలగపూడి కృష్ణయా మాత్యుడు - భానుమద్విజయం 1వ ఆశ్వాసాంతము. 129 పద్యం.

అచ్చతెలుగు :

1) లక్ష్మి నృసింహాచార్యులు - కుబ్జా కృష్ణ విలాసము. 3_119
2) శలపాక వేంకట సూర్యప్రకాశావధాని - కు. ఆం. ని. చంద్రహాస చరిత్ర. ఏ కాశ్వాసము.

ఆశ్వాసాంతము. 149 పద్యం. ఆ పద్య మీ క్రింది విధముగ నున్నది.

---

1. పూండ్ల రామకృష్ణయ్యా ప్ర. రా. వేం. వి. వి. పీఠిక. పుట. 27.

2 యస్వీ జోగారావు గారి - యక్షగాన చరిత్ర. పుట. 288

[1]మినుకుల తుదలను దనరెడు
గనుడా!, [2]వరువంపు గొల్ల గరితల మరుడా
[3]పెనుబొగడి కలన మరుల
చ్చనుడా!, [4]సిరిచెలియ మగడ సైరణ దరుడా.

చతుర్విధికంద పద్యములో నాల్గు కందములను విడగొట్టి చూపుట జరుగుచున్నది. మాదిరి పై కందము మొదటిది.

రెండవది. వరువంపు గొల్ల గరితల
మరుడా పెనుబొగడి కలన మరులచ్చనుడా
సిరి చెలియమగడ సైరణ
దరుడా మినుకుల తుదలను దనరెడు గనుడా.

మూడవది. పెనుబొగడి కలన మరుల
చ్చనుగా సిరి చెలియ మగడ సైరణ దరుడా
మినుకుల తుదలను దనరెడు
గనుడా వరువంపు గొల్లగరితల మరుడా.

నాల్గవది. సిరిచెలియ మగడ సైరణ
దరుడా మినుకుల తుదలను దనరెడు గనుడా
వరువంపు గొల్ల గరితల
మరుడా పెనుబొగడి కలన మరులచ్చనుడా.

అంకెలనుండి ఆయాపద్యములు మొదలిడి వరుసగా చదువుకొని వదలి వేసిన భాగమును చివరకు కలుపుకొనుచు పోయిన గర్భిత పద్యములు వచ్చుచుండును.

చతుర్విధ కంద పద్యములతో కావ్యమాసాంతము వ్రాసిన వారున్నారు.

1. వెలగపూడి కృష్ణయ్య – చతుర్విధ కందశతకము.[1] కాని అలభ్యము.

2. నాదెళ్ళవారి – చతుర్ముఖీన కంద రామాయణం. 202 పద్యములున్నవి.

3. గాదె పాపరాజు. 1) శ్రీ దర్శిజానకిరామ విచిత్ర నక్షత్ర కంద గర్భాష్టోత్తర శతకము. 27 పద్యములు 2) చతుర్ముఖరామాయణము. 109౩ పద్యములు.

---

1. దివాకర్ల వేంకటావధానిగారి ఆంధ్రవాఙ్మయ చరిత్ర. పుట. 78.

చతుర్విధ కందము. రెండవరకము.

ఉదా :- 1) [1]కృష్ణా! [3]వినుమ మఱి మఱవను
కృష్ణా నను నెనరు మఱచి కినియకు నాపై
[2]కృష్ణా[4]కవికర ముంచర
కృష్ణా యవి తలంచినపుడె యెనసెదననరా.
[వెలిదండ్ల వేంకటపతి. రాధామాధవ సంవాదము. పుట.72].

'ష్ణ' కారప్రాసతో 1,2 లతో మొదలిడు రెండు పద్యములు. 'న' కార ప్రాసతో 3,4లతో మొదలిడు రెండు పద్యములు. మొత్తము నాల్గు కందములు.

2) ద్వివిధకందమనెడి పేరుతో కాణాద పెద్దన - భద్రాపరిణయం- "ష్ణ,య" ప్రాసలతో. 3-294, 295.

3) విక్రాలవారి. శ్రీ.వేం చి.ర.కరము. పూ.భా 27.
ఇవి లక్ష్యములైనను లక్షణములుగా స్వీకరింపదగును.
చతుర్విధ కందము, మూడవరకము.
చతుశ్చరణ గర్భకందమనెడి పేరుతో వెలయించ బడినది.

1) అందుగుల వెంకయ్య - రామ రాజీయము 339. పద్యము.
[1]గిరిధర కమలాధ్యక్షా
[2]నర సీరుహ పత్రనయన శరనిధిశయనా
[3]మురహర సన్నుత నామా
[4]కరుణాకర నరసఖహరి కరివర రక్షా.

1,2,3,4,లతో మొదలిడు పద్యములను వరుసగా చదువుకొనిన చతుర్విధ కందములు నాలుగువచ్చును. 1,3 పద్యములకు యతులు కల్పించుచునే యున్నవి. 2,4 పద్యములకు 3,1 పాదముల రెండవ గణము మొదటి అక్షరముగా యతియుండు నట్లు రచింపబడినది. నాల్గు పద్యములకు ప్రాస 'ర' కారమే.

2) ఉదా:- గోపీనాథ వేంకటకవి. గోపీనాథ రామాయణం. కిష్కింధాకాండము, 1410.

చతుర్విధకందము. నాల్గవరకము. మాలికా చతుర్విధ కందమని దీనికి పేరు.
ఉదా:- 1) అప్పకవీయము. 4-627.

[1]శ్రీ[2]భూ[3]మీ[4]న వరదహరి
గోభూమానవ వినుత సుగుణ బుధ మధునా
శాభీ మానవ కృష్ణఘ
నా భా మానవ హరిదరి యభవ కమలనా.

లక్షణము. తరతరమ వర్ణమాదిగ
దొరలించిన మాలికా చతుర్విధ కందం
బరుదారుమ సత్కృతులం
దురగాధిప నవ్యతల్ప యుదధిశయానా.

[అప్పకవీయము. 4.626]

లక్ష్యపద్యములోని 1,2,3,4లతో మొదలికి వరుసగా చదువుకొనిన నాల్గు పద్యములు వచ్చును. లక్షణము చెడదు. విడిచిన అక్షరము చివరకు చేరచుండును. పై పద్యము మొదటిది.

రెండవది. 'భూమీ........మలనాశ్రీ'.

మూడవది. 'మీనవ........మలనాశ్రీ భూ'.

నాల్గవది. 'నవర........మలనాశ్రీభూమీ'

చతుష్ప్రాసతో పద్యము వ్రాసినప్పుడు నాల్గు పద్యములకు ప్రాస పాటింపబడి నట్లగును. పై పద్యమున 'భ,మ,న,వ' ప్రాసాక్షరములు గణములు : 1వ పాదమున 'గగ,భ,నల'. 2,4 పాదముల 'గగ,భ,నల,నల,స' 3వ పాదమున 'గగ,భ,భ' ఉండునట్లు రచింపబడినది. 1,3 పాదముల 'గగ,భ,భ లేదా నల'వాడవచ్చును. కావి మేధ నుపయోగించి గణములు సరిపడునట్లు చూచుకోవలెను. యత్యక్షరము రెండక్షరముల తర్వాత చోటుకు జరుగుచుండును. 2వ పాదములోని 'గు,బు,మ,నా' యత్యక్షరములు.

ఉదా :- 2) పూడిపెద్ది లింగమూర్తి. సువర్చలా పరిణయం.
3) కొండవలూరి రామచంద్రకవి-మహాసేనోదయము. 3-257.
4) కోట వీరాంజనేయ శర్మ- చిత్రాశ్వీయము. 3-38.

దీని భేదము. మాలికా త్రివిధకందము. ఇందు మూడు పద్యములు మాత్రమే వచ్చును. లక్షణముపైదానివలెనే. కాని దీనికి త్రిప్రాస చాలును.

ఉదా :- వింజమూరి- శ్రీ వేం చి,ర.త్నాకరము. పూ.భా. 29.

[1]రా[2]మా[3]నాథ నతజయద
భూమానాథ జలదవిభ పురమకనతిగా
యోమానాథఖ గ ధ్వజ
సామానాధికవిరహిత జయమధు మథనా

2) అష్టవిధ కందము

చతుర్విధ కందము పిదప అష్టవిధ కందమును చెప్పుకొనవలెను. ఇందు నెనిమిది కందములు మఱుగు పఱచబడును.

**1వ రకము.** ఉదా:- 1) తూము రామదాసు-మిత్రవిందోద్వాహము. షష్ఠ్యంతములలో. **1-36.**

[1]చరణ కజునకును[2]భవనది
తరికివి[3]స్తుతముని కవికివి[3]ధనవిభుపతికిన్
[5]క్షరదత నునకును[6]ప్రవిహిత
కరికివి[7]నుతవాసవికిని [8]గణరాడ్పతికిన్.

పై పద్యమునుండి 'ర' కారప్రాసతో రెండు, 'వ' తో రెండు, 'త'తో రెండు, 'న'తో రెండు - మొత్తమెనిమిది పద్యము తేర్పడును. కావున నాల్గుప్రాసాక్షరములు వాడబడినవి. ఇందలి 'ని,ను'లు గుర్వక్షరములగునపుడు'న్'గా మారును. అట్లే 'న్' లఘువైనపుడు''ని ను''లుగా మారును. ఉదా:- ''జునకును''——''జునకున్'' అగును. నలగణము 'స'గణమైనది. ఇట్లే 'తరికివి-తరికిన్' అగును.ఇట్లే ''పతికిన్'' ''పతికివి''——అగును. గణములబట్టి మార్పు చేసుకొని చదువుకొనవలెను.

దీనికి లక్షణము : రెండేసి గణంబులపై
నుండిన గణ మాదిగాగ నొనరగ చదువన్
ఖండిత సౌంభక కోటికి
తాండజ యష్టవిధకంద మనగా బరగున్.

[అప్పకవీయము. 4-631].

ఉదా :- 2) అప్పకవీయము. 4-632.

3) ముత్యసుబ్బరాయకవి. విదుషి-7-78. ఇందు 'త' కారప్రాస 8 పద్యములకు కూర్పబడినది. ''[1]కృతిరంజితులై [2]జితులై
జతులును[3]స్మితులై శతములు [4]చతురల్ జతయై.''

ఇందు ప్రతి గణము "త"తో కూడినది.

4) నాదెళ్ళవారి. 1. అ.ఉ.రామా. 2. గురుభక్తి ప్రభావము. 1-160. 3. సోమేశ్వరీయము. అన్నిటను "నల" గణముతోడనే పద్యములు నిర్మింపబడినవి. అవసరమగుచోట్ల అవి "స"గణములగును.

5) రా.ల.నా. ని.భా.రామా. పుట 20,21. పద్యం. 40

6) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. శ్రీ హనుమద్రామాయణం. అరణ్య.310.

అష్టవిధకందము. రెండవరకము.

ఉదా:- మరుగేశం పిళ్ళై వరగర్తై. త్రిశిర గిరీశ శతకము. 101 పద్యము.

తలతును నెలడాల్ నిలువున్
దలనెల నిలువుని వెలిమల తలగలు నెలవున్
విలుపుని దలజాల్ బలియుని
నెలగలు గలుగను బలుకుల నెలవున్ గలయన్

[అచ్చతెలుగు]

లక్షణము ప్రకారము 2 గణముల పిదప మూడవ గణముతో పద్యము ప్రారంభము కావలెను. కాని ఇక్కడ 1,3 పాదముల ప్రక్క ప్రక్కన 2,4 పాదముల రెండేసి గణముల పిదప పద్యములు ప్రారంభమైనవి. అన్ని పద్యములకును 'ల' ప్రాసయే.

8) షోడశముఖి కందము

ఉదా :- నాదెళ్ళవారి అ. ఉ. రామా: 7-149

[1]ధరణపు [2]తరుచపు [3]తఱుటను
[4]దఱుగను [5]దఱిగొన [6] దఱికను [7]తఱుగను [8]దరుగన్
[9]ధరణను [10]దరిగొన [11]ధరమును
[12]దరమును [13] దఱుమను [14]దఱియను [15]దఱలును [16]ద్వరగన్.

ప్రతి గణముతో ఒక పద్యము మొదలగును. 16 గణములకు 16 పద్యములు, ప్రతి గణము రెండవ అక్షరము ప్రాసయగుచుండును. కనుక 'ర' పాటింప బడినది. ప్రతి గణము మొదటిది ఏదో ఒక పద్యమునకు యతిస్థానాక్షరమగును కనుక 'ద,ధ'లు పాటింపబడినవి. ఇట్టివి కవుల యూహను బట్టి జనించుచుండును.

### 4) కందమున 108 కందములు.

దామెరల అంకన్న-ఉషా పరిణయం 5వ ఆశ్వాసము. 150 పుటలో ఇట్టి కందమున్నది.[1]

వరదా పరదా భరదా
వరద పరద భరద వరద వరదా భరదా
వరదా పరదా భరదా
వరద పరద భరద వరద పరదా భరదా.

మొదటి రెండు పాదాలలోని గణక్రమము, అక్షరక్రమము తర్వాత రెండు పాదాలలోను పాటింపబడును. భేదములేదు. ప్రతి అక్షరముతో ఒక్కొక్క పద్యము ప్రారంభమగును, పద్యమున 54 అక్షరములు. కనుక 54 పద్యము లగును. ఏ పద్యమునైనను గణక్రమము 1: 3 పాదముల స,స,స, 2,4 పాదముల నల, నల, నల, స, స- ఉండును. అక్షరక్రమముమారదు. మొదట విడిచిన అక్షరములు చివరకు గ్రహింపబడుచుండును.

మొదటి పద్యము 'వ' తో మొదలైనది. రెండవది 'ర' తో ఉదా:-

రదపా రదభా రదవా
రదప రదభ రదప రదవ రదభారదవా

తర్వాతి రెండు పాదములింతే కదా. మూడవది 'ద'తో, నాల్గవది 'ప' తో. ఇట్లే తక్కినవి. ఇట్లనులోమక్రమమున 54 పద్యములు. విలోమక్రమమున 54 పద్యము లేర్పడి మొత్తము కందములో 108 కందములు దాచబడినవి.

విలోమక్రమమున మొదట 'ద'తో రెండవది 'ర' తో మూడవది 'భ'తో ఇట్లే తక్కినవి మొదలగు చుండును.

ఉదా :- మూడవదైన 'భ' తో మొదలిడినచో.

భరదా పదరా వదరా
భదర పదర వరద భదర పధరా వదరా.

ఇట్లే నాల్గవది 'దరపా' గా 5 వది 'రవదా'గా ప్రారంభమగును. ఇట్లు తక్కిన వన్నియు సాగుచుండును.

---

1 ఆం.ప్ర.ప్రా. లి. గ్రంథాలయం. 540. కాగితం ప్రతి.

కందము నందితర పద్యములు :

1] మణిగణనికరము

ఉదా :- గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 848 పద్యము.

కం॥ ధరణి ధర భరణ తతకర
సరసా శరవర విదళన చణనిశిత శరా
పురహర నుత నిజభుజబల
గిరి మాఖరకరనిభ విభ గరుడ గిరిపతీ.

ఇందలి మణి గణ నికరము.

ధరణి ధర భరణ తతకర సరసా
శరవర విదళన చణనిశిత శరా
పురహర నుతనిజ భుజబల గిరిమా
ఖరకర నిభవిభ గరుడగిరి పతీ.

ఏ ఒక్క అక్షరములోను, గురులఘువులలోను మార్పులేదు. ఎటూ ఏ ఒక్క అక్షరము మిగులలేదు. కందమున 'నల, నల, నల, స, నల, నల, నల, స' అను వరుస గణములతో కూడిన రెండు పాదములు, మణి గణనికరమున, "నాల్గు 'న' గణములు 'సగణము మరి నాల్గు 'న' గణములు 'స' గణము. అను వరుస గణములతో కూడిన రెండు పాదములు సరిపోయినవి. ఇట్లే కందమందలి మిగిలిన రెండు పాదములు- మణిగణనికరమున మఱి రెండు పాదములగును.

కందమందలి 2, 4 పాదముల రెండవ గణము రెండవ అక్షరము మణి గణనికర ప్రాసాక్షరములగును. వాని వాని యతులు గమనించి వాడవలెను.

ఉదా:- 2) పుష్పగిరి తిమ్మన — సమీర కుమార విజయము, 4-79
3) కూచిమంచి తిమ్మకవి. — రసికజన మనోభిరామము, 2-55
4) లక్ష్మణ కవి — లంకా విజయము, 1-182
5) మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి. — సీతారామ చరిత్రము, 1-986
6) త్యాగరాజు మొదలి. — సుబ్రహ్మణ్య విజయము.
7) రాప్తాటి ఓబిరెడ్డి. — కవిజన వినోదిని, వ్రాతప్రతి, పుట 2(

## 2] మంజుల వృత్తము

ఉదా:- విక్రాలవారి శ్రీ. వేం. చి. ర. కరము ఉ.భా. పుట. 25.

కం॥ వేంకట రమణునిఁ బ్రీతిని
శంకా సంకట మథనుని సంపద గల్గన్
పంకజ నయనునిఁ బ్రతివ
రాంకున్ న్యంకు ధర ముఖుని నచ్యుతు గొల్తున్

ఇందలి మంజుల

వేంకటరమణుని బ్రీతిని శంకా
సంకట మధనుని సంపద గల్గన్
పంకజ నయనుని బ్రతివ రాంకున్
న్యంకుధర ముఖుని నచ్యుతు గొల్తున్.

కంద 'భ, నల, భ, గగ, భ, నల, భ, గగ' గణములతో గూడిన రెండు పాదములు-మంజుల "భ, న, జ, య, భ, న, జ, య" గణములతో గూడిన రెండు పాదములైనవి. ఇట్లే మిగిలిన రెండు పాదములును 2,4 పాదముల రెండవ గణము రెండవ అక్షరము కంద పద్యప్రాసాక్షరమునే పాటించిన- మంజులా వృత్తమునకు ప్రాసాక్షరమగును.

## 3] ప్రమితాక్షరము

ఉదా:- 1) విక్రాలవారి శ్రీ. వేం. చి. ర. కరము, ఉ.భా. పుట. 25.

కం॥ కమలా సహా యజయకం
జమహారమణీయ నేత్రజయరమ్యతమా
శమితారివంశ జయ స
త్సమరాసమ సార శూర జయసామజసా

ఇందలి ప్రమితాక్షరము.

కమలా సహాయజయకం జమహా
రమణీయ నేత్రజయ రమ్యతమా.
శమితారి వంశ జయ సత్సమరా
సముసార శూర జయసామజసా.

2,4 పాదములలో రెండవ గణము రెండవ అక్షరము ప్రమితాక్షరమునకు ప్రాస యగును. ఆ పద్య నియమాను సారము యతులను చూచుకోవలెను. కంద "స,జ, స,స,స,జ,స,స," అను రెండు పాదముల గణములు ప్రమితాక్షరపద్యమున రెండు పాదములకు సరిపోవును.

ఉదా:-2) గ.వేం. కవి-ప్ర.రా.వేం.వి.వి. 361 పద్యము.

4] ద్విపద

ఉదా:- 1) మిన్నికంటి గురునాధశర్మ. శివగీత 13-1

కం॥ పురహిత శంకర మునిహిత
పరమ తరుణ శశిమకుట ధవళ తనురుచిరా
సరసిజ సంభవ సన్నుత
చరణ గరళ గళ ధృత నగజహిత వరద! యా.

ఇందలి ద్విపద,

పురహిత శంకర మునిహిత పరమ
తరుణ శశిమకుట ధవళతను రుచి
సరసిజ సంభవ సన్నుత చరణ
గరళ గళధృత నగజహి రవరద

కంద 2,4 పాదాంతిమ వర్ణములు విడిచిన ద్విపదలు రెండేర్పడును. కంద పద్య "నల, భ, నల, నల, నల, నల, నల, 'న" గణము లోని మొదటి రెండు లఘువుల"తో గూడిన రెండు పాదములు, ద్విపద "నల,భ,నల,న, నల, నల, నల, న" గణములై రెండు చరణములు పూర్తియగును. యతులు గమనించి వ్రాసుకొనవలెను. కంద పద్య 2,4పాదములందలి రెండవ గణము రెండవ అక్షరము కందపద్య ప్రాసాక్షరమునే నిబంధించిన ద్విపదకు ప్రాసాక్షరములుగా పనికివచ్చును.

ఉదా:- 2) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి, గర్భ 6.

5] ద్విపద, తేటగీతి పద్యములు

ఉదా :- కం॥ కలుపల దొర మానికముల
దళంపు తళుకుల నెపుడును దగలోఁగొనఁగన్
గల తరగల పాలకడలి
చెలంగు చెలువుని నినుగొలిచెద లోకమునన్

[గ.వేం.కవి. ప్ర.రా.వేం.వి.వి. 139, పద్యం]

ఇందలి ద్విపద :

కలువల ............ దళంపు

తళుకుల ............ గొనగను

గలతర ............ చెలంగు

చెలువుని ............ కమునను.

'న్' ద్విపదలో 'ను'గా మారినది.

కంద "నల,స,నల,జ,నల,నల,స,స" (చివరి గురువు లఘువై) గణములతో కూడిన రెండుపాదములు, ద్విపద "నల,సల,నల,హ,నల,నల,సల,న"లతో గూడిన రెండు చరణములైనవి.

కొన్ని మార్పులతో

కలువలందొర మానికముల దళఁపుత

ళుకుల నెప్పుడు నుం,దగ లోఁగొనగను

గల తరంగల పాలకడలి చెలఁగు చె

లువుని నిన్ను గొలిచెదను లోకమునను.

## 6] శ్లోకము

ఉదా :- మల్లమపల్లి బుచ్చికవి. హాలాస్య మహాత్మ్యము. 5-549.

కం॥ భవధాత్ర శిరశ్ఛేత

ప్రవీణ కరపం కజగిరి భర్తృ సుతాధీ

శవిధు శ్రీయుత మస్తక

భవదూరము నీ స్తవంబు భర్గమహేశా.

ఇందలి శ్లోకము.

"భవధాత్ర శిరశ్ఛేత ప్రవీణ

కర పంకజరి భర్తృసుతాధీ

శవిధు శ్రీయుత మస్తక భవదూ

రము నీ స్తవంబు భర్గ మహేశా.

కంద "స,స,గగ,జ,స,నల,భ,గగ"గాని,"స,భ,స,స,జ,భ,భ,గగ"గాని__ శ్లోకము రెండు చరణములకు సరిపోవును. కంద పద్యమునకు యతిప్రాసలు చూచు కొనవలెను.

ఉదా :- 2) ఇటువంటి విహాలాస్య మహాత్మ్యమునందే 5-550, నుండి 554, వఱకు పద్యములు రచింపబడినవి.

## 2. తేటగీతి

ద్వివిధ తేటగీతి. అనగా తేటగీతిని మరియొక తేటగీతి గూఢ పఱుచబడి యుండిన పద్యము.

ఉదా :- రాప్తాటి ఓబిరెడ్డి. వ్రాతప్రతి.

తేటగీతి॥ మౌని సన్నుతాభిఖ్య శ్రీమత్ప్రశస్త
వేష సంతతానంద గోవింద సర్వ
కర్త శ్రీకరా కార సత్కార్యలోక
రక్ష ప్రేమ నన్నేలు మత్రాంత విహిత.

ఇందలి మొదటి రెండక్షరములు 'మౌని' వదలి వరుసగ చదువుకొని చివరన ఆ రెండక్షరములు తగిలించిన—రెండవ తేటగీతి వచ్చును.

తేటగీతి యందిమడ గల పద్యములు.

### 1] కందము

ఉదా :- 1) నాదెళ్ళవారి. సోమేశ్వరీయము.

తే॥ గీ॥ కరుణగలిగిన జనకులు గలరటవిన
దమనములుగల లనయినను మహిబరగ
గలరె యనుచు భువిని నరుల లలరుదురిది
నహజయనయ నియమమునవు హరరహర

ఇందలి కందము.

కరుణ ..... ...... నకులుగా
లరటని ................ ననుమహిన్
బరగగ ... ........ భువిని
నరులల ................ మమునౌ.

'మహి'—కందమున 'మహిమ' అయినది. 'మునవు' కందమున 'మునౌ' అయినది.

కందములో 'నల'లుగా తేటగీతిన 'న' గణములు సరిపోయినవి. అప్పుడు చివరి అక్షరములు కొన్ని మిగులును

2) ఉదా :- నాదెళ్ళవారి. అ.ఉ.రామా.

3) బోడివాసుదేవరావు-చిత్రమంజరి. గర్భ. 10.

4) అద్దుమిల్లి నారాయణరావు-నారాయణీయము. పుట. 103, 106.

"న,సల,భ,న,న,హ,భ,నగ,హ,హ"—లలో చివరి 3 అక్షరములు.

"న,సల,భ,న,న,హ,భ,నగ,హ,న"—లలో చివరి 4 అక్షరములు.

వదలిన కందమగును.

5) గ.వేం.కవి.ప్ర.రా.వేం.వి.వి. 809 వద్యము.

"న,సల,భ,నన; హ,ర,నల,హ,న; న,నగ,నల, న,న;న,నగ,త,న,హ." అను తేటగీతిలో చివరి 7 అక్షరములు తొలగించిన కందమగును.

## A1,2 కందములు

ఉదా :- విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. ఉ.ఖా.పుట.37.

తే॥ గీ॥ ద్విరద కులవర్య సంశ్రిత దురితనిబిడ
తిమిర నికర ధూనన రవిధీ కలనక
కరధృత జల జాసురహిత కరణవిరత
కొను స్తుతులనుఁగాంచన్ లక్ష్మిఁగూడిదేవ.

మొదటి కందము : తేటగీతి 2,4 పాదముల చివరి నాల్గు అక్షరములు వదలిన ఏర్పడును.

రెండవ కందము. తేటగీతిలోని చివరి 6 అక్షరములు తొలగింపగావచ్చును. "ల,ర" అభేదమని భావించి, ప్రాసకూర్చుట జరిగినది.

## 2] ద్విపద

ఉదా:- గ.వేం కవి. ప్ర.రా.వేం.వి.వి, 385.

తే॥ గీ॥ దమిత కంసవివక్ష దంతావళాక్ష
యమిత సేవక రక్షణా యత్తతీక్ష
సమర భుజ్మని దక్ష శశ్వత్కటాక్ష
యమర నాయకపక్ష యజ్ఞాయతాక్ష

ఇందలి ద్విపదములు రెండు. అక్షరములు సరిపోయినవి. తేటగీతి "న,భ,ర హ,హ"లు ద్విపద పాదమునకు "నగ,సల,త,హ"-అయి సరిపోయినవి.

### 3] ద్రుతవిలంబితము

ఉదా:– 1) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. పూ.భా.గర్భ. 5.

తే॥ గీ॥ శ్రుతి సహస్ర కృతిస్తుతి మాన్యతార్థ్య
జపతపో ధ్వర సిద్ధివిసార దాయి
అసదృశా భవభీతి భరాప హాఖ్య
జయము దాదిక మోదిత సంశ్రితాత్మ.

ప్రతిపాదమున చివరి అక్షరము తొలగించి చదివిన ఇందలి ద్రుతవి లంబితము వచ్చును–

తేటగీతి "న,భ,భ,హ,హ,"–చివరి లఘువు తొలగించిన–ద్రుతవి లంబితమున "న,భ,భ,ర"–గణములు వరుసగా వచ్చును. కాని ఇది సంస్కృత ద్రుత విలంబితము.

2) ఉదా:– కూచిమంచి తిమ్మకవి. రసికజన మనోభిరామము. 2–5.6
ఇందు తెలుగు ద్రుతవిలంబితముగలదు. యతిప్రాసము పాటింపబడినవి.

తే॥ గీ॥ హరసరీ సృపహర భయాపహర
పుర నిషూదన భూరి విభూతిదాన
హరిహయ ప్రణతాయచ్ఛ పదాంబుజాత
శరణు శంకర శాశ్వత సాద్మపాల.

చివరి అక్షరము తొలగించిన ద్రుతవిలంబితము వచ్చును.

### 4] ఆటవెలది

ఉదా :— రా. అ. నా. వారి. తి. భా. రామా. 37.

తే॥ గీ॥ వినియతి సున్నృపజులు విరివి ధృతిఁదలఁచి
రావివాహమునకుఁ బోవ హాశధీమ
తల్లితోడుత ఘనతనుఁ దనరిచనిరి
కానఁ గూర్మితోడఁ గలయఁగనుచు గనుచు.

ఇందలి ఆటవెలది. తేటగీతిలోని 2, 4 పాదముల చివరి గణాక్షరములు తొలగింప ఆటవెలది ఏర్పడును. యతులు చూచుకొనవలెను. "న, నల, నల, న, న" గాని "హ, భ, నల, న, న" గాని 1, 3 పాదములయందు, "హ, భ, నల, హ, హ" లేదా 'హ, ర, నల, న, న' గాని 2, 4 పాదములయందు, ఉండునట్లు

తేటగీతి రచించి, దాని 2, 4 పాదముల చివరి గణాక్షరములు తొలగింప ఆటవెలది వచ్చును.

5] అనుష్టుప్ శ్లోకము.

ఉదా:- విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము.పూ.భా.గర్భ 2.

తే॥ గీ॥ వేంకటేశ్వర రామాజ్ఞ బృందగీత
వరక్షమాక్షీర వార్ధీశ ప్రభవభాసు
రా న్యవర! క్షతి దూరస్థ రాక్షసాంత
శంఖ చక్రధరా నీకు జయము జయము.

ఇందలి అనుష్టుప్.

వేంకటేశ్వర రామాజ్ఞ బృందగీత వరక్షమా
క్షీరవార్ధీశ ప్రభవభాసు రాన్యవరక్షతి.

౨. ఆటవెలది.

ఇందిమడగల పద్యములు.

1. కందము. ఉదా :- రా.ల.నా.గారి.ని.భా.రామా. 85.

ఆ॥వె॥ మీఱి పలికెవెండి మిగుల శూరుడగు సు
యోధన విభుఁజూచి యుదుటు తోడ
బోరు వినవొ నష్టము మఱియారయగును
బొందు లాభమంచు బుడమిలోన.

ఇందలి కందము.

మీఱి పలికెవెండి మిగుల
శూరుడగు సుయోధన విభు జూచియు దుటుతో
బోరువినవొ నష్టము మఱి
యారయగును బొందులాభ మంచు,బుడమిలో.

ఆటవెలదిన 'హ, న, హ, సగ, నల, హ, న, హ, న, హ అను రెండు పాదములవరుస గణములలోని చివరి లఘువును తొలగింప కందము రెండుపాదము లేర్పడును. అట్లేతర్వాతి రెండుపాదముల కూడ. ఈ పద్ధతిలో కందమున 1,2 పాద ములకు, 'భ, స, నల, భ, వ, నల, భ,స' అనుగణము లుండును. కంద లక్ష ణాను సారము యతి ప్రాసములు చూచుకొని రచింపవలసియుండును.

## 2] ప్రమాణి.

ఉదా:- విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. గర్భ. కృత. 4.

ఆ॥వె॥ శ్రీవసుంధరా గిరిస్త నీ సఖనమ
ద్ధర ముఖప్రియ ప్రియా ప్రియాఢ్య
స్వాశ్రితాఖిలార్ధ సార్ధ దానతులు సం
భా సమేధ తారిత మామహోచ్చ

ఇందలి ప్రమాణి- క్రీగీతలు గల భాగము:

ఆటవెలదిన 'హ, హ, హ, ర' అను 1,3 పాదములందలి మొదటి గురువు తొలగించిన, ఆటవెలదిన 'న, (హ), హ, హ, హ, హ' అను 2,4 పాదముల మొదటి రెంతు లఘువులు లేదా గురువును మఱియు చివరి లఘువును తొలగించిన ప్రమాణివృత్త పాదము లేర్పడును.

• ద్విపద

## 1] కందము.

ఉదా:- కంకంటి నారసింహకవి. విష్ణుమాయా విలాసము. ఆశ్వా. 5.

ద్విపద: శరణార్థిహిత దయాసాగరకృష్ణ
శరద నిభాంగ కంస కరిహరీంద్ర
దరవక్ర ముఖ్య సాధన కరభాసి
నరకషలా శిఖండన చతురాసి.

పైరెండు ద్విపదలలో ద్విపదల చివరి అక్షరము లఘువు తొలగించిన కందమేర్పడును. ద్విపదిలో 'నల, నగ, భ, హ, నల, ర, నల, హ' వరున గణముల నుండి చివరి లఘువు తొలగింపబడిన, కందము 1,2పాదము లేర్పడును. ఇట్లే మఱి యొక ద్విపదయందు కందము 3,4 పాదములేర్పడును.

## 2] సీసము.

ఉదా:- కంకంటి నారసింహకవి. ద్విపద విష్ణుమాయా విలాసము. ఆశ్వా. 5.

ద్విపద: శ్రీరుక్మిణీపక్ష పితపుష్కరాక్ష
నారదమునిరక్ష నక్రప్రశిక్ష

1 ద్విపద సీసపాద మొకటి అగును. ద్విపదలో ''ర, ర, నల, హ, భ

సల, త, హ" అను వరుసగణములు, సీసపాదమున "ర, ర, సల, ర, సల, ర; హ, హ" అను వరుసగణములగును. అక్షరములు మిగులవు. ద్విపద రెండవ పాదమున 1వ గణము 2వ అక్షరమునకు, 3వ గణము మధ్యాక్షరమునకు యతి పాటించిన-సీసమునకు యతిపాటించినట్లగును.

3] తేటగీతి.

ఉదా:- కంకంటి నారసింహకవి. విష్ణుమాయా విలాసము. ఆశ్వా. 5.

ద్విపద: యఖిల సంహన నావ్యయా యప్రమేయ
యఖిల రక్షక యక్షరా యంచునిమ్న.

ద్విపద పాదమున 'నగ, సల, త, హ' అనుగణములు, తేటగీతిలో 'న, ర, ర, హ, హ' అను పాదగణములగును. యతులు వాని లక్షణానుసారము పాటింపవలెను ఒకద్విపద తేటగీతి రెండు పాదములగును.

4] శ్లోకము.

ఉదా:- కంకంటి నారసింహకవి. విష్ణుమాయా విలాసము. ఆశ్వా. 5.

ద్విపద: బాల గోపాల రూపాయ నవీన
నీల నీరద భాసినేతే నమోస్తు
జ్ఞాన గమ్యాయ కృష్ణాయ నిత్యాయ
తేనమోస్తు తమోహ్యాతే నిరీహాయ.

ఇందలి శ్లోకము:

బాలగోపాల రూపాయ నీలనీరదభాసినే
జ్ఞానగమ్యాయ కృష్ణాయ తేనమోస్తుతమోహ్యాతే.

5. సీసపద్యము.

1] ద్విపద

ఉదా:- పుష్పగిరి తిమ్మన. సమీరకుమార విజయము. 5-98.

సీసపాదము: "తారక బ్రహ్మమంత్ర విహారసుగుణహార కృపానిధియనిరాజ ధరుడు."

పైపాదమున ఒక ద్విపదగలదు. సీసపాద "ర, ర, సల, నగ సల, భ, హ, న" గణములు; వరుసగా ద్విపదయందు "ర, ర, సల, న; భ, ర, సల, న," గణములై. సరిపోవును. అక్షరములు శేషించవు. ఇట్లు సీసము నాల్గుపాదములకు నాల్గు ద్విపద లేర్పడును.

సీసము క్రింది తేటగీతిన రెండు ద్విపదలిముడును. కావున మొత్తము సీస మున 6ద్విపదలు పొందుపఱచవచ్చు.

2] కందము.

సీసముక్రింది తేటగీతిన, లేదా ఆటవెలదిన కందము గూఢపఱచబడును. ఆ పద్ధతిపైన తెలిపితిమిగదా. మత్తేభ కంద గర్భిత సీసములో కూడా ఇదేపద్ధతి. ద్విపద కంద గర్భిత సీసము (అప్పకవీయము. 4-614)లోను సీసపాదముల ద్విపదను, తేటగీతిన కందము నిముడ్చబడును. మధ్యలో కొన్ని అక్షరములు తొలిగించిన సీస పాదముల కందము వచ్చును. ముందు తెలుసుకొందుము.

3] ఆటవెలది.

ఉదా:— గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 466.

సీ॥ వనిత మెయిరకమ్ము కనకమ్ము నణగించు
దిరుగునదియు నాసదెగడునాస.
చంద్రముఖి గళమ్ము జలజమ్ము నణగించు
మఱల నదియు గేలు మాటికేలు.

సీసపాదమున ఆటవెలది రెండు పాదములు వచ్చును. సీసపాద "నల, నల, నల, నల, నల, నల, న, హ" అనుగణములు ఆటవెలదిన "న, న, హ, నల, నల, న, న, హ, న, హ" అను గణములతో రెండు పాదములగును. ఇట్లు రెండు సీసపాదములకు ఒక ఆటవెలది తయారగును. ఇటు సీసమటు ఆటవెలదికిన్ని యతి స్థానము మారటం జరగదు. కావున రెండింటికి ఒకే యత్యక్షరములు సరిపోవును. పై సీసపాదములు రెండును ఒక ఆటవెలది పద్యము.

4] రగడ

ఉదా:— గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 366.

సర్వలఘు సీసము॥ విదిత దిత మురసురణ విధి విశద
సనయజగ దవతరణ జనక
గజవరద బుధశరణ యజవిభవ
సముదచల దనుసరణ

ఇందలి రగడ (తురగవల్గన).

విదిత దితముర సురణ విధి
విశదనఖ కిరణ సనయుజ.
గదపతరణ జనన భరణ
గజవరద బుధ శరణయజ.

రగడకు యతులు సరిపోవునట్లు రచించెను.

## 5. మత్తేభము.

ఉదా:- 1) ధరణి దేవుల రామమంత్రి. దశావతార చరిత్ర. పుట. 117

సీస. వినత పద్మాసన విశ్వరక్షణ చణా నాశిక ప్రత్యేక్షణా రమేశ.
సతత తేజోనిధి సజ్జన వ్రజనుతా తారుణ్య లక్ష్మీయుతా యుపేంద్ర
విజిత మత్తాసుర విక్రమోజ్జ్వల భుజా శృంగార లీలానిధీ ముకుంద
మహిత కార్యోద్యమ మమ్ము బ్రోవుము దయహేమాంబరా డంబరామ
హాత్మ.

సీసపద్యములోని నాల్గుపాదములలోను ప్రతిపాదము నుండి మొదటి అక్షరము చివరి మూడుక్షరములు తొలగింప మత్తేభపద్యము వచ్చును. అప్పుడు సీసపాదమునకు " నగ, భా, ర, నగ, త, త" అనువరుసలో ఇంద్రగణములుండవలెను. పాదమున ప్రతి మూడవ అక్షరము ప్రాసాక్షరముగా పాటించిన అది మత్తేభ ప్రాసాక్షరమగును. సీసపాదమున రెండవ అక్షరమునకు దానినుండి 14వ అక్షరమునకు యతిచెల్లించిన మత్తేభ పద్యమునకు యతి సరిపోవును అనగా సీసపాదము రెండవ అక్షరము 15వ అక్షరమునకు యతిచెల్లించి నట్లగును.

ఉదా :- 2) కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము. 1-257.

3) చినవేంకటార్యుడు. భాద్రరాజపుత్ర చరిత్రము. గ్రంధాంతము నందు ఈ పద్యము గలదు[1].

## 5. A. మత్తేభకందములు.

మత్తేభము పై మాదిరి ఏర్పడును.
లేదా ఆటవెలదిన కందము పొందుపఱుప బడును.
గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 810.
కొండ వెంకటరత్నం. బిల్వేశ్వరీయము. 1- 299.

1. D. 597. G. O. M. Library. Madras.

3) తిరువేంగళాచార్యుని – నీలాచలవిలాసము[1].
4) కేశవయ్య – దాశరధి చరిత్ర. 1–309.
5) మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి – సీతారామచరిత్రము. 1 – 985.
6) నాదెళ్ళవారి – గురుభక్తి ప్రభావము. 4–200; సోమేశ్వరీయము.
7) పోతరాజు లక్ష్మీనరసింహకవి – మాఘపురాణము. 9–115.
8) పుష్పగిరి తిమ్మన – సమీర కుమార విజయము. 4–147.
9) అప్పకవీయము. 3–393.
10) కూచిమంచి తిమ్మకవి – రసికజన మనోభిరామము. 2–57.
11) తూము రామదాసు – మిత్రవిందోద్వాహము. 2–34.
12) అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పుట. 104.
13) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి – శ్రీహనుమద్రామాయణం. కిష్కింధా, 206.

23) a). వారి. —— ఉత్తమ జీవయాత్ర – 2వ. ఆశ్వాసాంతము.
14). అల్లమరాజు రంగశాయి – శ్రీ. ఆం. చంపూరామా. ఆరణ్యకాండము చివర.

15) వీరరాఘవాచార్యులు – యథా శ్లోక తాత్పర్య రామాయణము. 8–417.
16) కాణాద పెద్దన – భద్రాపరిణయం. 3–289.
17) రాప్తాటి ఓబిరెడ్డి – కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట. 10.

ఈ. B. మత్తేభ కంద షడక్షర సమవృత్తములు.

ఉదా:– 1) గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 809.

సీస॥ సవినయాచార విచార తత్పర మహావేదాంత విద్వందితాదిదేవ.
సుజన వర్యామిత శోభనైక ఘటనాచాతుర్య లీలాస్పదాతతాత్మ
భవన చారిత్రవతి కాంక్షి హృదయాబ్జాతద్విరేఫా కృతీత గాత్ర.
భువన రాశీశ్వర పుత్రికాభినుత సద్వస్తుప్రదానోత్సవాత్యుదార.

ఈ సీసమున మత్తేభము, క్రింది గీతమున కందములున్నవి మత్తేభ కందములు సీసమున నెట్లిముడునో లోగడ గమనించితిమి. షడక్షర సమవృత్తము. పై సీసపాదముల నిట్లున్నది.

---

[1]. య్యస్వీ జోగారావుగారి. యక్షగానచరిత్ర. పరిశోధన గ్రంథము

వినయాచార వి
జనవర్యామిత
వనవారిప్రతి
వనరాశీశ్వర.

ఉదా:- 2) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. పూ.భా. గర్భ. 9.

6. , భుజంగ ప్రయాత, స్రగ్విణీ దండకములు.

ఉదా:- గ.వేం కవి. ప్ర. రా.వేం.వి.వి. 807.

సీస॥ పూత నాదాసుర భ్రాతృ సంత్రాణ సూర్యప్రకాశాకృతీ యప్రమేయ
శేష తల్పాకర స్ఫీత శంఖారి గాంభీర్య వార్ధి స్థితా భీమ వంద్య
దంతిరక్షా వరాద్వైత మార్గప్రభావాత్త చిత్తాధి కాయద్రి ధైర్య
కంజనేత్రా శరఖ్యాత జీమూత సంకాశ వర్ణాతిగా కంబుకంఠ

ఇందు ప్రతిపాదమున "ర,ర,ర,ర,ర,ర,హ్వ,హ" అను గణములున్నవి.

ఇందలి భుజంగ ప్రయాతము

సురభ్రాతృ సంత్రాణ సూర్యప్రకాశా
కర స్ఫీత శంఖారి గాంభీర్య వార్ధి
వరాద్వైత మార్గ ప్రభావాత్త చిత్తా
శరఖ్యాత జీమూత సంకాశ వర్ణా.

దీని ప్రాస, యతులు చెడకుండ రచనమున్నది.

ఇందలి స్రగ్విణి :

భ్రాతృ సంత్రాణ సూర్యప్రకాశాకృతీ
స్ఫీత శంఖారి గాంభీర్య వార్ధి స్థితా
ద్వైత మార్గ ప్రభావాత్త చిత్తాధికా
ఖ్యాత జీమూత సంకాశ వర్ణాతిగా.

ఇందలి దండకము.

నాదాసు............యప్ర
తల్పాకర............భీమ
రక్షావ............యద్రి

. . . . .

2) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. గర్భ. 23.

6. A. కంద, స్రగ్విణీ, భుజంగ ప్రయాత, దండకములు.

ఉదా:- నాదెళ్ళవారి. గురుభక్తి ప్రభావము 5-140.

సీసము. దాని క్రింది తేటగీతి.

సీసపాదముల - స్రగ్విణీ, భుజంగప్రయాత, దండకములున్నవి. లోగడ గమనించితిమి కదా. సీసము క్రింది తేట గీతిన కందము పొందుపఱుచబడినది. అది కూడ లోగడ గమనించితిమి.

ఉదా:- 2) నాదెళ్ళ దక్షిణామూర్తి. శ్రీహనుమద్రామాయణం.

సుందరకాండ—274 పద్యము.

3) వారి - ఉత్తమ జీవయాత్ర. 4. ఆశ్వాసాంతమున - ఆ పద్యమున కంద స్రగ్విణీ భుజంగ ప్రయాతములు కలవు.

6. B. స్రగ్విణీ, భుజంగ ప్రయాతా, దండక, ద్విపదలు.

ఉదా:- విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము, ఉ. భా. గర్భ. పుట 31.

సీ॥ శ్రీధరానాయకా శేషధాత్రీధ్రపాలా కళానాథ పాలాంబుజాత
భూధరోద్ధారకా భూరిధా మాఢ్య కాంతావిభా చంద్రికాదాయ కాక్ష
క్ష్మాధురీణాలసచ్చక్ర భూతా ఘకా శ్రీ జగన్నాయకా శ్రీఘనాంగ
మాధురీఢ్యా మహామత్త ధూర్తాంత కాంక్షా దిగీశాన కామ ప్రదాత

తే॥ గీ॥ శ్రీకుమార పదాబ్జ శిక్షిత హాస
నీకు దాసుడ నేను లోకైక నాథ
నన్ను పాలన సేయు మన్నాను నాథ
నిన్ను నెన్నెద నన్ను మన్నింపుమన్న.

ఇందలి స్రగ్విణీభుజంగ ప్రయాత దండకములు లోగడ గమనించితిమి గదా.

ఇక ఇందలి ద్విపదలు : సీసమున నాలుగు ద్విపదలు.

మచ్చుకొకటి :

శ్రీధరా నాయకా శేషధాత్రీ ధ్ర
పాలా కళానాథ పాలాంబుజాత.

సీసముక్రింది తేటగీతిలో రెండు ద్విపదలు. ప్రాస పాటింపబడినవి.

మచ్చుకొకటి. శ్రీకుమార పదాబ్జ శిక్షితహాస
నీకుదాసుడ నేను లోకైకనాథ

6. C. స్రగ్విణిలో, మంజరి, ద్విపద దండకములు.

ఉదా:– గ. వేం. కవి. వ్ర. రా. వేం వి. వి. 879.

సీస॥ వారణా వారణా వక్రసన్నక్ర సత్పాదనాషాద నాగ్రారధార
కారవాధార వాగ్వారణా కారణార్ణవనా థావనాయాన వాస
సార హం కార హంసార ధామారధా మానసాఖ్యాన నావావ చాప
మార సంహార సంభావ భానవ్య భాగాగ మాంతాగ మాంతాలవాల

ఇందలి స్రగ్విణి : వారణా......................క్రసత్
కారవా......................ణాకారణా
సారహం......................మారధ
మారసం......................నవ్యభా

ఇందలి మంజరి : ప్రాసలేని ద్విపద.
వక్ర సన్నక్ర సత్పాదనా పాద
కార వాధార వాగ్వారణాకార

ఇందలి ద్విపద : సారహంకార హంసార ధామార
మార సంహార సంభావభానవ్య

సీసమున దండకము లోగడ గమనించితిమి గదా.

7. స్రగ్విణి, భుజంగప్రయాత, ద్రుత విలంబిత వృత్తములు.

ఉదా:– కూచిమంచి తిమ్మకవి. రసికజన మనోభిరామము. 2–56.

సీస॥. నిగమాశ్వ భూసురానీక సంపూజ్య శుంభత్ప్రభావా వృషపతితురంగ
సురుచిర ద్యోసరీ ఝాట ఖద్యోత సహస్ర భాసా సమస్తాఘహరణ
జగతీశమాసర స్వత్సుమామాన్య చంచత్కృపార్ద్రీనతజన శరణ్య.
మానితహాస రమ్యాన నాబ్జాల సన్మంగళాత్మా నిశానాథ మకుట

తే॥గీ॥. హరసరీ సృపహార భయాపహార
పుర నిషూదన భూరి విభూతిదాన
హరిహయుప్రణ తాచ్ఛ పదాంబుజాత
శరణు శంకర శాశ్వత సాధుపాల.

ఇందలి స్రగ్విణి : భూసురా......................త్ప్రభా
ద్యోసరీ......................స్రభా
మాసర......................త్కృపా
హాసర......................గళా

ఇందలి భుజంగ ప్రయాతము. సురానీక......................భావా
సరీ..........................భాసా
సరస్వ......................పార్థీ
సరమ్యా....................శాత్మ

ఇందలి ద్రుతవిలంబితము. సీసము క్రింది తేటగీతిలో గలదు.

హరస...................వహా
పుర .......................తిదా
హరి...................బుజా
శర ...................సాధుపా.

ఇటు తేటగీతి అటు ద్రుతవిలంబితములకు యతులు పాటింపబడినవి. ద్రుత విలంబితమునకు ప్రాసపాటింపబడినది.

ఉదా:– (2) మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి. సీతారామచరితము. 1–984.

8. మత్తకోకిల, ద్విపదలు.

ఉదా:–పిక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. 40. పుట. 47.

సీ॥ సారసాసనసత్స్వర సంస్తుత సారనారద కీర్తి తానరరథ్యచోది
వారిదోచ్ఛ్రయ నీరవర్ధితభక్త వారణ రక్షకా బలరామసక్త
క్షీరసాగర ధామకేశవ కృష్ణ మారమణి వరా మధురాక్షసాన్త
శూరసున్దర రత్నశోభితచూడ భాసురతోషణావర శోభనాఙ్గ.

దీనిక్రింద తేటగీతి కలదు.

ఇందలి మత్తకోకిల.

సీసపాద ర, సల, భ, ర, సల, భ, సా, హ. అను గణములలో మొదటి నుండి స, స, జ, జ, భ, ర అను గణములతో మత్తకోకిలపోను 6 అక్షరములు మిగులును.

"సారసా....................కీర్తితా
వారిదో....................రక్షకా
క్షీరసా.......... ........వరా
శూరసు....................తోషణా.

ఇందలి ద్విపదలు: సీసపాదమునకు ద్విపద ఒక్కొటి చొ॥న సీసమునకు నాలుగు ద్విపదలు, సీసముక్రింది తేటగీతికి రెండు ద్విపదలు, మొత్తమారు ద్విపద లిందు గలవు.

8. A. ద్విపద, మత్తకోకిల, కందములు.

ఉదా:- గ. వేం. కవి. ప్ర. రా. వేం. వి. వి. 821.

సీస॥ సారసోద్భవ శర్వసన్నుత సారవారణ రక్షణావసు రమ్యనేత్ర
ధారుణీ తనయాది ధర్మవిధారి దారుణ శిక్షణా తతరూపసార
హార మానసయుక్త హారి విహార నీరజ వీక్షణా నిధిరాజదాన
పారి కాంక్షిత సత్క్రియాపారస భారపార సులక్షణా పటురమ్యకృతిస

ఆ॥ వె॥ సవితృ బింబవసతి సౌరసమాదక
విజయభూత రాజవిదిత ధీర
వేదవేద్యయభవ వేదాంత తత్వజ్ఞ
యసుర నాశ వేంకటా చలేశ,

ఇందలి ద్విపద.

సీసము నాల్గుపాదములందు నాల్గుద్విపదలు.

ఇందలి మత్తకోకిల: సీసపాదములందలి చివరి 6 అక్షరములు తొలగించిన మత్తకోకిల వచ్చును.

వసురమ్య నేత్రతత రూ
పసార నిధిరాజదాన పటురమ్యకృతీ
ససవితృబింబ వసతి సౌ
రసమాదక విజయభూతరాజ విదిత ధీ

ఇందలి కందము.

సీసపాదముల మత్తకోకిలపోను మిగిలిన అరక్షరములు గ్రహించి, కందములో రెండుపాదములు వ్రాయబడినవి. సీసముక్రింది ఆటవెలది రెండుపాదములతో కందములో మిగిలిన రెండుపాదములు వ్రాయబడియున్నవి. కాని ఆటవెలది రెండవ పాదము చివరి అక్షరము మిగులును. కందములో "కృతీ" అని "తీ"కి దీర్ఘ మీయ బడినది. కందమొక పద్ధతిలో ఇట్లుసీస, ఆటవెలదులందు గూఢపరచ బడినది.

ఉదా: (2) చింతలపల్లి వీరరాఘవకవి-మధురవాణీ విలాసము. 2-8.

(3) కొడవలూరు రామచంద్రరాజకవి. మహాసేనోదయము. 2-79.

(4) నాదెళ్ళవారి. అ. ఉ. రామా. "మానవాశన" పద్యము.

(5) వీరి గురుభక్తిప్రభావము 6-150. ఇందు కీర్తనకూడ కలదు. సీస పాదమున మొదటి మూడుగుణములు కలిపి 'ర, సల, భ'లు కీర్తన అర్ధపాద మగును. నాల్గుపాదములలోను కలిపి రెండుపాదములగును. ఆ కీర్తన ఇటులున్నది.

సామజాంతక సాంబసాదర
శ్రీమహేశ్వర సేవ్యశ్రీకర —కీర్తన 1వ పాదము.
కామసంహర కాలకర్కశ
శ్యామలోత్పల చంద్రశంకర —1 కీర్తన. 2వపాదము.

(6) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజనవినోదిని. పుట. 13. వ్రాతప్రతి.

(7) నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి. ఉత్తమజీవయాత్ర. 3వ ఆశ్వాసాంతము.

### 9. ఆటవెలది, కందము, గీతము, చంపకమాలలు.

ఉదా:- రా. ల. నా—వి. భా. రామా. 126.

సీస॥ అతికరుణాత్ముడా పతియనంతర సాన్విత ప్రస్ఫుటాంగతా తనుగుణకలి.
తతతబలాప్రభూ పతిత తారక సద్ధృతి ప్రాజ్ఞపీఠసంధి తరుచిర వి
తతవరదాయకా యతుల నవ్యరమాయుత ఖ్యాతియుక్త పాతకరహిత ల
లిత సుభగా విభాకృతి సుశేఖ సుధీవరశ్రేష్ఠ బంధురా రమ్యచరిత్ర

తే॥గీ నతవరద రవి శశినయన పరవరమ
పురుషభక్త తోషభరిత భావన భాస
హితసురముని జన వినుత హతది తిరుహ
త్రిగుణమయ లసన్మతి వితవి శుభదాత.

ఇందలి ఆటవెలది. సీసము క్రింది తేటగీతిలో కలదు.

నత ...............వరమ
పురుష....... ....భావ
హిత ...............తిరుహ
త్రిగుణ...............విశుభ.

ఇందలి కందము: కరుణాత్ముడా పతియనం
తర సాన్విత ప్రస్ఫుటాంగ తా తతతబలా
వరదాయకా యతులన
వ్యరమాయుత ఖ్యాతియుక్త పాలితసుభగా

ఈ కందము సీసములో ఒక క్రొత్తపద్ధతిలో కూర్చబడినది.

ఇందలిగీతము: సీసప్రతిపాదమునుండి మొదటి 7 అక్షరములు, చివరి 6 అక్షరములు తొలగింపగా తేటగీతి ఏర్పడును. అది:

పతియనంతర సాన్విత ప్రస్ఫుటాంగ
పతిత తారకసద్భృతి ప్రాజ్ఞవీర
యతులనవ్య రమాయుత ఖ్యాతియుక్త
కృతి సులేఖ సుధీవర శ్రేష్ఠబంధు.

ఇందలి చంపకమాల.

అతి కరుణాత్ముడా పతి యనంతర సాన్విత ప్రస్ఫుటాంగతా
తతత బలాప్రభూ పతిత తారక సద్భృతి ప్రాజ్ఞ వీరసం
తత వరదాయకా యతులనవ్యరమాయుత ఖ్యాతియుక్తపా
లిత సుభగా విభాకృతి సులేఖ సుధీవర శ్రేష్ఠబంధురా.

సీసపాదముల చివరి ఆ అక్షరములు తొలగింప చంపక మాల ఏర్పడినది. సీసపాద "న,ల,ర,నగ,సల,త,ర" అను 6 ఇంద్రగణములు చంపకమాలలో "న,జ,భ,జ,జ,జ,ర" అనుగణములైనవి.

ఏ పద్యమున కాపద్య లక్షణానుసారము యతులు కూర్చబడినవి కంద చంపకమాలలకు ప్రాసకూర్చబడినది.

## 9. A. కందద్వయ చంపకమాలా గీతి గర్భసీసము.

ఉదా:- ముక్తినూతలపాటి సీతారామయ్య-వేణుగోపాలశతకం.

ఆసీసపాదము.

"పురహర సన్నుతా పరమపుణ్యరమా పతి పంకజేక్షణ దితిజహరణ"

ఇందలి రెండు కందములు: పై సీసపాదమున రెండు కంద పాదములున్నవి.

హరసన్నుతా పరమపు
ణ్యరమా పతిపంకజేక్షణ దితిజ హరణా

ఇట్లు నాల్గు సీసపాదములకు కలిపి రెండు కందపద్యములగును,

ఇందలి చంపకమాల.

పురహర.... .... .... జేక్షణా

ఇట్లు నాలుగు సీసపాదముల కలిపి చంపకమాల పూర్తి అగును.

ఇందలి తేటగీతి.

పరమ పుణ్య రమావతి పంకజేక్ష.

ఇట్లు సీసనాల్గు పాదముల కలిపి తేటగీతి ఏర్పడును.

9. B. ఉత్పలమాల గర్భసీసము

ఉదా:- రా ల.నా.గారి. ని.భా.రామా.పద్యం. 53.

సీసము :

పాయకమించగా స్వపురి వారుకడున్ రుచిస్ఫూర్తి యుక్తుడై శ్రీదలంచె
న్యాయపథాన మిన్న జననాయకుడుం గృతిస్తుత్యుడర్థభూతి కలితారి
ధీయుతరాజుగా ధృతి యుధిష్ఠిరు సన్మతి శ్రేష్ఠ రామునిన్ ధీరగుణుని
జేయగ దుష్టులన్ సిలుగు జెందిరి దుస్థితి క్షోభ గూడుచున్ దిట్టయయిరు

ఇందలి ప్రతిపాదము మొదటి 20 అక్షరములు కలిసి ఉత్పలమాల అగును.

సీసపాదములోని 'భ,ర,నగ,సల,త,ర' అను వరుస 6 ఇంద్రగణములు- ఉత్పలమాల పాదములోని 'భ,ర,న,భ,భ,ర,వ' అనువరుస గణములగును. ఇంక సీసపాదమున సూర్యగణములు రెండు మిగులును.

9. C. కందద్వయ గీతి ఉత్పలమాల గర్భసీసము.

ఉదా :- ముక్తి నూతలపాటి సీతారామమ్య-వేణు గోపాల శతకము.మచ్చుకు వారి సీసపాదమ.

"శ్రీపతి వేదగా రిపుల జీరతలిర్ప పుత్రీక్షమిత్ర రాజ్యత్రిపదవ"

ఇందలి రెండు కందములు :

పతివేదగారిపుల జీ
రతలిర్ప పుత్రీక్ష మిత్రరాజ్యత్రిపదా.

ఇట్లు సీసము నాల్గుపాదములకు రెండు కందములు వచ్చును.

ఇందలి తేటగీతి.

"రిపుల జీరత లిర్పపుత్రీక్షమిత్ర"

ఇట్లు సీసము నాల్గు పాదముల కలపి తేటగీతి ఏర్పడును.

ఇందలి ఉత్పలమాల. సీసమున ఉత్పలమాల లోగడ గర్భనించితిమి

## 9. D. శార్దూలము

ఉదా:- రా.ల.నా. గారి. ని.భా. రామా పద్యం. 54.

సీ.॥ ఇలఖ్యాతిస్ఫూర్తి యుత్తైణి లోచనలనత్ క్ష్మా పాత్మజుల్ గొప్పగా గొనిప్రియ
ముగ నీతిశ్రేయపు బుద్ధినేడు గలయన్ ధీనొక్కాకండున్ ధృతిన్ సుకృతము
లెదప్రీతిన్ ప్రజ్వలితేచ్ఛ సల్పిరి జనుల్ ప్రేమం గనంగా లలిం గనుకను
దద్భూతిశ్రేష్ఠత దాటిహెచ్చు సమయంబుల్ పొందుచున్ మోదమున్ మ
నముల.

ఇందలి శార్దూలము.

ఖ్యాతి .... .... .... గొప్పగా
నీతి .... .... .... ధృతిన్
ప్రీతిన్ .... .... .... లలిం
భూతి .... .... .... మోదమున్.

సీసపాదము "నల (త), భ,ర,నగ,త,త;" మొదటి సూర్యగణము "హ" లో గురువు. గ్రహించిన-శార్దూలము గణములు సరిపోవును. యతిప్రాసలు పాటింపవలసి యుండును.

## 10. సహస్రాధిక పద్యగర్భసీసము

ఉదా: . నాదెళ్ళవారి అ.ఉ.రామా. 7-211.

సీసము :

కరిహరగరహరి గరుడగ మిత్ర నీ కరుణను వేడెద వెఱపు వీర్పు
హరిశరహరిహరి హరివరనేత్ర నీచరితను బాడెదఁ బరగదీర్పు
దరహర ధరధారి తరళసుగాత్ర నీ మఱుగున దూడెద గొఱత నార్పు
హరిహర హరిధారి హరినుతి పాత్ర నీ గరిమను పాడెద వరముజేర్పు

తేటగీతి :

ధీర సోదార ధీధితి దివ్యమూర్తి, వీరమౌనీంద్ర సేవిత వేదవర్తి
తారలొప్పారునంతకు దండికీర్తి, నీరహిస్రగ్గ్రంథమీ నిలనిష్టపూర్తి .
(హరి=విష్ణువు, యముడు, సూర్యచంద్రాగ్నులు, సింహ, పాము, ఇంద్రుడు].

ఇందలి సీసములు : మొదటి పాదమునుండి మరి 7 పద్యముల పాదములుఈ క్రింది విధముగతయారగును.

1. కరిహర గరహారి గరుడగమిత్రుడ కరుణను వేడెద వెలపుదీర్పు
2. గరహారి కరిహర గరుడగమిత్రుడ కరుణను వేడెద వెలపుదీర్పు
3. గరుడగమిత్రుడ కరిహరగరహారి కరుణను వేడెద వెలపుదీర్పు
4. గరుడగమిత్రుడ గరహారి కరిహర కరుణను వేడెద వెలపుదీర్పు
5. కరిహర గరహారి గరుడగమిత్రుడ వేడెద కరుణను వెలపుదీర్పు
6. కరిహర గరహారి గరుడగ మిత్రుడ వెలపును దీర్పుము వేడగ కరుణ
7. కరిహర గరహారి గరుడగమిత్రుడ వెలపునుదీర్పుము కరుణవేడ.

సీసపాదమొక్క దానికిట్లు 7 పాదములేర్పడినవి పై 7 పాదములు 7 సీసము లగును. ఒక్కొక్కదానికి 8 చొ॥న. 7×8=56 సీసపద్యము లొక్క సీసములో ఇమిడి యున్నవి.

ఇందలి సమచిత్రపదములు.

1. కరిహర గరహా
   హరికర హరిహా
   దరహర ధరధా
   హరిహర హరిధా

2. గరుడగమిత్రా
   హరివరనేత్రా
   తరళసుగాత్రా
   హరినుతిపాత్రా

3. కరుణను వేడెద
   చరితను బాడెద
   ఎఱుగున గూడెద
   గరిమను పాడెద

4. వెలపుం దీర్పుము
   వరగం దీర్పుము
   గొలతన్నార్పుము
   వరముం జేర్పుము.

ఈ నాల్గింటికి 16 పాదములు. వీనిని పైకి క్రిందికి మార్చి వ్రాయుటచేతను, పాదములోని రెండు పదములను కుడి ఎడమల మార్చి వ్రాయుట చేతను 100పై చిలుకు ఏర్పడును.

ఇందలి ద్విపదలు :

కరిహర గరహారి గరుడగమిత్ర
హరికర హరిహర హరివరనేత్ర

ఇటువంటివి సీసమున 4 తేటగీతిన 2 మొత్తమూరుగలవు. అవి పైకి క్రిందికి మార్పుచేయుటవలన ద్విపదలు 100పైచిలుకు అగును. ఇవి చౌపదులుగాను స్త్రీలపాటలుగాను చదువదగును.

ఇందలి రగడలు : హయప్రచారము.

1. కరిహరుండ గరళ హారి
హారిశరుండ హరిజహారి.

2. దరహరుండ ధరజధారి
హరిహరుండ హరిజధారి.

3. కరుణవేడ వెఱపు దీర్పు
చరిత బాడ బరగదీర్పు

4. మరుగు గూడ గొఱత నార్పు
గరిమవాడ వరము జేర్పు.

ఇవి ఒక్కొక్కటి 10వంతున 4×10=40 అగును.

ఇందలి తురగవల్గనరగడలు :

1. కరిహరా గరుడగ మిత్ర. కరుణ వేడ వెఱపు దీర్పు
హరిశరా హరివర నేత్ర. చరిత బాడ బరగదీర్పు

2. దరహరా తరళసుగాత్ర. మరుగు గూడ గొఱతనార్పు
హరిహరా హరినుతి పాత్ర. గరిమవాడ వరముజేర్పు.

ఒక్కొక్కటి 80 చొ॥న. 2×80=160 అగును.

ఇందలి విజయమంగళములు.

రెండు తురగవల్గన రగడలొక విజయమంగళమగును. అది 16 విజయమంగళము లగును.

ఇందలి ద్విరదగతి రగడలు :

1. కరిహరా గరహారి కరుణ వెఱపును దీర్పు
హరిశరా హరిహారి చరిత బరగను దీర్పు

2. దరహరా ధరధారి. మరుగు కొఱతను దీర్పు
హరిహరా హరిధారి గరిమవరమును జేర్పు– [ఇవిరెండును 160 అగును.]

ఇందలి విజయభద్రములు : రెండు ద్విరదగతి రగడ లొక విజయభద్రమగును. అది 16 అగును.

మధురగతి గడలు :

1. కరిహర గరహా. గరుడగమిత్రా. హరి శర హరిహా. హరివరనేత్రా
2. కరుణను వేడెద వెఱపునుదీర్పుము. చరితను బాడెద. బరగునుదీర్పుము.
3. గరుడగమిత్రా. కరుణనువేడెద. హరివరనేత్రా చరితను బాడెద.
4. కరుణనువేడెద గరిహరగరహా చరితను బాడెద హరిశరహరిహా.

సీసపద్య పూర్వార్ధమున పై నాలుగు వచ్చినవి. ఉత్తరార్ధమున ఇంకొక నాలుగు మొత్తమెనిమిది. ఈ ఎనిమిది పదముల విఱుపుచే 960 రగడ లగును.

హరిగతి రగడలు :

1. కరిహరగరహా గరుడగమిత్రా కరుణను వేడెద వెఱపును దీర్పుము.
హరిశరహరిహా హరివరనేత్రా చరితను బాడెద బరగును దీర్పుము.

ఇది సీసపద్య పూర్వార్ధము. ఉత్తరార్ధమున. మరొకటి ఇవి రెండగును. మొత్తము 160 అగును.

ఇందలి హరిణగతి రగడలు :

1. గరుడగమిత్ర వెఱపును దీర్పు. హరివరనేత్ర. వరగనుదీర్పు
2. వేడెద గరుణ. వెఱపుదీర్పు. పాడెదచరిత. పరగను దీర్పు
3. కరిహరగరహా. గరుడగమిత్ర. హరిశరహరిహా. హరివరనేత్ర
4. కరుణను వేడెద. వెఱపునుదీర్పు.చరితనుబాడ. బరగను దీర్పు

ఇవికూడ 960 అగును.

ఇందలి వృషభగతిరగడలు. మొత్తము 240 దాకా అగును.

1. గరుడగమిత్ర వెఱపునుదీర్పు హరివరనేత్ర వరగను దీర్పు
తరళసుగాత్ర కొఱతను నార్పు. హరినుతిపాత్ర.వరమును జేర్పు.

ఇందలి తేట గీతులు :

1. కరుణవేడెద గరిహర వెఱపు దీర్పు
చరిత బాడెద హరిశర పరగ దీర్పు
మరుగు గూడెద దరహర కొఱత నార్పు
గరిమ వాడెద హరిహర వరము జేర్పు.

ఈ పాదముల నట్టు నిటు మార్చి ఏర్పరిచినచో 8 తేటగీతులగును. ఇటు వంటివి సీసమున 6భేదములుకలవు. 6×8=48 మొత్తము తేటగీతులు సీసములో కలవన్నమాట.

ఇందలి ఆట వెలదులు

1. కరిహర గరహారి గరుడగమిత్రనీ
కరుణ వేడెదనుర వెఱపుదీర్పు
హరిశరహరి హరిహరివర నేత్రనీ
చరిత బాడెదనుర పరగదీర్పు

42)

2. దరహార ధరధారి తరళసుగాత్ర నీ
మఱుగు గూడెదనుర కౌఁఅత నార్పు
హరిహర హరిధారి హరినుతిపాత్రనీ
గరిమవాడెదనుర వరము జేర్పు

ఆటవెలదులతో ఇది ఒక జోడు. మూడు జోడులిటువంటివి కలవు. ఒక జోడుకు 80 తగ్గక 3×80=240 ఆటవెలదులేర్పడును.

ఇందలి కందములు :

1 కరిహర[1]గరుడగ మిత్రా వెఱపును దీర్పు[5]గరిహారి వేడెదగరుణన్
హరిశరహ[2]రివరనేత్రా వరగను దీర్పు [6]హరిహారి పాడెద జరితన్

2. దరహార తర[3]ళసుగాత్రా. కౌఁఅకను దీర్పు[7] ధరధారి కూడెద మరుగున్
హరిహర హరినుతి పాత్రా వరమును జేర్పు హరిధారి వాడెదగరిమన్.

చిన్నపాదములు నాల్గింటిని ఆశ్లే పెద్దపాదములు నాల్గింటిని క్రిందకు పైకి జేర్ప పైజోడు షద్యములకు 96 కందములు వచ్చును. ఒక్కొక్క చిన్నపాదమునకు 24చొ॥న4 చిన్నపాదములకు4×24=96 కందషద్యములు వచ్చును. ప్రతి చిన్న పాదముతో పద్యము మొదళ్ళుంమను. ఇటువంటి జోడులు 10. పదముల నటు నిటు మార్చి వ్రాయుటచేత ఏర్పడును. ఆ పదింటికి 10×96=960 కందములు తేలికగా ఏర్పడును.

మచ్చుకు రెండవజోడు.

1. కరిహర కరణను వేడెద. గరహారీ వెఱపు దీర్పు గరుడగమిత్రా
హరిశర హరితను బాడెద. హరిహారీ వరగదీర్పు హరివరనేత్రా

2. ధరహర మరుగున గూడెద. ధరధారీ కౌఁఅతనార్పు తరళసుగాత్రా
హరిహర గరిమను వాడెద హరిధారీ వరముజేర్పు హరినుతిపాత్రా.

ఇందలి చంపకమాలలు.

వెఱపును దీర్పు నీకరుణవేడెదనో గరహారి మిత్రుడా
వరగను దీర్పు నీ చరితఁ బాడెద నోహరిహారినేతృడా
కౌఁఅతను నార్పు నీ మరుగు గూడెద నో ధరధారి గాత్రుడా.
వరమును జేర్పు నీగరిమ వాడెద నోహరిధారి పాత్రుడా.
పాదములు పదముల మార్పుచేత మొత్తమివి 56 చంపకమాలలగును.

ఉదా:- 2) సీసము-నాదెళ్ళవారి. కృష్ణానదీ మహాత్మ్యం 4-151.

ఉదా:- 3) కాణాదపెద్దన. భద్రావరిణయము. 3-292.

ఇది ద్విపద, చౌపది, లాలీ, శోభాన మంగళహారతి, సువ్వాల, ధవళాది వివిధభేద సీసము.

ద్విపదులు. సీసమున 4 తేటగీతిన 2=6, చౌపదులు 3(అనగా 2 ద్విపదులు 1 చౌపది) లాలి-ద్విపదలో 1పాదము. (అనగా లాలి పాదములు 12). సువ్వీసువ్వాలలే 3. ధవళము 1. మంగళ హారతి చరణములు 6 అర్థచంద్రికలు 12 ఈ సీసమున గర్భితమయినవి.

4) రాప్తాటి ఓబిరెడ్డి-కవిజనవినోదిని. పుట. 12 [వ్రాతప్రతి] ద్విపద లాలీ శోభానాది వివిధ భేద సీసము.

5) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. ఉత్తమ జీవయాత్ర. 6వ. ఆశ్వాసాంతము అనేక పద్య సహస్ర గర్భిత సీసము.

## 6. రగడ

### 1) ఉత్సాహావృత్తము.

ఉదా:- తురగవల్గనరగడ:- విక్రాలవారి శ్రీ.వేం.చి.ర.కరము, ఉ.భా గర్భ. పుట. 38

దేవదేవ తత్వమెన్న దిక్కు-మాకు నీవెకాదె
కావుమయ్య కేలుమోడ్పుగాంచి మించి ప్రీతిచేసి
భావుకమ్ములిచ్చి మా ప్రవత్తి మెచ్చి లెస్సగాను
భావ జాయుతోపమాన భవ్యదివ్యశోభనాఙ్గ

ఇందలి ఉత్సాహము. ప్రతిపాదమున చివరి అక్షరము తొలగింప ఏర్పడును. సూర్యగణములేడు తదువరి గురువు ఉత్సాహవృత్త గణములకు సరిపోవును. యతి స్థానము దానికివి దీనికివి ఒకటే.

## 2. వృత్తములు.

### 1. మదనవిలసితము

రెండు మదన విలసితము లొకకందమగును. మూగురుడవపాదము చివరి వును రెండు లఘువులుగా మార్చుకొనవలెను.

ఉదా:- 1వ మదనవిలసితము

అరిదరధరు భూ
వరుహరి వరదున్
సరసిజ నయనున్
బరు, ద్రుహిణపితన్

2వది గరుడ గమను శం
కరనుత చరణున్
సురరిపు దమనున్
స్మరగురు దలతున్

[బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. గర్భ. 4]

ఈ రెండిటితో కందము.

ఆరిదర ధరుభూభూవరుహరి
వరదున్ సరసిజ నయనుని బరుద్రుహిణపితన్
గరుడగమను శంకరనుత
చరణున్ సురరిపు దమనుని స్మరగురు దలతున్.

2. భుజంగప్రయాతము

1. స్రగ్విణి.

ఉదా:- భుజంగప్రయాతమ్.

"నమోదాశకా వేణునాద ప్రవీణో
ద్యమా యాశుషేణా మహాయావనారీ
రమాధీశ దామోదరా దేవదేవో
త్తమా భేశమిత్రా క్షతార్క్షానుయాయీ."

[అప్పకవీయము. 4-6]

ఇందలి స్రగ్విణి. "దాశకా వేణునాద ప్రవీణోద్యమా
యా శుషేణామహా యావనారీరమా
ధీశ దామోదరా దేవ దేవోత్తమా
భేశ మిత్రాక్ష తార్క్షాను యాయీ నమో."

4వ అక్షరము స్రగ్విణికి ప్రాసాక్షరమగును. మొదటి రెండక్షరములు తొలగించి పరుసగా చదువుకొని చివరకు ఆవదలిన మొదటి రెండక్షరములను కలుపు కొనిన స్రగ్విణి వచ్చును. భుజంగప్రయాత 'య, య, య, య,' గణముల మొదటి 'లఘు గురువు' తీసిన 'ర,ర,ర,ర' అను గణములతో స్రగ్విణి ఏర్ప. డును. చివరి పాదమునకు ఆ వదలిన రెండక్షరములు కలుపుకొన వలెను.

ఉదా:— (2) పెద్దాడ నాగరాజు—శకుంతలా పరిణయం. 1—256.
(3) పోతరాజు లక్ష్మీనరసింహకవి—మాఘ పురాణం. 10—108.
(4) బుర్రా కమలాదేవి—ఛందోహంసి.
(5) రాప్తాటి ఓబిరెడ్డి—కవిజనవినోదిని. ప్రాతప్రతి—పుట. 16.

౭. స్రగ్విణి.

1) భుజంగ ప్రయాతము

స్రగ్విణి యందు భుజంగ ప్రయాతము గూఢమై యుండును. దీనికి చిత్ర కవి లక్షణ లక్ష్యములు చెప్పియున్నాడు.

లక్షణము: "రములు నాల్గింపద్యతిన్ స్రగ్విణియగు
దానికొన రెండు వర్ణములో పూనిమొదట
నిడభుజంగ ప్రయాతమైయెసగు చదువ
యతులు ప్రాసముల్ తద్వృత్త గతులనగుచు:
(అ. సా. సం. 3—133)

స్రగ్విణి పద్యము చివరి రెండక్షరములు ముందునిడి చదువుకొనిన భుజంగ ప్రయాతమగును. అంత్యప్రాస పాటింపవలెను.

అతని లక్ష్యము. అ. సా. సం. 3—1 4.

స్రగ్విణి: "పావనీ లక్ష్మణ ప్రాణదాతాసమా
గ్రావచారీ లసద్రామ భృత్యాసమ
స్తావనిస్తుత్య సత్య ప్రతిజ్ఞాక్రమా
భావివేధా పరబ్రహ్మ మూర్తే సమః"

ఇందలి భుజంగప్రయాతము:

సమః పావనీ........దాతా
సమాగ్రావ........ భృత్యా
సమస్తావ........ తిజ్ఞా
క్రమాభా........ మూర్తే

యతి ప్రాసములు వాని లక్షణముల బట్టి చూచుకొని రచింపవలెను

ఉదా:- (2) నందితిమ్మన-పారిజాతాపహరణము. 5-101.

(3) గ. వేం. కవి.-ప్ర రా. వేం. వి. వి. 847 పద్యము.

(4) కొక్కొండ వెంకటరత్నం.... బిల్వేశ్వరీయము. 4-149.

(5) త్యాగరాజమొదలి. సుబ్రహ్మణ్యవిజయము.

(6) అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి-శ్రీనందిరాజు లక్ష్మి నారాయణ దీక్షిత చరిత్రము. 2-196.

(7) తురిమెళ్ల రామన. శేషధర్మము. 4 వ ఆశ్వాసాంతము.

(8) బోడి వాసుదేవరావు-చిత్రమంజరి. గ్భర 9.

రెండవరకము. మొదటి అక్షరమొక్కటి తొలగించి పద్యాంతమునకు దానిని జేర్చి అప్పుడు మొదటినుండి వరుసగా చదువుకొనిన భుజంగప్రయాతము వచ్చును. ద్విప్రాస పాటింపవలెను. అంత్యప్రాస అవసరములేదు.

ఉదా:- స్రగ్విణి: శ్రీకపర్దీ! మునిశ్రేయ! కామావహా
ర్దీ! కృపావార్ధీ! నీరేజ హృచ్ఛేకరా
ఢ్యాకాపాల స్ఫురద్ధస్త గండేభదా
రీ! కపోలోజ్జ్వలశ్రీ! జగజ్జీవనా!''

[పుష్పగిరి తిమ్మన. సమీరకుమారవిజయము. 4-73]

ఇందలి భుజంగప్రయాతము.

"కపర్దీ మునిశ్రేయ కామావహార్దీ
కృపావార్ధీ నీరేజ హృచ్ఛేకరాఢ్యా
కాపాలస్ఫురద్ధస్త గండేభి దారీ
కపోలోజ్జ్వలశ్రీ జగజ్జీవనాశ్రీ''.

4. ప్రమితాక్షరము

1) చతుర్విధ కందము.

ప్రమితాక్షరమందు చతుర్విధ కందము గూఢ మొనరింపబడినది.

ఉదా:- అడిదము సూరకవి-కవిజనరంజనము. 3-113.

ప్రమితాక్షరము: "1 హరమౌని పుంగవ మనోజ్ఞరవీ
2 పరమేష్ఠి వంద్య పదపంకరుహా

3 కరిదానవాంతక జగద్భరణా
4 నరకాంబు వాహవవనా వరదా

ఇందలి మొదటి కందము "హరమౌని పుంగవమనో
జ్ఞరవీవరమేష్ఠి వంద్య పదపంకరుహా
కరిదాన వాంతక జగ
ద్భరణా నరకాంబు వాహవవనా వరదా.

ఇట్లు ఆయా అంకెలనుండి మొదలు పెట్టి చదువు కొనిన నాలుగు కందము లేర్పడుమందును అక్షరములు సరిపోవును. అక్షరములెటూ మిగలవు.

నియమము: ప్రమితాక్షర రెండు పాదగణములు స,జ,స,స,స, జ,స,స'అని కందము రెండు పాదములకు సరిపోవును. చతుర్విధ కందమేర్పడవలెనని మొదల చివర 'స'గణములలో మధ్యాక్షరము ప్రాసాక్షరము గాన అది ఒకటిగా ఉండునట్లు చూచుకొనవలెను. ప్రాసయతులు వాని లక్షణముల బట్టి చూచుకొనవలెను.

ఉదా:- 2) లక్ష్మీ నృసింహాచార్యులు-కుబ్జాకృష్ణ విలాసము 3-11
(ఇది చతుర్విధకంద గర్భప్రమితాక్షరము)

3) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి- గర్భ 8 ప్రమితాక్షరమున ఒక్క-కందమే గూడ పరువబడినది.

4) రాప్తాటి ఓబిరెడ్డి కవిజన వినోదిని ప్రాతప్రతి పుట 41.

## 5) ప్రహరణ కలితము.

కల్పిత కల్పవల్లి ప్రహరణ కలిత మనుపేర కవులు ప్రహరణ కలిత పద్యమునఁ పెక్కు- పద్యముల నిమిడ్చి చూపిరి.

ఉదా:- అప్పకవీయము 5-143

ప్రహరణ కలితము : "కరధృత కరుహాం,కరిహిత కరణం
కరుహన ఖరుచిం గరుడ ఖగరథం
ఖరఘన కరవిం ఖరతర కరగం
కరళముఖరిపుం గరిధర కరతం."

పై పద్యమెనిమిది సమాసములతో గూడిన దనియు, అందు 15 పద్యములు గూఢమై యున్నవనియు అప్పకవి చెప్పి యున్నాడు.

ఇందలి పద్యములు :

1. మదన విలసితము ఈ పద్యము లిందు రెండు గలవు

మొదటిది కరధృత కరుహూన్ గరిహిత కరణున్
గరుహా సఖరుచిన్ గరుడ ఖగరధున్

రెండవది ఖరఘన కరవిన్ ఖరత కరగున్
గరళము ఖరిపున్ గరధర కరతున్

2. ఆంధ్ర ప్రహరణ కలితము.

"కరధృత కరుహూన్ గరిహిత కరణున్
గరుహస ఖరుచిన్ గరుడ ఖగరధున్
కరఘన కరవిన్ ఖరతర కరగున్
గరళ ముఖరిపున్ గరధర కరతున్

3. అష్టమాత్రావృత్తము

ఈ పద్యము లిందు రెండు గలవు

మొదటిది : కరధృత కరుహూని గరిహిత కరణుని
గరుహాసఖరుచిని గరుడ ఖగరధుని

రెండవది : ఖరఘన కరవిని ఖరతర కరగుని
గరళ ముఖరిపుని గరధర కరతుని

4. మధుర గతిరగడ : (16 అక్షరాల పాదము)

పై అష్టమాత్రా వృత్తములు రెండును మధుర గతిరగడలో నాల్గు పాదము లగును.

5. హరిణగతి రగడ. (32 అక్షరముల పాదము)

పై మధురగతి రగడ నాల్గుపాదములను ఈ హరిణగతి రగడలో రెండు పాదము లగును.

6. ద్విపద : రెండు ద్విపదలు కలవు.

మొదటిది : కరధృత కరుహూని గరిహిత కరణు
గరుహా సఖరుజివి గరుడ ఖగరధు

రెండవది : ఖరఘన కరవిని ఖరతర కరగు
గరళ ముఖరిపుని గరధర కరతు

7నుంచి 14 వరకు 8 కందములు_ఈ ప్రహరణ కలితమందు అష్ట విధ కందము గూఢపరుపబడినది దాని నుండి 8 కందములు లభించుచున్నవి.

[1]కరధృత కరుహాన్[2] గరిహిత
కరణున్[3] గరుహా సఖరుచిని[4] గరుడ ఖగరధున్
[5]ఖరఘన కరవిన్ [6]ఖరతర
కరగున్[7] గరళ ముఖరిపుని [8]గరధర కరతున్

ఆయా అంకెలనుండి మొదలిడి చదువు కొనిన 8 కందములు వచ్చును.

15. మణి గణనికరము.

కరధృత కరుహాని గరిహిత కరణున్
గరుహా సఖరుచిని గరుడ ఖగరధున్
ఖరఘన కరవిని ఖరతర కరగున్
గరళముఖరి పుని గరధర కరతున్

దీని ననుసరించి,

ఉదా:-2) తూము రామదాసు-నిర్వచన మిత్ర వింవోద్వాహము 1-29.
3) కొడవలూరి రామచంద్రకవి-మహాసేనోదయము 4-170
4) విక్రాలవారి-శ్రీ. వేం.చి.ర. కరము పూ.భా. 26
5) వావిలికొలను సుబ్బారావు- శ్రీ కుమారాభ్యుదయము 1-405.

ఇందునూ వైదు పద్యములు గలవు.

6. మణి గణనికరము.

1. చతుర్విధ కందము.
ఉదా:- అప్పకవీయము 4-619.

మణిగణ నికరము : శరధృత జలజాని గరి పతి వరదున్
వరతను రుచిజిత వనదుని బరమున్
బరివృఢు కొలిచెద బరపద శరణున్
శరవణ భవనుత చరితుని గరుణన్

ఇందలి చతుర్విధ కందము :

[1]కరధృత జలజాని గరిపతి
వరదున్[2] వరతను రుచిజిత వనదుని బరమున్
[3]బరివృఢు కొలిచెద బరపద
శరణున్ [4]శరవణ భవనుత చరితుని గరుణన్

మణిగణ నికరమందలి అక్షరములు చతుర్విధ కందమునకు సరిపోయినవి. ఒక్క అక్షరము కూడ మిగలలేదు. మణిగణనికర రెండు పాదములందలి గణములు కందములోని "నల, నల, నల, స, నల, నల, నల, స," అను వరుస గణము లైనవి. యతి ప్రాసములు రెండు పద్యములకును చూచుకొని రచింపవలెను. చతుర్విధ కందమైన దాని ప్రాసములు, యతులు ప్రత్యేకముగా చూచుకొని రచియింపవలసి యుండును.

ఉదా:- 2) తూము రామదాసు. మిత్రవిందోద్వాహము 2-31.

3) విక్రాలవారి-శ్రీ వేం చి. ర. కరము. ఉ.భా. పుట 26.

4) తిరువేంగళా మాత్యుడు-నీలాచల విలాసము

2. కందము: ఒకే కందమును మణిగణ నికరములో గూఢ పరచుట.

ఉదా:- 1) బిజ్జుల తిమ్మభూపాలుడు. అనర్ఘ రాఘవము 2-414.

మణిగణనికరము : "భవహర శ్రితజన భవహర రవితా
రవర శిఖిన యన రజిత ధరణి భృ
ద్భవన భువన నుత పరిహృత సవనా
జవన తురగిత విశదవృష సగణా."

ఇందలి కందము :

భవహర శ్రితజన భవహర
రవితా రవరశిఖిన యన రజితధరణి భృ
ద్భవన భువన నుత పరిహృత
సవనా జవన తురగిత విశదవృష సగణా.

మణిగణ నికరమందలి 1,3 పాదముల చివరి 'స' గణములో మధ్యాక్షరము ప్రాసాక్షరముగా నిబంధించిన కందమునకు ప్రాస పాటించినట్లగును. అట్లే దాని 1, 3పాదముల 'స' గణములో ఆద్యక్షరమునకును 2,4 పాదములలోని 9వ అక్షరమునకును యతి చెల్లించునట్లు చూడవలెను. అట్లు చెల్లించిన ఆయతి కందమునకు పనికివచ్చును.

ఉదా:- 2) కందుకూరి వీరేశలింగం -రసిక జనమనోరంజనము 2-116.

3) నాదెళ్ళవారి-అ.ఉ.రామా, 'వరరవికులమున' పద్యము

---

• యస్వీ జోగారావుగారి యక్షగాన వాఙ్మయ చరిత్ర. పుట 28. •

4) నాదెళ్ళవారి - సోమేశ్వరీయము 'కరఘటిత కనక' పద్యము
5) అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి. శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రము 1-194
6) వీరి-శు.ఆం. ని.ని. దాశరధి చరిత్ర 2-105
7) అయ్యనకోటి పార్థసారధి శెట్టి-సత్యవిజయము 4-23
8) బోడి వాసుదేవరావుగారి. చిత్రమంజరి. గర్భ 3
9) శ్రీ పాద వేంకటాచలకవి. రామకృష్ణో పాఖ్యానము[1]
10) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. వ్రాతప్రతి. పుట 18.

## 7. చంద్ర శేఖర వృత్తము.

1. శ్రీ కరవృత్తము

ఉదా:- కొక్కొండ వేంకటరత్నం - బిల్వేశ్వరీయము 4-148.

చంద్రశేఖర వృత్తము. "శివజగదీశ మమ్ముబోవు చంద్రశేఖరా
శివనగదయ్య కావనేని నవ్వె శ్రీకరా
శివమగు నీకు మిత్ర భూత యక్షశేఖ
శివమగు మాకు బిల్వనాథ యాప్త శ్రీకరా."

ఇందలి శ్రీకరవృత్తము: ప్రతి పాదము నుండి మొదటి రెండక్షరక్షరములు తొలగించిన శ్రీకరవృత్తమేర్పడును. చంద్రశేఖర లోని నాల్గవ అక్షరము శ్రీకరమ నకు ప్రాసాక్షరము.

## 8. పంచచామరము.

పంచచామరములో ప్రమాణి వృత్తములు రెండు గూఢమై యుండును.

ఉదా:—(1) విక్రాల వారి. శ్రీ. వేం. చి.ర. కరము. III భాగము. 6,7పద్యములు.

పంచచామరము:

"పయోధి కన్యకా రమా భయార్తి భంజనక్ష మా
జయాభివృద్ధి నందనా స్వయోగ నంది తాశ్రితా
అయప్రసన్న ఫాలభా హయేశ పూర్ణ మన్దురా
రాజయత్వమాహరాయతా శమాన్వితాత్మ భాసురా".

---

[1] పూండ్ల రామకృష్ణయ్య. ప్ర.రా.వేం.ఖి.వి. సీతిక, పుట. 27.

మొదటి రెండు పాదము లొక ప్రమాణికా వృత్తము అది.

పయోధి కన్యకా రమా
భయార్తి భంజన క్షమా
జయాభివృద్ధి సంధనా
స్వయోగ నంది తాశ్రితా.

ఇట్లే పంచచామరము చివరి రెండు పాదములందు మరియొక ప్రమాణి వృత్తము గలదు. ప్రమాణి వృత్తములకు ప్రాస సరిపడునట్లుగా పంచచామరము రచింపబడినది.

ఉదా:—(2) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. శరము. పూభా. గర్భ. 6.

## 9. ప్రియకాంతా

### 1. కందము

ఉదా:- కొక్కొండ వేంకటరత్నం. బిల్వేశ్వరీయము. 2-213.

ప్రియకాంతా:

"తపమును జాలం జలిపితి తన్వీ తనువయ్యేన్
విపులను బిల్వారు పనిట వెన్వేంటను నడ్మున్
విపులముగా నీ కిపుడవు విన్వృత్తము పేరే
నపరిమిత శ్రీకృపగను మన్వా బ్రియకాంతా."

ఇందలి కందము: ప్రతి పాదము మొదటి 10 అక్షరములలోనే సరిపోవును.

తపమును జాలం జలిపితి
విపులను బిల్వారు వినిట విపులము గానీ
కిపుడవు నపరిమితిశ్రీ
కృపగను శ్రీకృపగను నపరిమిత శ్రీశ్రీ.

ఉదా:-(2). రాప్తాటి ఓబిరెడ్డి. కవి జన వినోదిని. వ్రాతప్రతి. పుట. 15.

### 2. తనుమధ్యా వృత్తము

ప్రియాకాంతా వృత్తము నందలి ప్రతి పాదము చివరి ఆ అక్షరములు గహించి వ్రాసిన తనుమధ్య వృత్తమగును.

ఉదా:- పైప్రియ కాంతాపద్యము.

అందలి తనుమధ్య.

"తన్వీ తనువయ్యెన్
వెన్వెంటను నడ్మన్
విన్వృత్తము పేరే
మ న్వొప్రియ కాంతా."

10. శార్దూలము

1) కందము.

ఉదా :- పుష్పగిరి తిమ్మన-సమీరకుమార విజయము. 3-210

శా॥ నీకే మ్రొక్కెదఁ బ్రోవు మున్నత కృపానిర్మాణదివ్యత్వకా
కా! కాకుత్స్థ కులాగ్ర గణ్య కరుణా కల్పా! యనల్పవు తా
ప్రా కారి ప్రముఖస్తుత ప్రతిభ! దుర్భావాక్ష శిక్షైక ద
క్షా! కోకాప్త రుచిప్రకార! గుణనిస్తారా! సమీరాత్మజా!....

ఇందలి కందము :

నీకే మ్రొక్కెద బ్రోవుము
కాకుత్స్థ కులాగ్ర గణ్య కరుణా కల్పా
ప్రాకారి ప్రముఖస్తుత
కోకాప్త రుచిప్రకార గుణనిస్తారా.

ఉదా:- 2) గుడారు వెంకటదాసు-ప్రకృష్ట బలరామచరిత్ర. 1-73

2. హంసగమన 3. కోకరుత 4. మేఘరంజనీ వృత్తములు.

ఉదా:- పురాణం పిచ్చయ్య. విజయాశ్వచరిత్రము. పూ. భా. 6-266.

శా॥ గోపాల ప్రముఖా దయాజలనిధీ గోవర్ధనోద్ధారకా
పాప ధ్వంసయజా జయానుజనుతా భావస్వరూపా! హరీ
యాపన్నా భయదా స్మయాది రహితా జ్యావల్లభా పావనా
చాపాబ్జారి ధరా పయోధి శయనా జైవాతృకార్కాంబకా.

2] ఇందలి హంస గమన

ప్రతిపాదము మొదటి 9 అక్షరములు. శార్దూలప్రాసయే హంసగమన ప్రాసకు సరిపోయినది. అది ఇట్లున్నది.

"గోపాల ప్రముఖా
పావ ధ్వంస యజా
యాషన్నా భయదా
బాపాబ్జారి ధరా."

### 3] కోకరువృత్తము

శార్దూలములో ప్రతిపాదము 7నుండి 12 అక్షరముల వరకు గూఢమై యుండును. కోకరువృత్తమునకు ప్రాస పాటింపబడినది.

ఉదా:- పై శార్దూల పద్యమందలి. 7 నుండి 12 వరకున్న అక్షరాలు.

"దయా జలవిధీ
జయాను జనుతా
స్మయాది రహితా
పయోధి శయనా"

### 4] మేఘరంజనీ వృత్తము

శార్దూల ప్రతిపాదము చివరి 7 అక్షరాలు గ్రహించి చదివిన మేఘరంజనీ వృత్తము వచ్చును. శార్దూల పద్యమందు మేఘరంజనికి ప్రాసము పాటింపవలసి ఉన్నది.

ఉదా:- పై శార్దూల పద్యమునుండి

"గోవర్ధనోద్ధారకా
భావస్వరూపా! హరీ!
జ్యావల్లభా పావనా
జైవాత్రుకార్కాంబకా."

### 5] అనుష్టుప్ శ్లోకము

ఉదా:- విక్రాలవారి-శ్రీ వేం.చి.ర.కరము. పూ.భా. గర్భ. 10.

శా॥ శ్రీరాజద్విధుపాల శ్రీస్తనభరాశ్లేషోల్ల సన్మానసా
స్వారాజాంజిత పద్మగా భిలసితా స్వామీ కృపాశేవధీ
శ్రీరాజీవ దళాక్ష శ్రీకరకృపా సింధూ నమో రక్షవా
ధారా జత్ప మితాద్య మేఘలలిత భ్రాజా భుజంగాద్రిపా.

ఇందలి ప్రతిపాదము మొదటి 8 అక్షరములు గ్రహించి చదివిన శ్లోకము వచ్చును.

"శ్రీరాజ ద్విధు పాలశ్రీ
స్వారా జాంచిత పద్యగా
శ్రీరాజీవ దళాక్షశ్రీ
రారా జత్వమితాద్యమే."

ఈ శార్దూలపద్యమున కందముకూడ కలదు. అది

రాజ ద్విధు పాలశ్రీ
రాజాంచిత పద్యగా భిలసితా స్వామీ
రాజీవ దళాక్షశ్రీ
రాజత్వమితాద్య మేఘలలిత భ్రాజా.

'ర, ల'లకు యతి పాటింపబడినది. శార్దూలములో 3వ అక్షరము కందమునకు ప్రాసాక్షరము—శార్దూల పద్యమున కందముండు విధము లోగడ గమనించితిమి. ఇది రెండవవిధముగ గూఢ పరుపబడినది.

## 11. ఉత్పలమాల

### 1] తేటగీతి

ఉదా:— అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము పుట. 103.

ఉ॥ పావనమైన యాదినమె భారతదేశము దివ్యమంద యాం
ధ్రావని పేరిటన్ దెనుగు రాష్ట్రము దాన మదించె కృష్ణరాట్
శైవలినీ తటుల్ పృధు యశస్థలి యయ్యెడగృధ్రవాడ మా
రావు నివాసమౌ నదియె ప్రౌఢ కవీంద్రుల కాకరంబగున్

ఇందలి తేటగీతి :

దినమె భారతదేశము దివ్యమంద
దెనుగు రాష్ట్రము దానమదించె కృష్ణ
పృధుయశస్థలి యయ్యెడ గృధ్రవాడ
నదియె ప్రౌఢ కవీంద్రుల కాకరంబ

ఉత్పలమాలలోని మొదటి ఆరక్షరములు, చివర అక్షరమొక్కటి ప్రతి పాదమునుండి తొలగింప తేటగీతి వచ్చును. ఉత్పలమాలలోని ప్రతిపాదము మొదటి

రెండు గణములు తొలగించి పిదప "న,భ,భ,ర, లగ"లలో నుండి చివరి గుర్వ క్షరము తొలగింప తేటగీతిలో "న, భ,భ,హ,హ" అను గణము లేర్పడును. యతి పాటింపవలెను.

## 2. కంద తేటగీతులు :

ఉదా:- నాదెళ్ళవారి-కృష్ణానదీ మహాత్మ్యము. 2-138.

ఉ॥ శ్రీనగజేశ నీ మగుట జేర్పగ, గోరి యమంద భక్తి బ
ల్ధ్యాన ములన్పదా నెఱవఁ దన్నియమంబున్గణింపవేల య
య్యానగు మోమొగిం గననె హాయిగ నుండగల్గు గాదె యీ
శాన శివాపతీ గిరీశ చక్కని ప్రీతి సుఖింప నిమ్మయా.

కందతేటగీతుల లక్షణములు చెడకుండ ఉత్పలమాలలో వానిని గూఢపఱచుట జరిగినది.

ఇందలి కందము.

"నగ జేశ నీమఱుగు జే
ర్పగ, గోరి యమంద భక్తి బల్ధ్యానములన్
నగు మోమొగింగ ననెహా
యిగ నుండ గ గల్గుగాదె యీ శాన శివా."

ప్రథమపాదము మొదటి అక్షరమును, రెండవపాదము చివరి 16 అక్షర ములు తొలగించిన కందము మొదటిరెండుపాదము లేర్పడును. ఇట్లే 3, 4 పాద పాదములనుండి కందము జిక్కిన రెండుపాదములు వచ్చును. అప్పుడు కందమున "స,జ,స,స,స, జ,గగ,స," అనుగణములు రెండుపాదములలో వరుసగా ఉండును.

తేటగీతిని లోగడ గమనించితిమి.

ఉదా:- 2 నాదెళ్ళవారి అ.ద రామా. 'భూపరిపాల' పద్యము.

3) పోతరాజు లక్ష్మీనృసింహకవి. మాఘపురాణము. 9-116.

4) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. శ్రీహనుమద్రామాయణము. అయోధ్య 329

5) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట 14

6) ముక్తి నూతలపాటి సీతారామయ్య. వేణుగోపాల శతకము.'వేణుగోపాల లారావళి'లో ఇటువంటివి 9 పద్యములు గలవు.

3 వాణీ 4. పద్మా 5. అంబా 6. రతి 7. దరధ్వని తాళ 8. మధుర గీతి రగడలు.

ఈ ఆరురకములైన పద్యములు గూఢ మొనరింపబడిన ఉత్పలమాల ఇటు లున్నది. అప్పకవీయము. 4-645.

ఉ॥ శారదశాసిత ప్రసవచాప వి ఖండన సామ సన్నుతా
తారణ దానపోష ధవతాపన మండన ధర్మతత్ప రా
వారణ బాసుర ప్రభవ ప్రావక ఖండన వాసవానుజా
పారద వాసుదేవ భవ పావని దండన భర్గపూజితా.

3. ఇందలివాణీ. ప్రతిపాదమున మొదటి 3 అక్షరములు తొలగింపగా ఏర్పడును.

4. పద్మ : ప్రతిపాదమున మొదటి 7 అక్షరములు తొలగింపవచ్చును.

5. అంబా : ప్రతిపాదమునుండి మొదటి 9 అక్షరములు తొలగింప ఏర్పడును

6. రతీ : ప్రతిపాదమునుండి మొదటి 12అక్షరములు తొలగింపగా వచ్చును

7. దరధ్వనితాళము :

"శాసిత ప్రసవ దానపోషధవ
భాసురప్రభవ వాసుదేవభవ"

8. మధురగతిరగడ : ప్రతిపాదమునుండి మొదటి 3 అక్షరములు, చివరి 5 అక్షరములు తొలగింపగా ఏర్పడును

ఉదా :- 2) సువర్చలాపరిణయము. 'రాజితరామమూర్తి' అనుపద్యము.

3) బ్రాకమలాదేవి. ఛందోహంసి. 'వాణీ, పద్మాం, భారతీ, పద్యము లుత్పలమాలలో పొందుపఱుపబడినవి.

9. సౌగంధి, 10 కుసుమమంజరి పద్యములు.

ఈ రెండు రకముల పద్యములు గూఢ మొనరింపబడిన ఉత్పలమాల పద్య మిట్లుండును.

ఉదా:- చిత్రకవి పెద్దన. ల.సా.సం. 3-122

ఉ॥ సైన్యపసౌరి మంత్రి ఘనసార నిభోజ్జ్వల కాంతి సుద్యశున్
జన్యర సారమాద్య ఘనుస్వామిహితాధిక కార్యదక్షునిన్
ధన్యుసదారి తాక్ష ధని దాశరథి ప్రియదాన చంద్రునిన్
మాన్యుని మారదూరు హనుమంతునిగొల్తు నమంచిత స్థితిన్.

44)

11. ప్రమితాక్షరి 12. స్వాగతా 13. ద్రుత విలంబిత వృత్తము లుత్పల మాలలో గూఢమైయుండును.

ఉదా:_ విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 7.

ఉ॥ శ్రీవర హృత్సరోభవ సమూద్భృతకామ భవప్రదాయకా
భూవరదాన విప్రణుత భూతికరాత్మక వందనార్చనా
భావిటవాదికా వరన భక్తుల పాలన పావనాహ్వయా
అవ్యృత విశ్వకారహిత కాత్మతులాగ జరాణ్ణుతాబ్జిఽకా.

అందలి ప్రమీతాక్షరీ : సంస్కృతము. ప్రతిపాదమున మొదటి అక్షరము, చివరి 7 అక్షరములు తొలగింప ఏర్పడును.

స్వాగత వృత్తము : సంస్కృతము. ప్రతిపాదము మొదటి 3 అక్షరములు చివరి 6 అక్షరములు తొలగింప ఏర్పడును.

ద్రుతవిలంబితము : సంస్కృతము. ప్రతిపాదము మొదటి 6 అక్షరములు చివరి 2 అక్షరాలు తొలగించిన ఏర్పడును.

తెలుగు తేటగీతి పద్యముకూడ ఇందుకలదు.

"భవసమాద్భృత కామభవప్రదాయ"

ఇట్లే నాల్గుపాదములును, దీనిని లోగడ గమనించితిమి తేటగీతి పద్య లక్షణానుసారము యతి పాటింపబడినది.

౹ ౭. చంపకమాల

1) కందము

ఉదా:_ (1) నన్నెచోడుడు. కుమార సంభవము. 12_219.

చం॥ హరు మనమారఁ గొల్చెదరుదాతని గొల్చియు నాది బోడ దా
బొరియునె భూరిభోగ పురభూతి విభుత్వముఁ బొంది పేర్మితోన్
బరజన దారుణోగ్ర శరపాత నియుక్త పదంబునందు దా
బొరయడు వారకొల్చి వీరిభూత గణేశ్వరుఁ బొందు నాత్మలోన్

ప్రథమపాదమున మొదటి రెండక్షరములు. రెండవపాదమున చివరి 16 అక్షరములు తొలగింప కందము రెండుపాదము లేర్పడును. ఇట్లే చంపకమాల 3, 4 పాదములనుండి కందములో తక్కిన రెండు పాదములు ఏర్పడును. అప్పుడు కందమందలి రెండు పాదములకు వరుసగా గణములు 'స, జ, స, స, వ, జ, భ, స.'

చంపకషట్పదులలో 1, 3 పాదములలో 12వ అక్షరమునకు, చివరి అక్షరము యతివి పాటించిన కందములో యతి పాటించినట్లగును.

పై చంపకమాల యందలి కందము.

"మనమార గొల్చుదరు దా
తని గొల్చయునాది బోదదా బోరియునె భూ
జన దారుణోగ్ర శరపా
తని యుక్త పదంబునందు దా బొరయడువా."

ఉదా:- (2) మచ్చ వెంకటకవి. శు ఆం. ని. ని. కుళ చరిత్ర. 2-1 0.

(3) అడ్డుమిల్లి నారాయణరావు-నారాయణీయము. పుట. 106.

(4) మాడభూషి వేంకటాచార్యులు-భరతాభ్యుదయము. 2వ ఆశ్వాసాంతము[1].

(5) దామెరల అంకన్న-ఉషాపరిణయం. పుట. 44. వ్రాతప్రతి.

2) తేటగీతి

ఉదా:- అడ్డుమిల్లి నారాయణరావు-నారాయణీయము. పుట. 105

చం॥ అరయుచు నేటికీ కవుల కాదరణంబెది గానరాద దు
ర్భర శకమయ్యెరాయనుచు రావు హృదబ్జమునందు నెంచి వ
ల్వారు నుతియింప వేయిడె నపూర్వనటందకు సృష్టి నేడు సం
బరమున గొల్వుడీ పరమపావన మియ్యది భారతాంధ్రిలో.

ప్రతిపాదము మొదటి 7 అక్షరములు, చివరి ఒక్క అక్షరము తొలగింప తేటగీతి వచ్చును.

ఉదా:- (2) రాప్తాటి ఓబిరెడ్డి-కపిజనవినోదిని. వ్రాతప్రతి. పుట. 16.

3) కంద, గీతములు

ఒక్క చంపకమాలలో ఈ రెండు పద్యములను గూర్చ మొనర్చుట జరిగినది. ఈ కందగీత గర్భ చంపకమాలలను చాలామంది కవులు వ్రాసిరి.

ఉదా:- (1) అప్పకవీయము. 1-32.

---

[1]. పూండ్ల రామకృష్ణయ్యగా ప్ర రా. వేం. వి. వి. పీఠిక పుట. ౨౮.

చం॥ నరహరి కేశవా వనజనా భరమా ధవవంశ హస్త బం
ధుర సుగుణాకరా దురితదూర జనార్దన దోర్బలాఢ్య గి
ర్వర గిరిశ స్తుతా మురహరా సురపూజిత ముఖ్యపాద సుం
దర పురుషాగ్రణీ భుజగతల్ప శచీపతి పుత్ర రక్షణా.

చంపకమాలలో కందమును లోగడ గమనించితిమి. ఇట్లే తేటగీతినికూడ లోగడ తెలిపితిమి.

ఇందలి కందము. "హరికే................జనా
భరమా.......................సుగుణా
గిరిశ.......................రహరా
సురపూ...................పురుషా."

ఇందలి తేటగీతి: "వనజ................హస్త
దురి................ర్బలాఢ్య
మురు............ ...పాద
భుజ................రక్ష."

కందగీతముల లక్షణానుసారము చంపకమాలలో ఆ రెండిటి నిముడ్చుట ఇందలి చిత్రము.

ఉదా:- (2) మచ్చ వెంకటకవి-కుశచరిత్ర. "ఇలసిరిరాయడా" అనుపద్యము

(3) తూము రామదాసు-మిత్రవిందోద్వాహము. 2-30.

(4) నాదెళ్ళవారి-ధార్మికోల్లాసిని. 331.

(5) వీరి. గురుభక్తిప్రభావము. 3-200.

(6) వీరి. అ. ఉ. రామా. "విను స్మరియించె" అనుపద్యము.

(7) వీరి. సోమేశ్వరీయము. "శివనన్నుబ్రోవరా" పద్యము.

(8) వారణాసి వేంకటేశ్వర్లు-రామచంద్రోపాఖ్యానము. 1-137.

(9) పోతరాజు లక్ష్మీనరసింహకవి-మాఘపురాణము. 10-110.

(10) కొడవలూరి రామచంద్రకవి-మహాసేనోదయము. 3-65.

(11) దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులు-మహేంద్ర విజయము. 2-108.

(12) అనుముల వెంకట సుబ్రహ్మణ్యకవి-భార్గవరామచరిత్రము. 9-180,

(13) ముత్య సుబ్బారాయుడు-విదుషి 3-101,

(14) తంయాల లక్ష్మీనృసింహాచార్యులు-కుబ్జా కృష్ణవిలాసము. 3-111.
(15) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి-శ్రీ హనుమద్రామాయణం బాల 283.
(16) కోటవీరాంజనేయశర్మ-చిత్రాశ్వీయము. 3-40.
(17) బోడివాసుదేవరావు-చిత్రమంజరి. గర్భ. 7.
(18) విక్రాల శ్రీదేవమ్మ-వాసవదత్తా పరిణయం. 3-227.
(19) పురాణం పిచ్చయ్య-మైరావణ చరిత్ర. [1]
(20) శ్రీపాదవేంకటాచలకవి-రామకృష్ణోపాఖ్యానము. [2]
(21) ముక్తినూతలపాటి సీతారామయ్య-వేణుగోపాలశతకము. ఇందలి వేంకటేశ్వర తారావళిలో. 8 పద్యము లిటువంటివి కలవు.
(22) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. ఉత్తమజీవయాత్ర. 1వ ఆశ్వాసాంతము.

4) కందద్వయము, తేటగీతి

ఉదా:- మిన్నికంటి గురునాథశర్మ. శ్రీ మద్గురు భాగవతము. ఏకాదశ స్కంధాంతము. 11-98.

తం॥ సురమునిపా మహాకలుష సూదన యాశ్రిత కామ్యదాన త
త్పర ఘనమానసాదనుజ భంజన లోలవ్రధా విశాల సం
గర పరమా ప్రభూవిగమ కాంద . రటృద నీరజాత న
వ్యరుచిర భాసురా శశి విభాకర నేత్రల సత్స్వరూపకా.

ఇందలి కందము మొదటిది. మునిపా మహాకలుష సూ
దన యాశ్రిత కామ్యదాన తత్పర ఘనమా.
ఘనమాన సాదనుజభం
జనలోలవ్రధా విశాల సంగర పరమా

కందము రెండవది. పరమా ప్రభూవి గమకాం
ద . రటృద నీరజాత నవ్యరుచిర భా

చిరభాసురా శశివిభా
కరనేత్రల సత్స్వరూపకా సురమునిపా.

---

1. యస్వీజోగారావుగారి యక్షగానచరిత్ర నుండి గైకొనబడినది
2. పూండ్ల రామకృష్ణయ్య-ప్ర.రా.వేం.భి.ఫి.పీఠిక.పుట 2

"ఘనమా" "వరమా" "చిరభా" "మునిపా" అనునవి ఆవృత్తి పదములై నవి. పై చంపకమాలలో 3వ పాదములో ఒక్క అక్షరము లోపించినది.

ఇందలి తేటగీతి. "కలుష..................దాన
దనుజ............శాల
నిగమ............జాత
శశివి...............రూప."

ఉదా:- (2) కాణాద పెద్దన-భద్రాపరిణయం 1-219. కందద్వయము.
(3) దాసాటి ఓబిరెడ్డి-కవిజనవినోదిని. వ్రాతప్రతి పుట. 17. కందద్వయము.
(4) నాదెళ్ళ దక్షిణామూర్తి-ఉత్తమజీవయాత్ర. 6వ ఆశ్వాసాంతము.
(5) భువనగిరి విజయరామయ్య-మల్లికార్జున సహస్రము. పద్యం. 141.

5. స్వాగతావృత్తము, కందము.

ఉదా :- గోపీనాథ వేంకటకవి. గోపీనాథ రామాయణం. అరణ్య. 1311.

చం॥ సురవర సూరిలోక నుత సుందరమూర్తి నమజ్జనావనా
వరవిభ వారణప్రియ వివారిత వైరి నమస్త భద్రమం
దిర ధరధీర విష్ణు . నతీ నిరవద్య సురక్ష్యమాణ్యోని
ర్జరకుల .... చోరమణి చంద్ర కులేంద్ర రమామనోహరా.

ఇందు 3,4 పాదములలో అక్షరములు పోయినవి.

చంపకమాల ప్రతిపాదము మొదటి నాల్గక్షరములు, చివర ఆరక్షరములు తొలగించగా స్వాగతా వృత్తము వచ్చును. దాని పాదముల చివరి అక్షరమునకు దీర్ఘ మీయవలెను.

ఇందలి స్వాగతావృత్తము : సూరిలోక సుత సుందరమూర్తి
వారణ ప్రియ వివారిత వైరీ
ధీర విష్ణు. నతీ నిరవద్యా
.... చోర మణి చంద్ర.కులేంద్రా."

ఇందలి కందము : లోగడ గర్భితమొనరించినట్లే.

"వరమూ........ తను.
దరమా........విభవా
ధర........నతీ
నిరవ........కుల."

6) ప్రమితాక్షరము, చతుర్విధ కందము:

ఉదా :- తూము రామదాసు. మిత్రవిందో ద్వాహము. 2. 32.

చం॥ పుర భువనేశ దోష జలముక్పవనా సుర పోషణాధృతా
చల నవనాధినాథ పవి సత్కృవ చామరవైరి భక్తవ
త్సల ధవళ ప్రభాముఖ పతజ్జవనా హత యాతుధానదో
ర్బల భవనా శమా హృదయ వాసవరా కరినాథ పాలకా

చంపకమాల ప్రతిపాదమున మొదటి రెండక్షరములు, చివరి 7 అక్షరములు తొలగింప 'స,జ,స,స' లతో ప్రమితా క్షర మేర్పడును-అది.

ప్రమితాక్షరము : "భువనేశ దోషజలము క్పవనా
నవనాధి నాథ పవిసత్కృవచా
ధవళ ప్రభాముఖ పతజ్జవనా
భవనా శమా హృదయ వాసవరా."

ఇందలి చతుర్విధ కందము. ప్రమితాక్షర వృత్త ప్రతి పాద ద్వ్యక్షరముతో మొదలిడి చదువ నాల్గుకందములు వచ్చును.

7) ద్రుత విలంబితము, కంద, గీత, స్వాగతా వృత్తములు.

ఉదా :- గోపీనాథ వేంకటకవి. గోపీనాథ రామాయణం కిష్కింధా పద్యం. 1408

చం॥ కరివర కామజా దనుజ ఘస్మర ధన్య కథా జితారిమా
వర విభవా మనా వినుత వాసవ విశ్వవ విక్రమార్య భూ
ధర హరిధామదా కనకదా స్థిర కార్య జగన్నుతాఖ్య శ్రీ
కర జనకాముకా ప్రణుత కార్ముక బాణ విపన్న పాలకా.

ఇందలి ద్రుతవిల బితము. చంపకమాల ప్రతి పాదము మొదటి7 అక్షరములు చివర రెండక్షరములు తొలగింప ద్రుతవిలంబితము వచ్చును. ద్రుతవిలంబితమునకు యతి ప్రాసములు పాటింపవలెను.

ద్రుతవిలంబితము :- "దనుజ ఘస్మర ధన్యకథా జితా
వినుత వాసవ విశ్వవ విక్రమా
కనక దా స్థిర కార్య జగన్నుతా
ప్రణుత కార్ముక బాణ విపన్నపా."

ఈ చంపకమాల యందు కంద, గీత, స్వాగతా వృత్తములు కలవు. వీనిని

లోగడ గమనించితిమి. గర్భితమైన నాల్గు పద్యములకు లక్షణముల చూచుకొనుచు పై చంపకమాల రచింపబడినది.

## 8) శ్లోకము.

ఉదా :- గ వేం కవి. ప్ర.రా.వేం. వి. వి. 822 పద్యము.

చం॥ నరసఖ నారశాయి నరనాథ నతామర నారదస్తుతా
ధరక్షర ధార దేహ ధరధారి ధరాధిప దారితా శరా
హరిబల హారి కంఠహర హారి హతాహిత హార హృద్ధి దా
స్థిత తర సీర పాణి శివ శీల జితా సుర సింధు బంధనా.

చంపకమాల ప్రతి పాదము మొదటి 3 అక్షరములు తొలగించినచో ఇందలి శ్లోకము వచ్చును. ఆ శ్లోక మిట్లుండును.

"నరనాథ నతామర నారదస్తుతా
ధరధారి ధరా ధిప దారితా శరా
హరహారి హతాహిత హర హృద్ధి దా
శివ శీల జితా సుర సింధు బంధనా"

## 9) అనుష్టుప్ శ్లోకములు రెండు; కంద తేటగీతలు.

ఉదా :- వి క్రాలవారి. శ్రీ.వేం.చి.ర. కరము. పూ. భా. గర్భ. 8.

చం॥ భవాం విభ వాంచితా తతతపః ప్రభృతి ప్రియ సన్మదాత్మభా
మహిత సుధామయూఖ ముఖమాతజ తాగత కౌశలాదిమా
మహిని భృతాంబుజా సనక మౌన్యఖి వంద్య నిజ ప్రయార్ణజా
సహన భయానదా సకృద వాతారయుక్త నిజప్రియాత్మ కా.

చంపకమాల ప్రతిపాదము మొదటి 3 అక్షరములు, చివరి రెండక్షరములు తొలగింప శ్లోకము లేర్పడును. పద్యము మొత్తము మీద రెండు శ్లోకము లేర్పడును.

1వ శ్లోకము, "భవాం.............సన్మదా.
సుధా.............శలా

2వ శ్లోకము. భృతాం.............ప్రియా
భయా.............ప్రియా

కంద, గీతములు లోగడ గమనించబడినవి గదా.

### 10. కందగీత గర్భ చంపకోత్పల మాలలు :

అచ్చము చంపకోత్పల మాలలతోనే నాదెళ్ళవారు మల్లికార్జున శతకమును వ్రాసిరి. మల్లికార్జునా మకుటము.[1] ప్రతి పద్యమున కంద గీతములు గూఢ పరచ బడినవి.

### 11. నాలుగు చంపక మాలల "కల్పిత కల్పవల్లి."

ఉదా :- చిత్రకవి పెద్దన. ల.సా.సం. 3-102-106.
నాలుగు చంపక మాలలలో ఎన్ని పద్యములెట్లు గూఢపరచదగునో
మొదట సీసమాలిక యందు లక్షణ మిచ్చి తర్వాత ఆ
నాలుగు చంపకమాలలు. లక్ష్యముగా చెప్పియున్నాడు చిత్రకవి.
ఆ లక్షణమిట్లున్నది

విడుగీట్లు షట్కంబు నెరవ్రాసి యడ్డ గీ
  తైయిదుగా నందంట నమర వ్రాయ
నిరువది యిండ్లగు నొరిది నైదై దిండ్లఁ
  బద్య మొక్కొక్కటి పరఁగ వ్రాయ
క్రమమిది కల్పిత కల్పవల్లికి నందు
  చంపకమాలికల్ జరుగు నాల్గు
నాది పద్యాంఘ్రుల నాదుల రెండేసి
  తుదల సప్తార్ణముల్ తొలఁగ జేయ
ప్రమితాక్షరీ వృత్తమమరు నార్యాగీతి
  కందంబు ద్వివిధమై యందమగుడ
రెండవ పద్యాది నుండెడి నలములు
  కడలరెండేసి యక్కటము లుడుగ
నగుమణి భూషణ మందాది రేఫవో
  ద్రుతవిలం బితవృత్త గతి యొసంగు
మూడవ పద్యంబు మొగి నాగ బంధమౌ
  నాల్గవ పద్యంబునను మొదళ్ళ

---

[1]. ప్రింటు. 1926. బందరు.

వర్ణముల్ రెండేసి వదలినఁ గవి కంఠ
భూషణ వృత్తంబు పొసఁగ నొప్పు
మొదలి పద్యంబులో మొదలంఘ్రి నార్లఘుల్
గలయించి యేనవ ఖండి కాంత
రగణముల్ పదియాఱు రహి మీరఁ జదివిన
దగ గణ సమకర్మ దండకంబు
పందాఱు లఘువులు పట మాని చదివిన
స్రగ్విణీ వృత్తంబు సంభవించు
షడ్జోడు నల సల మ్ములు ప్రాక్త్రి ఖండిక
ల ద్వ్యఖండికఁ గల గలమ్ము లందు
గల చతుష్కము క్రింది గలములు రెండును.
గలయంగ సీ సాంఘ్రి గతి ఘటించు
జరణాంతమైదు తచ్చరణాది నెన్మిది
వర్ణముల్ గూర్చిన పచ్చగీతి
నఘములు రెండును నలమొక్కటి యునొక
గలమును ద్విపదకు గుణములయ్యె.
ధవళంబు సువ్వాల తగిన యారతిపాట
ఖండికాత్రయమున గ్రమమునగు.
సైదుఖండికలను నాయాయి రగడ భే
దములు రేకులు పెక్కులమరు మఱియు
విడుద కందంబు మొదలి ఖండికనె యొదవు
నిట్టి చిత్రంబు లెన్నొని యుండె కలవు
చిత్రకవి చంద్ర నుతకాయ శిష్టగేయ
యాఱిసుతసేవ కవిధేయ యాఁజనేయ.

[అ.సా సం. 3-102]

లక్ష్యము. నాలుగు చంపకమాలలు:—

| | .1 ఖండిక | .2 ఖండిక | .3 ఖండిక | 4 ఖండిక | .5 ఖండిక |
|---|---|---|---|---|---|
| 1. | స్మరజయ | చారుధామ | జయచర్య | యజాకృతి | సాధుగాయకా |
| | హరిహయ | యాంజనేయ | యనఘాత్మయ | యతీడిత | యార్యకల్పకా |
| | హరిహయ | హారకీర్తి | యరుణాస్య | యభీష్టద | యాదికర్మతా |
| | స్వరుశయ | సారమూర్తి | శమశాలి | సమాదృత | సత్సుధీశకా. |
| 2. | సరసగ | శౌరిదాస | సమసఖ్య | యశస్కర | సౌఖ్యదాయకా |
| | హరనుత | హారిగేయ | సదృశాంగ | దయానిధి | యాజిభూహితా |
| | హరిబల | హరికాయ | సుగుణాఢ్య | మహామహా | యనఘదారణా |
| | పరబల | భారవిద్రవ | సమపాద | శుభక్రమ | భవ్యధీరతా |
| 3. | నరనుత | నామధారి | నదనాద | నమద్ఘన | నారపాయకా |
| | వరహరి | వారవీర | బలవాలి | వరక్రమ | వైరిభీమజా |
| | ధరశర | తారహార | ధరతార | శరస్వర | ధాతభారకా |
| | హరిహరి | యానసార | యసురాసు | భయంకర | హారిదారణా |
| 4, | గురుకుల | గోత్రధైర్య | గుణకూట | గురువ్రత | గోపవాయజా |
| | తరుతల | దండితాక్ష | తతధామ | తపఃఫల | దక్షనక్రహా |
| | పరబల | భానుజాప్త | పటుభాష | భయాసహా | భాగవర్ణికా |
| | కరకలి | కావిరాజి | కపికాంత | కనత్కవి | గణ్యప్రోవిమీ |

ఇందలి పద్యములు.

1. ప్రమితాక్షరీవృత్తము ; "జయచారుధామ జయచర్యయజా
హయ యాంజనేయ యనఘాత్మయతీ
హయహారకీర్తి యరుణాస్యయభీ
శయ సారమూర్తి శమశాలి సమా."

2. ఆర్యాగీతికందములు రెండు :
మొదటిది : "జయ చారుధామ జయ చ
ర్యయ జాకృతి సాధుగాయకా హరిహయయాం
హయ యాంజనేయ యనఘా
త్మ యతీడిత యార్యకల్పకా హరిహయఘా."

రెండవది: మొదటి చంపకమాల చివరి రెండు పాదములనుండి ఏర్పడును.

3. మణిభూషణము : రెండవ చంపకమాల ప్రతిపాదము మొదటి నాల్గు, చివరిరెండ. క్షరములు తొలగింప మణిభూషణము వచ్చును.

4. ద్రుతవిలంబితము: పై మణిభూషణము నుండి మొదటి రగణము తొలగింప ద్రుతవిలంబితము వచ్చును.

5. నాగబంధము. 3వ చంపకమాలలో కలదు.

6. కవికంఠభూషణము : నాల్గవ చంపకమాల ప్రతిపాదము మొదటి రెండక్షరములు తొలగింప నేర్పడును

7. గణసమకర్మ దండకము : "స్మర జయజయ గాయకా కల్పకా కర్మతాధీశకా దాయకా భూహితా ధారణా ధీరతా పాయకా భీమజా భారకా ధారణా వాయుజానక్రహావర్ణికా ప్రోవుమీ."

8. స్రగ్విణి. పై దండకమున మొదటి 6 అక్షరములు తొలగింప స్రగ్విణి వచ్చును.

"గాయకా కల్పకా కర్మతా ధీశకా
దాయకా భూహితా ధారణా ధీరతా
పాయకా భీమజా భారకా ధారణా
వాయుజా నక్రహా వర్ణికా ప్రోవుమీ."

9. సీసము : స్మర జయహరిహయ హరిహయ శ్వరశయ
జయచర్య యనఘాత్మ చారుధామ
సరసగ హరనుత హరిబల వరభట
సమసఖ్య సద్భుజాంగ శౌరిదాస
నరనుత వరహరి ధర శరహరిహరి
నరనాద బలవాల నామధారి
గురుకుల తరుబల పరబల కరకలి
గుణకూట తతదామ గోత్రధైర్య.

10. తేటగీతులు నాల్గు ; ప్రతి చంపకలమాల ప్రతిపాదము చివరి 5 అక్షరముల తర్వాత మొదటి 8 అక్షరముయి గ్రహించి వ్రాసిన తేటగీతులు వచ్చును. నాల్గు చంపకమాలలకు నాల్గు తేటగీతులు. మొదటి చంపకమాలలోని తేటగీతి యిట్లున్నది.

"సాధుగా యకా స్మర జయచారుధామ
యార్య కల్పకా హరిహయ యాంజనేయ
యాదికర్మతా హరిహయ హరకీర్తి
సత్ప్రధీశకా స్వరుశయ సారమూర్తి."

**11.** ద్విపద : స్మరజయ హరిహయ జయచర్య ధామ
హరిహయ స్వరుశయ యరుణాస్యకీర్తి.

**12.** ధవళము, సువ్వాలి, హారతి పాటలు : 3వ ఖండిక యందమరును.

**13.** రగడలు :

హయప్రచారము : "స్మర జయహరి సారమూర్తి
హరిహయహరి హరకీర్తి."

తురగవల్గనము :

"స్మరజయ హరిహయ హరిహయ
చారుధామ ఆంజనేయ
సరసగ హరనుత హరిబల
శౌరిదాస హరిగేయ".

విజయమంగళము : రెండు తురగ వల్గనరగడలతో విజయ మంగళ మేర్పడును.

ద్విరద గతిరగడ :

"జయచారుధామ జయచర్య హయహరకీర్తి
హ్మాయ యాంజనేయ యనఘాత్మ శయసారమూర్తి."

విజయభద్రరగడ :

"అరుణాస్య శమశాలి యనఘాత్మ జయచర్య
సమసఖ్య సుగుణాఢ్య సదృశాంగ సమపాద
ధరతార యసురాసు తతదామ గుణకూట
పటుభాష కపితాంత బలవాల నదనాద."

మధురగతిరగడ :

"హరనుత సరసగ హరిబల స్మరజయ
పరభట నరనుత వరహరి హరిహయ
హరిహరి ధరశర హరిహయ తరుతల
పరబల కిరకలి స్వరుశయ గురుకుశల."

హరిగతిరగడ : ఇందేగలదు.

వృషభగతిరగడ :

"స్మరజయ హరిహయ హరిహయ స్వరు శయసరసగ హరనుత హరిబల
పరభట నరనుత వరహరి షరబల ధరశర హరిహరి గురుకుల."

14. విడుదకందము : మొదటి అంటికయందు మాత్రము కలదు.

"కరకలి స్మరజయ హరిహయ
హరిహయ స్వరుశయ నరనగ హరనుత హరిబల్
షరభట నరనుత వరహరి
ధరశర హరిహ్హరి గురుకుల శరుతల వరబల్."

ఉదా :- 2) నాలుగు చంపకమాలలతో "కల్పిత కల్పవల్లి" గుడారు వెంకట దాసు-ప్రకృష్ట బలరామచరిత్ర [1-0-23]లో కలదు.

ఆ నాలుగు చంపకమాలలివి.

1. హరిహర హరిహస దరదార్ఢ్య రసాగత యాగనాగహా
దరదర తారకాత్త ధనధాన్య రతానఘ దానధీహరా
నరహరి హరచేన దరనాశ జనాశయ నాగనాయకా
దరదర తారవాట్య దశితారి గదాగ్రజ దాశదాశహా

2. హరజక దారికృష్ణ నరకారి దయాకర రాజునాగరా
రరజయ కారకార్య హరిరక్ష ఘనాఘన కాండధారకా
కరజగ దారిదాత హరికాంత ఖగీతిత రాజనందనా
నరజిత సారసేవ నరనాథ జనార్దన నందకాధరా.

3. శరచర సారరాజ జరజర్య జయాధిగ నాగనాగరా
ఖరఖర సారసాంక కలకల్య కళాధర తారహారకా
పరసర సారతాక్ష క్షణక్షణ క్షణాధిగ సాంగనాగజా
చిరచిర గిరయాచి చిదచిన్ని చితాంతర శీరధారకా

4. నరహిత నారకార నరనార నతాంగద నారనాగదా
హరశర తారహార హరహార హరక్రియ సారతార్క్ష్యకా
చిరతర నారసార హరచీర సరచ్ఛర చారనారకా
ఖరఖర దారధార గయగేయ జయంకర నారకార్థకా

ఈ పద్యములలో గూఢమైయున్న పలు పద్యములను వెలికిదీయుటకు లక్షణమొక సీసమాలికలో చెప్పబడినది. [1-24].

ప్రాగ్రేఖలాఱు తిర్యగ్రేఖలైదును
వ్రాయనిర్వది యిండ్లు వరుసనగును
పద్యమైదిండ్లకు పరగ నొక్కొక్కటి
ఘటియింప కల్పిత కల్పవల్లి.
యనెడి బంధక్రమం బందు చంపకమాలి
కా వృత్తముల్ నాల్గు కానుపించు
మొదటి పద్యము పాదముల ముందు రెండేసి
కడనేడు వర్ణముల్ విడిచిచూడు
ప్రమితాక్షరియు నార్య యమరికందము గీతి
ద్వివిధ కందము లౌనులోన
మొదలనలంబును తుదలగంబును ద్రోయ
నగుమణి భూషణం బందురగణ
మొదలించద్రుత విలంబితమౌను రెండవ
పద్యాది వర్ణముల్ వదలి మొదటి
పద్యాంతి మాక్షరం బాదిగా చదివిన
నుత్పలమాలిక యొదవుచుండు
మూడవ పద్యంబు మొగిపుష్పమాలిక
మొదలి రెండక్షరములను ద్రోయ
కవికంఠ భూషణాఖ్యనుగానుపించును
నాలవ పద్యంబు నాగబంధ
నాదిపద్యాంఘ్రిలో నార్లఘుల్ గదియించి
యైదవ ఖండిక నమరు రగణ
షోడశంబును గూర్చి ధాటిగా జదివిన
తగు గణసమకాఖ్య దండకంబు
పంచమ ఖండిక ప్రథమాక్షరము ద్రోయ
పంచచామర వృత్తి పరిఢవిల్లు

ఆ పంచ చామరం బాద్యక్షరము పీడ
జనియించు నచ్చట స్రగ్విణీయును
ప్రథమ తృతీయ పరగ ఖండికలందు
నలసలంబులు నారు కలయగూర్చి
రెండవ ఖండిక రెండు గళంబులు
....సీసాఖ్యజానబడును.
పాదాంతమైన తత్పూరాది నెన్మిది
నక్కరంబులు గూర్ప నమరు గీతి
ద్విసలముల్ నలమేకమును నొక్క గలమును
గదియింప ద్విపదగా గుదురుపడియె.
మొదటి ఖండికలోన మూడున లంబులు
మూడవ ఖండిక మొనయుసగణ
మమరు వరించిన మణిగణనికరంబు
ప్రథమ ద్వితీయల పరగు వినయ
మమరు రెంతవ ఖంఢియం దక్షరములన్ని
మూడవ ఖండిక మొదలివర్ణ
ములు గూడి మత్తకోకిలయయ్యె మూడవ
ఖండ సగణ చతుష్కంబు గూడి
తోటకవృత్తమౌతావిత్రి ఖండిక
యందు కవిరాజ విరాజితంబు *
నిచట ద్వితీయ ఖండిక పక్షములు గూడి
గానుపించును. లయగ్రాహి యొకటి
పద్యత్రయం బంత్య పాదత్రయంబున
మూడేసి అక్షరంబులను గూడి
ప్రథమ పద్యంబున పాదపాదాదిని
వర్ణద్వయంబున వదలి జదువ
శార్దూల మౌనందు జరిపియేకాక్షరం
బాది పద్యార్ధ ద్వయంబు గూర్ప

---

* ఇందు కొన్ని అక్షరములు పోయినవి.

మస్తేభమై యొప్పు మరియంబురుహరథో
ద్ధత వృత్తమును స్వఘాతంబు దృష్ట
హర్షణం బం....నందంద వచనకై
వారగద్య శ్లోక వైభవంబు.
ధవళంబు సువ్వాలి తగిన యారతిపాట
లంద్రయంబున కలిగియుండు.
పంచ ఖండికలందు పరగు తాళంబులు
రగడ భేదంబులు రాగ సమితి
కలిక యుత్కలిక మంజరీ కలిత
యాలలతి చిత్రముల నిండె యమరియుండు
అఖిల లోకేశ పాదన్రమాభ్రకేశ
విశ్వహిత సన్నివేశ శ్రీ వేంకటేశ.

ప్రకృష్ట బలరామ చరిత్రలో దైవప్రార్ధన మందే ఈ కల్పిత కల్పవల్లీ చిత్రము కలదు.

పెద్దన చెప్పిన 'కల్పిత కల్పవల్లి' నాలుగు చంపకమాలలలోలేని చిత్రములు కొన్ని యిందు గలవు.

వానిలో కొన్నిటిని మాదిరికి చూపుచున్నాను.

1. ఉత్పలమాలిక. మాదిరి. ఒక పాదము.
"హాటకదారి కృష్ణ నరకారిదయాకర రాజ నాగరా"
2. మూడవ పద్యమున పుష్పమాలికా బంధమున్నది.
3. పంచచామరము. మాదిరికొక పాదము.
"గనాగహాన ధీహరా గనాయకాశదాశహా"
4. మణి గణనికరము. మచ్చుకొకపాదము.
"దర దర నరహరి దరదర దరదా"
5. వినయము. "హరిహా
దరతా
హరిహా
దరతా."

6. మత్తకోకిల. ఒకపాదము.

"హారిహాసదతారకాత్త ధహార చేనద తారనా"

7. తోటకము. ఒక పాదము.

"దరదాధనధా దళితా దరనా"

8. శార్దూలము.

"హారాకాహరి హారి హాస దరదా హాయాగహా నాగహా."

9. మత్తేభము.

"హరిరాకాహరి హారి హాస దరదా హాయాగ హానాగహా".

10. రథోద్ధతము.

"హారిహాస దర యాగ నాగహా
తార కాత్త ధన దాన ధీహరా."

కవిరాజవిరాజితము, లయగ్రాహి, అంబురుహ మిత్యాది పద్యము లింక నిందు గలవు. పై లక్షణ సీసమాలికలో కొన్ని పాదముల అక్షరములు పోయినవి గణ దోషములైనవి. అవి తెలిసిన పిదప, పాఠభేదములున్న తెలిసిన పిదప మఱి యితర పద్యములను వెలికితీయ వీలుపడును.

## 18. స్రగ్ధరా.

స్రగ్ధర యందు పెక్కు పద్యము లిమడ్చవచ్చును.

ఉదా:-స్రగ్ధరా. విక్రాలవారి. శ్రీ వేం.చి.ర.కరము. ఓ.భా.గర్భ. పుట. 36.

"రాజాధారా మురారీ ప్రరమిత కమలా లక్షణాసక్త చిత్తా
రైధా రాదా మహాత్మా ప్రదసదరి దరభ్రాజిసత్యానురక్తా
క్రోధాస్పృష్టా రఘూర్ధా కురురుహణ శరా లూన సాలాళిశైలా
ప్రాంధాన్యధ్యా యదూర్ధా ప్రరచిత భువనా వాసుదేవా సమస్తే.

1. ఇందలి కన్యావృత్తము. ప్రతిపాదము మొదటి నాల్గక్షరములతో కన్యావృత్త మేర్పడును.

2. ఇందలి మదన విలసితము. ప్రతిపాదము మొదటి యేడక్షరములు, చివరి యేడక్షరములు తొలగించిన మదన విలసితము వచ్చును.

3\. శాలినీ. "రాజాధారా లక్షణా సక్త చిత్తా
రైధారాదా భ్రాజి సత్యాను రక్తా
క్రోధా మృష్టా లూన సాలాళి శైలా
ప్రాధాన్యాఢ్యా వాసుదేవా నమస్తే."

4\. మందాక్రాంతము. "రాజాధారా మమిత కమలా లక్షణా సక్త చిత్తా
రైధా రాధామ సదరిద రభ్రాజి సత్యాను రక్తా
క్రోధా మృష్టార రుహణ శరా లూన సాలాళి శైలా
ప్రాధా న్యాఢ్యాయ చిత భువనా వాసుదేవా నమస్తే."

## 14. మత్తాక్రీడ.

మత్తాక్రీడ యందు పెక్కు పద్యములను గూఢ పఱచదగును.

ఉదా:- మత్తాక్రీడ, నాదెళ్లవారి. అ. ఉ. రామా. 7-140.

శ్రీరమ్యంబౌ నమ్మా చేరన్ సిరి నను మనుపుము చిరమగు కరుణన్
ధీరత్వంబౌ సుమ్మా తీరన్ దిరుగని పదమిడు స్థిరమగు తరణన్
భారాఢ్యంబౌ లెమ్మా పారన్ పరమ ముద మొసగు పరువు వివరణన్
సారాత్తంబౌ నిమ్మా సౌరున్ జరగగ సరిపడు సరణి విహరణన్.

1\. ఇందలి సావిత్రీ వృత్తము.

మొదటిది. ప్రతి పాదము మొదటి 6 అక్షరములు.

"శ్రీరమ్యంబౌనమ్మా
ధీరత్వంబౌ సుమ్మా
భారాఢ్యంబౌ లెమ్మా
సారాత్తంబౌ నిమ్మా."

రెండవది. ప్రతి పాదము మొదటి నాల్గక్షరములు పైన 7,8 అక్షరములు కైకొనిన వచ్చును.

"శ్రీరమ్యంబౌ చేరన్
ధీరత్వంబౌ దీరన్
భారాఢ్యంబౌ బారన్
సారాత్తంబౌ సౌరున్".

మూడవది. "చేరన్ శ్రీరమ్యంబౌ" ఇట్లే మిగిలిన మూడు పంక్తులు.

నాల్గవది. "అమ్మా శ్రీరమ్యంబౌ" ఇట్లే మిగిలిన మూడు పంక్తులు.

2. విద్యున్మాల. "శ్రీరమ్యంబౌ చేరన్నమ్మా
ధీరత్వంబౌ తీరన్నమ్మా
భారాధ్యంబౌ పారన్లేమ్మా"
సారాత్త్యం బౌసౌరున్నిమ్మా"

3. మణి గణ నికరము.

మత్తాక్రీడ యందలి ప్రతి పాదము మొదటి 8 అక్షరములు తొలగించిన మణిగణనికరము వచ్చును.

4. భ్రమర విలసితము.

శ్రీరమ్యంబౌ చిరమగు కరుణన్
ధీరత్వంబౌ స్థిరమగు తరణన్
భారాధ్యంబౌ బరువు వివరణన్
సారాత్త్యంబౌ సరణి విహరణన్."

5. 12చందము. "సిరినను మనుపుము. శ్రీరమ్యంబౌ
దిరుగని పదమిడు. ధీరత్వంబౌ
బరమ ముద మొసగు. భారాధ్యంబౌ
జరగగ సరివడు. సారాత్త్యంబౌ."

6. 24ఛందము.

"సిరినను మనుపుము. చిరమగు కరుణన్. శ్రీరమ్యంబౌ. జేరనెయమ్మా.
తిరుగని పదమిడు. స్థిరమగు తరణన్. ధీరత్వంబౌ. దీరనెసుమ్మా.
వరమ ముద మొసగు పరువు వివరణన్ భారాధ్యంబౌ భారనె లెమ్మా
జరగగ సరిరడు సరణి విహరణన్ సారాత్త్యంబౌ సౌరునెయిమ్మా."

ఇక నిందలి రకములు.

రెండవ రకము.

"చిరమగు కరుణన్సిరి నను మనుపుము శ్రీరమ్యంబౌ జేరనెయమ్మా."

మూడవ రకము.

"సిరినను మనుపుము చిరమగు కరుణం జేరన్నమ్మా శ్రీ రమ్యంబౌ."

నాల్గవ రకము.

"చిరమగు కరుణన్సిరి ననుమనుపుము చేరన్నమ్మా. శ్రీ రమ్యంబౌ."

ఐదవ రకము.

"చిరమగు కరుణం జేరన్నమ్మా. సిరినను మనుపుము. శ్రీ రమ్యంబౌ."

ఆరవ రకము.

"సిరినను మనుపుము. శ్రీ రమ్యంబౌ. చిరమగు కరుణన్. జేరన్నమ్మా."

7. కందములు.

1. శ్రీరమ్యం బౌనమ్మా
చేరన్ సిరి ననుమనుపుము. చిరమగు కరుణన్
ధీరత్వంబౌనుమ్మా
తీరం దిరుగవి వదమిడు. స్థిరమగు తరణన్
ఇది మత్తా క్రీడ 1, 2 పాదములతో తయారైనది.

2) మత్తాక్రీడ 3,4 పాదములతో రెండవ కందము
"భారాధ్యంబౌ లెమ్మా
పారన్ పరమ ముదమొనగు వరువు వివరణన్.
సారా_త్తంబౌ నిమ్మా
సౌరున్ జరగగ నరివడు సరణి విహరణన్"

ఇట్లు పాదముల పైకి క్రిందికి మార్పిడితో ఇంక నేడు కందములు తయారగును.

8. రగడ (మధురగతి).

1) శ్రీరమ్యంబౌ సిరినను మనుపుము. ధీరత్వంబౌ దిరుగవి వదమిడు భారా ధ్యంబౌ బరము ముద మొనగు సారా_త్తంబౌ జరగగ నరివడు.

2) చిరమగు కరుణన్సిరినను మనుపుము స్థిరమగు తరుణన్దిరుగని వదమిడు, వరువు వివరణన్పరమ ముద మొనగు సరణి విహరణన్జరగగ నరివడు.

ఉదా:_2) నాదెళ్ళవారి అ.ఉ. రామా 'శ్రీరామా నీ యొద్దం జేరం' అను మత్తా క్రీడ పద్యము

3) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. శ్రీహను మద్రామాయణము. యుద్ధకాండ పద్యము 699.

4) వీరి 'ఉత్తమ జీవయాత్ర'లో. 5వ ఆశ్వాసాంతము

## 15. క్రౌంచపదము.

క్రౌంచపదము వంటు పెక్కు పద్యములు గూఢ పఱచ బడినవి.

1. రెండు కందములు

ఉదా:- 1) నంది తిమ్మన- పారిజాతాపహరణము 5-98

"అంకురిత శ్రీసంగ భుజాంకాహరి హయమణి మదహర తను వర్ణా
సంకట కృద్దైత్యాశయ శంకా జనన విజ చరితశయ ధృత శంఖా
పంకజ నాభా భంజిత పంకా పరమ పురుష భవపరిభవనామా
శంకర భావా కిసలయ సంకాశపదయుగ కలశ శరనిధిశయనా."

ఇందలి మొదటి కందము.

"అంకురితశ్రీ సంగభు
జాంకా హరిహయమణి మద హర తను వర్ణా
సంకట కద్దైత్యాశయ
శంకా జనన విజ చరిత శయధృత శంఖా."

రెండవ కందము 'క్రౌంచపదము' చివరి రెండు పాదములతో ఏర్పడును. క్రౌంచపదము 'భ, మ, స,భ,న,న,న,య' అనుగణములు కందము 1, 2 పాదముల గలిపి వరుసగా 'భ,కగ, భ, గగ. నల, నల, నల, గగ' అను గణములగును. కందమునకు యతిప్రాసములు పాటించుకొనవలెను. క్రౌంచపద ప్రాసాక్షరమే కందములకు ప్రాసాక్షరమగును.

ఉదా:- 2) చిత్రకవి పెద్దన ల.సా.సం. 3-130

3) అందుగుల వెంకయ్య-రామరాజీయము 342 పద్యము.

4) నాదెళ్ళవారి అ.కి. రామా 'పావనమూర్తి' అనుపద్యము.

5) బోడి వాసుదేవరావు - చిత్ర మంజరి. గర్భ 5.

2. రుగ్మవతీ 3. కమల విలసిత పద్యములు.

ఉదా:- బోడి వాసుదేవరావు. చిత్రమంజరి గర్భ. 11.

"సారస నేత్రా! శౌరి! కృపాబ్ధి! సరస హృదయ! హరి! విదమలతేజా!
దారిత దైత్యా! దాన సురాద్రీ? ధరణిధవ! భవనుతపద సరోజా
నీరద గాత్రా! నీరజనాభా! విరుపమ గుణగణ! నిగమ విహారా!
హరి ! మురారీ! హాటకచేలా! హరశర! శుభకర! యని వినుగొల్తున్."

ఇందలి రుగ్మవతీ. క్రౌంచపద ప్రతిపాదము మొదటి 10 అక్షరములు గ్రహించిన రుగ్మవతీ వచ్చును.

క్రౌంచపదము ప్రతి పాదము మొదటి 10 అక్షరములు తొలగించిన కమల విలసిత మేర్పడును.

3.A. కందద్వయ, రుగ్మవతీ, కమల విలసితములు మూడును గూఢమై యుండు క్రౌంచపదము.

ఉదా:-1) అప్పకవీయము. 2-433

ద్వారవతీనాథా సదుదారా తరుణ ధవళ కరధర నుత నామా
మారమణిధామా సుకుమారా మరుదధిపతి రిపుమదగిరి శంబా
సారస నేత్రా సత్య విచారా శరరుహ భవముఖ సకల సురేశా
శూరకులా తేజోజితమారా సురవరమణి నిభసురు చిరదేహా

రెండు కందములు, రుగ్మవతీ, కమల విలసితము పద్యములుపై క్రౌంచపద పద్యమున గూఢ పరుప బడినవి. అవి యెట్లిముడునో లోగడ గమనించితిమి.

ఉదా:- 2) కనుపర్తి అబ్బయ్య - కవిరాజమనో రంజ ము 4-177.

3) వీరరాఘవాచార్యులు. యథాశ్లోక తాత్పర్య భారతము. 7 ఆశ్వాసము పుట 363.

4) విక్రాల వారి శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా.1.

5) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజన వినోదిని. ప్రాతప్రతి. పుట. 15.

4. బహువృత్త కందరగడలు గల క్రౌంచపదము.

ఉదా:- నాదెళ్ళవారి అ. ఉ రామా. 7-141.

సారస గంధీ సంతతసారా సరసిజ రిపుముఖి సమరము నేర్తే
సారసగంధీ సంతతి సారా సరళ సదుడునఖి క్రమదమినోర్తే
ధారణకంధీ తంత్రిత ధారా తరుణ సుఘన శిఖి దమమును గూర్తే
కారణ సంధీ శాంతివికారా ఖరకరనిభనఖి క్రమణము నార్తే

ఇందలి వృత్తములు :

1. పఙ్క్తి- మొదటిది 'సారసగంధీ రెండవది 'సంతత సారా

| | |
|---|---|
| సారస గంధీ | సంతతి సారా |
| ధారణ కంధీ | తంత్రిత ధారా |
| కారణ సంధీ' | శాంతి వికారా' |

2. అష్టమాత్రా వృత్తము. "సరసి జరిపు ముఖి
సరళ సదుడు శిఖి
తరుణ సుఘన నఖి
ఖరకర నిభ సఖి."

3. శశివదన : "సమరము నేత్రే
శ్రమదమి నోత్రే
దమమును గూత్రే
క్రమణము నాత్రే"

4.వ సుమతి. "నేత్రే సమరమున్
నోత్రే శ్రమదమిన్
గూత్రే దమమునున్
నాత్రే క్రమణమున్".

5. రుగ్మవతీ. "సారసగంధీ సంతత సారా" ఇట్లు ప్రతిపాదమునుండి మొదటి 1(
అక్షరములు గ్రహించిన రుగ్మవతీ పూర్తి అగును.

రెండవ రుగ్మవతీ. "సంతత సారాసగంధీ" అని పదములు త్రిప్పుటచే ఏర్ప
డును.

6. 13 ఛందము. మొదటిది. "సరసిజ రిపుముఖి సంతత సారా
సరళ సదుడునఖి సంతతి సారా
తరణ సుఘనశిఖి తంత్రితధారా
ఖరకర నిభసఖి శాంతివికారా."

రెండవది. "సరసిజ రిపుముఖి సారసగంధీ"
ఈ రీతిలో పూర్తి అగును.

7. కమల విలసితము. క్రౌంచపదము ప్రతిపాదమునుంచి మొదటి 10 అక్షరములు
తొలగింపగా వచ్చును. ఈ పద్ధతి లోగడ గమనించితిమి.

8. 11 ఛందము. "సమరము నేత్రే సారసగంధీ
శ్రమదమి నోత్రే సారసగంధీ
దమమును గూత్రే ధారణకంధీ
క్రమణము నాత్రే కారణసంధీ."

దీనిలో రెండవ రకము—"సమరము నేత్రే సంతత సారా"
ఈ రీతిలో పూర్తి అగును.

9. క్రౌంచపదము.
"సంతత సారా సారసగంధీ సరసిజ రిపుముఖి సమరము నేత్రే"
ఈ రీతిలో మిగిలిన మూడు పాదములుండును.

10. 24 ఛందము. "భ,త,న,న,న,స,త,య." గణములు.
"సంతతసారా సరసిజ రిపుముఖి సమరము నేత్రే సారసగంధీ."
ఈరీతిలో తక్కిన మూడు పాదములుండును.

11. 24 ఛందము "భ,త,న,త,న,న,జ,య." గణములు.
"సంతత సారా సమరము నేత్రే సరసిజ రిపుముఖి సారసగంధీ."

12. 24 ఛందము. "భ,త,న,న,జ,య,న,య." గణములు.
"సంతత సారాసర సిజరిపుముఖి సారసగంధీ సమరము నేత్రే"
ఇందలి కందములు.
క్రౌంచపదములో రెండు కందములను లోగడ గమనించితిమి.

పాదములు క్రిందికి పైకి ఉంచి చదువుకొనిన ఒక్కొక్కపాదము మొదటి పాదముగ 3 కందముల చొ॥న 4 పాదములకు క్రౌంచపదములో మొత్తము 12 కందము లేర్పడును.

1. సారస గంధీ సంతత
సారాసరసిజ రిపుముఖి సమరము నేత్రే
సారస గంధీ సంతతి
సారా సరళ సదుడునఖి శ్రమదమినోత్రే.

2. సారస గంధీ సంతత
సారా సరసిజ రిపుముఖి సమరము నేత్రే
ధారణ కంధీ తంత్రిత
ధారా తరుణ సుఘన శిఖిదమ ఘను గూర్తే.

3. సారస గంధీ సంతత
సారా సరసిజ రిపుముఖి సమరము నేత్రే
కారణ సంధీ కాంతివి
కారా ఖరకర నిభసఖి క్రమణము నార్తే.

ఈ మాదిరి రెండవపాదము మొదటిపాదము 3 కందములు. మూడవపాదము మొదటి పాదముగ 3 కందములు, నాల్గవ పాదము మొదటి పాదముగ 3 కందము లేర్పడును. అప్పుడు మొత్తము 12 కందములు వచ్చును.

ఇందలి రగడలు:

2. సారస గంధీ సరసిజ రిపుముఖి
సారస గంధీ సరళ సదుడునఖి

2. ధారణ కంధీ తరుణ సుఘనశిఖి
కారణ సంధీ ఖరకర నిభసఖి

3. సంతత సారా. సరసిజ రిపుముఖి
సంతతిసారా. సరళ సదుడు సఖి

4. తంత్రితకారా. తరుణ సుఘన శిఖి
క్షాంతివి కారా. ఖరకర నిభసఖి

5. సమరము నేర్తే. సరసిజ రిపుముఖి
శ్రమదమి నోర్తే. సరళ సదుడునఖి

6. దమమును గూర్తే. తరుణ సుఘనశిఖి
క్రమణము నార్తే. ఖరకరనిభ సఖి

## 16. సరసిజము

ఉదా:- పుష్పగిరి తిమ్మన. సమీరకుమార విజయము. 4-71.

"ఏనా నిన్నున్ ధ్యాన మహీ నా ధృతిగొని కనుగొనవెద నహహామహా
మౌనీశానుల్ భానుసమానుల్ మదినిడ నెఱుగక మనికి తపడగా
నీనామంబే లోవిడి నేనంతటి మిఁగొలువఁగ నెనరున దనరన్
సానందోక్తుల్ మానక యోనచని మనుషగదగు దశదృశనయనా."

మొదటి రెండుపాదము లొకకందము. తర్వాత రెండు పాదములు వేరొక కందము. సరసిజము పాదమందలి 'మ,త,య,న,న,న,న,స' గణములు కందము 1,2 పాదముల గలిపి వరుసగా 'గగ,గగ,భ,గగ,నల,నల,స' గణములగును.

2. మణిగణనికరము. మరియు 2 కందములు.

ఉదా:- నాదెళ్ళవారి. అ ఉ. రామా.

"సూరేంద్వ గుణ్యశ ప్రియశూరా సురవరులు మునులు స్తుతులొనరుపగా
వీరక్రూరా పాయదవీరా విరివిగ వరములు వెలయగ విడెదే
ధీరమ్యా క్షోణీధరధీరా స్థిరతహృదయములు తెరపిగను రహిన్
గోరం బ్రార్థింతుం గయికోరా గుణుతున ననుదయగొని మనుపుమతీ."

సరసిజము ప్రతిపాదము మొదటి 9 అక్షరములు తొలగించి చదివిన మణిగణ నికరము వచ్చును. పై పద్యమున రెండు కందములు గూడ కలవు. వానిని లోగడ గమనించితిమి.

3.న వాక్షరవృత్తము. మరియు రెండు కందములు, మణిగణ నికరము

ఉదా :- 1) విన్నకోట పెద్దన. కా. చూ. 6-54.

"శ్రీ విశ్వేశజ్ఞ్మవరు సేవాశ్రితులు వొగడుదురు సిరివరగుటకై
ధీవిద్యా సంభావిత దేవున్ ధృతియుతు హితజనదివస ఓనకరున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్ జితరిపు శశికుల శిఖరిమృగపతిన్
భావోదంచిద్భావిత భావున్ బ్రతిదివసముదిత బహుంతరవిభవున్"

సరసిజము ప్రతిపాదము చివరి 15 అక్షరములు తొలగించిన నవాక్షరవృత్తమగును సరసిజకు 'ఉ, త, య' గణములు నవాక్షరమునకు సరిపోయినవి. 2 కందములు, మణిగణనికరము. లోగడ గమనించినట్లే పొందుపఱచబడినవి.

ఉదా:- (2) గ. వేం. కవి, ప్ర. రా. వేం. వి. వి. 818 పద్యము.

(3) నాదెళ్లవారి. అ. ఉ రామా. 5-193.

(4) కందత్రయము. మరియు మణిగణనికరము. నవాక్షరము.

ఉదా:- చిత్రకవి పెద్దన అ. సా. సం. 3-127.

"శ్రీకామాప్తున్ చారు శరీరున్ శ్రితజన ఫలదుని గృపగల యతవిన్
హారిస్థైయిర్యున్ వీరవిహారున్ హతదశగళబలు హనుమదధిపతిన్
సారాబాతున్ ధీరవిచారున్ శతధృతి గురుమతి శ్వసనుని సుతునిన్
సూరిస్తుత్యున్ దారుణశూరున్ శ్రుతిహితచరితు శుభగుణుగొలుతున్."

2 కందములను లోగడ గమనించితిమి గదా. ప్రతిపాదము మొదటి 9అక్షరములు తొలగించిన మూడవకందము వచ్చును. అనగా మణిగణ నికర పద్యమందు కందము గూఢమైయున్నది. మణిగణనికరము, నవాక్షరములు లోగడ గమనింప

బడినవి. కావున ఈ సరసిజమునందు మొత్తము మూడుకందములు, మణిగణ నికరము, నవాక్షరము 5పద్యములు గూఢ పరుపబడినవి. వాని యతి ప్రాసములు చూచుకొనుచు ఈ సరసిజము రచింపవలసి యుండును.

5. నీలోత్పలమాల. మరియు రెండుకందములు. మణి గణనికరము.

ఉదా:- అప్పకవీయము. 4-640.

"శ్రీవర్ధిష్ణుం బావన జీవన్నితభృగు తనయుని సిరిగలుగుటకై
భావింతు న్పంభావితభావుం బ్రతియుగ సముదిత బహుతనుమహితున్
దేవేంద్రాది ప్రస్తుతదేవున్నతి తనయతుహిన దినకర కిరణున్
ధీవిద్యోద్యోతు న్వసుదేవున్నతి మదగుణయుతు దృణితవిదురదున్."

ఇందలి నీలోత్పలమాల: "శ్రీ వర్ధిష్ణుంబావన జీవున్
భావింతు న్పంభావిత భావున్
దేవేంద్రాది ప్రస్తుతదేవున్
ధీ విద్యా ద్యోతున్వసుదేవున్"

కందములు, మణిగణనికరము లోగడ గమనించిన విధముననే గూఢ పరుప బడినవి.

ఉదా:- (2) రాప్తాటి ఓబిరెడ్డి. కవిజనవినోదిని. వ్రాతప్రతి. పుట. 18.

6. కందత్రయ, నీలోత్పలమాల,మణిగణనికరములు.

ఉదా:-విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 25.

7. బహువృత్త కందరగడలు గల సరసిజము.

ఇందు 50 పద్యములు గూఢమైయుండును.

ఉదా:- విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా. పుట. 39.

"తారాజారాస్యున్మహిదారున్ త్వరగను తలుగను తలచగు తలటున్
దారాగారద్వతును దారున్దరమును తలమను దలతును తరుణున్
తారాంభోదశ్రీ తనుధారిన్ ధరణిని, ధరగుని దరహని దరగున్
తారాప్రేయో వాలివిదారిన్ ధరకును ధరణుని తరళని తరిపున్."

ఇందలి పద్యములు.

1. కందద్వయము. లోగడ గమనింపబడినది.

2. నీలోత్పలమాల. లోగడ గమనింపబడినది,

3. మణిగణనికరములు. 16. మణిగణనికరమును లోగడ గమనించితిమి. ఒక్క మణిగణనికరములో 16 మణిగణనికరములు గలవు. ఎట్లన మణిగణనికర ములో నాల్గువదములు పాదమునకు చొ॥న. నాల్గుపాదములకు 16 పదములుగలవు. ఒక్కొక్కపదముతో మొదలిడిన 16 మణిగణనికరములు తప్పకవచ్చును.

4. కందములు 16. పై 16 మణిగణనికరములు 16 కందములుగా ఏర్పడును.

5. మదన విలసితములు రెండు.

(1) త్వరగను తఱుగవ్
తఱచగు తఱటున్
దరమున తఱుమన్
దలతును తరుణున్

(2) ధరణిని ధరగున్
దరహాని దరగున్
ధరకుని ధరణున్
తరళని తరిపున్.

6. మధుమతీవృత్తములు రెండు.

మొదటిది: "త్వరగనున్దఱుగన్
తఱచగుత్తఱటున్
దరము నున్తఱుమన్
దలతునున్తరుణున్."

ఇట్లే రెండవది:

7. ప్రహరణ కలితమ. "త్వరగను తఱుగన్ తఱచగు తఱటున్
దరమును తఱుమన్ దలితును తరుణున్
ధరణిని ధరగున్ దరహాని దరగున్
ధరకును ధరణున్ తరళని తరిపున్."

8 తోటకము. "త్వరగన్ తఱుగన్ తఱచౌ తఱటున్
దరమున్ దఱుమన్ దలతున్ తరుణున్
ధరణిం ధరకున్ దరహాం దరగున్
ధరకున్ ధరణున్ తరళన్ తరిపున్

9. వసుధావృత్తములు రెండు. పై తోటకము రెండు వసుధావృత్తములగును.

10. అష్టమాత్రావృత్తములు రెండు. మొదటిది.

"త్వరగను తఱుగను
తఱచగు తఱటును
దరమును తఱుమను
దలతును తరుణుని"

ఇట్లేరెండవది.

11. మధురగతిరగడ. మణిగణనికరపద్యము మధురగతిరగడ అగును.

12. ద్విపదలు. రెండు. మొదటిది "త్వరగను తలుగను తలచగు తలటు
దరమును తలుమను దలతును తరుణు."

రెండవది సరసిజము 3,4 పాదభాగములతో ఏర్పడును.

13. హరిణగతిరగడ. (ద్వాత్రింశదక్షరైకపాదము) మధురగతివలెనే.

14. వినయవృత్తములు. నాలుగు. మొదటిది. "త్వరగన్
తలుగన్
తలచో
తల టున్"

ఇట్లే తక్కినవగును.

ఉదా:- 2) నాదెళ్లవారి. అ. ఉ. రామా. 7-139.

## 17. భాస్కర విలసితము

రెండు కందములు.

ఉదా:- చిత్రకవి పెద్దన. ల. సా. సం. 3-129.

"అక్షయ మితిశమితోరుతరాక్ష యాశ్రితజనచయ హరిహయవృక్ష
పక్షితురగభట బాంధవ పక్ష భాస్కరవిలసితఫల రుచిభక్ష
దక్షిణ శరనిధి లంఘన దక్షదాశరథిచరణ తలభజనేక్ష
లక్షణ గుణమము క్రోవు జితాక్షలక్ష్మణ ధరణి భృదసువరిరక్ష."

భాస్కర విలసిత మొదటి రెండు పాదములొక కందము, తర్వాత రెండు పాదములు మరొక కందమగును. భాస్కర విలసిత పాదములోని 'భ, న, జ, య, భ, న, న, స, గ,' అను గణములు కందము రెండుపాదములకు కలిపి 'భ, నల, భ, గగ, భ, నల, నల, గగ,' అనుగణములగును. భాస్కరవిలసిత ప్రాసాక్షరమే కందములకు కూడ ప్రాసాక్షరము.

ఉదా:- 2) నంది ఘంటలజంట. వరాహపురాణం.9-156.
3) పుష్పగిరితిమ్మన—సమీరకుమార విజయము. 4-72.
4) గ. వేం. కవి.—ప్ర. రా. వేం. వి. వి. 825 పద్యము.
5) నాదెళ్లవారి. అ. ఉ. రామా. మరియు సోమేశ్వరీయము.
6) బోడి వాసుదేవరావు. చిత్రమంజరి. గర్భ. 2.

2. కల్పితకల్పవల్లి. భాస్కర విలసితము.

పెక్కుపద్యము లిందు గూఢమైయుండును.

ఉదా:- అప్పకవీయము. 4-605.

"అక్షరహరి వికచాంబురుహాక్షా యక్షపసఖనుత యదుకులదక్షా

రక్షక సురవిదుర ద్విపరక్షా రాక్షస విదళన ప్రథుచిరవక్షా

పక్షగపతి రథపౌండ్ర విపక్షా భక్షితదశిఖి బహూనపదీక్షా

వృక్షగ సహచర ఋక్షసదృక్షా ఋక్షపదుహితృప ఋషి జపక్షా"

ఇందలి పద్యములు.

1. రెండు కందములు. వీనిని లోగడ గమనించితిమి.

2. ద్విపదలు నాలుగు. మొదటిది.

"అక్షర హరివిక చాంబురుహాక్ష
యక్షప సఖనుత యదుకులదక్ష."

భాస్కర విలసితము మొదటి పాదమునుండి ఈ మొదటి ద్విపద ఏర్పడినది. ఇట్లు నాల్గు పాదములకు నాలుగు ద్విపద లేర్పడును.

3. లాలిపాట: పదము లెనిమిది.

మొదటిది. "అక్షర హరివికచాంబురుహాక్షా...."లాలి.

రెండవది."యక్షపసఖనుత యదుకులదక్షా"....లాలి.

4. పెండ్లి పాట. పదములు నాల్గు. [గౌరి కల్యాణ వైభవమే] పల్లవి.

"అక్షరహరివిక చాంబురుహాక్షా యక్షపసఖను తయదు కులదక్షా" .... "గౌరికల్యా"

5. ధవళము.

అక్షర హరివిక చాంబురు హాక్షా యక్షపసఖ
రక్షక సురవిదుర ద్విప రక్షారాక్షస విదళన
పక్షగ పతిరథపౌండ్ర విపక్షా భక్షితదవశిఖి
వక్షగ సహచర ఋక్ష సదృక్షా ఋక్ష పదుహితృప."

6. సువ్వాలే.

భాస్కర విలసితము రెండు పాదములతో ఒక సువ్వి సువ్వాలతే పదమేర్పడును. కావున ఇందు రెండు సువ్వాలేపదములు గలవు.

7. అర్ధచంద్రికలు. 8. "అక్షర హరివిక చాంబురు హాక్షన్
యక్షప సఖనుత యదుకులదక్షన్."

ఈ మాదిరి. ఎనిమిది. అర్ధ చంద్రికలేర్పడును.

ఉదా :- (2) తూము రామదాసు. మిత్రవిందోద్వాహము. 2.33.

ఉదా :- (3) నాదెళ్ళవారి. కృష్ణానదీ మహాత్మ్యం 3-138. బహుకంద వృత్తములు గల భాస్కర విలసితము.

"కోరెద గురువర కూరిమిగూర్పన్ గుందగ గొఱతలు గుఱుతునగూడన్
జేరెద జిరతర జేరువజేర్పన్ జెందగ సిరులను జిరమగ జిమ్మన్
తేరెద స్థిరముగ దీరికదీర్పన్ దెందము తిరమవు తెఱగును గొల్పన్
మారెద స్మరహర మాఱుతు మార్పన్ మందము మఱుగవు మరులను నిల్పన్."

1. ఇందలి కందములు. మామూలుగ రెండు కందములుండునని లోగడ గమనించితిమి. అంతేకాక ఒక్కొక్క పాదముతో మొదలుపెట్టి 3 కందముల చొ॥న. 4 పాదములకు 4×3=12 కందములు వచ్చును.

ఉదా :-

| | | | |
|---|---|---|---|
| 1) కోరెద<br>జేరెద | 4) జేరెద<br>తేరెద | 7) తేరెద<br>మారెద | 10) మారెద<br>కోరెద |
| 2) కోరెద<br>తేరెద | 5) జేరెద<br>మారెద | 8) తేరెద<br>కోరెద | 11) మారెద<br>జేరెద |
| 3) కోరెద<br>మారెద | 6) జేరెద<br>కోరెద | 9) తేరెద<br>జేరెద | 12) మారెద<br>తేరెద |

మరియు,

"గురువర కూరిమి గూరుప గొఱతలు గుందగ గుఱుతున గోరెదగూడన్"

ఈ విధముగ ఏర్పరచుకొనిన మరి 12 కందములు వచ్చును.

తర్వాత,

"కూరిమి గూరుప గురువర కోరెదగుందగ కొఱతలు గురుతునగూడన్."

ఈ విధముగ ఏర్పరచుకొనిన మరి 12 కందము లేర్పడును

"కూరుప గూరిమి గురువర కోరెద గుందగ గొఱతలు గుఱుతున గూడన్"

ఇట్లు 12 కందములు.

"కొఱతలు గుందగ గూరిమి గురువర కూరుప గుఱుతున గోరెద గూడన్"

ఇట్లు మరి 12 కందములు.

"గుఱుతున గూడం గోరెద గురువర కుందగ గొఱతలు కూరిమిగూర్పన్."

ఇట్లు కందములు. మొత్తము 6×12=72 కందములు భాస్కర విలసితములో గూఢపరుపబడినవి.

2. ద్విపదలు : లోగడ గమనించితిమి.
3. చంపకమాలలు రెండు : మొదటిది.
"గుఱుతున గూడనే కొఱత కుందగ గూరిమి గూర్పగోరెదన్."
ఈ విధముగ తక్కిన మూడు పాదము లేర్పరిచిన చంపకమాల అగును.
రెండవది :
"గురువర కోరెదం గొఱత కుందం కూరిమి గూరుతం గదే."
ఇట్లు తక్కిన మూడు పాదములు వ్రాసికొనిన రెండవ చంపకమాలవచ్చును.
4. ఉత్పలమాల :
"కోరెద గుందగా కొఱత గూరిమి గూర్పగదే గురూత్తమా."
ఇట్లు తక్కిన మూడు పాదములు వ్రాసినచో ఉత్పలమాల వచ్చును.
5. రగడలు.

"కోరెద గురువర కూరిమి గూర్పన్
చేరెద చిరతర చేరువ చేర్పన్."

ఇటువంటివి 4 పెట్లు భాస్కరవిలసితములో కలవు. పెట్టుకు నాలుగు చొ॥న. 16 రగడలు మొత్తము లభింపగలవు.
6. సీసము.

"గురుతున గూడంగ గొఱతలు కుందంగ
గురువర కోరెద గూర్మి గూర్ప."

ఇట్లు తక్కిన మూడుపాదములు కూర్చుకొనిన సీసపద్య మేర్పడును.
7. చిత్రపదములు. "కోరెద కూరిమి గూర్పన్
జేరెద జేరువ జేర్పన్
తీరెద దీరిక దీర్పన్
మారెద మాఱుతు మార్పన్".

ఇట్లు పదముల నటునిటు మార్చివ్రాసిన పెక్కు చిత్రపదములు వచ్చును.
ఉదా :- (4) నాదెళ్ళవారి. అ.ఉ.రామా. 6-212.
"సారస భవనుత సంగరవీరా సంతత గరధర విరహితయోగి
మారమణ ఘటిత మంగళహారా మంత్రక పురహర సురనుతత్యాగి
చారుమణిలసిత జంగమహారా శాంతిద స్మరహర హరిహితరాగి
భైరవనయి యుత భంగహభారా భ్రాంతిహ హరిశర పరిణత భోగి."

ఇందు 12 కందములున్నవి.

ఇందు "బహువృత్తములు గూఢమైన క్రౌంచపదము"లో వలె "శశి వదన, రుగ్మవతీ, పంక్తి" మున్నగు 28 రకముల పద్యములున్నవి.

ఉదా :- (5) నాదెళ్ళవారి. గురుభక్తి ప్రభావము. 2-160.

(6) వావిలికొలను సుబ్బారావు. కౌసల్యా పరిణయము 6-117.

(7) విక్రాలవారి. శ్రీ.వేం.చి.ర.కరము. ఉ.భా గర్భ. పుట. 33 ఈ పద్యములో రెండు కందములు, ద్విపదలు, లాలి, పెండ్లిపాటలు, ధవళము, సువ్వాలలు రెండు, 8 అర్ధచంద్రికలు కలవు.

## 18. లయగ్రాహి

ఉదా:- చిత్రకవి పెద్దన. ల.సా.సం. 3-119.

"ఘోరతరజన్యతల. వైరిభట సంహరుని, శౌరి
నుత సాహసుని. చాయనయధుర్యున్.
భూరిబలు ధన్యగుణు.నీరనిధి దాటినర. మారమణ
దానవరు. మారుతనూజున్.
వీరహరి సైన్యచయ. కైరవనిశాకరుని. హారఘన
సారదర. హారధర కీర్తిన్.
దీరజనమాన్యగిరి. తారమరమండలుని. భూరుహ
సుమంతువటు. సూరు వినుతింతున్."

ఇందలి షద్యములు :

1. వనమయూరము.

"శౌరినుత సాహసు విచారనయ ధుర్యున్
మారమణ దానవరు మారుతనూజున్
హార ఘన సార దర హార ధర కీర్తిన్
భూరుహనుమంతు నటు సూరుని నుతింతున్."

2. మంగళ మహాశ్రీ. పై లయగ్రాహి ప్రతిపాదమునుండి మొదటి నాల్గక్షరములు తొలగించిన "మంగళ మహాశ్రీ" ఏర్పడును.

"జన్యతలవైరి భట సంహరుని శౌరినుత సాహసు విచారనయధుర్యున్.
ధన్యగుణు నీరనిధి దాటినరమారమణ దానవరు మారుతనూజున్
సైన్యచయ కైరవ నిశాకరుని హార ఘన సార దరహార ధరకీర్తిన్
మాన్యగిరి తారమర మండలుని భూరహనుమంతువటుసూరుని నుతింతున్."

"మంగళ మహాశ్రీ"కి గణ యతిప్రాసములు సరిపోయినవి.

9. లయవిభాతి

ఉదా :- గ.వేం.కవి.ప్ర రా.వేం.వి.వి. 367 పద్యము

"నలిన నయన సదయ.జలధి.వరువాసఖల. దళ చణఘనా ఘన రు. చిలలిత శుభాంగా,
విలసిత గుణ విదిత. బల గరిమపాల లల. దలకవిభగోవ
జన. ఫలదస దపాంగా.
కలితనయ ధీనదర. జలజ భవపాల నల దవలవగ
నికాయమణి. వలహ్లాదనుషంగా
తులిత మహిమ చిదదయ లసనసదావిచల. దిలఘుతర
మానస స.కలనుత రథాం గా"

ఈ 'లయవిభాతి' యందు రెండు కందములు కలవు.

మొదటి రెండు పాదములలో మొదటి 6 అక్షరములు తొలగించిన మొదటి కంద మేర్పడును. అప్పుడు గణములు వరుసగా "నల, నల,భ,నల,స,నల,నల,గగ' కందము రెండు పాదములకు సరిపోవును.

మొదటి కందము.

"సదయ జలధి వరువాస ఖ
ల దళచణ ఘనాఘన రుచి లలిత శుభాంగా
విదితబల గరిమపాల ల
లదలకవిభ గోవజన ఫలదసద పాంగా "

ఇట్లు 'లయవిభాతి' చివరి రెండు పాదము లందు మొదటి ఆరక్షరములు తొలగింప రెండవ కందమేర్పడును. దానికిని ద్' కారప్రాసయే:

8] పద్యగూఢ చిత్ర కవితా కావ్యములు.

కేవలము పద్యగూఢ చిత్రముతో (గర్భకవితతో) కావ్యములు వ్రాసిన కవులున్నారు.

1. అచ్చము చతుర్విధ కందములతో నిర్మింపబడిన కావ్యములను లోగడ 'చతుర్విధ కందము' శీర్షిక క్రింద గమనించితిమి.

2 రావిపాటి లక్ష్మీనారాయణ-వారి. ని.భా.రామా.

ఇందు ప్రతిపద్యమున ఏదో ఒక పద్యము గూఢమై యుండును. అసలు పద్యము రామాయణార్థమును, గూఢపద్యము భారతార్థము నిచ్చుచుండును.

# పంచమ ప్రకరణము

# ఇతర చిత్రములు

"స్వరవ్యంజన........గూఢాని చిత్రమ్" అని కావ్యాను శాసన కర్త చెప్పిన దానిని బట్టి 'ఆది' పదములో ప్రశ్నోత్తరప్రహేళికాది చిత్రము లున్నవని గ్రహింప వలెను. ఇంతకుముందు పేర్కొనబడిన చిత్ర శీర్షికల క్రిందకు రాని చిత్రముల నన్నిటిని ఈ "ఇతర చిత్రములు" శీర్షిక క్రింద చేర్చుట జరిగినది. అవి

1. ప్రశ్నోత్తర చిత్రము.
2. ప్రహేళికలు-పొడుపు కథలు
3. నల్లెంట్లు
4. ఇచ్ఛావాక్య సంఘట్టనము
5. పలుభాషాపద్యములు
6. అర్థచిత్రము (అనేకార్థ కావ్యాలు)
7. అచ్చ తెలుగు
8. నిర్వచన కావ్యములు
9. చిత్రమిశ్రమము

## 1. ప్రశ్నోత్తర చిత్రము

ప్రశ్నయందే ఉత్తరము దాగియుండుట ఇందలి చిత్రము. ఉత్తరాలంకారమే ఇదియని చెప్పవచ్చు. దీనికి చిత్రోత్తరాలంకారమని కూడ పేరున్నది. ప్రశ్న, ఉత్తరము రెండును ఒకేచోట ఉండునని ఈ ప్రశ్నోత్తర చిత్రార్థము.

ఇది సంస్కృతములోను, పాశ్చాత్యభాషలలోను కలదు.

పాశ్చాత్యభాషలలో ఈ ప్రశ్నోత్తరమును 'Anagram' అందురు. దానిని సోదాహరణముగా జి.యన్. రెడ్డిగారు వివరించిరి. దానిని పేర్కొందును.[1]

---

[1]. తిరుపతి "సాహిత్య సమితి వ్యాసావళి" తెలుగు పాశ్చాత్య భాషలలో చిత్ర కవిత్వము-పొడుపు కథలు-వ్యాసము.

Anagram అర్థమిట్లున్నది. "a dissolution of a name into its letters as its elements; and a new connection into words is formed by their transposition, if possible, without addition, subtraction or change of the letters, and the words should make a sentence applicable to the person or thing named. The anagram is complementary or stirical."

దీనిని బట్టి ఒక పదములోని వర్ణాలే అటు ఇటు మాటి వేటే పదమేర్పడు నని తెలియును.

ఉదా:- Telegraph. దీనినుంచి great, help అని పదములేర్పడవచ్చును.

ఇట్లే గ్రీకు, లాటిన్ భాషలలో ఇటువంటి Anagrams కొన్ని ప్రచారానికి వచ్చినవి. Latin భాషలోని బైబిలు గ్రంథములో pilate-ఏసుక్రీస్తు నడిగిన ప్రశ్న రూపము, దానికి క్రీస్తు సమాధానము ప్రశ్నోత్తర చిత్రమున కుదాహరణముగా దీసికొన దగును.

Quid est veritas? (What is truth?)

దీనికి క్రీస్తు చెప్పిన సమాధానము

est vir qui adest (It is the man, who is before you).

ప్రశ్నరూప వాక్యములోని వర్ణాలే సమాధానపు వాక్యములో ఉండుట గమనింపదగిన చిత్రము.

ఇట్టివి, Hebrew, French మున్నగు భాషలలో కూడ ఉన్నవి. ఇంగ్లీషులోకూడ Live, vile, and evil అనునట్లున్నవని చూపిరి.

వారు చూపిన మతొక ఆంగ్లోదాహరణ మీక్రిందిది.

"How much there is in a word. 'monastery' says I
Why that makes nasty Rome and when I looked
At it again, it was evidently more nasty a very
vile place or mean stry. Ay. monster says I
............... I think one might make no mean,
story out of this one word-monstery."

సంస్కృతములో ఉదా:- (1)

"కాహమస్మి గుహావక్తి ప్రశ్నేముష్మిన్కిముత్తరమ్
కథముక్తం నజానాసి కథర్థయపి యత్నతే" [కా.శా. వ్యాఖ్య. V. 525]

'దరీ, గుహా, కందర, గహ్వర శబ్దములు పర్యాయము లగుట.
"గు, హా." నేనెవరు? అని అడుగగా 'నీవు దరివశి' ఉత్తరము.

ఉదా:— (2)

ప్రశ్నోత్తరాంతరా భిన్న
ముత్తరం చిత్ర ముత్తరం
కేదార పోషణ రతాః
కేఖేటాః? కించలం? వయః

ఇందు పూర్వార్ధములో లక్షణమున్నది. ఇందులో రెండు రకముల ప్రశ్నోత్తరములు కలవు. 1. ప్రశ్నయందే ఉత్తర మిమిడి యుండుట 2. రెండు ప్రశ్నల కొకే ఉత్తర ముండుట.

మొదటిది. కేదారపోషణ రతాః? అనగా భార్యా పోషణ యందు దానశక్తి గల వారెవరు? అనునది ప్రశ్న. కేదారపోషణ యందు దానశక్తిగల వారే దారపోషణ రతులని సమాధానము.

రెండవది. "కేఖేటాః"? అనగా ఆకాశము లో సంచరించేవియేవి? అని ఒక ప్రశ్న. కించలం? అనగా ఏది అస్థిరమైనది? అని రెండవ ప్రశ్న. ఈ రెండింటికి ఒకే పదము "వయః" సమాధానం ఎట్లు? "వయః" అనగా పక్షులు, వయస్సు అనెడి అర్థముల రెండు ప్రశ్నలకు సమాధానముగా భావింపబడినది

తెలుగున ఈ ప్రశ్నోత్తర చిత్రము అవధాన సమయమునను, ఎదుటి వాని ప్రతిభా పాండిత్యములను ప్రశ్నించుటకు, లేదా తన ప్రజ్ఞను ప్రదర్శించుటకు పనికి వచ్చుచున్నది

ఈ ప్రశ్నోత్తరము ను గూర్చి తెలుగులాక్షణికులు చిత్రకవిత్వమున చెప్ప పోయినను ఇది ఉత్తరాలంకారము, ఇందు చిత్ర తత్వమున్నది కనుక ఇది చిత్ర కవిత్వము క్రింద జేరును.

తెలుగున నాలుగు విధముల ఇది కనబడుచున్నది అవి:

1. ప్రశ్నలోనే సమాధానపు వర్ణము లిమిడి యుండుట.
2. పెక్కు ప్రశ్నల కుత్తర మొక్కటి యగుట.
3. సమాధానము చేత ప్రశ్న నూహించుట.
4. ప్రశ్నోత్తర పదములే సమాధానముగా నుండుట.

ఇది ఉత్తరాలాంకార మనియు, నాలుగు విధములని, అడ్డుమిల్లి నారాయణ రావుగారు తమ నారాయణీయమున ఇట్లు వివరించిరి.

"ఎదియ ప్రశ్నయో యుత్తర మదియ యైన
పెక్కు ప్రశ్నల కుత్తర మొక్కటైన
ఉత్తరము చేత ప్రశ్నయే యూహ్యమైన
ఉన్న ప్రశ్నోత్తరసమయే "యుత్తరమ్ము". [పుట 76].

మొదటి విధము:

ఇందు ప్రశ్నలోని పదములే సమాధానములోని పదము లగును.

ఉదా:— (1) ఎద్దీశున కశ్వంబగు? ఎద్ది ఈశున కశ్వమగును? అని ప్రశ్న. "ఎద్దు ఈశున కశ్వమగును". అని సమాధానము.

(2) ఆనంద నిలయ లోలుడు
మానుగ నెవ్వండు తలప మావిభుఁ డెవడీ
క్షోణిని ప్రశ్నమ్ముల
లోనే ప్రత్యుత్తరమ్ములన్ గనుడు బుధుల్.
[చిత్రకవారి. శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా. 23]

ఇందు రెండు ప్రశ్నోత్తరములు గలవు.

ఆనంద నిలయము=వేంకటేశ్వరుని గుడి, లోలుడు=అందు విహరించువాడెవడు? అనెడి ప్రశ్నకు ఆనంద నిలయము నందు అనగా నందుని యింట, లోలుడు=విహరించువాడే అని సమాధానము.

అట్లే, మా విభుడెవడు? అనగా మా ప్రభువెవడు? అనెడి ప్రశ్నకు మా=లక్ష్మీదేవికి, విభుడెవడు? =భర్త యైనవాడెవడో, అతడే అని సమాధానము.

(3) "కనగనైనది యా యందగత్తె సీత". కినగనైనదియా? అని ప్రశ్న.
[అబ్బరాజు హనుమంతరాయ శర్మ పాకయాజి. ఉ. అం. వి. ని. దాశరథి చరిత్ర 1–133.]

కనగనైనది. ఆ అందగత్తె సీత అని సమాధానము.

(4) "నాతి! దూరమ గుడివాడ? నావెలంది
నాతి దూరమ గుడివాడ నా వచించె.
[అడ్డుమిల్లి నారాయణరావు. నారాయణీయము. పద్యములో 2 పంక్తులు పుట. 76.]

నాతి?= ఓస్త్రీ! గుడివాడ దూరమా? అను ప్రశ్నకు నావెఅంది 'న+అతి దూరమ'= దూరము కాదు దగ్గరే గుడివాడ. అని సమాధాన మిడెను.

ఇందులో రెండవ రకము. ప్రశ్న వాక్యములో ఏదో ఒక పదము గాని లేదా కొన్ని అక్షరములు గాని సమాధానమగుట.

ఉదా:- 'చాటుపద్య రత్నావళి.' [1] పుట. 27.

సీ॥ తులలేని ధనము చేతుల దూగునది యేది?
గిరిజా మనోహరు గేహమేది?
విరివిగా తుమ్మెద విహరించు తావేది?
ఓడ కంబుధి దాటుచుండునేది?

పై సీసము రెండు పాదములలో నాలుగు ప్రశ్నలు కనబడుచున్నవి. మొదటి ప్రశ్నకు 'తులలేని' పదములోని 'తుల' సమాధానమగు చున్నది. రెండవ ప్రశ్నకు 'గిరిజా మనోహరు' లోని 'గిరి' మూడవ ప్రశ్నకు 'విరివిగా' లోని 'విరి' నాల్గవ దానికి 'ఓడక' లోని 'ఓడ' సమాధానములైనవి. ఇట్లు మిగిలిన సీస పాదము లందు "కల, శ్యామ, దివి, కరి, వల, పలుకు"అని పదములుండి సమాధానములైనవి.

ఇందలి మూడవరకము : 'A' Sectionలో ఉన్న విద్యార్థిని "నీవు ఏ సెక్షనులో ఉన్నావు?" ప్రశ్నకు, 'A' Sectionలోనే అనే సమాధానము. ఆంగ్లాంధ్ర పదోచ్చారణ సామ్యముచే ఇది సాధింపబడినది.

రెండవ విధము- ప్రశ్నోత్తర చిత్రము

పెక్కు ప్రశ్నల కొకే సమాధానము.

ఇందు మొదటి రకము.

"సూర్యభగవాను పట్టపు భార్య యెవతె?
నీతిలేని యుద్యోగి చింతించునెద్ది?
బాటనెదిగోరి వృక్షముల్ నాటుచుంద్రు?
దాని చాయ యటన్న ఉత్తరము గాదె"

పై మూడు ప్రశ్నలకు 'చాయ' అని ఒకే సమాధానము.

[అడ్డుమిల్లి నారాయణరావు.నారాయణీయము, పుట 76].

---

1. సంపాదకుడు. శ్రీరంగాచార్య. ప్రచురణ. ఆం. ప్ర. సా. అకా. హైదరాబాదు. 1978.

రెండవ రకము.

రెండు ప్రశ్నలకొకే సమాధానము. కాని అది గత ప్రత్యాగతముగ ఉండవలెను. అదికూడ ఐదక్షరములలోనే ఉండవలెను.

ఉదా:- పై 'చాటు పద్యరత్నావళి'-పుట. 26.

సీ॥ రాజుల కెటువంటి రత్నముల్ ప్రియమయ్యె?
కాయలే చెట్లవి కరులు మ్రింగు?

ఈ రెండు ప్రశ్నలకును సమాధానమొకటే. "వెలగలవె." ఎట్లు? రాజులకు ప్రియమైన రత్నములు వెలగలిగినవే. అనియు, ఏనుగులు వెలగ చెట్లకాయలు మ్రింగుననియు రెండుప్రశ్నలకును సమాధాన మర్థవంతమైనది. మరియు సమాధానం గత ప్రత్యాగతములో ఉన్నది. అనగా ముందునుండి వెనుకకు వెనుకనుండి ముందుకు చదివిన ఒకే రీతిగ ఉండుట. "వెలగలవె". ఈ పదమునందైదే అక్షరములు గలవు.

ఇట్లు మరిరెండు సీసపాదములను గమనింతుము.

"నెద్దాని నీశ్వరుండెచ్చోట ధరియించు?
జారుదేవంక నెవ్వానిగోరు?
—"నెలతలనె."

నెన్నెన్ని దినముల కేతెంచు పున్నమ?
జనయిత్రి పుష్పిణి సమయమేది?
—"నెలనెలనె."

ఇందలి మూడవరకము.

రెండు ప్రశ్నలకొకే సమాధానము. కాని సమాధానము రెండు భాషలలో సరిపోవలెను.

"రావణస్య కియద్వక్త్రం
నూపురం కుత్ర వర్తతే
ఆంధ్ర గీర్వాణ భాషాభ్యాం
ఏకమే వోత్తరం వద."

రావణుని తలలెన్ని? పది. నూపుర మెక్కడ ఉండును? పది. అనగా పాదమందు సమాధానము 'పది'అను పదము సంస్కృతాంధ్రముల సరిపోయినది.

49)

### మూడవ విధము. ప్రశ్నోత్తర చిత్రము

ఉత్తరముచేత ప్రశ్ననూహించుట.

ఉదా:- అడ్డుమిల్లి నారాయణరావు-నారాయణీయము పుట. 77.

తే॥ గీ॥ ఎఱుగరో రావు వైద్యాభివృద్ధి గుళ్ళ
వాడ? యెవాడఁ గనుగొన్న వారి రోగు
లే, యెవండు పల్కిన వాని వృత్తి వర్ధ
తియె, యెవడు విన్న వాని కీర్తిని గురించె.

రావుగారి వైద్యము గూర్చి పద్యములో వివరింపబడినది. దానినిబట్టి ప్రశ్న నూహింపవచ్చు. గుడివాడ రావు వైద్యాభివృద్ధి నెరుగరా? అను ప్రశ్న నూహింప వచ్చు. ఆ ప్రశ్న మొదటి పాదములోనే గూఢమై యున్నది.

### నాల్గవ విధము ప్రశ్నోత్తర చిత్రము

ఉన్న ప్రశ్నోత్తర సమితియే ఉత్తరమగు చిత్రము నాల్గవ విధమునకు చెందినది.

కొన్ని ప్రశ్నలకు సమాధానములు అవధాన సమస్యలో ఉండును ఆ సమాధానాలకు ప్రశ్నల రూపముతో ఆ సమస్య పూర్తి చేయబడును. ఆ విధముగ సమస్యలు పూర్తిచేయుట పరిపాటియైనది.

ఉదా:- 1)రాధేయుడు నందినెక్కి రావణు గెలిచెన్. ఇది సమస్య. పూరించిన విధాన మిట్లున్నది.

కం॥ యోధుడెవరు కురుబలమున? [రాధేయుడు]
మాధవ సఖుడేమియెక్కి మరి తిరుగాడున్ [నందినెక్కి]
సాధించె రాము డెవ్వని [రావణుని గెలిచె]
రాధేయుడు నందినెక్కి రావణుగెలిచెన్.

మొదటి మూడు పాదాల మూడు ప్రశ్నలకుగల సమాధాన పదములతో నాల్గవ పాదము పూరింపబడినది. మరియొక విధముగ చెప్పవలెనన్న నాల్గవ పాదములో ఇచ్చిన సమాధాన పదాలకు ప్రశ్నరూపములో మొదటి మూడు పాదాలలో చెప్పుట జరిగినది.

ఉదా:- 2) "అలరు గణింప పంక్తిరథు నాత్మజులెవ్వరు? మైథిలుండు నే
లలనకు తండ్రి? మన్మథుని లావు శరంబులు నెవ్వి? కాశికా
చెలువుని నామమెద్ది? మరిసీరియు శౌరికి నేమికావలెన్
చెలువుగ రామలక్ష్మణులు, సీతకు, దమ్ములు, శంభు, డన్నయున్."

పద్యములోని మొదటి మూడు పాదాలలోగల ప్రశ్నలకు నాల్గవ పాదములో వరుసగ సమాధాన పదములు కూర్చబడినవి. షణ్ముఖుడు రఘునాత్మజులు రామలక్ష్మణులు సీతకు మైథిలుండు తండ్రి, తమ్ములు=పద్మములు మన్మథుని శరములు, కాశికా చెలువుని పేరు శంభుడు, సీరియు శౌరికి అన్న కావలెను.

ఉదా:- 3) "ప్రజల రుజకెద్ది దైవమ్ము? వైద్యవిద్య
కష్టముల నేది మఱపించు? గానవిద్య
యేది సప్తసంతతి స్థిరమిలను? కైత
యెవ్వడాంధ్ర నాలంద సృజించె? రావు."

పై పద్యములో ఒక్కొక్క పాదమున ఒక్కొక్క ప్రశ్న పాదాంతమున ఆ ప్రశ్నకు సమాధానము కూర్చబడినది.

## 2. ప్రహేళికలు—పొడుపుకథలు

ప్రపూర్వకమై భావకరణార్థకమైన హిలధాతు నిష్పన్నము ప్రహేళికాశబ్దము. లక్షణము "ప్రహేళికాతు సాజ్ఞేయా వచః సంవృత్తి కారియత్" అభీప్సితార్థమును సమాచ్ఛాదించునట్లుగా చేయు వాగ్విన్యాసమే ప్రహేళిక అని అర్థము.

"ప్రహేళయతి సూచయతి భావం నతు స్వరూపార్థమితి ప్రహేళికా"[1]. అర్థ స్వరూపమును తెల్పక భావమును మాత్రం సూచించునదిది యన్నమాట. ఇది పొడుపుకథ వంటిది. కాని సంస్కృతములోను తెలుగులోను ప్రహేళికలు, పొడుపు కథలు వేర్వేఱని గుర్తింపదగును.

ప్రహేళికలు :

"ప్రహేళికా సకృత్ప్రశ్నః" అని భోజుడనెను. దండి ప్రహేళికా ప్రయోజనము నిట్లు వివరించెను.

"క్రీడాగోష్ఠి వినోదేషు తద్ జ్ఞైరాకీర్ణ మంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికా."

[కా ద. III. 97]

ఈ శబ్దాలంకారములు రసాను గుణముగ గద్య పద్యములలో కవులచే ప్రయోగింపబడవలెననియు, ప్రకాశకర్షుడిట్లు వివరించెను.

---

1 కావ్యాలంకార సంగ్రహము. సన్నిధానం వారి, పుట. 530.

"లీలాకమల మౌచిత్యం వాసః ప్రశ్నోత్తరమ్ పరమ్
ప్రహేళికాంతు పదక మనుప్రాసంతు కంచుకమ్
క్రీడాశకుంతం యమకం గూఢోక్తిం కేళికందుకమ్."
(రసార్ణవాలంకారము. III. 71-74)

ఇది యిట్లుండ,
"రసస్య పరిపన్థిత్వా న్నాలంకారః ప్రహేళికా."
(సా. ద. 10-13).

ప్రహేళిక అలంకారము కాదు. రసమునకు విరోధి అని సాహిత్యదర్పణ కర్త అభిప్రాయపడెను. ఉక్తివై చిత్ర్యా మాత్రము చ్యుత చిత్రమని దానినీ వివరించెను.

ప్రహేళికలో భేదములు:

కావ్యాదర్శనమున పదునారు ప్రహేళికలు లక్షణ లక్ష్య సహితము వివరింప బడినవి. అవి. 1. సమాహితా. 2. వంచిత. 3. వ్యుత్క్రాంత. 4. ప్రముషిత. 5. సమానరూప 6. పరుష. 7. సంఖ్యాత. 8. ప్రకల్పిత. 9. నామాంతరిత. 10. నిభృత. 11. సమానశబ్ద. 12. సమ్మూఢ. 13. పరిహారిక. 14. ఏకచ్ఛన్న. 15. ఉభయచ్ఛన్న. 16. సంకీర్ణ.

సాహిత్యదర్పణమున చెప్పబడినవి ఆరు. అవి. 1. చ్యుతాక్షరా 2. దత్తాక్షరా. 3. చ్యుతదత్తాక్షరా. 4. అక్షరముష్టి. 5 బిందుమతి. 6 అర్థమతి ఇవియే సర కంఠా. లో చెప్పబడినవి.

ఇట్లు ఇవి మొత్తము 22.

ఈ ప్రహేళికల స్వభావమర్థ గోపనమని లక్షణమును బట్టి గ్రహించితిమి. వీనిలో పెక్కులు అర్థచిత్రము ద్వారా సాధింపబడెడివే. కొన్ని చ్యుత చిత్రమునకు చెందినవి. కొన్ని సంకేతములద్వారాను, కొన్ని ఊహద్వారాను, సాధింపదగినది. దండి 16 పేర్కొన్నను గుర్తించినవసలు 30 దాకా ఉన్నవి

పై వివరణముబట్టి చ్యుత, గూఢ చిత్ర సంబంధము గలిగిన వీ ప్రహేళిక అనియు, కొన్ని చిక్కుప్రశ్నల వంటివనియు, నేర్పుతో సాధింపగలిగినవనియు తెలియవలెను.

ఈ ప్రహేళికలు అవధాన ప్రక్రియలోను, ఒక క్రీడగాను వాడబడదగినవి

కాని అప్రయత్నముగ కావ్యముల వీనిని కవులు ప్రయోగింతురనుటలో అతిశయోక్తి లేదు.

పైన పేర్కొనబడిన 22లో చ్యుతచిత్రమున (1) చ్యుతాక్షరా (2) దత్తాక్షరా. (3) చ్యుత దత్తాక్షరా వచ్చినవి. ఇక మిగిలిన 19 అర్థచిత్రమునకు, చిక్కుప్రశ్నలకు, యూహా సాధ్యములునైయున్నవి. అవి దిగువ వరుసగా వివరింప బడుచున్నవి

1. అక్షర ముష్టికా. ఇది. సర. కంఠాలో ఇట్లు చెప్పబడినది.

"అతిః అతిః అన్మఅలం ప్రీద్య రద్య జద్యఫద్య
మేలామేలా మేలం మేలం ఫస ఫస ఫస ఫస." (2-361.)

ఇది శబ్దాలంకారసంబంధి అని చెప్పవచ్చుగదా.

## 2. బిందుమతి

ఇది బిందు సంకేతముచేత ప్రదర్శింపబడును. దానివలన అక్షరములు కనుగొనవలసియున్నది. ఈ బిందుమతి నిర్మాణ మిట్లుండవలెనని దలంచవచ్చు.

లక్షణము. "బిందూనేవ హలాం స్థానే స్వరాన్ప్రకృతి వల్లిఖేత్
తద్బిందు మదితి ప్రాహురన్యే బిందుమతేతి చ." (4-3.)

తలకట్టు తప్ప మిగిలిన అచ్చులను హల్లులమీద చేర్చవలసి వచ్చినపుడు వాని గుర్తులు బిందువుల మీద చేర్చవలెను. సంయుక్తాక్షరములకు, ద్విత్వాక్షరములకు బిందువు క్రింద బిందువుచేర్చి వ్రాయవలెను. విసర్గకూడ బిందువుక్రింద బిందువుగా వ్రాయవలెను. కాని పరిమాణము చిన్నది.

ఉదా:- (1) త్రిభువన చూడారత్నం
మిత్రం సింధోః కుముద్వతీ బంధుః
అయ ముదయతి ముస్మృణారుణ
రమణీ వదనో పమశ్చంద్రః

ఇది బిందువులలో :

పై బిందుమతి కాదంబరీ వ్యాఖ్యాత చూపిన ప్రహేళిక. [1].

ఉదా:- (2) సర. కంఠా. లో 2-363.

(3) కవీంద్రకర్ణాభరణమ్. 4-3.

ఇది అక్షరములను బిందువుల రూపమున గోపన మొనరించు చిత్రము. ఇది రహస్య సమాచారము నందించుటకు తోడ్పడును. అయితే సంకేత జ్ఞానమటు నందించువారికి, ఇటు గ్రహించువారికి వచ్చి ఉండవలెను.

3. అర్ధమతి

ఉదా:- సర కంఠా. లో. 2-365.

"ఉత్తప్త కాఞ్చనాభాసం సందష్ట దశనచ్ఛదమ్
సరసం చుంబయతే హ్యాష్టైర్వ్యద్ధైరపి కిముజ్జ్వలమ్."

4. సమాహితా

"ఆహుః సమహితాం నామ గూఢార్థాం పద సంధినా." అని దండి లక్షణము. "పద సంధిచేత గూఢార్థకమగు దానిని సమాగత యటంచు వచించెదరని" ఆంధ్ర కావ్యాదర్శము సంధిని విడదీసి పదముల అర్థచిత్రము ద్వారా ఈ ప్రహేళికార్థము గ్రహింపదగును.

సంస్కృతములో ఒక ఉదాహరణము. కావ్యానుశాసనమ్ వ్యాఖ్య V. 52

---

1. కావ్యాలంకార సంగ్రహము. (సన్నిధానం వారి) పుట. 561.

వయస్వినీనాం ధేనూనాం బ్రాహ్మణః ప్రాప్యవింశతిమ్
తాభ్యోష్టాదశ విక్రీదు గృహిత్వైకాం గృహం గతః."

ఒక బ్రాహ్మణున కిరువది గోవులు లభించెను. వానిలో పదునెనిమిదింటిని అమ్మివేసెను ఒకదానిని తోలుకొని ఇంటికి చేరెను. అని వాక్యార్థము. ఇదేమి? మిగులవలసినది రెండు గోవులు గదా. కాని ఇట్లు సమర్థించవలెను వయస్వినీనాం= ఆవులలో, ధేను నా ఊనామ్ (ధేనూనాం) = ఒక ఆవుచేతతక్కువైన, వింశతిమ్ = ఇరువదింటిని అనగా పందొమ్మిది అని విశేషార్థము. కావున బ్రాహ్మణునకు లభించినవి 19. విక్రయము 8 చేయగా 1 మిగిలినది.

ఇది యుక్తి ప్రశ్న. పదసంధి. అర్థచిత్రముద్వారా సాధింపబడినది.

తెలుగులో పదచ్ఛేదముతో పరిష్కరించే సమస్యలిందు కుదాహరణములుగా గ్రహించవచ్చు.

(1) సంధ్యావందన మాచరింపవలదా? చౌశీతి బంధమ్ములన్. ఇది అవధాన ప్రక్రియలో సమస్యాపూరణముస కిచ్చినది. దీనిని "సంధ్యావందనమా! చరింపవలదా? చౌశీతి బంధమ్ములన్" అని విడదీసిన సరిపోవును.

(2) ఈతాకుల గుడిసెలోన ఇనుడుదయించెన్.

"తాతా తొంగున్నావా
ఈతాకుల గుడిసెలోన? ఇను డుదయించెన్."

ఆంగ్లములో పదాలను దగ్గరగా పలికినపుడు ధ్వనిచే వేఱొకపదము స్ఫురించి యీ ప్రహేళిక ఏర్పడును

అందుకు రెండు ఉదాహరణములు[1].

1) Sixty cups are on the tabel. Five cups fell down- how many cups are on the table. Six-tea cups అని, Sixty cups అని ధ్వనిచే అర్థములో మార్పువచ్చును. దీనికి సమాధానము 1.

2) Ten cows have twenty four legs. దీనికి twenty fore legs అంటే సమాధానము సరిపోవును.

---

1. గుమ్మా శంకరరావు వారి పొడుపు కథలు. ప్రచు ఆం.ప్ర. సా. అం. 1976 మార్చి.

5. వంచిత

"వంచితాన్యత్ర రూఢేన యత్ర శబ్దేన వంచనా" అని దండి లక్షణము.

ఉదా:- చర్లనారాయణశాస్త్రిగారి అం.కా.ద. 110.

కం॥ ఈగతి గుబ్జాసేవను
సాగించెడు నీకునరతి సమధికమగునో
యాగతి యచ్చరలకుఁదులఁ
దూఁగెడు నారులను బొందు దొరకును నగునే.

ఇట కుబ్జాపదము మరగుజ్జు స్త్రీ అను నర్థములో రూఢము, కాని అస లర్థము 'కన్యాకుబ్జనగరి' అని రూఢ్యర్థముచేత అసలర్థము గూఢ పఱచబడినది. ఇది ఆ పద మందలి అర్థ చిత్రముద్వారా సాధింపబడినది. రూఢర్థము వంచన చేయుచున్నది.

6. వ్యుత్క్రాంత

"వ్యుత్క్రాంతాతి వ్యవహిత ప్రయోగాన్మోహకారిణీ అని దండి లక్షణము

ఉదా:- అం.కా.ద 111.

తే॥గీ॥ హంస కఠిన కంటక యుతమగు కమలిని
గాండమున ముద్దిడుకొను ముఖమున రుతము
చక్కగా నొనరించుచు ముక్కుఁ జేర్చి
మృదులమైన యంగము నపరించు కొనును.

కాండమున, రుతము, చక్కగాచేయుట, ముఖమున ముద్దిడుకొను, అన్వయము దూరముగా ఉన్నది. కాని వ్యామోహము కల్గించుచున్నది.

7. ప్రముషిత.

"సాస్యాత్ ప్రముషితా యస్యాం దుర్బోధార్థా పదావళీ" అని దండి లక్షణము.

ఉదా:- అం.కా.ద. 112.

తే॥గీ॥ పలుబ నీ కాలమున స్ఫార్హపల్లుపులయి
స్నాతుతాఖాతు లోకని యా తొగచెలి
కాఁడు నాఁకు ప్రబసన్నుఁడౌ కారణమున
నాదు వాయువుల్ ధారులై నలువు మీరు.

కాలము=కాళ్యతేక్షిప్యతే=ముందుకు జిమ్మబడును గానకాల మనగా పాదము. స్ఫార్త్ర = స్ఫీతములుగా అందమైన, ఖాతులు=ఖ = ఆకాశ సంబంధముగా, ఖ అను శబ్దము కలుగునట్లు, అతులు=ఎక్కువగా నడచునవి నూపురాద్యలంకారములు. ఓ కని=ఓకన్యా, ధారులు=రుద్ధచేష్టలు గలవై అందముగా నున్నవి. ఇట కాల, స్ఫార్త్ర, ఖాతులు, కని, ధారులు, అన్న పదములు పై అర్థము లలో అప్రసిద్ధములై యున్నవి.

ఇది కూడ శబ్దముల అర్థ చిత్రముద్వారా సాధింపబడినది.

తెలుగులో దీనికి రెండు ఉదాహరణములు.[1] పదాల వలననేగాక ఇతర శాస్త్ర పరిచయ లోపమువలన కూడ దుర్బోధ కలగవచ్చు. ఇవి ప్రముషితా ప్రహేళికలే.

1) నక్షత్రముగల చిన్నది
నక్షత్రము చేతబట్టి నక్షత్ర ప్రభున్
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రము పైన వేసి నాదుని పిలిచెన్.

నక్షత్రములు 27. వానిలో ఉత్తర, భరణి, మూల, హస్త- ఈ నాలుగు నక్షత్రములతో ఈ చిత్రము నిర్మింపబడినది ఇది అభిమన్యుడు యుద్ధానికి బయలు దేరుటకుముందు ఉత్తర వీర తిలకమును దిద్దెసి ఘట్టములోనిచి నక్షత్రముగల చిన్నది-ఉత్తర, నక్షత్రముచేత బట్టి భరణిని పట్టుకొని, నక్షత్రప్రభుని=తన భర్తను, నక్షత్రమునకు రమ్మని-మూలకు రమ్మని, నక్షత్రముపైన వేసి-హస్త అనగా తన చేతిని పై నుంచి పిలిచెను.

2) కన్యకు నైదు జంఘలను జన్యకు నాలు కుచంబు లెన్నగా కన్యకు నాల్గు కన్బొమలు కన్యకు నేడు విశాల నేత్రముల్ కన్యకు ద్వాద శంబులగు కౌనును కల్గిన పంచలక్షణా కన్యకు నీకు నింక పదిగావలె కస్తురి రంగనాయకా.

ఇక్కడ జ్యోతిశ్శాస్త్ర పరిచయ మవసరము, కన్యకు 5 మకరము. మకరమువంటి జంఘలును, కన్యకు నాలుకుంభమువంటి కుచంబులును, నేననక 4 ధనుస్సు. ధనుస్సువంటి కనుబొమలును, కన్యకు 7 మీనం. మీన నేత్రములును, కన్యకు 12 సింహం-సింహము నడుమును,గల కన్యతో నీకు, కన్యకు 10 వన మిథునము. అనగా జంట-జోడుగావలెను అని అర్థము.

1. గుమ్మా శంకరరావుగారి పొడుపు కథలు. ప్రచురణ 1975

8. సమాన రూపి

"సమాన రూపా గౌణార్థారోపి తైర్గ్రథితా పదైః" అని దండి లక్షణము
ఉదా:- అం. కా. ద. 113.

తే॥గీ॥ ఉవ వనమునందునై చిగురుటాకు
లెసఁగు వల్లరి నా చేత దృష్టమయ్యె
దాని యొక్కొక్క చిగురున దామ్రమైన
యొక్కొక కుసుమ మంజరి యొప్పుచుండు.

నాయిక ఉద్యానవనముగాను, బాహువు వల్లరిగాను, వల్లవము లంగుళులు గాను, కుసుమ మంజరి నఖపంక్తిగాను ఆరోపింపబడెను. ఇదిసమానోక్తి అలంకారముగా జెప్పవచ్చు. ఉపమేయ పదగోపనము. గౌణార్థ ప్రధాన మగుటచేత అర్థ చిత్రముద్వారా ఇది సాధింపబడినది

9. పరుష

"పరుషా లక్షణా స్త్రీత్వమాత్ర వ్యుత్పాదిత శ్రుతిః" అని దండి లక్షణము.
ఉదా:- అం. కా. ద. 144.

కం॥ సురచయము యథేచ్ఛముగా
సురాలయమునందు మాత శోభలు చెలగన్
దిరుగుదు రామున సౌరపు
సరసి మునుగుచున్నవారి చాడ్పున నేఁడున్.

సురాలయమన్నది స్వర్గమనెడి అర్థములో రూఢము. సురలనగా మద్యము తయారుచేయువారు, వారి ఆలయము=మద్యశాల. అన్నది అప్రసిద్ధము సౌరపు సరసి=మద్యపు చెరువు-ఇది అప్రసిద్ధము. కృత్రిమార్థకల్పన మిందు గలదు. ఇది వంచితవలె నున్నది. ఇది అర్థ చిత్రముపై ఆధారపడినది.

10. సంఖ్యాత

"సంఖ్యాతానామ సంఖ్యానం యత్రవ్యామోహ కారణం." అని దండి.
ఉదా:- అం కా. ద. 115.

కం॥ ఇరుపార్శ్వములన్ జతుర
క్షరములతో దనరి మధ్యగా నాసిక్యా
క్షరమగు పురి గలదిదికా
పుర ముష్టాక్షరి యుతాఖ్య భూపాలురకున్

నాసిక్యాక్షరపురి=అనగా కాంచీపురి అని అర్థము. క్, అ, ఞ్,చ్, ఈ అను 5 అక్షరములలో 'ఞ' అను అను నాసికము మధ్య ఉన్నది. అష్టవర్ణాక్షరములలో గల రాజులు అనగా పల్లవల్ అనువారు'ప్+అ+ల్+ల్+అ+వ్+ఉ+ల్.' అంకెలతో గూఢార్థము చెప్పబడినది. అర్థగూఢ చిత్రము.

ఇది పొడుపు కథవలె ఉన్నది. ఒక పట్టణము పేరు 5 అక్షరాలు. మొదటి రెండక్షరాలు 'ఏనుగు' అర్థములో వాడుదురు. చివరి మూడక్షరాలు పట్టణమనే అర్థ ములో వాడుదురు. ఆ పట్టణము పేరేమి? 'కరిపురము.'

11. ప్రకల్పితా

"అన్యథా భాసతే యత్ర వాక్యార్థః సా ప్రకల్పితా." అని దండి లక్షణము.

ఉదా:- (1) అం. కా. ద. 116.

కం॥ రాలు పడెడు మాటలతో
వాలినతలలోను దైన్య.పు చూపులతోన్
దూలుచు నిలబడినను నీ
వేలా కరుణింప వోసి వృద్ధానన్నున్.

అచ్చు పుస్తకములోనే పై పద్యము లో రెండవ పాదము లో ఒక అక్షరము పోయి ఉన్నది.

'వృద్ధా' కాముని వాక్యముగా దోచుచున్నది అసలర్థము వృద్ధిగలది. "వృద్ధ లక్ష్మి " ఓలక్ష్మీ! దయ జూడమని ప్రకృతార్థము-వృద్ధాశబ్దమునకు 'లక్ష్మి' అనెడి అర్థము కల్పింపబడినది. కనుక ప్రకల్పితా శబ్దమున కర్థచిత్రము ద్వారా ఈ ప్రహేళిక కర్థము చెప్పుకొనదగును.

విరోధాభా సాలంకారము వలె-అపశబ్దాభాసము, అశ్లీలాభాసములు కూడ ప్రకల్పితా ప్రహేళికలః కొంతవరకు చెప్పుకోవచ్చు.

(2) అపశబ్దభాసము

ఉదా:- తే॥గీ॥. వేధ వేధాంత విద్యలు వే విధముల
దెలిసి సర్వోత్త మత్వ ప్రతిష్ఠ నీకె

[వేదులవారి ల న. పుట. 212. మొదటి రెండుపంక్తులు.]

ఇందు 'వేధవేధాంత' అపశబ్దముగా కన్పడును. అసలు వేదవేదాంత విద్య లుగా ఉండవలెను. కాని వేధ=బ్రహ్మదేవుడు, వేధా+అంతవిద్యలు=బాధలను నాశనము జేయువిద్యల ననెడి అర్థములో అవి సుశబ్దములే.

(3) కం॥ భూదర దారీ కగవర
గాదేవా దండమిడుదు కరుణాఖరధీ
యోదామోదర ఖేశవ
రాదా నాదాన రసిక రాగవదవనా

[విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ.భా. 6].

'భూధర దారీ' వలె కన్పడు భూవరదాకీ ప్రయోగము అనగా భూమియొక్క భీతిని పోగొట్టువాడా!, 'ఖగవర' వలె కగవర ప్రయోగము. కగ=జీవాత్మలను పొందినవాడా!, వరగా=శ్రేష్ఠులను పొందువాడా!, 'కరుణాకర' వలె 'కరుణాఖర' అనగా 'కరుణా+అఖరధీ'=కృపచేత కఠినముగాని బుద్ధిగలవాడా!, 'కేశవ' వలె 'ఖేశవ'_అనగా 'ఖ+ఈశవర'=స్వర్గమునకు నాయకులైన వేల్పులలో శ్రేష్ఠుడా! 'రాఘవ' వలె 'రాగవ' ప్రయోగింపబడినది.

(4) అశ్లీలాభాసము.

ఆ॥ వె॥. లంజరాగ సరసకుం జవరాల్చేరి
ముద్దులాడి హార్ద ముగ్ధకేళి
శాలలోన బయల చంద్రకాంతుల గ్రామ
విహృతి నెఱపుపెద్ద వేంకటపతి.

[విక్రాలవారి.శ్రీ. వేం. చి. ర. కరము. ఉ. భా. 20]

అర్థము: లంజెరాఁగ సరసములైన ఉత్తమ నికుంజములను జేరి ముద్దులు పెట్టుకొని ప్రేమకుచెందిన అందములైన పడుకటింటి వెలుపల వెన్నెలలోను కామ క్రీడ సలుపునట్టి వేంకటేశ్వరుడు అని అశ్లీలార్థము.

లంజ=లక్ష్మి, యనెడి యర్థమున కల్పితార్థము.

12. నామాంతరితా

"సా. నామాంతరితా యస్యాంనామ్ని నానార్థకల్పనా." అని. దండి.

ఉదా:_ ఆం. కా. ద. 117.

తే॥గీ॥ ఒక్క పార్థివ వ్యక్తికినోసి చంచ
లాక్షి! యాఁడవి రాజా యటంచునొప్పు
కానివ్యక్తికి రాజార్థకత మఱియు స
నాతనత దనర వగు సనాతనతయు.

పార్థివవ్యక్తి=పృథివి యందు విదితుడైనవ్యక్తి, అను అర్థమును బట్టి 'రాజు' అనదగును, న అతన=తనశబ్ద శూన్యముకానిది, అనగా తనశబ్దము, సనా తన=తనశబ్ద శూన్యముకాని దానితో కూడినది అనగా 'రాజసనాతన' దానిభావము. అనగా 'రాజతన' వృక్షముపేరు. ఆ 'రాజ తనవృక్షము' ఇటు రాజుగాదు. అటు సనాతనము కాదు. అది పేరులో నానార్థకల్పనచే కప్పి పెట్టబడినది.

నామవిశేష ప్రకటనము కొఱకు అనేక వస్తువుల కల్పన చేయబడిన నామాంతరితా అనవచ్చు. దీనియందు కూడ అర్థ చిత్రమున్నది.

ఇటువంటి ప్రహేళిక. లనఁదగునవి కొన్ని తెలుగులో కలవు.

ఉదా:- (1) చంపకమాల.

'అలఘున చంద్ర బింబసమమై దన రారెడు వక్త్రమందులో
గలిగిన నామ భేదములకైపడి నొప్పెడి కప్పుకొప్పు చె
క్కులు రదనాళు కంబులవి గుబ్బలకున్ సరిరాక పోయె చే
తులు సరులాయె దానిగతి తోచును పొంకపుటారు బోటికిన్'

(2) అధర ముఖవర్ణ శూన్యంబు లతివ కుచము
లౌన నాకార రహిత మబ్జాక్షిపేను
అజ జఘన మండలము థంచయానకురులు
చరమ బాధిత కరములు చామ తొడలు.

ఆంగ్లములో ఈరకము పొడుపుకథ

"He is between two MATS and ICS is after the Mat.? What is it.?"

"M A T H E M A T ics.".[1]

## 18. నిభృతా.

'నిభృతా నిభృతాన్యార్థా తుల్య ధర్మస్పృశాగిరా.' అని. దండి లక్షణము.

ఉదా:- కా. ద. (ఆంధ్రము). 1 8.

---

1. గుమ్మా శంకరరావుగారి. పొడుపు కథలు. ప్రచురణ. 1976 మార్చి

తే॥గీ॥ బహుళ భంగి కలాకృష్ణ బహుమనుజులు
వసుమ దాపి హృతద్రవ్య వర్జ నక్రి
యైన దీక్షలు దుర్ధరలైన గాని
కారు గణికలు వార లెవ్వారు చెపుమ.

తన వివిధ భంగిమలచే అందరినీ ఆకర్షించి ధనహీనుని విడిచి ధనవంతుని వద్దకు పోయేదేది? వేశ్యలు కారు. నదులు తమ అలలచే వృక్షశాఖల పత్రాలను తమ ప్రవాహములలోనికి లాగి ధనహీనుడైన పర్వతాన్ని వదిలి ధనవంతుడైన సముద్రుని చేరుకొనెను. ప్రస్తుతార్థము గూఢమై యున్నది. రహస్యమును దెలుపునది అందుచే నిది నిభృత. అర్థ చిత్రసంబంధి.

14. సమానశబ్ద

"సమాన శబ్దోపన్యస్త శబ్దపర్యాయ సాధితా" అని. దండి

ఉదా:- అం.కా.ద. 119

కం॥ గెలిచి ప్రకృష్టక చాహ్వాయ
ములనక్షితి నామధేయమున నెసగొడు నీ
అలితాంగ మిపుడు నన్నో
కలభాషిణీ! చేయు నధిక కామాతురునిన్.

అభీష్ట శబ్దాల స్థానములో వాని పర్యాయ వాచక శబ్దాలను ప్రయోగించి సాధించిన అది సమానశబ్ద ప్రహేళిక.

ప్రవాళానికి పర్యాయవాచక శబ్దము ప్రకృష్టకచము.
అధరానికి " అక్షితనామధేయము

అని గ్రహించవలెను. కావున ఇదికూడ అర్థచిత్ర సంబంధి.

15. సంమూఢా

'సంమూఢా నామ సాక్షన్ని ర్దిష్టార్థాపి మూఢయే'. అని దండి లక్షణము.

ఉదా:- అం.కా.ద. 12`.

కం॥ శయనంబున దంపతులు ప్ర
ణయ కలహముచేత నాననంబులు పెడగా
శయనించిరి, కూర్మినటులె
శయితులగుచుఁ జుంబనంబు సలిపిరి ముఖముల్.

సాక్షాత్ వాచక శబ్దాంద్వారా అర్థము నిర్దిష్ట మౌచున్నను, శ్రోతలలోవ్యామో హోత్పన్నము చేయుదానివి 'సంమూఢా' అందురు. (పెడగా) కోశముచే పరుండ నెట్లే అటులే కూర్మిని (అభిముఖముగా) పడుకొని చుంబనమొనరించిరి. అని అర్థము. యుక్తి యూహ లిక్కడ ప్రధానము

౹౯, పరిహారిక

"యోగమాలాత్మికా నామ యాస్యాత్ సా పరిహారికా". అని దండి లక్షణము

ఉదా:_1) అం.కా ర ౨౧.

అ॥ వె॥ శకున జిత తనూజ శాత్రవ గురుపాద
హతిని. ఖిన్నుడైన యట్టి జనుడు
హిమ విరోధ్యమిత్రదములచే వ్యాప్తమౌ
ఘన పథమును మెచ్చుకొనుచు నుండు.

శకున పక్షియైన గరుడినిచే, జిత=జయింపబడిన వాడు_ఇంద్రుడు అతని తనూజుడు అర్జునుడు. వానికి శాత్రవ=కర్ణుడు, వానిగురువు=సూర్యుడు, పాదహతివి=కిరణముల తాకిడిచే ఖిన్నుడైన జనుడు, ఎండచే బాధపడువాడు, హిమవిరోధి=అగ్ని, దానికి అమిత్రము జలము, దానిని దములు=ఇచ్చునవి=మేఘములు, వానిచే వ్యాప్తమైన ఘనపథము=ఆకాశము_ఆకాశము మెచ్చుకొనుటయే ఇందు వర్ణితము యౌగికార్థములు చెప్పు శబ్దములు పంక్తిగా నున్నవి

ఉదా:_2) విక్రాలవారి. శ్రీ. వేం. చి. ర. కరము. పూ. భా. 21. కందము

ఉదాహరణములు 3 4 గుమ్మా శంకరావుగారి "పొడపు కథల"[1] నుండి గ్రహింపబడినవి.

ఉదా:_3) తేటగీతి. "పర్వతశ్రేష్ఠ పుత్రికా పతివిరోధి
అన్న పెండ్లాము అత్తను గన్నతండ్రి
ప్రేమ వారింట బెరిగిన పెద్దబిడ్డ
సున్నమిపుడు తేగదే సుందరాంగి.

పార్వతీపతి=శివుడు, వానికి విరోధి మన్మథుడు, అన్న=బ్రహ్మ, పెండ్లాము=సరస్వతి, అత్త=లక్ష్మి, కన్నతండ్రి=సముద్రుడు, వారిపెద్దబిడ్డ=జ్యేష్ఠా. ఓజ్యేష్ఠా సున్నము తెమ్మని అర్థము

1. ఆం. ప్ర. సా. అకా. ప్రచురణ 875

ఉదా:-4) పైదానికి సమాధానము. "జ్యేష్ఠ" చెప్పుచున్నది.

కం॥ శతపత్రంబుల మిత్రుని
సుతు జంపిన వాని బావ సూనుని మామన్
సతతము తలధరియించిన
సుతవాహన వైరివైరి సున్నం బిదుగో.

సూర్యు, కొడుకు=కర్ణుని, జంపినవాడు=అర్జునుడు, బావ=కృష్ణుడు, కొడుకు =మన్మధుడు, వానిమామ=చంద్రుడు, అతని తల ధరించినవాడు=శివుడు, వాని కొడుకు=వినాయకుడు, అతని వాహనము -ఎలుక, దానికి వైరి=పిల్లి, దానికి వైరి= కుక్క ఓ! కుక్కా! ఇదిగో సున్నము అని ఆమె సమాధానమిడినది.

17. ఏకచ్ఛన్నా

"ఏకచ్ఛన్నాశ్రితం వ్యజ్యయస్యా మాశ్రయ గోపనమ్." అని దండి.

ఉదా:- ఆం కా ద. 123.

తే॥ గీ॥ ఒక్కయమనుష్య హస్తమే యొకపుడేని
స్త్రీల స్తనమండలమును స్పృశింపబోదు.
శస్త్రమునుగూడ స్పృశింప సాహసింప
దైన నిష్ఫలమనరాదు దీనినెపుడు

అమనుష్యుని ఈహస్త మెప్పుడూ ఆయుధాన్నిగానీ, స్త్రీస్తన మండలాన్ని గానీ స్పృశింపలేదు. కాని అది నిష్ఫలముకాదు అమనుష్య హస్తమనగా-ఆమదపు చెట్టు—ఇది ఫలవంతము ఇందు ఆశ్రితమైన ఫలము వ్యక్తమైనది ఆశ్రయమయిన వృక్షము గోపనమైనది. కనుక ఆశ్రయపద గోపనము జరిగినది. అర్థము సాధించుట ఊహాప్రధానము. అర్థ చిత్రము తోడుపడినది.

18. ఉభయచ్ఛన్నా

"సాభవే దుభయచ్ఛన్నాయస్యా ముభయ గోపనమ్," అని. దండి.

ఉదా:- ఆం.కా.ద. 114

తే॥ గీ॥ ఏక మేకముతోఁ గూడి యెల్లకార్య
ముల నమీపించు నద్దియే భోజనంబు
నలుపు వేళను దృష్టి గోచరముగాగ
దూరముగ ద్రోయగా బడుఁ దోయజాక్షి.

ఏది? ఎవరు? అన్ని పనులలో కలసి ఉండునో, భోజన సమయమున కన బడిన పారవై చ౽డునో అది ఏది? ఏకము=ఏ శిరస్సునకుసంబంధించిన, ఏకము= ఏకేశము శిరస్సు, కేశము, ఈ రెండును ఆశ్రయాశ్రితములు. గూఢములు. కనుక ఆశ్రయాశ్రిత పదముల గోపన మిందున్నది. ఒకే పదమునకు రెండర్థాలచేత దీనిని సాధింపవచ్చును. అర్థచిత్రముపై నాధారపడినదిది. ప్రశ్నలోనే సమాధాన మిమిడి యున్నది కావున ప్రశ్నోత్తర చిత్రం మొదటి విధమునకు చెందినదిగా చెప్పుకో వచ్చు.

19. సంకీర్ణ

"సంకీర్ణా నామ సాయస్యాం నానా లక్షణ సంకరః," అని. దండి. లక్షణము

ఉదా :-అం.కా.ద.125.

తే॥ గీ॥ సహిత హయసహిత గజయు సహిత భటయు
నైన యాసేన జితము కాదేని నాదు
నాత్మజుఁడ మాత్యకుడు మూడుడైన యట్లు
ప్రజలచే గణ్యుఁడగు నక్షరజ్ఞుఁడయ్యె.

గుఱ్ఱములు, గజములు, భటులతో గూడిన యాసేన జయింప బడకపోయిన నా కొడుకు అక్షరజ్ఞుడయ్యె, పరమార్థము తెలిసినవాడైనను, అమాత్యకుడు కాగలడు. మూడుడుగా ప్రజలచే పరిగణింపబడును. అని పైకితోచు అర్థము.

'హ' వర్గాళి—శ,ష,స,హ; 'య' వర్గాళి—య,ర,ల,వ; 'గజ' వర్గాళి— క,చ వర్గాక్షరములు; 'భట' వర్గాళి—ప,ట వర్గాక్షరములు; ఈసేన='ఇ'కారముతో గూడిన అచ్చులు; 'న' వర్గాళి—'త' వర్గాక్షరములు; మొత్తమక్షర పంక్తి జితము కానిచో మూడుడని, అమాత్యకుడు=వర్ణములు లేనివాడు, అని ప్రజలు గణింతురు. అనెడిది గూఢార్థము. వంచనగా చెప్పుటచే వంచిత ప్రహేళిక, హయాదులు మొదలు సేనవరకు వివిధార్థ కల్పనముచే నామాంతరిత ప్రహేళిక, ఇందు సంకీర్ణమైయున్నవి.

ఇటువంటిదే సంఖ్యారచనము. బిందుమతివలెనే అంకెలతో వ్రాయు విధాన మిది. అక్షరములకు అంకెలు కేటాయించబడినవి. 3 అక్షరముల కొక్కొక్క చొ॥న 8 అంకెలకు మొత్తమక్షరములు సరిపోవును. ప్రతి అంకెకు సంబంధించిన మొదటి అక్షరము ఆ అంకె $+1/4$, రెండవ అక్షరము ఆ అంకె$+1/2$, మూడవ

అక్షరము అంకె +3/4, లచే సూచింపబడును. ఇక ఒత్తులు, దీర్ఘాలు, కొమ్ములా మున్నగునవి బిందుమతిలోవలె ప్రత్యేకముగా చూపబడును అక్షరములు వానికి సరియగు అంకెలు దిగువ చూపబడుచున్నవి.

| 1/4 | 1/2 | 3/4 | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అ | తా | ల | ఏకం | జ | బా | స | పంచమీ (బాణం) |
| క | ద | వ | ద్వితీయం | ట | మ | హ | షష్ఠి |
| ఖ | న | శ | త్రీణి | డ | య | ళ | సప్తమీ |
| చ | ప | ష | చతుర్థం | క్ష | ణ | ర | అష్టమి |

ఉదా:- 1/2 — 3/4 — 3/4 — 3/4 — 3/4 — 3/4 —

జవాబు : ధర్మేశ్వరరావు

ఈ ప్రహేళికల గూర్చి సమగ్ర పరిశోధన జరగవలసి యున్నది. ఇప్పటికే కొంత పరిశ్రమ చేసి శ్రీ భాష్యం విజయ సారథిగారు వివిధ ప్రహేళికలు సేకరించి ప్రకటించిరి.

## పొడుపు కథలు

ప్రహేళికలు పొడుపుకథలవలె కనబడినను రెండును వేర్వేరని తెలియుపలెను. ప్రహేళికలలో సంస్కృతాంధ్ర ప్రహేళికల నబడిదగినవి చూచితిమి. ఇప్పుడు సంస్కృతాంధ్రములలో పొడుపుకథలను గూర్చి తెలిసికొందుము.

ఈ పొడుపు కథల స్వభావము గూర్చి గుమ్మా శంకరరావుగారి వివరణ మిట్లున్నది. "మెదడుకు మేత వేసేవి, బుద్ధికి నైశిత్యాన్ని కలిగించేవి, ఆలోచనను ప్రేరేపించేవి, తెలివి తేటలకు సానపెట్టేవి, పదును పెట్టేవి, జ్ఞాన తృష్ణను కలిగించేవి, యుక్తి ప్రయుక్తి ప్రకటనా సామర్థ్యాన్ని పెంపొందించేవి, సమస్యలను పరిష్కరించే కౌశలాన్ని వృద్ధిచేసేవి, విద్యావైశద్యాన్ని కలిగించేవి, స్ఫూర్తిని కలిగించేవి, చమత్కారాన్ని, ఆహ్లాదాన్ని కలిగించేవి ఈ పొడుపుకథలు. ఇది ఒక జ్ఞానక్రీడ."[1]

---

1. పొడుపు కథలు. ప్రచురణ. 1975 మార్చి. ఆం. ప్ర. సా. అకా. హైదరాబాదు.

పై లక్షణాలు చ్యుత, గూఢ చిత్రములలోను, ప్రశ్నోత్తర, ప్రహేళికల లోను గలవని గమనించితిమి.

పొడుపు కథ ప్రశ్నోత్తర చిత్రములో ఒక రకమని చెప్పవచ్చు. ఏలన, ప్రశ్నలో సమాధానముయొక్క లక్షణములు చెప్పబడును ఆ లక్షణములు సమన్వయము చేసికొన్నచో సమాధానము సరిగావచ్చును పెక్కు ప్రశ్నలకు సమాధానమొక్కటి అను ప్రశ్నోత్తర రకమువలె పెక్కు లక్షణముల సమన్వయము పొడుపు కథా సమాధానమగును.

ప్రశ్నల రూపములో ఉండక సమాధాన లక్షణములు వర్ణించి చెప్పునది. పొడుపుకథ. ఇదియే ప్రశ్నోత్తరములో రెండవ విధమునకు పొడుపుకథకు గల ముఖ్య భేదము. కావుననే ఇవి ప్రత్యేక శీర్షిక క్రింద చెప్పబడుచున్నవి.

పొడుపు కధ లన్ని భాషలలోను గలవు.

సంస్కృతము. ఉదా:- "అపదో దూర గామీ చ
సాక్షరో న చ పండితః
అముఖః స్ఫుట వక్తా చ
యోజా నాతి స పండితః."

పదములు లేనివాడు, దూరముగా పోయెడివాడు, అక్షరసహితుడు కనీసము పండితుడు కాడు. ముఖములేనివాడు కాని స్ఫుటవక్త. వాడిని తెలిసినవాడే పండితుడు. సమాధానము కార్డు.

(2) "వనేజాతా వనే త్యక్తే
వనే తిష్ఠతి నిత్యశః
పణ్యస్త్రీ న తు సా వేశ్యా
యోజా నాతి స పండితః".

వనములో పుట్టినది, నీటిలో విడిచిపెట్టబడెడిది, నీటిలోనే ఎప్పుడూ ఉండెడిది, శరీరాన్ని అమ్ముకొనెడిది, కాని అది వేశ్యకాదు. అది తెలిసినవాడే పండితుడు సమాధానము ఓడ.

(3) "వృక్షాగ్రవాసీ న చ పక్షిరాజః
త్రినేత్ర ధారీ న చ శూలపాణిః
త్వగ్వస్త్రధారీ న చ సిద్ధయోగీ
జలం చ బిభ్ర న్న ఘటో న మేఘః."

చెట్టుమీద ఉన్నది, కాని పక్షికాదు మూడు కన్నులున్నవి కాని శివుడుకాదు. చర్మశాస్త్రమే కలవాడు కాని, సిద్ధయోగి కాడు. నీటిని గలిగినది ఘటము కాదు. మేఘముకాదు. సమాధానము కొబ్బరికాయ

తమిళము :

1) అణ్ణ నుక్కు ఎట్టాదు తంబికి ఎట్టుదు. సమాతానము పెదవులు.
ఇది తెలుగులో అన్న కందవు అమ్మ కందుతాయి.

2) పోవాన్ వారువాన్ తిమ్మప్పన్
ఒరుకే కాల్ నిప్పన్ తిమ్మప్పన్.—సమాధానములు - తలుపు.
ఇది తెలుగులో "వస్తాడు పోతాడు తిమ్మప్ప
ఓ కాల నిలుస్తాడు తిమ్మప్ప"

కన్నడము :

1) అంకడొంకద బావి
శంఖ చక్రద బావి
నారాయణ కేరిల్లద బావి.—సమాధానము చెవి

2) ఎరెడు మనిగె
ఒందుతొలె—సమాధానము. ముక్కు.

3) చిక్కమనిగె
చెక్కెతుంబెద —పలువరుస

హిందీ.

1) తూచల్, మై ఆయా. క్యాహై? — తలుపు.

2) దో లటర్‌తే, ఏక్ పకడ్‌తా. క్యాహై? — త్రాసు.

ఆంగ్లము : ఇందలి పొడుపు కథలను 'Riddles' అందురు. అంటే పొడికథ అంతరార్థము నూహించే ఒక ఆట. లేదా సమస్య అని దీని అర్థము.

Edgar Allen Poe. నిర్వచనము "It mary well be doubted whether human ingenuity can construct enaigma of the mind which human ingenuity may not by proper application. resolve."

ఉదా:-

1) It has no teath but bites — shoes.

2) If you take out one from nine, it makes ten. How it possible? —Roman No. IX.లో I తీసిన X మిగులును.

3) 'A' is the father of 'B' But 'B' is not son of 'A'. What is the relationship beetween 'A' and 'B'? — daughter.

4) It is placed on the table. It is cut and distributed anongst the members. But it is not edible. What is it? —playing Cards.

5) Why 'T' is called an island? Because it is in the midst of water:— 'WATER'. ఈ పదములో మధ్య ఉన్నది. [1].

తెలుగు :

1) తోకలేని పిట్ట తొంభై ఆమడ పోయినది.— ఉత్తరము (post card)

2) పైన పచ్చ, లోన తెలుపు. గులకరాళ్ళు, తేటనీళ్ళు—నారింజ

3) ఏడ్వకేడ్చు నవ్వకేనవ్వచుండును
బాధ లేక బాధ పడుచు నుండు
నిద్రరాకయున్న నిద్రించు—చావకే
చచ్చు నెవ్వడో చెప్పుడు సరసులార—నటుడు.[2]

4) కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో విక్రమార్కుని కడ కొకడు వచ్చి నాలుగు భాషలలో దీవించి, తన పేరు కనుగొనమని పొడుపు కథ వివరించును అది యిట్లున్నది.

"నా పేరు ఆరక్షరాలు. అందులో మొదటి అక్షరము తీసినచో నేను అశ్వ వేదినగుదును. మొదటి రెండక్షరాలు తీసినచో నాట్యకర్త నగుదును.నాలుగు తీసినచో చాల నేర్పరిని. అన్ని అక్షరాలును కలిపి చదివినచో బుద్ధిబలముగల ప్రౌఢుడను.— నేతిబీరకాయవలె గాకుండ సార్థక నామధేయుడను."

అతని పేరు "చతురంగ తద్జ్ఞు" అని రాజు సమాధానమిడెను.

[సింహాసనద్వాత్రిన్ 2-47,48]

---

1. ఆంగ్లోదాహరణములు -గుమ్మా శంకరరావుగారి 'పొడుపుకథలు'— నుండి గైకొనబడినవి. ప్రింటు. 1975. మార్చి. ఆం.ప్ర.సా.అకా. ప్రచురణ.

2. చాటుపద్యరత్నావళి. పుట. 17.

ఆధునికాంధ్ర సాహిత్యములో కొన్ని పొడుపు కథలను గుమ్మా శంకరరావు గారు గుర్తించిరి.[1]. వానినిట పేర్కొనుచున్నాను ఒకదానిని గూర్చి వర్ణించిన అది పొడుపు కథ అగును.

(1) 'ఐడివంతులు' సినిమాలో "బూవాడమ్మా బూవాడు
బుల్లిపెట్టెలో ఉన్నాడు"

సమాధానము :_ టెలిఫోను

(2) 'మేరానామ్ జోకర్'లో _ "పిల్లికి ముందు రెండు పిల్లులు
పిల్లికి వెనుక రెండు పిల్లులు
పిల్లికి పిల్లికి మధ్యన ఒకపిల్లి
మొత్తం పిల్లుల సంఖ్య ఎంత?

సమాధానము :_

(3) 'ఇల్లరికంలో' _ ఒంటికాలిపైనుండి, హఠయోగ విద్రలోనుండి
గుట్టుగ దనవని సాధించునది, వివరిస్తావా చిన
దానా? అంటే....'కుక్కగొడుగు' అని ఆమె
సమాధానము కాని 'కొంగ' అతని సమాధానము

(4) 'మంగమ్మ శపథం'లో _

రాజు "నువ్వులలో పుట్టి నువ్వులలో పెరిగిన చిన్నదానా!
నువ్వు గింజకంటె చిన్న ఆకు ఉన్న చెట్టు ఏది."

దానికామె "పువ్వులలో పుట్టి పువ్వులలో పెరిగిన ఓ రాజా!పువ్వులలో మూడు
రంగుల పువ్వు పూచే చెట్టు ఏది?! _అది వెలుతురు చెట్టు.

పొడుపు కథల గూర్చి నేను చెప్పినది నామమాత్రమే. వీనివి గూర్చి సమగ్ర పరిశోధన జరగవలసిన అవసరమున్నది. ఇందు కసిరెడ్డి వెంకటరెడ్డిగారు కొంత ఇప్పటికే పరిశోధన చేసినట్లింక చేయుచున్నట్లు వారి వ్యాసమువలన తెలియు చున్నది.[2]

---

1. పొడుపు కథలు. పుట. 8-109 ప్రచురణ. ఆం. ప్ర సా. అ కా. 19.5 మార్చి.
2. వివేచన. ప్రచురణ. డిసెంబరు. 198 . తెలుగుశాఖ. ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు.

## 8. నల్లెంట్లు

ఈ నల్లెంట్లను చిత్ర కవిత క్రింద చెప్పినవాడు అప్పకవి యొకడే. అతడై నను లక్ష్యము చెప్పినాడు కాని లక్షణము పేర్కొనలేదు.

బ్రౌణ్యంలో దీని అర్థమిట్లు చెప్పబడినది: నల్లెంటి కావ్యం **"Linking, coupling (అంటిపెట్టుట) Connecting. A sort of conceit in poetry where in certain words are capped or the names of places & etc are used in a double sense as Turn-bridge. Ox-ford & Co."**

అప్పకవి చెప్పిన లక్ష్య మీక్రిందిది [అప్పకవీయము-4-560]

కం॥ నారదముని శార్దూలము
కూరిమి నజినంబు గప్పుకొని వేడుకతో
నారాయణ వాసమున క
నారత మేతెంచు ననగ నల్లెంటులగున్

ఈ నల్లెంట్లకు బ్రౌణ్యంలో అర్థమున్నదని చెప్పి దానితో లక్ష్యమును సమన్వయించి చూపినది గుమ్మా శంకరరావుగారు.[1] వారి వివరణము "ఇందులో "నారదముని" పదం విడిచి మిగిలిందంతా ఇచ్చిపూర్తిచేయమంటారు. శార్దూలం. అజినం. కప్పుకోవడం ఏమిటీ? అని అసందర్భంగా తోస్తుంది అప్పుడు "నారద ముని" పదం చేరిస్తే అజినం కప్పుకోవడం సబబే. సమన్వయం కుదురుతుంది. ఏదైనా Capital Letterతో ఆరంభించే పదంతో కూర్చాలని అదే నల్లెంట్లలోని విశేషం. అని తెలుస్తుంది. అవధానంలో ఇచ్చే సమస్యకు నల్లెంట్లకు భేదం ఉంది. సాధారణంగా సమస్యలో చివరి పాదాన్నిచ్చి పూర్తి చేయమంటారు. నల్లెంట్లలో ఇంచుమించు పద్యమంతా ఇచ్చి ముందు ఒకటి రెండు పదాలు మినహాయిస్తారు. రెండింటిలోను అసందర్భము తొలగింపబడి సందర్భపూర్తినికలిగించడం-ఉంటుంది"

ఇక్కడ గమనింప దగిన అంశములు కొన్ని కలవు. రెండుపదముల నంటి పెట్టుట. అంటిపెట్టబడెడి పదము కూడ ఒకరిపేరో, ఒక ప్రదేశము పేరో అయి

---

1. వారి తెలుగులో చిత్రకవిత్వము వ్యాసం "తెలుగు" త్రైమాసిక పత్రిక July-Sept 78. ప్రచురణ. తెలుగు అకాడమీ, హైదరాబాదు.

యుండవలెను. వానిలో ఒక పదము మాత్రమే ఇచ్చెదరు. రెండవది సరియైనది. అంటిపెట్టబడవలెను. ఆ రెండు పదములను కలిపినపుడు, మఱొక అర్థము రావలెను.

దీనిని బట్టి "నారదముని" "శార్దూలము"రెండింటిని అంటిపెట్టినపుడు "నారద మునిశ్రేష్ఠుడు" అనెడి అర్థము గోచరించి, అసందర్భము తొలగించబడి "శార్దూలము" నకు గల ప్రత్యేకార్థము తొలగించబడినది.

అప్పకవి నల్లెంటులగున్ అని నల్లెంటుకు బహువచన రూపము వాడినాడు. కావున లక్ష్యములో రెండు నల్లెంటు లుండి యుండవలెననెడి శంక వొడమును. ఇట్లా చూచినచో "నారాయణ వాసము" అనునది మఱియొకటి గోచరించును. "వాసమున కనారతమేతెంచు" నన్నప్పుడు, ఏ వాసము? అనునది అర్థరహితము. దానికి "నారాయణ" పదము నంటిపెట్టినపుడు "వైకుంఠము" అనెడి అర్థము స్ఫురించును.

ఇట్లు, పై లక్ష్యమున రెండు నల్లెంట్లుకలవు. రెండు పదము లంటిపెట్టబడినపుడు ఒకే పదమై, సమానమై, ఒకే అర్థము నిచ్చుచున్నదని కూడ చెప్పవచ్చును.

### 4) ఇచ్ఛావాక్య సంఘట్టనము

"ఇచ్ఛావాక్య సంఘట్టన రచన అష్టావధానములోని దత్తపది వంటిది. ఇట్టి రచన French, English భాషలలో కలదు. వానిని Bouts, Rimes అందురు. ఒక యువ కవిని ప్రేమించిన అమ్మాయి అతని కవితాశక్తిని పరీక్షించుటకు please, Teas, moan, bone, అను నాల్గు మాటలను ఇచ్చి తనను గూర్చి ఒక పద్యము చెప్పుమన్నదట అతడు చెప్పిన పద్యమిది.

"To a form that is faultless, a face that must please,
Is added a restless desire to-tease,
O! how may hard fate I should ever be-moan,
Could I but believe she'd be bone of my bone"[1]

దీనిని బట్టి పృచ్ఛకులు కోరిన పదములచే అర్థవంతముగ, సందర్భాను సారము కూర్చి ఆశుకవి పద్యమును చెప్పును. అదే ఇచ్ఛావాక్య సంఘట్టనమని

---

1. తిరుపతి "సాహిత్య సమితి వ్యాసావళి"లో జి.యన్. రెడ్డిగారి "తెలుగు పాశ్చాత్యభాషలలో చిత్రకవితం పోలికలు"_ వ్యాసము.

అనవచ్చు. చిత్రముగా పూర్తి చేయబడును గనుక చిత్రకవిత్వము క్రింద దీనిని అప్పకవి చెప్పినాడు.

అప్పకవి లక్ష్య పద్య మీక్రిందిది. అప్పకవీయము. 4_567.

కం॥ తోటలు లెస్సై యున్నవి

తాటా దూటములుగావు తాపసులుండన్

బేటలు దామోదరు చె

ర్లాటలు కాన్పేళవులు మధురాపురి చెంతన్

ఒకపుర వర్ణనము సందర్భముననో లేదా ఏదో వర్ణన సందర్భముననో ఈ రీతి అర్థవంతముగా శబ్దములు వాడవలెనని అప్పకవి భావము కావచ్చును. అందులోను ప్రాసస్థలమున ఇచ్చిన పదములు ప్రయోగించవలెనా అన్నది మఱియొక శంక అట్లైయినచో ఈ చిత్రమును దాదాపు ప్రతికవియు ఏదో ఒక సందర్భమున చేసినాడనియే చెప్పవచ్చు ఇటువంటివి కొన్ని మచ్చుకు కావ్యములనుండి యుదాహరింప వచ్చును.

1) కంసవైరి మాటల వర్ణన సందర్భము ముద్దుపళని. రాధికా సాంత్వనము. 2_45.

తేటలుగా జిగి ముత్యపు

బేటలుగఁ బంచదార పేటులుగఁబూఁ

దోటలుగా చిలుకల

మాటలుగా గంసవైరి మాటలు దనరున్

2) పురవర్ధన సందర్భము. పురాణం పిచ్చయ్య. విజయాశ్వ చరిత్ర పూ.భా. 1_120

ఆ పురము రమా మణికి

గాపురము తిరస్కృతాల కాపురము ధరా

నూపురము పుణ్యముల కుం

దాపురము సురేంద్రపురము దా బురణించున్

అవధాన సమయమందు మాత్రమే ఇచ్ఛావాక్య సంఘట్టనము చిత్రముగా కనబడును.

3) బుర్రా కమలాదేవి. ఛందోహంసి. ఒక పద్యమున్నది విశేషములేదు.

52)

### ౬. పలుభాషా పద్యములు

పద్యము నందొక్కొక్క పాదముగాని, పాదభాగము కాని ఒక్కొక్క భాషలో వ్రాయబడుటను పలుభాషాపద్యము లనవచ్చును. అనగా ఒక పాదమొక భాషలోను, మఱియొక పాదము వేఱొక భాషలోను వ్రాయుట.

ఈ విధముగ రచింపబడిన పద్యాలకు Macaronis verses అని ఆంగ్లములో అందురు.[1]

సాధారణముగ సంస్కృతాంధ్రములతో తెలుగుపద్యము నిర్మింపబడు చుండును. కనుక అది ఈ చిత్రము క్రింద పరిగణింపబడుటలేదు. భాష ఏదైనను తెలుగులిపిలో వ్రాయుదురు.

ఇందులో మూడు రకములు కనపడుచున్నవి. (1) ఒక్కొక్కపాద మొక్కొక్క భాషలో రచియించుట. (2) భాషామిశ్రమము. (3) అన్యభాషా పద్యములు.

(1) పాదమునకొక భాష.

ఉదా:- (1) గ. వేం. కవి. అష్టభాషా సీసము. ప్ర. రా. వేం. వి. వి. 875.

ఇందు ప్రాకృత, శౌరసేని, మాగధ, పైశాచి, చూళిక, అపభ్రంశ, సంస్కృతాంధ్రములున్నవి. మొత్తమీ యెనిమిదియు వరుసగా ఎనిమిది పాదములందు పొందుపఱచబడినవి. అష్టభాషా సీసమను పేరు దీనికి తగియున్నది.

సీ॥ ణాయమాన స్విణీళోయ దమ్మిళ్ళ పజ్జణ్ణ యవిజ్జుళ్ళా సరిసపాయ

ఛాయః [నాకమన స్వినీలో కధమ్మిల్ల పర్జన్య కవిద్యుతి సధృశపాద.]

పురవదేవ్వ విదాణ గరువమరట్టు దుఃఖట్టజాద విజేఉ కళనసీహ.

ఛాయః [పూర్వదేవ వితానగర్వ మదోద్ధత గజజాత విజవన కలనసింహ.]

చళనశాళ శనిళంతళ భత్తచిందిత పళసమన్తన కేళిపాళియాద్

ఛాయః [చరణసారస నిరంతర భక్తచింతిత ఫల సమర్ధన కేళి పారిజాత.]

మకన సూతన ధేరతిత శవళ్ళ హముహగ నవిజ్జగల్లా నగునదుదీన

ఛాయః [మదనసూదన ధాత్రు త్రిదశవల్లభ ముఖ గణనీయ కల్యాణ గుణ ధురీణ.]

---

1. తిరుపతి "సాహిత్యసమితి వ్యాసావళి." జి. యన్. రెడ్డిగారి "పాశ్చాత్యభాషలలో చిత్రకవిత్వం" వ్యాసం.

తే॥గీ॥ కందక చళాచఖక్కాణ వంధురాశి
(గంధ గజరాజ రక్షణ బంధురాశి)
మహాయ ముఖధికరీ హేదుమహాషదురు
(మగువ ముఖాశ్చర్య హేతుసమ సమూహ)
(సంస్కృతం.) అజవంజవ జలధి మగ్నా త్తితరణి
(అచ్చతెలుగు.) మబ్బు పూవుట్టువు బిడారు మగువ తేఁడ

ఉదా:- (2) ఆదిభట్ల నారాయణదాసు. 19-5-1931.న చెప్పినది. పుట. 97.

సంస్కృత, పారశీకాంగ్లేయాంధ్ర చతుర్థభాషాసీసము. ఈ నాలుగు భాషలు వరుసగా సీసము నాలుగు పాదములందును కూర్పబడి, దిగువ తేటగీతిన ఆంధ్రాంగ్లేయ పారశీక సంస్కృతములు వరుసగా పాదముల రచించబడినవి.

సీ॥ భ్రాజతే కుక్కుటేశ్వర మాఁదవాలయాభ్యాం నభఖ్ఖంచి సౌధాంతరేణ
హాసిల్హా మీషజహా తాబ్నమాన బిహిషస్తు సౌఫీర్జిహేరసాల
రావు సూర్యారావ్రిరాజా బహాదుర్థి చారిటబిత్రాల్ ప్లెజంట్రెవ్రి
చదువుఁ పుట్టిల్లు చల్లగాలి న్వేదజల్లు బొగ్డలి వెల్లజల్లు

తే॥గీ॥ మేటిపంటల పెంకి కల్మిమెడ లంకి
బెష్టుటౌ విన్గొడావరీ యూస్టిసీజె
మర్జ పీర్వజవాజ్జవాల్ మీర్జనాన
పీఠికాపురమస్తి త్రివిష్టపమివ.

ఉదా:- (3) అష్టభాషాదండకము. చినతిరుమలాచార్యులు. 16వ శతాబ్ది.[1]

## [2] భాషామిశ్రమము

పద్యము మొత్తముమీద పలుభాషాపదములు వచ్చునట్లు రచించుట ఇందలి చిత్రము. ఏ భాషాపదమైన నేపాదములో ఎక్కడైనను రావచ్చును

ఉదా:- (1) పంచభాషి. చాటువు. మాలిక. ఇందుమూడు కందములున్నవి కందమాలిక అనవచ్చు. ఇందు తెలుగు, సంస్కృతము, హిందీ, తురకం, ఇంగ్లీషు భాషలున్నవి.

---

1. ఆంధ్రవాఙ్మయచరిత్ర. పుట. 52. ప్రచురణ. ఆంధ్ర సారస్వత పరిషత్. 1979.

కం॥ తా జీ ముత్రాజాలిడ
బాజాల్మా జార్లునిండ బాజూఘాజు
ల్జేజే ధ్వనివే జేయగ
బై జీరొజారు కండువా జల్తారా.

కం॥ పైజారుల పై జేరగ
గాజుల కరకంకణముల కాజాలసతు
ల్లాజలు వేజల్లగ సురి
ఖూజముక్రియ భూజనులకు భోజనములు బల్.

కం॥ ప్రైజులు తాజిమ్ముచు నా
గోజారావిజ గానకోజిష్ణుండే
యౌజామ్మీ నాజిబియని
యీజీగా జెప్పవచ్చునే జనుడైనన్.

[నాదెళ్ళ పురుషోత్తమకవి వ్రాసినది]

(2) ఆంగ్లాంధ్రముల పద్యములు.

1. సీస॥ నేర్పున రాజమండ్రి చెన్నవగరుల జదివి బీయేవయి పొదలి, యిర్వ
దేండ్లయీడున దెల్వియెసగ నయిన్సు: స్కూలు టీచరు పనిచేసి పిదప
బీయలై ప్లీడరీ పెరపున నల్పిసిటీస్కాటంధ్రి బోర్డ్సు సిడెంటువై తి
మెడ్రా స్లెజిస్లెటీ వ్మెంబరై వరుసగా బైకెక్కి యక్టింగ్గవర్నరువయి.

తే॥గీ॥ నేడు పైస్కాన్సలరు పని నెలపుచుంటి
వేర తెన్గు సీమకుదెల్గు వారికెల్ల
నిందు పేర్దెచ్చినావు నూరేండ్లవరకు
బెంపు మీఱంగ నీవు నీబిడ్డలెల్ల
నందరు న్మెచ్చ హాయిగా నలరినావు.

[సర్. కూర్మా వెంకటరెడ్డిని గూర్చి. ఆదిభట్ల నారాయణదాసు వ్రాసినది.
పుట. 50.]

2. ఇటువంటిదే వీరు చోడవరం డిస్ట్రిక్టు మునసబు బుర్రారాజ లింగశాస్త్రి గూర్చి వ్రాసిరి. [1]. వల్లవి.

---

1. చూ॰ ఆదిభట్ల నారాయణదాసు॰ పుట॰ ౬౩॰

"ఫెర్వెల్ఫ్రెవెల్ఫీ రాజలింగ-శర్వాబ్రిసిప పాదజల జాతభృంగ."

(3) వ్యవహారికాంధ్ర, హిందీభాషలు. రెండు కందములు

కం॥ బస్తాకు మూతుప్పైసలు, వస్తే రావచ్చు మీకు వాంఛదలిర్చన్
సస్తాగ సరుకు లిస్తుము, వస్తుంటే లాభమేమి పలుకడు త్వరగా.

కం॥ సస్తే నస్తిమి పాపా, వస్తామని మోటువారు వర్తకులకు మా
టిస్తే తప్పిమటంచును, మస్తానుల మాడ్కి మాటిమాటికి నగుచున్.

(అజ్మతుల్లాగారు. సంతను గూర్చి. చాటుపద్య రత్నావళి. పుట. 149.)

(4) శ్లోకములో సంస్కృతాంధ్రములు.

"అంబలి ద్వేషిణం వందే
చింతకాయ శుభప్రదం
కూరగాయ కృతాత్రాసం
పాలనేతి ప్రియం గవాం."

పైశ్లోకములో అంబలి, చింతకాయ మున్నగు తెలుగుపదములున్నట్లు కనబడుచున్నది. కాని అర్థము జూచినచో అదికూడ సంస్కృత పదాలే అని బోధపడును.

బలి = బలిని, ద్వేషిణం = ద్వేషించువాడైన, చింతకాయ = [తనను గూర్చి] చింతించువారికి, శుభప్రదం = శుభము కూర్చువాడైన, కు+ఉరగాయ = చెడుదైన సర్పమునకు (కాళీయునకు), కృతాత్రాసం = భయమును కల్గించువాడైన, గవాం = ఆవులను, పాలనే = రక్షించుటయందు, అతిప్రియం = మిక్కిలిప్రేమ కల్గినవాడును, అగు, అం = విష్ణుమూర్తికి, వందే = నమస్కరించుచున్నాను

(౮) అన్యభాషాపద్యములు

కేవల మాంధ్రేతర భాషలోనే వ్రాయబడిన పద్యము లివి.

ఉదా:- (1) ప్రాకృతసీసము నొకదానిని. ధరణిదేవులరామమంత్రి దశావతార చరిత్ర. పుట. 169లో వ్రాసెను. "అనుచుప్రాకృతో దితమై దగ్గి ప్రస్తుతింప" అను సందర్భానుసారము పద్యము వ్రాయబడినది.

(2) హిందూస్థానీలో రెండు పద్యాలను రామిసెట్టి పేరమదొరగారు తన యాదవాద్రీ శోపాఖ్యానమున వ్రాసినారు. 1. అందులో ఒకటి చూచుడు. [1-66]

---

1. మచిలీపట్టణము. ప్రింటు. 1౮౬౬.

కం॥ చెర్గయె పుథ్లా బావా, ఛూల్గయి మేరీసెదోస్తి పుథలీ యేకోః
బెల్గయి నాచ్తె నాచ్తె, దిల్గయి బత్తాయ్యె ముఝ్కో దేఖీభేజ్తీ.

3) ఆంగ్లములో పద్యము నాదెళ్లవారు వ్రాసిన జాబులోనిది.

కం॥ ఓమోస్టానర్బ్రారి, నై్మమెెండైథింకు దట్యూమై అనెస్టెప్రిం
డ్మెమెెండ్మీ ఎజ్వెన్నా, ఫ్రీమెన్ హుయుమ్యాశఫోజుదేపుడీప్ లైక్డ్.

4) గిడుగు సీతాపతి గారి 'భారతీ శతకము' వ్యావహారిక భాషలో వ్రాయబడినది.[1]

## ౯. అర్థ చిత్రము• (అనేకార్థ కావ్యాలు)

పదముల కున్న నానార్థములపట్టి, పదములు వేర్వేరు ఉచ్చారణా రీతిని బట్టి పద్యము నిర్మింపబడిన సందర్భ చిత్ర మున్నదని చెప్పవచ్చు. ఇట్లు కావ్యమున రెండు మూడు పద్యములనే గాక కావ్యము మొత్తమున ఈ అర్థవైచిత్రిని పాటించి రచన చేసిన కవులున్నారు. అట్టి కావ్యముల ననేకార్థ కావ్యము లందురు.

ఈ చిత్రమునకు మూలము శ్లేషాలంకారము. ఇది శ్లేషచమత్కృతిపై నాధారపడినది. ద్వ్యర్థి, త్ర్యర్థి మున్నగు కావ్య లుద్భవించుట దీని పరిణతి పర్యవసానమే యనవెల్లును.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక పుట 241 to 246 లలో కాశీభట్ట బ్రహ్మయ్య గారిచే శ్లేష యొక్క ఉపయోగ మిట్లు చెప్పబడినది. "తక్కువమాటలతో సరసముగా నెక్కుడు భావము గలిగించుటకు, కవి కల్పనలను స్వభావ సిద్ధము జేసి మెఱుంగు దెచ్చుటకును చాల వినియోగించు నిశ్లేష చదువరుల మనంబుల నద్భుతానందముల గూర్చును.

'పదశక్తి నొండుగా గూర్చి' అనెడి రామరాజ భూషణుని మాట శ్లేష సహజ శక్తిని చాటుచున్నది

ఉదా:- 1) అస్వాభావికముగాఁ గాన్పించు కథల స్వాభావికము చేయుటకు (వసుచరిత్రము).

2) ఒక్కపోల్కిల కథలఁ జమత్కారముగా నొక్కట దెల్పుటకు, (రాఘవ పాండవీయము)

3) శత్రువుల గూఢముగా దిరస్కరించుటకు (లంకా విజయము).

---

[1] ఆం. వా. చరిత. పుట. 102. ప్రచురణ• ఆంధ్రసారస్వత పరిషత్• 1979. గ్రంథకర్త• దివాకర్ల వేంకటావధానిగారు.

4) విరుద్ధాంశముల నొక్కటి ప్రౌఢముగా దెల్పుటకు (శృంగార వైరాగ్యములు కూర్చిన శతకము).

5) చదువ వింపుగా నుండని విషయముల మనోహరముగా దెలుపుటకు (లోలంబ రాజీయము).

6) మనోహరముగా నీతుల మనసున కెక్కించుటకు (కవి రాక్షసీయము).

7) చమత్కారమునకు (సుమనోభిరంజనాదులు).

ఈ రెండర్థముల కావ్య రచనము పైన తెల్పిన 7 విధముల ఉపయోగించుచున్నది.

పాశ్చాత్య అనేకార్థ కావ్యములలో హాస్యము మాత్రమేయుండును. తెలుగున శృంగార, వీర, కరుణ, హాస్య, శాంతరసములు ప్రధానముగ గలిగిన అనేకార్థ కావ్యము లున్నవి

సంస్కృతాంధ్రములలో అనేకార్థ కావ్యాలున్నవి.

పాశ్చాత్య భాషలలో కొన్ని శ్లేషచమత్కృతి గల వాక్యాలు, పద్యాలు గల వని జి.యస్. రెడ్డిగార క్రింది విధమున సోదాహరణముగ వివరించిరి.[1] ఇవి 5 ఉదాహరణములు. వానిని యథాతథముగ పేర్కొనుచున్నాను. "శ్లేషరచన కాంగ్లము"లో 'Paronomasia' అనిపేరు. Hebren, Greek, Latin ఇత్యాది భాషలలో కూడ కవులు శ్లేషచమత్కృతిని కొంత అభిమానించినారు.

1) అప్పులవాడు Sheridan దగ్గరకువెళ్ళి అసలూ వడ్డీ యిమ్మని అడిగి నపుడు అతడన్నాడట.

'It is not my interest to pay the principal nor itis my principle to pay the interest.'

2) Short road to wealth. అను పేరుతోగల ఈక్రింది పద్యంలోని శ్లేషచమత్కృతి గమనింపదగినది.

'I' ll tell you a plan for gaining wealth.
better than banking, trade or leases;
take a bank-note and fold it across
and then you will find your money increases,

---

1. తిరుపతి. "సాహిత్య సమితి వ్యాసావళి." "తెలుగు, పాశ్చాత్య భాషలలో చిత్ర కవిత్వము. పోలికలు" వ్యాసము. [మొత్తం 5 ఉదాహరణములు].

This wonderful plan, with out danger or less,
keeps your cash in your hands and with nothing to trouble it,
At every time that you fold it across
'T is plain as the light of the day that you double it.

3) women పదోచ్చారణలో కలిగిన మార్పుల్ని పురస్కరించుకొని ఒక రచయిత ఈ క్రింది పద్యంలో శ్లేషను పాటించి రచించినాడు.

When Eve brought woe to all mankind
Old Adam called her wo-man;
But when she wood with love so kind
He than pronouneed he woo-man.
ı ut now with folly and with pride
Their husband's pockets trimming
The ladies are so full of whims
The people call them whim-men.

4) **Rite, wright write, right.** ఈ పదాలకు సంబంధించిన శ్లేష చమత్కృతి.

Write we know is written right,
When we see it written write
But when we see it writted wright
We know it is not writtenright
For write, to have it written right
must not be written right or wright
Not yet should it be written rite
But write for so it's written right.

5) ఆంగ్లభాషలో శ్లేషకావ్యాలు లేవుకాని రెండర్థాల్ని సాధిస్తూ రచించబడిన పద్యాలు కొన్ని వున్నాయి. వాటికి Equivoques అని పేరు. ఇట్టి పద్యాలలో మొదటి పాదంతోపాటు వరుసగా అన్ని పాదాల్ని చదివితే ఒక అర్థం. బేసి పాదాలను మాత్రం చదివితే మరొక అర్థం స్ఫురిస్తుంది. ముసలి భర్తగల ఒక పడుచు

ఒకనాటి తన ప్రియునికి ఈ క్రింది పద్ధతిలో ఉత్తరం వ్రాసి తన భర్తకు చూపి పంపించిందట ఇది Equivoqueకు చక్కని ఉదాహరణ.

'I can't be satisfied my dearest friend !
blest as I am in the matrimonial state,
Unless I pour into your friendly bosom
Which has never been in union with mine,
the various sensations which swell.
With the live liest emotion of pleasure,
my almost hurting heart, I tell you my dear
husband is the most amiable of men
I have now been married seven weeks and
never have found the least reason to
repent the day that Joined us. My husband is
both in person and manners far from resembling
ugly, cross, old, disagreeble and Jealous
monsters, who think by confinning to secure
a wife, It is his maximum to treat as a
bosom friend and confident and not as a
play thing or menial slave, the woman
chosen to be his companian, Neither party
he says, should always obey implicitly
but each yield to the other by turns.
An ancient maiden aunt, near seventy
a cheerful, venerable and pleasant old lady,
lives in the house with us. She is the de-
light of both young and old. She is ci-
vil to all the neighbourhood around
generous and charitable to the poor,

I am convinced my husband loves nothing more
than he does me, he fathers me more,
than a glass, and his intoxication
(for so I must call the excess of his love)
Often makes me blush for the unworthiness
of its object, and wish I could be more deserving
of the man whose name I bear. To
say all in one word, my dear and to
Crown the whole - my former gallant lover
is now my indulgent husband, my husband
is returned and I might have had
a prince without the friendly I find in
him. Adien ! may you be blest as I am un
able to wish that I could be more happy ! "

సంస్కృతములో అనేకార్థకావ్యాలు.

సంస్కృత కవులు కొందరు తమ కావ్యములలో 'అర్థత్రయవాచీ' పేరుతో మూడర్థములు వచ్చునట్లు ఒకటి లేదా రెండు శ్లోకములు వ్రాసినవారున్నారు.

ఉదా:- భారవి. కిరాతార్జునీయము. 15-45.

'జగతీ శరణే యుక్తో హరికాన్తః సుధాసితః
దాన వర్షీకృతా శం నో నాగరాజ ఇవా బభౌ'.

ఇందు సింహము, ఐరావతము, శేషుడు గూర్చి వర్ణన మున్నది. ఇట్లే ఈశ్వర శతకము, దేవీ శతకము, శిశుపాలవధ మున్నగు వానియందొకొక్క త్రయవాచీకలదు.

చతురర్థి దేవీ శతకమున కలదు. ఇటువంటి చతురర్థి పద్యములను ధర్మఘోషుడు వ్రాసియున్నాడు.[1]

కావ్యములు: వీని వివరము కృష్ణమాచారిగారి 'సంస్కృతసాహిత్యచరిత్ర' నుండి గ్రైకొనబడినది.[2]

---

1. History of classical Sanskrit Literature by Krishna machariar. Print 1937. Madras. Page 372.

2. పై దే. పుటలు. 872 to 8?

వేంకటేశుని శ్లేషమాల,శ్రీనివాసుని శ్లేషచూడామణి, శివప్రసాదుని శ్లేషోల్లాసము, వేంకటాచార్యుని శ్లేషచంపూ రామాయణమ్. చిదంబరుని శ్లేషచింతామణి

చిదంబరుని 'రాఘవ యాదవ పాండవీయము- మూడు కథలను జెప్పును. పంచకల్యాణ చంపువు.—ఇది ఐదు కథలను చెప్పును.

ధనంజయుని—'రాఘవ పాండవీయము.' ద్విసంధాన కావ్యము.

'సప్త సంధాన' అని ఏడుగురి జీవితములు వివరించు గ్రంథము.

సోమప్రభ రచించిన 'శతార్థి కావ్యము' ఇందు నూఱర్థములుండును.నాగరాజు 'భవశతకము.' వేఱొక అర్థము గూఢముగ ఉండును. దానిని పాఠకుడు కనిపెట్టవలెను. కాని ఎల్లెన పద్యము చివర ఆ అర్థము పేర్కొనబడును.

భాస్కరసూరి శబ్దోదాహరణము. ఇందు రామకథ కలదు: ఇల్లొక అర్థమున వ్యాకరణము బోధించును.

సర్వసేవ 'హరి విజయము' నందు హరి విజయము కథయేకాక 'చదరంగము' ఆట విధానము గూడ కలదు.

తెలుగులో అర్థచిత్రము.

ప్రహేళికలను లోగడ గమనించితిమిగదా. అవి సాధించుటకు తోడ్పడు నర్థ వైచిత్రియే ఈ అనేకార్థకావ్యాల రచనకు దారితీసినది. శ్లేషాలంకారము మూలమైనది సంస్కృతములో అనేకార్థకావ్యాలున్నట్లు తెలిసికొంటిమి. వానిని జూచి తెలుగు కవులిట్టి కావ్యాలు వ్రాయుటకు పూనుకొనిరి.

సాహిత్యమున వైవిధ్యము తప్పనిసరి. ఏదో ఒక కొత్తదనము తమ కావ్య సృష్టిలో కనబడవలెనని, అందుకు రాజులచే మెప్పు పొందవలెనని కవులు తహతహపడిరి. అందుకు తగినట్లు పాటుపడజొచ్చిరి.

ఇట్టి కావ్యములు వ్రాయుటకు కవి కెనలేని శబ్దాధికారము,నపార పాండిత్యము లవసరము. పింగళి సూరన కళాపూర్ణోదయములో చెప్పిన భాషాగోపనమునకు, భాషానులోమ విలోమమునకు చెందిన పద్యములను లోగడ గమనించితిమిగదా. పదముల విఱుపుచే సంస్కృతాంధ్ర పదములు విడివడి అటు సంస్కృతార్థమును, ఇటు ఆంధ్రార్థమును బోధించును. ఇందుల కుభయభాషలలోను కవి పండితుడై యుండవలెను గదా. అట్లు రచింపబడిన పద్యము సంస్కృతాంధ్రభాషాద్వయ శ్లేష కుదాహరణముగా చెప్పవచ్చు.

ఒక్క పదములో రెండర్థములుండు నట్లొక పద్యము వ్రాయుట కష్టము. పద్యమందంతటను శ్లేషను పాటించి రెండర్థా లాపద్యానికే కల్పించుట మఱి కష్టము. అంతకుపై మెట్టుకుపోయి ప్రతి పద్యములోను ఆ రెండర్థాలను సాధించుచు కావ్యము మొత్తమటువంటి పద్యములతో నిర్మించుట ఇంకెంత శ్రమయో వేఱు చెప్పనవసరము లేదు.

రెండర్థాల కావ్యములో ప్రతి పద్యమొక అర్థమున నొక కథాంశమును, మఱొక అర్థమున వేఱొక కథాంశమును తెలుపుచుండును. అట్లు ఒక అర్థమున కావ్యము యావత్తు చదివిన ఒక కథ పూర్తిగా చదివిన వారమగుదుము. అట్లే వేఱొక కథ గూడ. అందువలన ఈ చిత్రమును కథాగోపనమని యనవచ్చు. రెండు కథలను బోధించు దానిని ద్వ్యర్థికావ్యమని, మూడింటిని తెలుపుదానిని త్ర్యర్థి అనియు, అట్లే చతురర్థి మున్నగు పేర్లతో పిలుతురు.

అర్థమును దాచియుంచుట ఇందు జరుగుచున్నది. కావున దీనిని అర్థగోపన చిత్రమని కూడ పిలువదగును.

తెలుగుకవులు కొందఱు తమ కావ్యములశ్లేష పద్యముల నక్కడక్కడ వ్రాసి పొందుపఱచిరి. మచ్చుకొండు రెండు చూచెదము.

ఉదా :_ (1) చేమకూర వెంకటకవి. సారంగధర చరిత్ర. 1_4

సీ॥ తనయభ్యుదయము నిత్యముగోరు నిజసహ్యా । ద్విజ బుధ వ్రాతంబు వేడ్కనుండ
గలెందు బొడగాన బడకుండ నడచినా । దమృతమే యీ రూప మయ్యెనన. గ
దనపాదములకును తమ తలలకు లంకె । పాటని దుర్గాధిపతులు వల్క
జల్లదనము గల్గు సన్మార్గవర్తి మేల్ । మాయన్న యని ప్రజల్ గాంచి మ్రొక్క
జార చోరాదులకు భీతి సంఘటిల్ల । నహిత చక్రంబు లల్లల నాడచుండ
నేలె నారాజు కువలయమింపుదనర । నాడితప్పక భరత మర్యాద వెలయ.

ఇందు రాజు_చంద్రుడు గూర్చి వర్ణన గలదు. అసలు రాజు గుణము వర్ణించుట శ్లేషలో చంద్రుడి వర్ణనము గూడ వచ్చినది.

ఉదా :_ (2) విక్రాలవారి.శ్రీ వేం.చి.ర.కరము.పూ.భా.పుట 24.

ఉ॥ నీవు సువర్ణకోశతతి నేతవు నేనును యట్టివాడనే
నీవు సమాశ్రితప్రియ కవీశ్వరు(దేనును నట్టివాడనే
నీవు ముఖ ప్రభాసుర విశేషకవిప్రథితండవేనునున్
భావభునీవు నేనును సెభాసర యంగను వేంకటేశ్వరా.

అర్థము : స్వామిపక్షమున. సువర్ణ=బంగారు, కోశ=బొక్కసములయొక్క, తతి=సమూహముగల, నేతవు=ప్రభుడవు

కవిపక్షమున. సువర్ణ=మంచి అక్షరములుగల, కోశతతి=గ్రంథసముదాయమునకు, నేతను=త్రిప్పుకొనుచుండువాడను.

స్వామి : సమాశ్రిత=పొందబడిన, ప్రియక=ఇష్టుడైన, వి=ఈశుడవు.

కవి :_ పొందబడుచుండిన, స్నేహితులైన కవీశ్వరులు గలవాడను.

స్వామి :_ ముఖమునందు చక్కగా ప్రకాశించుచున్న పుండ్రముచేత పేరుపొందిన వాడవు

కవి :_ ముఖోద్భవుడనగు (బ్రాహ్మణుడైన) వి=విప్రకాల, శే=శేషాచార్యుని, కవుల యందు పేరు పొందినవాడు.

స్వామి:_ భావమే స్థానముగా గలవాడు

కవి :_ భావ=పండితునివలన, (రామచంద్రాచార్యుల), భవు=పుట్టినవాడను.

ఈ కవియే 'హరి' శబ్దమునకు 12 అర్థములు వచ్చునట్లు 'హరిశబ్ద ప్రయోగ చమత్కారమ'ని ఒక పద్యమును (శ్రీ.వేం.చి.ర కరము ఉ.భా 32) రచించిరి.

ఉదా:_ (3) త్ర్యర్థి పద్యము. గ వేం కవి ప్ర.రా వేం వి వి 874.

కం॥ స్థిరసత్యా సక్తాశయ
నరకచ్ఛేదన ధురీణ నగరాజకరా
సరసాదర కమలోదయ
హరిహయ తనయా యజాహ్వయా వరమాత్మా.

ఇది త్రిమూర్త్యాత్మక త్ర్యర్థి కందము మొగ్గురు మూర్తులను త్ర్యర్థి పద్యమున వర్ణించుట పందర్భోచితముగ నున్నది.

4) త్రింశదర్థ పద్యరత్నం. పోకూరి కాశీపతి.

ఆ॥వె॥ భూరి జఠర గురుడు నీరజాంబిక భూతి
మహితకరుడ హీనమణికలాపు
డలఘు సద్గణేశు డగ్రగోప్పుడు మహా
మర్త్య సింహుడేలు మనల నెపుడు

ఇందులో 1. గణపతి 2. శివ 3. బ్రహ్మ 4 విష్ణు 5. ఇంద్ర 6 అగ్ని 7. యమ 8. నిర్ృతి 9. వరుణ 10. వాయు 11. కుబేర 1 . అష్ట దిక్పాలక 13. నవగ్రహ 14. సూర్య 15. చంద్ర 16. సముద్ర 17. మేఘ 18. హిమవన్న

గేశ్వర 19 ఆదిశేష 20. గరుడ 2 . గజేంద్ర 22. ఆంజనేయ 23. నందీశ్వర 24. వీరభద్ర 25. కుమారస్వామి 26. మన్మథ 27. నారద 28. దత్తాత్రేయ 29. విశ్వకర్మ 30. వీరబ్రహ్మ[1]. లనుగూర్చి వర్ణనమున్నది అనగా ఈ పద్యము ముప్పది వేర్వేరు విషయములనుగూర్చి అర్థము లొసంగు చున్నదని చెప్పవచ్చును.

శ్లేషకావ్యములు వేఱు అనేకార్థ కావ్యములు వేఱని తెలిసికొనవలెను. దాదాపు నిండుగా శ్లేష చమత్కృతి గలిగిన కావ్యము శ్లేషకావ్యము. ఉదా:— వసు చరిత్ర. ఇందొకే కథ ఉండును. ప్రతి పద్యమున రెండర్థముల రెండు కథలుబోధింప బడుచు కావ్యము మొత్తమట్లు నిర్మింపబడిన ద్వ్యర్థికావ్యమగును.

ఉదా :— రాఘవ పాండవీయము. ఇట్లే త్ర్యర్థి, చతుర్థ కావ్యములును.

తెలుగులో అనేకార్థ కావ్యములు మూడు విధములుగ కన్పడుచున్నవి. 1. ద్వ్యర్థికావ్యములు 2. త్ర్యర్థికావ్యములు 3. చతురర్థి కావ్యములు.

1. ద్వ్యర్థి కావ్యములు :

తెలుగులో మొదటి ద్వ్యర్థి కావ్యము రాఘవ పాండవీయము. రామాయణ భారతార్థములు రెండు జోడింపబడి వ్రాయబడినది. దీనికర్త పింగళి సూరన. ఇటు వంటి కావ్యము అద్భుతము గొల్పును కనుక చిత్రము క్రింద పరిగణింపదగును. ఈ కావ్య నిర్మాణ మద్భుత కార్యమని పింగళి సూరన యిట్లు చెప్పియున్నాడు.

[రాఘవ పాండవీయం, 1-10]

శా॥ రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింప శక్యంబు గా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబున నందునం దెనుగు కబ్బందద్భుతం బంద్రుడ
ఖండెవ్వాడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్.

ఏదో ఒకటి రెండు పద్యములుకాక కావ్యమంతటను ప్రతి పద్యమున రెండు కథల కర్థము వచ్చునట్లుగా రచింపలెనన్న చాల విధముల రెండర్థములు సాధింపవల సిన అవసరమున్నది. తానేయే విధముల ననుసరించి కృతార్థుడయ్యెనో ఈ క్రింది సీసములో పింగళి సూరన వివరించియున్నాడు. (రా.పాం 1-17).

---

1. వీని అర్థ వివరణము కొరకు త్రిపురనేని సుబ్బారావు "కవిసింహా కాశీ పతి—జీవితం• సాహిత్యం" గ్రంథ అనుబంధము. పుటలు. 75 to 89.

సీ॥ ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొకచోఁ నొక్కొక్కచోట
నుచిత శబ్ద శ్లేష యొక్కొకచోట స
ద్ధశ్లేష యొక్కొకతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేష ఘటన యొక్కొకతఱి
నర్థాన్వయము వేరె యగుచునునికి
శబ్దాన్వయ విభేద సంగతి యొక్కొక్క
తఱినివి యొక్కొక్క తఱిని రెండు
తే॥ గీ॥ మూఁడు గూడుఁ యునన సముజ్జ్వలముగ
నాకు దోచిన గతి బెక్కు పోకలమర
రామ భరత కథలు పర్యాయ దృష్టి
జొచు సమతుల కేర్పడ నాచరింతు

ఇట్లే పెక్కు పోకడలతో శ్లేష చమత్కృతిని పాటించి త్ర్యర్థి చతురర్థి కావ్య నిర్మాణము చేయుచుందురు.

రాఘవ పాండవీయమునుండి మచ్చుకొక పద్యము.

కం॥ వినియతనిం దనపైనిడు
కొనియేగి నియమికి దగని ఘోరార్తి యొన
ర్చినవాడ మీకు దండ్యుఁడ
నని తను దెలుపుచును వారి కప్పనసేసెన్. [1–28]

రామాయణ పరమైన అర్థము.

పై ఘట్టములో దశరథుడు మునిబాలుని ఏనుగనుకొని చంపిన పిదపఅతనిని దీసికొని తల్లిదండ్రుల కప్పగించును

భారతపరమైన అర్థము : ఒక ముని తన భార్యతో లేడిరూపమున క్రీడించు చున్నప్పుడు పాండురాజు వారిని చంపును. తర్వాత పశ్చాత్తాపము 'విని యతనిందన పైనిడుకొని' అనగా నిందను తనపై మోపుకొని, అని అర్థము.

ఇంకను ద్వ్యర్థి కావ్యములు:

2. రామరాజ భూషణుడు—హరిశ్చంద్రనలోపాఖ్యానము.

3. పింటిప్రోలు లక్ష్మణకవి-రావణదమ్మీయము లేదా లంకావిజయము.

4 బుక్కపట్టణం వేంకటాచార్యుడు_అచలాత్మజాపరిణయం.
5. పోడూరి పెదరామామాత్యుడు_శివరామాభ్యుదయము.
6. మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి_కృష్ణార్జున చరిత్ర. (సుభద్ర పారిజాతాపహరణ కథలు జోడింపబడినవి.)
7. కొత్తలంక మృుంత్యుం జయకవి_ ధరాత్మజాపరిణయము
8. సింగరార్య కవి_రాఘవవాసుదేవీయము.
9. చెన్నకృష్ణకవి.యాదవ భారతీయము.
10 మరింగంటి సింగరాచార్యులు_రామకృష్ణవిజయము (అలభ్యము.)
1 . కృష్ణాధ్వరి_నైషధపారిజాతము.
12. గాదేపల్లి కుక్కుటేశ్వరరావు_యేసుకృష్ణీయము.
13. విక్రాల శ్రీనివాసాచార్యకవి_సౌగంధిక పారిజాతీయము. (భారత భాగవత కథాశ్లేష కలది.)
14. శ్రీపాద వేంకటాచలకవి_రామకృష్ణోపాఖ్యానము.
15. మైనముపాటి కామేశ్వరామాత్యకవి_యాదవ రాఘవీయము.
16. రావిపాటి లక్ష్మీనారాయణ_భారతగర్భ రామాయణము. (మొత్తము పద్యము రామాయణార్థమునుగర్భితపద్యము భారతార్థము నిచ్చుచుండును.
17. కొత్తపల్లి సుందర రామకవి వసుస్వారోచిషోపాఖ్యానము. వీనిలో కొన్ని విక్రాలవారు తెలిపిరి.[1]

2. త్ర్యర్థి కావ్యములు

మూడు కథలనుజెప్పు కావ్యములను త్ర్యర్థి కావ్యము లందురు. ప్రతి పద్యములో మూడుకథల కర్థము వచ్చునట్లు రచియించుట ఇందలి అద్భుతకార్యము.

ఉదా:_ (1) నెల్లూరి వీరరాఘవకవి_యాదవ రాఘవ పాండవీయం. ఇందు కృష్ణునికథలు, రామాయణ, భారతకథలు చెప్పబడును.

అందుండి ఒక పద్యము కథాప్రారంభము_1.

ఆ॥ వె॥ శ్రీలకిరవు బహుళ సితభాను కులులకు
నాటపట్టు సజ్జనాస్పదంబు
మహి నయోధ్యకాంతి మధురసాలోజ్జ్వల
నాగపురి దనర్చు నవ్యలీల.

1. "కథాద్వయ కావ్యములు" వ్యాసము. భారతి. 1958 జూన్

యాదవకథ : శ్రీః కు+ఇరవు=సంపదలకు స్థానము, బహుళసితభాను+కులు లకున్+ఆటపట్టు=పలువురు చంద్రవంశపు రాజులకునికిపట్టు, సజ్జన+ఆస్పదంబు= సజ్జనులకుచోటు, మహిన్=భూలోకమున, కాంతిన్=తేజమున, అయోధ్య=జయింప నలవికానిది, సాల+ఉజ్జ్వల=ప్రాకారములచే శోభావంతమైనది, మధుర+నాగ+ పురి=మధుర అనే పట్టణము, నవ్యలీలః నూత్నవిలాసములతో, తనర్చు=ఒప్పు

రాజులైన యాదవులకు ముఖ్యపట్టణము. మధుర.

పాండవకథ: మధుర=ఇంపైనది, చూడచక్కనిది, నాగపురి=హస్తినాపురము (కురుపాండవుల రాజధాని) నవ్యలీలల దనర్చును. చంద్రవంశపురాజులైన కురు పాండవులకు రాజధాని హస్తినాపురము.

రాఘవకథ: బహుళసిత భానుకులులకు-విఖ్యాతిగాంచిన సూర్యవంశ క్షత్రియులకు, మహిన్+అయోధ్య+నాగపురి తనర్చు=అయోధ్య అనెడి పట్టణము కలదు. సూర్యవంశరాజుల రాజధాని అయోధ్య

ఇంకను త్ర్యర్థి కావ్యములు :

(2) అయ్యగారి వీరభద్రకవి-రాఘవ పాండవ యాదవీయము.

(3) ఎలకూచి (భట్టర) బాలసరస్వతి. రాఘవ యాదవ పాండవీయము.

(4) పోకూరి కాశీపతి. సారంగధరీయము. (ఇందు శివ, చంద్ర, సారంగ ధరుల పేర్లు మూడు కలిసి వచ్చేటట్లు సారంగధరీయము అని కావ్యము పేరు. సరి పోయినది.) సారంగధరుడైన ఈశ్వరుని కథ, (పార్వతీ కల్యాణం), మృగాంకు డైన చంద్రుని కథ (తారాశశాంక ప్రణయగాథ.) రాజరాజ నరేంద్రుని కుమారుడైన సారంగధరుని కథ జోడింపబడి కావ్య నిర్మాణము జరిగినది.

8. చతురర్థి కావ్యములు

(1) "నలయాదవ రాఘవ పాండవీయము." తాను రచించినట్లు మరింగంటి సింగరాచార్యులు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము కృత్యాది 17వ పద్యములో ఇట్లు చెప్పుకొనినాడు.

"నల యాదవ రఘు పాండవ
నలలి తురీయార్థ కావ్య సంశ్లేష కృతుల్
యెలమి దశసప్తహాయన
మలవడు కాలంబునందు నతిమధురోక్తిన్."

కాని నేడీ కావ్య మలభ్యము

54)

(2) ఓరుగంటి సోమశేఖరుడు : రామకృష్ణార్జున రూపనారాయణీయము.
ఈ "అనేకార్థ కావ్యములు" ప్రత్యేక పరిశోధనాంశమే.

## 7. అచ్చతెలుగు

K. V. సుందరాచార్యులుగారు అచ్చతెలుగును గూర్చి తమ సిద్ధాంత గ్రంథము అచ్చతెలుగు కృతుల పరిశీలనము,[1] లో వివరించిరి.

"అచ్చతెలుగు సహజమైన భాషాప్రవాహమనియు, తెలుగు సాహితీ మూర్తులు కృతకమగు మిశ్రాంధ్రమున కలవాటుపడి అచ్చతెలుగును కృతకభాషగా పరిగణించుచున్నారనియు, అచ్చతెలుగు సాహిత్యమంతయు చిత్రకవిత్వముగ తలంచుట భావ్యము గాదనియు" ఆచార్యులగారభిప్రాయపడిరి.

మొదటగా తెలుగు కావ్యరచనము సంస్కృత, తత్సమ, తద్భవ దేశ్య పదములతో నొనరింపబడినది. అది కృతకమని, మిశ్రాంధ్రమని ఆచార్యులగారనిరి. కాని అది కృతకము, మిశ్రాంధ్రమన గూడదు. తెలుగన జెల్లును. అచ్చతెలుగు సహజమైన భాషాప్రవాహమన్నారు సుందరాచార్యులుగారు. అది నిజమే. కాని మనకు నేడు లభ్యమగు అచ్చతెలుగు కృతుల యందలి భాష కృతకము. భాషలోగల సంస్కృత, తత్సమ పదజాలమును నిషేధించి వ్రాయుట అనెడి నియమముతో ఏదో ఒకటి రెండు పద్యములు తమ కావ్యముల కవులు మొదటగా చిత్రించిరి. దానిని గమనించి కావ్యము మొత్తమూ నియమముతో తర్వాతి కవులు వ్రాయుటకు మొదలిడిరి. ప్రయత్నించి వ్రాసిరి. దీనికి అచ్చతెలుగని పేరిడిరి.

కొన్ని అక్షరములను (ఓష్ఠ్యములను) నిషేధించి నిరోష్ఠ్య కావ్యములు కవులు వ్రాసినట్లే, భాషలో కొన్నిపదములు నిషేధించి అచ్చతెలుగు కావ్యములు వ్రాయుట జరిగినది. నిరోష్ఠ్యరచనము, అట్టి కావ్యములు చిత్రకవిత్వముగ పరిగణించి నప్పుడు అచ్చతెలుగు రచనము, ఆ కావ్యములు చిత్రకవిత్వము క్రింద చెప్పవీలగుననినే నభిప్రాయపడుచున్నాను.

అచ్చతెలుగు రచనము కష్టసాధ్యము. ఒక అద్భుతకార్యమే యగును. అట్టి పద్యరచనముతో కావ్య మాసాంతము నిర్వహించుట ఒక ఘనకార్యము. ఈ

---

1. ఉస్మానియా విశ్వవిద్యాలయములో "పరిశోధన గ్రంధం." ఏప్రియల్ 1978.

విషయమునే మొదటి అచ్చతెలుగు కావ్యకర్త పొన్నెగంటి తెలగన యిట్లు చెప్పెను.

"అచ్చ తెనుంగు పద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుండురది యెన్నుచు పెద్దలు క్రొత్త మెల్ల ని
ట్లచ్చ తెనుంగు నన్నొడువ నందుల చంద మెఱుంగు వారు నిన్
మెచ్చరొ యబ్బురంబనరొ మేలనరో కొని యాడరో నినున్."

ఇట్లు సంస్కృత తత్సమ శబ్ద నిషేధముగ ఒక నియమబద్ధమై యుండుటను బట్టియు, "అబ్బురంబనరో" అని పొన్నె కంటి తెలగన అన్నట్లచ్చ తెలుగు రచన మాశ్చర్య హేతువగుట చేతను, అచ్చతెలుగు చిత్ర కవితా భేదమని భావింపదగును.

తెలుగు ప్రజలకు రుచిభేదము కూర్చుటలోను తమ ప్రతిభా పాండిత్యములో ప్రదర్శించుట కొరకై తేనేమి, కవిత్వములో క్రొత్త దనము వెలయించుట కొఱకై తేనేమి కవులచే అచ్చతెలుగు కావ్యాలు సృజింప బడినవి.

తెలుగు కవులచ్చ తెలుగు కావ్యాలు వ్రాయ లేరనెడి సంస్కృత కవుల యాక్షేపణగూడ

అవి ఉద్భవించుటకు కారణమై యుండ నోపు. అచ్చతెలుగు కావ్యరచనమే చిత్రమైతే అందులోను పెక్కు చిత్ర కవితా రీతులు ప్రదర్శింపబడినవి

బిరుద నామములను మాత్రము తత్సమములను కూర్చి దేశ్య, తద్భవ పద జాలముతో రచన చేయుట అచ్చ తెలు గనబడినది.

అచ్చ తెలుగులో గూడ సమాసరచనమునకు వీలున్నది.

"నెల తాతీనియ సంతసంపు మగఱా నీరాళ పుంగొప్పటా
కుల నిద్దంపు బసిండి నున్ననికె నిగ్గుల్ దొట్టు కట్టాడిపూ
సల మేల్పొల్పు మెకంబు చెక్కడపుకీల్ జాగాజగా గద్దియన్
జెలు పెచ్చ న్గొలువుండె నెల్లరులు జేజేయంచు(ద న్గొల్వగన్."
[గ.వేం కవి. ప్ర రా.వేం. వి వి. 126 పద్యము].

యమక మిట్లున్నది.

కం॥ మిన్నా పడు ముల కలువల
మిన్నా నెఱి చూపు మేలి మిన్నలు వెన్నన్
వెన్నా పలుకులు చక్కని
ఫెన్నా యన టాకు కలిమి వెలదికి గనగన్,

వర్ణనమున కచ్చ తెలుగున చోటున్నది.

తిరుపతి వేంకటకవుల హరిహరుల వర్ణన మీ క్రింది విధము.

సీ॥ తాల్చె నెవ్వాడు కెందమ్మి దండంబోలె
నెదు తొమ్మపై సిరులిచ్చుదాన
మ్రింగె నెవ్వాడు నేరెడు పండు చందాన
గడలిలో బుట్టిన కాఱు విసము
పూనె నెవ్వడు వెన్నముద్ద కుద్దిగ నేల
నెల్ల సంచుల నింపు నల్ల సంకు
ఆన నెవ్వడు మల్లె యలరు గుత్తులపేరు
పోల్కిగా మెడనిండ బున్నదండ

వే వెలుంగుల దొరయును రే వెలుంగ
నెవని కన్నులు విప్పుగ న్నెవని కెక్కు
డట్టి మున్నీటి యల్లుడు నట్టి మంచు
కొండ యల్లుండు మీకు గోర్కులొసంగు

మరియొక ఉదాహరణము. కం॥ డాలా పిక్కలు కొంబన
డాలా కెమ్మోని తమ్మి డాలా యడ్గుల్
వాలా చూడ్కులు నును సన
రాలా జడతీవి బొంగరాలా చున్నల్.

[తంయాల లక్ష్మీ నృసింహా చార్యులు. కుబ్జా కృష్ణ విలాసము. 2-18].

పద్యరచనము జారువారినట్లు నల్లేరుపై బండి నడకవలె సాగుటకు కూడా ఇందు వీలున్నది. అచ్చ తెలుగు రామాయణముశుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రాదులందు కుదాహరణములు. అచ్చ తెలుగు రచనా నియమము కథా భాగము నందే కాక,షష్ఠ్యంతముల యందు గూడ కొంతమంది కవులు పాటించిరి అచ్చ తెలుగులో అతివాదులు నామములకు మారుపేర్లు కల్పించుకొనిరి. కాని అది సరసముగా తోచుట లేదు.

అచ్చతెలుగు ప్రబంధములలోని చిత్రబంధ గర్భ కవితల గూర్చి ఆయా చిత్రకవితా భేదములలో వివరించుట జరిగినది.

అచ్చతెలుగు కావ్యకర్తలు 54 మందిగాను, అందులో అచ్చతెలుగు నిఘంటకర్తలు పదునేడు గురుగాను, మొత్త మచ్చతెలుగు రచనలు 80పై చిలుకు

గాను సుందరాచార్యులుగారు గుర్తించిరి. నిరోష్ఠ్య చిత్రమున కొన్ని శుద్ధాంధ్ర రచనలు పేర్కొనబడినవి.

పొన్నెగంటి తెలగన యయాతి చరిత్రనుండి మచ్చుకొక పద్యము చూచెదము. [5-1.]

కం॥ సిరిరాచ వేల్పు! కడు నీ
ఎరి తనమున నీటి దాల్పు! వలమురి సుడివా
ల్దొర వంటి యొప్పుగలదే
వరజాణ యమీను ఖాన వలపుల జేడా.

8. నిర్వచన కావ్యములు.

తెలుగు వాఙ్మయములో మొదట పుట్టిన ఉద్గ్రంథములు పద్యకావ్యములైనను ఎడనెడ వచనము అందు గలవు. ఆ కొంచెము వచనము గూడ లేకుండ పద్య కావ్యము వ్రాయుట ఈ నిర్వచన కావ్యముగా చెప్పుకొనవలెను. ఇది పెద్ద విశేషమైన చిత్రము కాదు. ఈ నిర్వచన కావ్యములను పెక్కుమంది కవులు వెలయించిరి.

ఆశ్వాసాంత గద్యలో కూడా ఈ నిర్గద్య నియమము కొంతమంది కవులు పాటించిరి. ఉదా:- నాదెళ్ళవారి. గురుభక్తి ప్రభావము.

ఈ చిత్రమున కాద్యుడు తిక్కనామాత్యుడు. అతని గ్రంథము నిర్వచనోత్తర రామాయణము

1. నిర్వచన మిశ్ర విందోద్వాహము - తూము రామదాసు.
2. కుమారి సంభవము - త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయకవి.
3. రాప్తాటి నిర్వచన రామాయణము. రాప్తాటి ఓబిరెడ్డి.
4. గురుభక్తి ప్రభావము. } నాదెళ్ళవారు.
5. కృష్ణానదీ మహాత్మ్యము. }
6. భగవద్గీతా - అగస్త్యరాజు సుబ్బారాయుడు.
7. నీతి చంద్రిక - మల్లాది లక్ష్మీపతి శాస్త్రి.
8. కలిపురాణము - కొత్త సత్య నారాయణ చౌదరి.
9. భారత గర్భ రామాయణము - రావిపాటి లక్ష్మీనారాయణ.
10. చతుర్ముఖ రామాయణము —గాదెపావరాజు
11. మహా భారతము. } బులుసు వేంకటేశ్వర్లు.
12. ఆధ్యాత్మ రామాయణము. }
13. మహాభాగవతము }

అచ్చ తెలుగులో నిర్గద్య కావ్యము - దాశరధి చరిత్ర—అబ్బరాజు హను మంతరాయ శర్మ పాకయాజి

### 9. చిత్ర మిశ్రమము.

రెండు లేదా అంతకంటె పెక్కు చిత్రములు కలిపి వ్రాయబడిన పద్యము చిత్ర మిశ్రమము క్రింది చెప్పబడును. దానినీ క్రింద విధముగ విభజింప దగును. 1. ద్విచిత్ర మిశ్రమము. 2. త్రిచిత్ర మిశ్రమము. 3. చతుశ్చిత్ర మిశ్రమము.

మొత్తము మీద ఈ మూడు మిశ్రమములలోను 1. శబ్ద చిత్రము 2. ఆకార నియమచిత్రము 3. గూఢ చిత్రము 4. ఇతర చిత్రము. లను నాలుగు చిత్రములలో ఏ వేని కలిసి యుండును.

1. ద్విచిత్ర మిశ్రమము.

1) శబ్ద చిత్ర, గూఢ చిత్రమిశ్రమము.

ఉదా :- గ వేం.కవి. - ప్ర రా.వేం. వి.వి. 832. దండకము ఇందు

1) అచల జిహ్వాకోష్ఠ్య వర్ణ భుజంగ ప్రయాతము 2) నిరోష్ఠ్యాచల జిహ్వ స్రగ్విణీవృత్తములు గలవు.

2 విక్రాలవారి- శ్రీ వేం చి.ర కరము. ఉ. భా. పుట. 74 దండకము.

ఇందు 1) ద్విస్వర నిరోష్ఠ్య స్రగ్విణి వృత్తము 2) ద్విపద 3) సీసము.

3. ఈశలపల్లి భవానీశ. ధర్మఖండము. నిరోష్ఠ్య కందగర్భిత మణి గణ నికరము [4-270]

4. రావిపాటి లక్ష్మీనారాయణ ని భా రామా 33 నిరోష్ఠ్యము కందగర్భ గీతము.

5 నిరోష్ఠ్య కావ్యములలో గర్భిత పద్యము లన్నియు ఈ శబ్ద గూఢ చిత్ర మిశ్రమము క్రింద చెప్పుకొనదగును. ఉదా:- పురుషకారి కేశవయ్య-నిరోష్ఠ్య దాశ రధీ చరిత్ర కావ్యము [1-116]

ఇందు ద్విపద, శోభనధవళసువ్వాల త్రివిధ మంగళహారతి జంపె కతాళార్ధ చంద్రికా కోలువద చౌవదదరువు లాలి పద ప్రముఖ నిఖిల భేద వివిధ ధాటీ సీస పద్యము.

6. కందగీతగర్భ చంపకమాల నిరోష్ఠ్యము 2 76 శ్రీ నందిరాజు లక్ష్మీ నారాయణ దీక్షిత చరిత్ర-అబ్బరాజు హనుమంతరాయశర్మ

౬) శబ్దా, కారనియమ చిత్ర మిశ్రమము.

1. గ. వేం. కవి. ప్ర. రా వేం.వి.వి. 851 కందము. ఇందు నిరోష్ఠ్యము, పుష్పమాలికా, గోమూత్రికా, గుచ్ఛ, హల, ఛత్ర బంధము లున్నవి.

కం॥ శ్రీనకనక నయన ధన
జ్ఞాన కన ధ్యానసాన సనక నదీనా
ధ్యాన జనన నగనటన
స్థాన జనస్థాన హీనజన ఘనహసనా.

2. ప్ర.రా. వేం.వి వి. 377. ఇందు ననులోమ విలోమ, నిరోష్ఠ్య అచల జిహ్వ మున్నగు శబ్ద చిత్రములు, గోమూత్రిక, చక్ర మున్నగు వివిధ బంధములు కలవు.

3. విక్రాలవారి శ్రీ.వేం.చి.ర. కరము. ఉ. భా. పుట. 70 విద్యున్మాలా వృత్తము అది 'రామా' రెండక్షరములతోనే నడచినది. ఇందు ద్వ్యక్షరి ఏకస్వరం 'ఆ' అనుశబ్ద చిత్రములు, కంకణ బంధము కలవు.

4. పై గ్రంథము పూ భా పుట. 46 శ్లోకము, అనులోమ విలోమము, మాలికా బంధములు కలవు

5. నిరోష్ఠ్య కావ్యము లన్నింటిలోను బంధములు వ్రాయబడిన పద్యములు, ఈ చిత్ర మిశ్రమము క్రింద చెప్పుకొనదగును.

ఉదా:- పుష్పకారి కేశవయ్య దాశరధి చరిత్ర 8-137 పుష్పమాలా బంధము, 3-139. సర్వతోభద్ర బంధము

6. నిరోష్ఠ్య బంధశత గర్భిత ఛత్రబంధ శ్లోకము. మండపాక పార్వతీశ్వర శాస్త్రి కాశీవిశ్వనాథ శతకములోనిది [1]

రాక రాక త్రిరా కారా
రాజ తాగ గతాజరా
రాగాసార రసాగారా
రాకా రాత్రి కరాకరా

---

1. అముద్రిత గ్రంథ చింతామణి, ప్రింటు 159. ప్రబంధ సంబంధ బంధని బంధన గ్రంథముగూర్చిన వివరణములో గలదు.

7. త్ర్యక్షరీ కంకణ బంధము. దామెరల అంకన్న ఉషా పరిణయం. పుట- 44.

౨. ఆకారనియమ, గూఢ చిత్ర మిశ్రమము.

1. గ. వేం. కవి ప్ర రా వేం వి.వి. 827. కందము గోమూత్రికా చతుష్కందము చిత్రము లిందుగలవు.

2 పై గ్రంధమున 831 సీసము నాగబంధము, మంజరీగతి గర్భిత సీస మిది.

3. పై గ్రంధమందలి 826 చంపకమాల. ఇందు ప్రమితాక్షర, కంద, నాగ బంధములు కలవు.

4. ఇంకను 870 విద్యున్మాలా వృత్తగర్భిత స్రగ్ధర అష్టదళపద్మ బంధము కూడ ఇందు కలదు.

5 863. స్రగ్ధర ఇందు కంద, మదన విలసిత, శ్లోకము, పుష్పమాలికా బంధములు.

6. విక్రాలవారి శ్రీ.వేం.చి.ర.కరము ఉ భా. పుట. 38 ఖడ్గ, కుంత, నాగబంధములు, కందద్వయ గర్భితములు కలవు.

చం॥ ఖలబలకాల పాలయన ఘూర్ణిళిని స్థల ఖేల నాఘనా
బలిబలహార పాలన భవాభళి? నన్దలవాల వానభా
ఖల ఖలహా దవాలివక గాకకళ స్త రసాల వీనగా
కులబలకాలతాల ఒకకోక లఘుప్రద లీలశ్రీశకా.

మొదటి కందము 'బలకా........బలహా
బలహా........ఖలహా'—ఇది ఖడ్గబంధము

రెండవ కందము 'ఖలహా........బలకా
బలకా........శ్రీశకా ఖలబలకా-ఇది కుంతబంధము.

మొత్తము పద్యము-నాగబంధము.

7. పై దాని పుట 67లో కందగీత గర్భిత చంపకమాల, పుష్పమాలికా బంధము.

8. నాదెళ్ళవారి చతుర్ముఖి కందరాజము. 'వరదాత్రిమాత' పద్యము. ఇందు గోమూత్రికా బంధమున్న ది.

9. రావిపాటి లక్ష్మీనారాయణ వి భా.రామా. 70 పద్యము కందగీత గర్భిత చంపకమాల నాగబంధమిందున్నది.

10. చిత్రకవి పెద్దన ల.సా.సం. 3_108 సీసము. ఇందు కందము మత్తేభములు గూఢములు ఖడ్గబంధమున్నది.

11. నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి. శ్రీ హనుమద్రామాయణము యుద్ధ కాండ. 698 పద్యము. కందము ఇందు తృతీయ పాదగోపనము, రథ బంధము కలవు.

12. అనుష్టుప్ గర్భ పంచపాది గీతాంచిత షోడశదళ పద్మబంధ సీసము కొక్కొండవారి బిల్వేశ్వరీయము. 4_110

13 అష్ట విధ కంద కంకణ బంధము. దామెరల అంకన్న ఉషాపరిణయం. 3 ఆశ్వాసము. పుట. 93.

14. చతుర్విధకంద ఖడ్గబంధము. చింతలపల్లి వీరరాఘవకవి_మధుర వాణీవిలాసము [2_10]

15. చిత్రసీసము. ఇందు వివిధ వృత్తములు: కంకణ బంధాది బంధములు కలవు ముక్తివి వెంకట తిరుమలదాసు. రామాయణ సారసంగ్రహము. కిష్కింధా. 'వాక్యగురు పరంపరార్థము' గ్రంధము ప్రింటు. 1918.

16. మత్తేభ గర్భ సీసము. రధబంధము_ముక్తి నూతలపాటి సీతారామయ్య. వేణు గోపాల శతకములో 'విజయ యజ్ఞాహిత' పద్యము.

4) శబ్దార్థ చిత్ర మిశ్రమము.

1. తంగెడ గంగనామాత్యుడు. ఈ. అం.వి.ని. హరిశ్చంద్రోపాఖ్యానము. నిరోష్ఠ్యము, ద్వ్యర్థి చిత్రములు కలవు. కావ్యము ద్వ్యర్థి కనుక పద్యములో రెండర్థము లుండును. నిరోష్ఠ్య కావ్యము గూడ గనుక నిరోష్ఠ్య చిత్రమందు కలదు[1]

2. అనేకార్థ కావ్యములలోని శబ్ద చిత్ర పద్యము లీ చిత్రమిశ్రమమున జేరును.

3. ఉభయ భాషార్థానులోమ విలోమ కందము అల్లమరాజు సుబ్రమణ్యకవి. భద్రా పరిణయం. 4_20

---

1. దశరథరాజ నందన చరిత్ర పీఠిక పుట. 51. నిర్వహణ శ్రీ రంగాచార్య ప్రచురణ ఆం.ప్ర.సా. అకాడమీ 979.

మాఘుగ రవదే నమవర
గానునసీ తేరిలనవగా నివిడినురా
రానుడి వినిగావ నలరి
తేనీ నను గారవమని దేవరగనుమా.

పద్యమును మొదటి సగము క్రమముగ జదివినపుడు సంస్కృతమును తల క్రిందుగ జదివినపుడు తెలుగున చివరిరెండు పాదములగును. కావున మీది పేరుసార్థకము. పదవిచ్ఛేదము సంస్కృతం. మా, అనుగరవత్. అవ, రగానున సీతే, అరిలనవగా నివిడినుర, అ. తెలుగు: చివరి రెండు పంక్తులు రానుడి,విని, కావన్ అలతిరి, ఏన్, ఈననున్, గారవము, అనన్, దేవర, కనుమా!

ట) గూఢ చిత్రార్థ చిత్ర మిశ్రమము.

1. రావిపాటి లక్ష్మీనారాయణ-ని.భా. రామా కావ్యము గూఢాచిత్రముల మిశ్రమమున కుదాహరణము ఇందు ప్రతి పద్యము మరియొక పద్య గర్భిత మయి నందున గూఢ చిత్రము, రామాయణార్థము వచ్చు పద్యమున భారతార్థ మిచ్చు పద్య ముండి ప్రతి పద్యము రెండర్థముల నిచ్చుచుండును గనుక అర్థ చిత్రము గలవు. ఉదా:- తేటగీతి గర్భసీసము. పుట. 7. పద్యము 20

సీ॥ ప్రతిభవెల్గె ఘనుడు పాండు సమాఖ్యుడా
జనవరా నుగ్రహమున కనేక
నృపులు వేచెదరు తది నసామ్య తేజుండు
నెవ్వు డన్న నుడల చొవ్వవిడడు.
రమకోరి దిగ్విజయముజేసె కుంతిమ
ద్రక్షోణి విభుముఖ్య రాజతతుల
మించి కౌసల్య సుమిత్ర గేకయధాత్రి
ధవతన యల గొనె దయితలుగను
తే॥గీ॥ సంతులేక విచారించె స్వాంతమందు
శ్రీ విచారించె గురువు వసిష్ఠుతోడ
ఋశ్య శృంగు దెచ్చె నిజపురికి బురజను
లెలమి మిన్నంద బుత్రకామేష్టి సలిపె
ఈ సీస పద్యము మొత్తము రామాయణార్థము నిచ్చును.

ఇందలి తేటగీతి.

ఘనుడు పాండు సమాఖ్యుడా జనవరాను
జుండు నెప్పుడన్న నడుల చొప్పువిడడు
కోరి దిగ్విజయము జేసె కుంతి, మద్ర
ధాత్రిధవతనయలఁ గొలె దయితలుగను

ఇది భారతార్థము నిచ్చును. కాని ఈ భాగమే సీసములో రామాయణార్థము కూడ ఇచ్చుచుండుసుగదా. కనుక గర్భస్థ పద్యము ద్వ్యర్థియగును. ఈద్వ్యర్థి యర్థమును చూతము. పాండు సమాఖ్యుడు-తెల్లని కీర్తిగలవాడు (రా) పాండురాజు (భా).

అన్ననుడుల చొప్పు=పలికిన మాటలదారి. (రా) అగ్రజుని మాటల దారిని (భా)

పదవిభజనముచేత పెద్ద పద్యములోని ద్వ్యర్థిని సాధించుట జరిగినది. ఎట్లన పై పెద్ద పద్యములోని 'జనవరాను గ్రహము'లో 'జనవరాను' గ్రహించి 'సామ్య తేజుండు'లో 'జుండు' గ్రహించి ఆరెండింటిని ప్రక్కకుజేర్చగ 'జనవరాను జుండు' అని క్రొత్తపద మేర్పడి గర్భస్థమున మరియొక యర్థము గోచరించుటకు దోహద మైనది.

## ౬. త్రిచిత్ర మిశ్రమము

1) శబ్దాకార నియమ, గూఢ చిత్ర మిశ్రమము

1. నిరోష్ఠ్య కావ్యములలో సహజముగ శబ్దచిత్రముండును. దానికితోడు గూఢాకార చిత్రములున్న ఈ చిత్ర మిశ్రమ మున్నట్లగును

ఉదా:- పురుషకారి కేశవయ్య. దాశరధిచరిత్ర. నిరోష్ఠ్య కావ్యము. అందలి ప్ర.ఆ. 148 సీసములో అనులోమ విలోమ శ్లోకము గర్భితము పద్మబంధమున్నది. ప్ర.ఆ.146 శ్లోక గర్భితకందము త్రిశూలబంధమున్నది.

2. విక్రాలవారి శ్రీ.వేం.చి.ర.కరము ఉ భా.పుట 65 విద్యున్మాలా. ఇందు 64 విద్యున్మాలలు వచ్చుటకు వీలున్నది అనులోమ విలోమము ఏకస్వరము 'అ' ద్వ్యంక్షరి చిత్రము ఉన్నవి కంకణబంధమున్నది.

"రామా రామా రామా రామా
రామా రామా రామా రామా
రామా రామా రామా రామా
రామా రామా రామా రామా"

వీరి. శ్రీ.వేం.చి.ర కరమ. ఉ.భా 68 ప్రమాణ్యకా. ఇందు పద్మ, మాలికా, చక్ర, గోమూత్రికా బంధములు గలవు. ద్విస్వరము 'అఆ'లు నిరోష్ఠ్యము గలవు. చతుర్విధ పద్యము.

3. గ.వేం కవి ప్ర.రా.వేం.వి.వి. 808. ఇందు 64 చిత్ర భేదములు గలవు. 40కిపైగా గర్భితపద్యములు, 20కుపైగా బంధములు గతి చిత్రమును గలవు.

4 గుడారు వేంకటదాసు. ప్రకృష్ట బలరామ చరిత్ర. 1-18,19. అది చక్రాందోళికాబంధ మత్తేభగర్భ నిరోష్ఠసీసము, మరియు.1-30

2) ఆకారనియమ, గూఢార్థ చిత్ర మిశ్రమము

1. రావిపాటి లక్ష్మీనారాయణ వి.భా.రామా. 51 పద్యము. ఇందు ద్వ్యర్థి చిత్రము గలదు ఈ పద్యము గీత గర్భ చంపకమాల కనుక గూఢ చిత్రమిందున్నది. పుష్పమాలికా బంధ మిందు గలదు. కనుక ఆకారనియమ చిత్రము గలిగినట్లుగదా.

## 3. చతుశ్చిత్ర మిశ్రమము

1) ఆకార, గూఢార్థేతర చిత్రముల మిశ్రమము

1. రావిపాటి లక్ష్మీనారాయణ వి.భా.రామా. ఇది నిర్వచన కావ్యమగుటచేత ఇతర చిత్ర మిందున్నది. ఈ కావ్యములోపద్యములలో ఆకార, గూఢార్థ చిత్రములు మూడును గలవని పైన జూచితిమి. కనుక ఇందు నాలుగుచిత్రము లున్నట్లగును.

## ఉపసంహారము

గ్రంధ విస్తర భీతిచే ప్రతిచిత్ర భేదము క్రింద నుదాహరణములుగ పద్యములను వ్రాయక ఆయా కావ్యములపేరు, పద్య సంఖ్యను మాత్రమే పేర్కొనుట జరిగినది.

కవితలలో ఒకరకము చిత్రకవితయని లాక్షణికులే వచించిరి. కవిత్వములో అట్టి చిత్ర కవిత్వస్థానము గూర్చి చర్చ చేయబడినది. తెలుగులో చిత్ర కవిత్వ స్వరూప స్వభావాదులు నిరూపింపబడినవి. లభ్యమయిన విషయసామగ్రిని బట్టి, చిత్ర, బంధ, గర్భ, కవితలు వేర్వేఱుకాక చిత్ర కవితాంతర్భాగములేనని సిద్ధాంతము చేయబడినది.

తెలుగులో చిత్రకవిత్వ మెప్పుడు ప్రారంభమయినది గుర్తింపబడినది. ప్రథమ ప్రకరణములో తెలుగులో చిత్ర కవిత్వ స్వరూప స్వభావములు, అందలి భేదములు, కవితా సందర్భము ప్రయోజనములు, ఆ కవిత్వ ప్రారంభ వికాసములు ఆంధ్రేతర భాషలలో చిత్రకవిత్వము గూర్చి పరిచయము మున్నగు నంశములు, ద్వితీయ ప్రకరణములో స్వర, వ్యంజన, గతి, స్థాన, అక్షర, పాదనియమ చిత్రములు, వాని మిశ్రమమును, తృతీయ ప్రకరణములో ఆకార నియమ చిత్రము (బంధకవిత్వము)ను, చతుర్థ ప్రకరణమున చ్యుత,నామ, పద, పాద, పద్యగూఢ చిత్రము (గర్భ కవిత్వము), భాషలో గూఢత మున్నగు చిత్రములును, పంచమ ప్రకరణములో ప్రశ్నోత్తర, ప్రహేళిక, నల్లేంట్లు, ఇచ్ఛావాక్య సంఘట్టనము, అనేకార్థ కావ్యాలు, అచ్చతెలుగు కావ్యాలు మున్నగు చిత్రములు చర్చించబడినవి.

బంధములకు బొమ్మలు కనపడని సందర్భములలో యూహించి చిత్రకల్పన మొనరింప వలసి వచ్చినది.

తెలుగులో కనబడనటువంటివి, సంస్కృతాంగ్ల తమిళ హిందీ కన్నడ భాషలందలి బంధములు లభించినట్టి వనుబంధములో ప్రదర్శింపబడినవి. వీనిలోగూడ బొమ్మలు లభ్యపడని సందర్భముల చిత్ర కల్పన చేయుట జరిగినది.

దీనివలన కావ్యాను శాసనకర్తచే చెప్పబడిన "స్వర, వ్యంజన, స్థాన, గతి, ఆకారనియమ, చ్యుత, గూఢ, ఆది" చిత్రములన్నియు చర్చించబడినట్లైయినది. చిత్రకవిత్వ సమగ్రరూపము చూపబడినట్లయినది.

# అనుబంధము

## 1. సంస్కృతము
## 2. హిందీ
## 3. తమిళము
## 4. ఆంగ్లము

తెలుగులో లేనివి, ఆంధ్రేతర భాషలలో కన్పడుచున్న
బంధము లిట ప్రదర్శింపబడుచున్నవి.

సంస్కృతము.

1. తిలకబంధం. (పటం-116)

హరిపదం దనుజద్విప మర్దనం హరిపదం దరదం గుణదం భ
హరిపదం కమలార్చిత మక్షరం హరిపదం కమలార్చిత మక్షరమ్.

[కవి. రామరూప పాఠకః] [చిత్రకావ్య కౌతుకం. పుట. 8.]

లక్షణం.

మధ్యేశ్లిష్టం పదం జ్ఞేయం పార్శ్వయోశ్చ పద ద్వయమ్
కోణయో రక్షరం శ్లిష్టం తిలకం బద్ధ సుందరమ్

[చిత్రకావ్య కౌతుక కర్త. స్వకృతమ్ పుట-9]

2. ముసల బంధం (పటం-117)

రాజన్ సుస్వన అభ్ వస్వే దేవేశో రూప వారిధిః
ధిషణాం రాతు మేవేదే శ్వేతరక్తో వినాయకః

[చిత్రకావ్య కౌతుకమ్. పుట. 20,21]



తిలక బంధం

పటము–116



ముసల బంధం

పటము–117



శక్తి బంధం

పటము–118

లక్షణం.

ఊర్ధ్వాద ధస్త తశ్చోర్ధ్వ హ్యాను లోమ విలోమతః
మధ్యవర్ణత్రయం జ్ఞేయం బంధేత్ర ముసలాభిధే

[చిత్రబంధకావ్యమ్. పుట. 35]

౩. శక్తిబంధం (పటం–118)

రాదరే దేవిహే సానుభాను భాః క్రోధజిత్ పదమ్
దరానయత మోహన్త్రి నానా సౌఖ్యం ప్రయచ్ఛనః

[చిత్రకావ్య కౌతుకం. పుట. 28,29]

లక్షణం.

మధ్యతో ధస్తతో మధ్యే తతశ్చో షరితో భ్రమన్
పునర్మధ్యే సమాప్తం స్యాద్ బంధేత్ర శక్తి సంజ్ఞకే

[చిత్రబంధ కావ్యమ్. పుట. 38]



పరశుబంధం

పటము 119

భగ్నావయం భవమయే నోద్ధృతాః పశవ స్త్వయా
యా స్త్వవస్థా రుజాం భామామాభాజం రుద్రతాహర.

[ఈశ్వర శతకము—28 శ్రీమదవతారకవి]

లక్షణం లేదు ఆకారము. నేనే నిర్మించితిని.

[చూ. పటము–119]



పద్మబంధం

పటము–120

దేహాంతకాలే స్వరసేన పాహి యమాత్రిభో భాస్వరలోచనాజ
శమైక సర్వస్వ సభూరికామాం యచ్ఛదేవేశ జహీవామాంమా
(శ్రీమదవతారకవి. ఈశ్వరశతకమ్-19)

లక్షణం లేదు. ఆకారము. నేనే నిర్మించితిని. (చూ. పటము. 120)

సర్వతో ముఖబంధం. (పటం. 121)

కాశీప్రియా సురనదీ గిరిజా విశోకా
కారామ సేచనకరీ భవసింధు నౌకా
కామప్రదా విమల భాలలసచ్ఛశా ఙ్కా-
కా భాను తావతు సదాభవభూషణైకా.

(చిత్రకావ్య కౌతుకమ్. పుట. 60)

లక్షణము.

స్వేష్టందళే కర్ణికాయాం విన్యస్య పరితోభ్రమేత్
కర్ణికా తః కర్ణికాయాం బద్ధ్యేత సర్వతోముఖే.
(చిత్రబంధ కావ్యమ్. పుట. 59.)
(చిత్రకావ్య కౌతుకమ్. పుట. 61)

సరోబంధం (పటము. 122)

మానసధామన్ కామదనామన్ మిత్రసుదామన్ పాలయధీమన్
మానద రాకాకాన్త భజామి మిత్రభరూపా పారవ సామా
న ర్తనపద్మ మ న్త్రి సుపాత్ర త్ర స్తసుపాల లమ్బిత గాన
సర్వవినోద దక్షసుభాసు సుప్రభకాయ యజ్ఞ సుహంస
ధాత్రృప నానా నాట్యయశోదా దామఖసదూధి ధీ దహి మాదాః
(చిత్రకావ్యకౌతుకమ్. పుట. 63)

లక్షణ

కోణేభ్యః పరితః స్తమ్భే సశ్లేషం సర్వతః పునః
సమ్పూరేత పాదకశ్చాత్ర సరోబంధే కవిప్రియః
(చిత్రబంధ కావ్యమ్. పుట. 55)
(చిత్రకావ్య కౌతుకమ్, పుట 63)

56)



సర్వతోముఖ బంధం
పటము_121



సరోబంధం

పటము_122

కూపబంధం. (పటము. 123.)

జగదీశ సుధావాక్య జనాహ్లాదక హసవ
జలోర్ధిన్యాః సదాసారా జలజేక్షణ దేహికూ
యశోదాజ పటాచ్ఛంకూ కూవస్థహర దీనప
పతే కనక మదూహారా రాధనం కురూ మానయ.

(చిత్రకావ్యకౌతుకం. పుట. 64.)

లక్షణం.

మధ్యతః పరితో గచ్ఛన్నేమౌ సశ్లేష మేవచ
ఏవం న్యాసక్రమో జ్ఞేయం కూపబంధే హినూతినే
(చిత్రకావ్య కౌతుకం. పుట. 65.) (చిత్రబంధకావ్యమ్. పుట. 54.)

ఉలూఖలబంధం (పటము. 124)

భద్రవాస సదావన్ద్య యమలార్జున తారక
క జ్జనేత్ర స్మితాధార రత్నేశలలనా మహ
హరే హేలాకృతే శజ్ఞ కటూయు లూఖలబద్ధ భా
లలితం కురూ సర్వకం సర్వకామ ప్రపూరక.

(చిత్రకావ్య కౌతుకం. పుట. 66)

లక్షణం. మధ్యకోణీయ కోష్ఠేషుస్వేష్టం విన్యస్య సర్వతః
భ్రమే నిమ్నత ఊర్ధ్వస్తు మధ్యే హ్యార్థాదులూఖలే.

[చిత్రకావ్య కౌతుకం. పుట. 67] [చిత్రబంధ కావ్యమ్. పుట. 54]

వ్యోమబంధం (పటము. 125).

వరూణామృడ సాదరలేఖ వినాయక రక్షన దేవ
వరద స్వమరేశ్వర హేహితదాన రిషే జనతావ
కరుణామృత సాగర దుఃఖవినాశక హే జ.దేక
శరణం స్వపురే హరదేహి సదా గిరిరాజ సుతాశ.

[చిత్రకావ్య కౌతుకం. పుట. 74]

లక్షణం. అష్టాదశ శిఖరచరీం గోమూత్రికయా చతుష్పదీం పశ్యేత్
సత్రాద్యన్తై ర్దృష్టాం సజ్ఞేయో హ్యోమబంధ ఇతి.

(సర. కంఠా. చిత్రప. 47 శ్లో



కూపబంధం

పటము_123



ఉలూఖల [రోలు]

పటము_124



వ్యోమబంధం
పటము_125

సూర్యబంధం (పటం. 126).

రక్షమావర సంసారవ శ్రీధీద మహేశ హే
హేశ హేమద ధీశ్రీవ రసాసంరవ మాక్షర.

(చిత్రకావ్య కౌతుకం. పుట 76).

లక్షణం. ద్వేపదే అనులోమ్యాత్ర విలోమ్యాచపద ద్వయమ్
భిన్నార్థ వాచకాః శబ్దాబంధే మిహిర సంజ్ఞకే.

(చిత్రకావ్య కౌతుకం. పు 77) (చిత్రబంధ కావ్యమ్. పు. 47)

చంద్రబంధం (పటం_ 27)

రజనీకర సదూదార రమాభ్రాతా రసేశ్వర
తారకేశ కళాధార రక్షత్వాం వరదః పితా

(చిత్రకావ్య కౌతుకం. పుట. 78

లక్షణం. మధ్యతః పరితోగచ్ఛేన్నేమా వపి తతః పరమ్
ఇతిశైలీం విజానస్తు బంధేత్ర చంద్ర సంజ్ఞకే.
[చిత్రకావ్య కౌతుకం. పుట. 79 చిత్రబంధ కావ్యమ్. పుట. 48]
శివికా బంధం. (పటము. 128)
సహాసవక్త్రా హరిణాసహైవ
వధూవరా ప్రాప్తహ యేనభర్త్రా
త్రాతేన వీరైః శివికాసుఖస్థా
స్థా స్స్వప్రవ భావాత్పధి సంలలాస. (చిత్రకావ్య కౌతుకం. పు 80)
లక్షణం. మంచమణ్ణపవైతాన స్తంభవంశ సమన్వితః
శివికాబంధ ఇత్యుక్తోలిపే స్త్రత్ర చమత్కృతిః
(చిత్రకావ్య కౌతుకం. పుట. 81 చిత్రబంధ కావ్యమ్. పుట. 23)




సూర్య బంధం
పటము_126.

మొదటి పాదము 1 నుండి మొదలు_పైకి.
రెండవ పాదము 2 నుండి మొదలు_క్రిందకు.



చంద్ర బంధం
పటము_ 127.



శివికా బంధం
పటము_ 128.

దర్పణ బంధం (పటము. 129).

పిజ్జ వేష్టన సీతాక కపోలా దర్శ దర్శక
కంజనేత్ర స్మితాశాల లసమాధర్ష జగద్ధవ
వసుధానాథ సన్మంద చక్రపాణే మహాధన
నరేంద్ర శీలసింధో హే హేల యాదేహి మామపి,

[చిత్రకావ్య కౌతుకమ్ పుట. 82,83].



దర్పణ బంధం
పటము— 129.

లక్షణం. శ్లేషే శ్లేషే పఠన్ ధీరస్తత్రైవ విరమేత్పునః
సుధియా స్వధియాప్రోక్తో బంధోయం దర్పణాభి ధః
[చిత్రబంధ కావ్యమ్. పు. 24].

వృత్తబంధం. (పటం. 130).
రామః కామ ద్రుమః పాలః కర్మ ధర్మ సుమంగళః
కామ దామ తిమన్మాలః సామదామ సుమండలః
[చిత్రకావ్య కౌతుకమ్ పుట. 88]

లక్షణం. ఉపరి ష్టాత్తిరో భాగాదధో మధ్యాత్తు మధ్యకే
ఏవం క్రమైః పుదర్మధ్యే విరమేత్తరూ సంజ్ఞకే.
[చిత్రకావ్య కౌతుకమ్ పుట. 89. చిత్ర బంధకావ్యమ్. పు. 52].

ఢాల బంధం. (పటం- 131).

కమల కోమల హేళినపాలక
కలవచో దళయాన సుబాలక
కనకభూషణ దానవ పావక
కథయ మాం శివమాన సహంసక.

[చిత్ర కావ్యకౌతుకం. పుట. 9౦].

లక్షణం. మధ్యాద్ గచ్ఛేద్ పునర్మధ్యే మధ్యాన్మధ్యే పునస్తథా
ఇమాం శైలీం కవిశ్రేష్ఠ ఢాలబంధే వదేద్బుధః
[చిత్ర కావ్య కౌతుకమ్. పుట. 97]. [చిత్ర బంధకావ్యమ్ పుట 39]



వృ తు బంధం

పటము-130.



ఢాల బంధం (చెవికమ్మ)

పటము– 131.

| హ 1 | ర 18 | నం 19 | ద 4 | న 5 | మా 22 | న్యా 7 | ద్య 24 |
|---|---|---|---|---|---|---|---|
| గ 9 | జా 26 | న 11 | న 28 | వి 13 | నా 30 | య 15 | క 32 |
| హ 17 | ర 2 | నం 3 | ద 20 | య 21 | మా 6 | మ 23 | ద్య 8 |
| ప్ర 25 | జా 10 | ధ 27 | న 12 | ద 29 | నా 14 | య 31 | క 16 |

శర యంత్రం

పటము– 132.

అంకెల వారీ చదు వుకొన్నను ఇదే శ్లోకము వచ్చును.

హర నన్దన మాన్యాద్య గజానన వినాయక
హర నన్దయ మామద్య ప్రజాధనద నాయక.

[చిత్ర కావ్యకౌతుకం. పుట. 98].

లక్షణం.

చతుర్వ్యాపిచ పాదేషు పంక్తిశో లిఖి తేష్విహ
ఆదే రాదే స్తుర జ్జిస్య పాద్యైః పాదః సమాప్యతే.
[చిత్ర కావ్యకౌతుకమ్. పు. 99]. (చిత్ర. ప్రక. సర. కంఠా. పు. 24).

కమండలుః [పటం 133].

అయి ద్విజ జనాధీశ శయవాస మనోరమ
అశేష కీర్త వార్ధామ మహాః పుణ్య జయం సృజ.

(చిత్ర కావ్యకౌతుకమ్. పు. 102.)



కమండలు బంధం

పటము- 133

లక్షణం.

స్వేష్టం కోష్టేషు విన్యస్య మధ్యతః పరితః సరేత్
అధో ధస్తాన్ముఖే చైవ నవ్యబంధే కమండలే.

(చిత్ర బంధ కావ్యమ్. పుట. 25).

సు వ ర్ణ చ త్వ ర బం ధం (పటం-134)

హేదేవదేవ మమహేళవ దేహదేహే హేదేహ లీగణ వపాలక పాళదేహే
హేదేళ కలా గతివిచ్ఛ సుమోద దేహే హేదే దయస్వ గిరిజే శివ దేవదేహే
[చిత్ర కావ్యకౌతుకం పు. 105.]

సువర్ణ చత్వర బంధం.
(పటం-134)

లక్ష-ం. మధ్యతః కోణా మాగచ్ఛేన్మౌ కోణాత్తు మస్తకే
అనులోమ విలోమాభ్యాం బంధే చత్వర సంజ్ఞకే.
(చిత్ర బంధ కావ్యమ్. పుట. 22)

గజబంధం (పటము-135)

కపర్ద నిర్ఝర స్నాన జన్మకర్తృ ద్విహర్షద
నమ్య పద ధూళి సుస్నాన కళాకర్ణగకేతకాత్
ద్వితీయ దన్త శోభా భృత్ వటోన్కంఠ కటిభ్రుక
కనక ద్విప కల్యాణం అధిపూజ్యవరంకుకు.[చిత్రకావ్య కౌతుకం. పుట.106]

లక్షణం.

విన్యస్యేష్టం శుంటతశ్చ ద్వితీయేష్టాత్ పదేపదే
పునరిష్టం గృహీత్వైవ గచ్ఛేత్ పుచ్ఛే కవిప్రియః
[చిత్రకావ్య కౌతుకం పుట. 107 చిత్రబంధ కావ్యమ్. పు. 4]

నందిబంధం. (పటము-136)

నయనానన్ద దాతరహే శివాఙ్ఘ్రి శిరసానత
దయ యాదర సంహర్తర్ లసదూవల్లభహే అజ
కైలాస గౌర శందేహి నందిన్ శిలాదబాలక.
[చిత్రకావ్య కౌతుకం. పుట. 109.]

లక్షణం.

చరణేషు సమాప్యంతే చత్వారశ్చరణాః క్రమాత్
పునః పుచ్ఛాగ్రతో గచ్ఛేన్నన్ది బంధే ముఖాగ్రతః
[చిత్రకావ్య కౌతుక కర్త స్వ నిర్మితమ్]



గజబంధం
పటం-135

'కనకద్వీప'' అను పెద్ద అక్షరములు నాల్గవ పాదము మొదలగును. అంకెలు పాదముల మొదలు తెలుపును.

నందిబంధం

పటం-136

తూణబంధం (పటము 13 )

తారేశరణ ముద్యన్తి సురేశరణ ముద్య మైః
త్వందోషా పాసినోదగ్ర స్వదోషా పాసినోదనే.

[ఆనందవర్ధనుని. దేవీశతకం.90]

తూణబంధం (అమ్ముల పొది)

పటము-137

లక్షణంలేదు. ఆకారము నేనే నిర్మించితిని.

డమరు బంధం (పటము–138)




సావిడమ్ము కతాం నీత్వాప్త వతీ
క్రూర తాం విభో
విసారే కురుతే కాలసేనా దోషం
మయిస్థిరా.
[శ్రీమదవ తారకవి.
ఈశ్వరశతకం. 60]

లక్షణం లేదు.
ఆకారము **నేనే** నిర్మించితిని.



జాలబంధం (వల)
పటము–139.

ఇది రెండు గోమూత్రికలు కలిసి ఏర్పడినది.

సదావ్యాజ వశి ధ్యా తాః సదాత్తా జవ శిక్షితాః
దదాస్య జ్ఞ స్రసం శివతాః సూదాత్తా జవిశిస్థితాః
ఆనందవర్ధనుని—దేవీశతకం—81 (పటం-139)

లక్షణం లేదు. ఆకారమును నేను నిర్మించితిని.

కాంచీ బంధం (పటం 140)

నరకం కాలమాలా భరణాహి తరసా శ్రితాః
నరక జ్కాల మాలా భరణా హితర సాశ్రితాః
(శ్రీ మదవతారకవి. ఈశ్వరశతకం-13)

లక్షణం లేదు ఆకారమును నేను నిర్మించితిని.



కాంచీబంధం [మొలనూలు]
పటము-140.



కదమ్బ కలికా బంధం [కడిమిచెట్టుమొగ్గ]
పటము-141.

నృపసింహాస్మహా ధామ్నః పరేధీరా ఇతో యయుః
అప యాహిదితా నీక్వచిత్తు అతి భూమితే

—అప్పారాయ యశశ్చంద్రోదయే.

నవమీకళా ఆకార చిత్ర. 3 (పటము-141)

పైనుండి క్రిందికి, క్రింద నుండి పైకి చదువుకొనుచు పోవలెను.

లక్షణం లేదు, కాని పటము చిత్రింపబడియున్నది.

హిందీ.

(ఛత్రబంధము పటము -132)

భక్త ప్రవర తులసీదాసు రామచరిత మానస్‌నుండి

"ఆగే చలే బహూరి రఘురాయా

ఋష్యమూక పర్వత నియరాయా అను పద్యాంశముతో ఛత్రబంధము.

(చిత్రకావ్య కౌతుకమ్. పీఠిక. పుట-34)



ఛత్రబంధము

పటము-142

58)

## త మి ళ ము

ఇరట్టైయి నాక పంతం.(పటము_143)

రెండు పద్యములు ఒక్కొక్క పద్యము ఒక్కొక్క పాదమున సరిపోవును.

1. అరుళిన్ అరువురు వేయం బలత్తాయుంబర్
తేరుళిన్ మరువారు చిర్ చీరే_పొరువిలా
వాన్ ఱేయుమై యాళట్ నేయురు దితరు
కున్ ఱే తేరుళ వరుళ్



ఇరట్టై నాకపంతం

పటము_143

7. మరులిన మరుళత్ తేవాళ చూడరే నంచు
పెరుకొళియాన్ తేయ పెంచేది-తిరువిలా
వానం చురుంగ మిగుచుడరే చిత్ త
మయ మరుళవై యొళి
దండి తమిళ అలంకార గ్రంథమందు పటము ప్రదర్శింపబడినది.
సుళికుళమ్. బంధం (పటము-144)
కవిముది యార్ పావే
విత్తైయరు మాన త్ పా
ముయల్ వదు ఉనర్
తిరువళిప్ దుమాయా

దండి తమిళ అలంకార గ్రంథమందు పటము ప్రదర్శింపబడినది. నాల్గు పాదములు వరుసగా వ్రాయవలెను. సుడిగుండం ప్రకారం వరుసగా చదివిన పద్య పాదములు వరుసగా వచ్చుచుండును. ఇది ఇందలి చిత్రరచనము.



సుళికుళమ్ (సుడిగుండం)
పటము-144

ఆంగ్లము :




(విల్లంబులతో) ధనుర్బంధము

పటము_145

---

సాహిత్య సమితి వ్యాసావళి. తిరుపతి. ప్రింటు. 1937.
అందలి శ్రీ జి. యన్. రెడ్డి పాశ్చాత్య భాషలలో చిత్ర కవిత అనెడి వ్యాసము నుండి ఈ ధనుర్బంధము గైకొనబడినది.

## ఉపయుక్త గ్రంథ సూచి


సంస్కృత లక్షణగ్రంథములు.

అగ్నిపురాణము.

| | |
|---|---|
| అలంకార మహోదధి. | నరేంద్రప్రభసూరి. |
| అప్పారాయ యశశ్చంద్రోదయే. | శ్రీమదాణివిళ్ళ వేంకటేశ్వరుడ |
| అలఙ్కార ముక్తావళీ. | చావలి రామసుధీవరుడు. |
| అలంకార సర్వస్వము. | రుయ్యకుడు. |
| కవి కంఠా భరణము. | క్షేమేంద్రుడు. |
| కవీంద్ర కర్ణా భరణము. | విశ్వేశ్వర పండితుడు |
| కావ్య ప్రకాశము. | మమ్మటుడు |
| కావ్య ప్రదీపః | గోవింద |
| కావ్యాదర్శము. | దండి. |
| కావ్యాను శాసనము. | హేమచంద్రుడు. |
| కావ్యాలంకారము. | ఉద్భటుడు |
| కావ్యాలంకారము. | రుద్రటుడు |
| కావ్యాలంకార సూత్రాణి. | వామనుడు |
| చంద్రాలోకము. | జయదేవుడు |
| చమత్కార చంద్రిక. | విశ్వేశ్వర కవిచంద్ర. |
| చిత్ర మీమాంస | అప్పయ్య దీక్షితుడు. |
| ధ్వన్యాలోకము. | ఆనందవర్ధనుడు. |
| ప్రతాపరుద్రీయము. | విద్యానాధుడు. |
| మన్దార మరంద చంపూ. | శ్రీకృష్ణకవి. |
| రసగంగాధరము. | జగన్నాథుడు |
| సరస్వతీ కంఠాభరణం. | భోజుడు |
| సాహిత్యదర్పణము. | విశ్వనాధుడు |
| సాహిత్య రత్నాకరము. | ధర్మసూరి |
| సాహిత్య సారము. | అచ్యుతరాయమోదక్. |
| సుభాషిత రత్న భాండాగారం. | నారాయణరామ్ ఆచార్య (Editor) |

ఆంగ్లము.

1. History of Classical Sanskrit Literature. M. Krishnamachariar (printed at Madras. 1937)

2' Vol. XV. No. 1 of 1961 Journal of T.M.S.S.M. Library Thanjvur.

సంస్కృత గ్రంథములు :

| | |
|---|---|
| ఈశ్వర శతకము. | శ్రీమదవతారకవి. |
| కవికల్పలత | దేవేశ్వరమహాకవి.[1] |
| కిరాతార్జునీయము. | భారవి. |
| చిత్ర కవిత్వాణి. | శ్రీ రూపదేవ |
| చిత్ర కావ్యకౌతుకమ్. | పండితరామ రూపపాఠక. |
| చిత్ర రత్నాకరం. | చక్రకవి. |
| దేవీ శతకము. | ఆనందవర్ధనుడు. |
| పాదుకాసహస్రము. | వేంకట నాథుడు. |
| యమకరత్నాకరము | శ్రీవత్సాంక మిశ్రులు |
| రామకృష్ణ కావ్యమ్ | శ్రీగురుహరి దామోదర వేలణకర |
| లక్ష్మీ సహస్రము | వేంకటాధ్వరి |
| శివకర్ణామృత స్తోత్రము | సదాశివ[2] |
| శివపాదకమల రేణుసహస్ర | నంజరాజకవి[3] |
| శిశుపాలవధ | మాఘుడు |

శ్రీ వేంకటేశ్వర గుణరత్న శేవధిస్తోత్రమ్ 'కవికంఠీరవ' విక్రాలశేషాచార్య

---

1. రాయవరపురామ స్వామి."కవితా సాగరము"నుండి గ్రహింపబడినది.

2. రాయవరపు రామస్వామి "కవితా సాగరము" నుండి గ్రహింప బడినది.

3. Vol X No 1. of of 1955 joural T M.S S.M. Library Thanjavur

కన్నడము
కవిరాజ మార్గము — నృపతుంగ
కావ్యావలోకనము — నాగవర్మ
సిరిభూవలయ — సిరికుముదేందు గురు

తమిళము.
అలంకారము — దండి 4th Print. 1953

తెలుగు లక్షణ గ్రంథములు
అప్పకవీయము — అప్పకవి
కావ్యాలంకార చూడామణి — విన్నకోట పెద్దన
నరస భూపాలీయము — రామరాజ భూషణుడు
లక్షణ దీపిక — వార్తాకవి రాఘవయ్య
లక్షణ శిరోమణి — పొత్తపి వేంకటరమణ కవి
లక్షణ సార సంగ్రహము — చిత్రకవి పెద్దన

తెలుగన కనుపదింపబడిన లక్షణగ్రంథములు, విమర్శన, సిద్ధాంత గ్రంథములు, పత్రికలు.
అచ్చ తెలుగు కృతులు-పరిశీలనము సిద్ధాంత గ్రంథము, — కె.వి. సుందరాచార్యులు ఉస్మానియా, 978 ఏప్రిల్.
అముద్రిత గ్రంథ చింతామణి — 1-8-1892, మరియు జనవరి 1897, 1903 ఏప్రిల్
ఆంధ్రకావ్యాదర్శము — అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి
ఆంధ్ర కావ్యాదర్శము — చర్ల నారాయణ శాస్త్రి
ఆంధ్రపత్రిక — వారపత్రిక 3-6-1977
ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము — చెలమచర్ల రంగాచార్యులు
ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర సిద్ధాంతగ్రంధము — యస్వీ జోగారావు
ఆంధ్రరసగంగాధరము — వేదాల తిరువేంగళాచార్యులు
ఆంధ్రవాఙ్మయ చరిత్ర — దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రసంస్థానములు సాహిత్య పోషణ — టి. దొనప్ప.
ఆంధ్ర సాహిత్య దర్పణము — వేదం వేంకటరాయశాస్త్రి

ఉదాహరణవాఙ్మయ చరిత్ర — నిడుదవోలు వేంకట్రావు
ఉషః కిరణాలు — యండమూరి సత్యనారాయణ
కంకంటి పాపరాజు-సమకాలీన కవులు — యమ్. వి. సత్యవతి
సిద్ధాంతగ్రంథము — ఉస్మానియా, 1975.
కచ్ఛపీశ్రుతులు — సంపాదకులు యస్.వి. జోగారావు
కథాద్వయ కావ్యములు — విక్రాల శేషాచార్యులు, భారతి, జూన్ 1958
కవితా సాగరము — సంపాదకులు: రాయవరపు రామస్వామి
కవిసింహ కాశీపతి జీవితం — సాహిత్యం-త్రిపురనేని సుబ్బారావు
కావ్యాలంకారసంగ్రహము — సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
గోపీనాధ వేంకటకవి-వేంకటగిరి సంస్థానము- ఇతరకవులు - సిద్ధాంతగ్రంథము ఉస్మానియా, 1970July కర్త: కాళిదాసు పురుషోత్తమకవి
చాటుపద్య రత్నావళి — యం. రంగాచార్య
చిత్ర కవిత్వ దర్పణము సంకలన గ్రంధము రావుకొండలరాయుడు
Paper. R 1145. S V O.R.i. Tirupathi:
తెలంగాణ శాసనములు VOL I&II — లక్ష్మీనారాయణపరిశోధకమండలి హైదరాబాదు
తెలుగు భాషలో ఛందో రీతులు — రావూరి దొరసామి శర్మ
తెలుగులో చిత్ర కవిత్వం — గుమ్మా శంకరరావు వ్యాసము 'తెలుగు' వైజ్ఞానిక త్రైమాసిక పత్రిక, July; Sept 1979
తెలుగులో ఛందో వికాసము — కోవెల సంపత్కుమార
దాసుగారి మేలుబంతి — సంపాదకులు యస్వీజోగారావు
నన్నెచోడ కవిత్వ తత్త్వము — వేదం వేంకట్రాయశాస్త్రి
పొడుపు కథలు — గుమ్మా శంకరరావు
ప్రబంధ వాఙ్మయ వికాసము — వల్లా దుర్గయ్య

మధుర వాణీవిలాసము — సిద్ధాంతగ్రంధము విమర్శనము. బుచ్చారెడ్డి ఉస్మానియా 1979
మరుగుపడిన మాణిక్యాలు — బి. రామరాజు
విజ్ఞాన దీపిక — పాటిబండ మాధవశర్మ
విజ్ఞాన సర్వస్వము — తెలుగుభాషా సమితి VoL VI 'కవితా భేదములు' పుట 617 10 619
వీరేశలింగం పంతులుగారి కృతులు-పరిశీలనము సిద్ధాంతగ్రంధము అక్కిరాజు రమాపతి రావు ఉస్మానియా 1964
వేలూరి శివరామశాస్త్రి — పంపాదకుడు మహతి శంకర్
శాసనార్ధ ప్రకాశిక — పి. తిరుమలరావు
శ్రీరంగ మహత్త్వము — పీఠిక నిర్వహణ శ్రీ రంగాచార్య
శ్లేషకవిత్వము — కాశీభట్ట బ్రహ్మయ్య వ్యాసము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1912 సంవత్సర సంపుటము
సంస్కృతములో గర్భ కవిత్వము లేదా? వ్యాసము ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు భారతి 1963 ఏప్రిల్
సాహిత్య సమితి వ్యాసావళి — తిరుపతి 'సాహిత్య సమితి' ప్రచురణ. ఇందలి [సంపుటం-1] వ్యాసము 'తెలుగు, పాశ్చాత్య భాషలలో చిత్రి కవిత్వము-పోలికలు [సంకలన గ్రంథం] — కర్త జి. యన్. రెడ్డి
ప్రచురణ : 1967 పుటలు - 11 to 29

### తెలుగు కావ్యములు

అచలాత్మజా పరిణయము — బుక్కపట్టణం వేంకటాచార్యుడు
అచ్చతెలుగు కుబ్జా కృష్ణ విలాసము తంయాల లక్ష్మీనృసింహాచార్యులు
అద్భుతోత్తర రామాయణము — నాదెళ్ళపురుషోత్తమకవి
2) గురుభక్తి ప్రభావము
3) చిత్ర కందపద్య రత్నాకరం
4) కృష్ణానదీ మహాత్మ్యం
5) ధార్మికోల్లాసిని
6) మల్లికార్జున శతకము
59)

| | |
|---|---|
| అనర్ఘరాఘవము | జిజ్జాల తిమ్మభూపాలుడు |
| ఆంధ్ర మహాభ్యుదయము | బండ్ల సుబ్రహ్మణ్యకవి |
| ఇందుమతీ పరిణయము | తెనాలి రామభద్రకవి |
| ఉత్తమ జీవయాత్ర | నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి |
| ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు |
| ఉత్తర హరి వంశము | నాచన సోమన |
| ఉషాపరిణయము | దామెరల అంకన్న Paper A.c.c No 5405 ఆం ప్ర.లి.ప్ర.భాం. హైదరాబాదు |
| కవిజన రంజనము | అదిదము సూరకవి |
| కవిజన వినోదిని (వ్రాతప్రతి) | రాప్తాటి ఓబిరెడ్డి |
| కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయ్య |

2) రాఘవ పాండవీయము

| | |
|---|---|
| కాళిందీ కన్యాపరిణయము | అహోబలపండితుడు |
| కుమార సంభవము | నన్నెచోడుడు |
| గోపీనాధ రామాయణము | గోపీనాధ వేంకటకవి |

2) శిశుపాల వధము

| | |
|---|---|
| చక్రతీర్థమహాత్మ్యము | కపిల వాయి లింగమూర్తి |
| చతుర్ముఖ రామాయణము | గాదె పాపరాజు |
| చమత్కార చంద్రిక | మంగిపూడి వేంకటశర్మ ప్రింటు. 1920 |
| చిత్రమంజరి | బోడి వాసుదేవరావు |
| చిత్రాశ్వీయము | కోట వీరాంజనేయశర్మ |

2) మాధురీ సుధాకరము (అముద్రితము)

| | |
|---|---|
| ఛందో హంసి | బుర్రా కమలాదేవి |
| జైమినీ భారతము | పిల్లలమర్రి పినవీరన |

| | |
|---|---|
| తాలాంకనందినీ పరిణయము | మరింగంటి నరసింహాచార్యులు |
| దశరథ రాజనందన చరిత్ర | మరింగంటి సింగరాచార్య |
| దశావతార చరిత్ర | ధరణిదేవుల రామమంత్రి |
| దాశరథి చరిత్ర | నంబెరుమాళ్ళ పురుషకారి కేశవయ్య |
| ధర్మఖండము | ఈదులపల్లి భవానీశ |
| నాగర ఖండము | జానపాటి పట్టాభిరామశాస్త్రి |
| నారాయణీయము | అడ్పుమిల్లి నారాయణరావు |
| నిర్వచన భారతగర్భ రామాయణము | రావిపాటి లక్ష్మీనారాయణ |
| నిర్వచన మిత్రవిందో ద్వాహము | తూము రామదాసు |
| పద్మపురాణము<br>(2) శివధర్మోత్తరము<br>(3) షట్చక్రవర్తి చరిత్ర | మల్లారెడ్డి |
| పారిజాతాపహరణము | నందితిమ్మన |
| ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము | గణపవరపు వేంకటకవి |
| ప్రబంధ రాజ శిరోభూషణ ప్రకృష్ణ బలరామ చరిత్ర | గుడాకు వేంకటదాసు, D. NO. 581. Paper, G O. M. L. Madras. |
| ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంధము (అముద్రిత గ్రంధ చింతామణి ప్రచురణ, 1896.)<br>(2) రాధాకృష్ణ సంవాదము | మండపాక పార్వతీశ్వరశాస్త్రి |
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నం |
| భద్రరాజపుత్ర చరిత్రము | చిన వేంకటార్యుడు Paper No 597. G O. M. L Madras |
| భద్రాపరిణయము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి |
| భరతాభ్యుదయము | మాడభూషి వేంకటాచార్యులు |
| భానుమద్విజయం | వెలగపూడి కృష్ణయామాత్యుడు |

| | |
|---|---|
| భార్గవరామ చరిత్రము | అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి |
| మధురవాణీ విలాసము | చింతలపల్లి వీరరాఘవకవి |
| మన్నారు దాస విలాసము | రంగాజమ్మ |
| మల్లికార్జున సహస్రము | భువనగిరి విజయరామయ్య |
| మహాసేనోదయము | కొండవలూరి రామచంద్రకవి |
| మాఘపురాణము | పోతరాజు లక్ష్మీనృసింహకవి |
| మిత్రవిందా పరిణయము | కుందుర్తి వేంకటాచలం |
| ముకుంద విలాసము (భద్రా పరిణయం) | కాణాద పెద్దన |
| యథాశ్లోక తాత్పర్యభారతము | వీరరాఘవాచార్యులు |
| యథాశ్లోక తాత్పర్య రామాయణము | కాణాద పెద్దనాదులు |
| యయాతి చరిత్ర | పొన్నెగంటి తెలగన |
| యాదవ రాఘవ పాండవీయం | నెల్లూరి వీర రాఘవకవి |
| రసికజన మనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| రసికజన మనోరంజనము | కందుకూరి వీరేశలింగం |
| రాఘవాభ్యుదయము | చింతలపల్లి ఛాయాపతి |
| రాధా మాధవ సంవాదము | వెలిదండ్ల వేంకటపతి |
| రాధికా సాంత్వనము | ముద్దుపళని |
| రామరాజీయము (నరపతి విజయము) | అందుగుల వెంకయ్య |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు |
| రుక్మవతీ పరిణయము | రేకపల్లి సోమనాథకవి |
| రుక్మాంగద చరిత్ర అను ఏకాదశీ మహాత్మ్యము | మల్లన |
| లంకావిజయము (రావణదమ్మీయము) | పిండిప్రోలు లక్ష్మణకవి |
| లక్ష్మీసహస్రము (ఆంధ్రము) | వేదుల సూర్యనారాయణ |
| వరాహపురాణము | నంది ఘంటల జంట |
| వాక్యగురు పరంపరార్థము | ముక్తివి. వేంకట తిరుమలదాసు |

| | |
|---|---|
| వాణీవిలాసవన మాలిక | చేకుమళ్ళ రంగశాయి |
| వాసవదత్తా పరిణయం | విక్రాల శ్రీదేవమ్మ |
| (2) రసిక శరణాగతి | |
| విజయనందన విలాసము | మంగళగిరి ఆనందకవి |
| విజయాశ్వచరిత్రము | పురాణం పిచ్చయ్య |
| విదుషి | ముత్య సుబ్బరాయదైవజ్ఞమణి |
| వెట్టికి వేయివిధములు | కొత్తపల్లి సూర్యారావు |
| శకుంతలా పరిణయము | పెద్దాడ నాగరాజు |
| శకుంతలా పరిణయము | కృష్ణకవి |
| శశాంక విజయము | శేషము వేంకటపతి |
| శివగీత | మిన్నికంటి గురునాథశర్మ |
| శివరహస్య ఖండము | కోడూరు వేంకటాచలకవి |
| శుద్ధాంధ్ర కిరాతార్జునీయము | తిరుమామిడి రామస్వామి |
| శుద్ధాంధ్ర హరిశ్చంద్ర చరిత్ర | రాయవరపు గవ్రరాజు |
| శ్రీకుమారాభ్యుదయము | వావిలికొలను సుబ్బారావు |
| (2) శ్రీకౌసల్యా పరిణయము | |
| శ్రీగణేశ్వరీయము | భువనగిరి విజయరామ |
| శ్రీగోవిందకృష్ణయాచేంద్ర విజయము | సుబ్బరాజ నామధేయుడు |
| శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితచరిత్రము | అబ్బరాజు హనుమంతరాయశర్మ |
| శ్రీమత్ప్రతాపగిరి ఖండము | కపిలవాయి లింగమూర్తి |
| శ్రీమదాంధ్ర చంపూ రామాయణము | అల్లమరాజు రంగశాయి |
| శ్రీమహేంద్ర విజయము | దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులు |
| శ్రీరంగ మహత్త్వము | భైరవుడు |
| శ్రీరామచంద్రోపాఖ్యానము | వారణాసి వేంకటేశ్వర్లు |
| శ్రీవేంకటేశ్వర చిత్రరత్నాకరము VOL. I & II. | విక్రాల శేషాచార్యులు |

| | |
|---|---|
| శ్రీవేణుగోపాల శతకము | ముక్తినూతలపాటి సీతారామయ్య |
| శ్రీవేల్పుగొండ లక్ష్మీనృసింహ మహాత్మ్యము | తంయాల లక్ష్మీ నృసింహాచార్యులు |
| శ్రీసులక్షణో పాఖ్యానము | ప్రతాప హనుమయ్య |
| శ్రీహనుమద్రామాయణము | నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి |
| సత్యవిజయము | అయ్యనకోటి పార్థసారధిశెట్టి |
| సమీరకుమార విజయము | పుష్పగిరి తిమ్మన |
| సింహాసనద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| సీతారామ చరితము | మంత్రి ప్రెగడ సూర్యప్రకాశకవి |
| సీతారామాంజనేయ సంవాదము | పరశురామ పంతుల లింగమూర్తి |
| సుదక్షిణా పరిణయము | తెనాలి అన్నయ్య |
| సునందినీ పరిణయము (నాటకం) | కోలాచలం శ్రీనివాసరావు |
| సుమనో మనోభిరంజనము | ఓగిరాల జగన్నాధం |
| హంసవింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము | రామరాజ భూషణుడు |
| హాలాస్య మహాత్మ్యము | మల్లమపల్లి బుచ్చికవి |

## సు ప థ ము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 6 | చిత్రకవితా మృతమును | చిత్రకవితామృతమును |
| 13 | 15 | ఛారువయినదని | చారువయినదని |
| 15 | 20 | శబ్దాలంకారమును | శబ్దాలంకారములు |
| 17 | 13 | సువ్యక్తరబై | సువ్యక్తంబై |
|  | 25 | ప్రీతి | ప్రతి |
| 33 | 13 | రిత్ర | చరిత్ర |
| 46 | 23 | అత్యాను | అంత్యాను |
| 54 | 21 | న్నది | న్నిధి |
| 58 | 18 | స్వరలఘువు | సర్వలఘువు |
| 64 | 24 | మానామానా | మానానూనా |
| 83 | 7 | శుద్ధాంధ్రకావ్య | శుద్ధాంధ్ర నిరోష్ఠ్య కావ్య |
|  | 18 | బడినదని | బడదని |
| 84 | 26 | 'త' ర ఒత్తు | 'త' ఒత్తు |
| 87 | 12 | శల్యం | లవ్యం |
| 101 | 22 | పదమాడిన | పదమాదిన |
| 107 | 2 | పదనియమ | పాదనియమ |
| 116 | 26 | మవసరము | మనవసరము |
| 208 | 23 | వేద ప్రదర్శన | వేద పదప్రదర్శన |
| 245 | 5 | బంగారు | బంగరు |
| 253 | 16 | మత్య | మత్స్య |
| 267 | 21 | కారామా | కారమా |
| 270 | 6 | బరి | బతి |

| | | | |
|---|---|---|---|
| 271 | 4 | ఉదా : 4కూడ వర్ణచ్యుతకమునకు సంబంధించినది. | |
| | 25 | శతకము | చ్యుతకము |
| 274 | 13 | పాగం | పాంగ |
| 28 | 16 | వత | శత |
| 301 | 17 | ష్టా్రి | ప్రాు |
| 304 | 24 | భరదా | భదరా |
| 309 | 2 | ఇటువంటి విహాలాస్య | ఇటువంటివి హాలాస్య |
| 313 | 4 | ప్రమాణివృత్తము : | |
| | | వసుంధరాగోస్తనీ | ముఖప్రియప్రియాప్రియా |
| | | శ్రితాభి లార్థసార్థదా | సమేధ తాంతా మామహా |
| 331 | 27 | మూగురుడవ | మూడవ |
| | 28 | వును | గురువును |
| 337 | 17 | ఇందునూ దైదు | ఇందు నూతైదు |
| 344 | 7 | మగుట | మఱుగు |
| 350 | 12 | స్నాగతా | స్వాగతా |
| 397 | 24 | శాగిశా | శాగిరౌ |
| 402 | 10 | ె 8 $\frac{3}{4}$్త – 3 $\frac{3}{4}$్వ | ె 8 $\frac{3}{4}$్త – 3 $\frac{3}{4}$్వ |
| | 25 | జ్ఞానకీడ | జ్ఞానక్రీడ. |
| 406 | 12 | సమాధానము[illegible]:- | సమాధానము :-3. |
| 418 | 15 | be more happy | be more |
| | 16 | | happy అని ఒక్కపదమునే 16వ పంక్తిలో చేర్చుకొనిచదువుకొనవలెను |

